# దక్షిణ భారత సాహిత్యములు











ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# దక్షిణ భారత సాహిత్యములు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# తొలి పలుకు

దేశభాషల సాహిత్య చరిత్రలను ఆంధ్ర పాఠకలోకానికి పరిచయము చేయు ఉద్దేశముతో సంగ్రహముగా ప్రకటించ వలెనని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నిర్ణయించినది. ఆ నిర్ణయానుసారము మొదటి సంపుటముగా యీ గ్రంథములో తమిళ, కర్ణాటక, మలయాళ, మహారాష్ట్ర భాషా సాహిత్య చరిత్రలను క్రోడీకరించి ప్రకటించినాము.

భిన్నముగా గోచరించు దేశభాషల అందలి సాహిత్యముల యేకత్వమును స్పష్టీకరించుటయే యీ గ్రంథ ప్రచురణ ఉద్దేశమని వేరుగా చెప్పవలసిన ఆవశ్యకతలేదు. మన దేశ సమస్యలలో యీ నాడు జాతీయ సమైక్యము ముఖ్యాతి ముఖ్యమై యున్నది. జాతీయ సమైక్యమును ప్రబోధించు వాఙ్మయమును కేంద్ర రాష్ట్ర సాహిత్య అకాడమీలు ప్రోత్సహించి ప్రచురించుచున్నవి. ఈ వరుసలో యితర దేశభాషా సాహిత్యములకు సంబంధించిన సంపుటాలను కూడ త్వరలోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రకటించనున్నది.

ఈ గ్రంథమును వ్రాయించు నప్పుడు ఆయా భాషలతో మంచి పరిచయము కలిగిన వారికి యీ సాహిత్య చరిత్రల రచనను అప్పగించ వలెనని నిర్ణయించినాము. మేము కోరినంతనే తమిళ, కర్ణాటక, మలయాళ, మహారాష్ట్రముల సాహిత్యముల చరిత్రలను నిర్ణయించిన పరిమితిలోను, వ్యవధిలోను వ్రాసి యిచ్చిన నలుగురు విద్వాంసులకు అకాడమీ పక్షాన కృతజ్ఞతానేక వందనములు.

హైదరాబాదు.
౧౦-౪-౬౨

దేవులపల్లి రామానుజరావు
ప్రధాన కార్యదర్శి.

# విషయసూచిక

## తమిళ సాహిత్యము.



## కన్నడ సాహిత్యము.



## మలయాళ సాహిత్యము.



## మహారాష్ట్ర సాహిత్య సంగ్రహము.

పేజీ నెం.





# మున్నుడి

తెలుగు తోబుట్టువులలో తమిళ మొకటి. తద్భాషాపండితులు తమిళ మను మాటకు మధురమని అర్థము చెప్పుదురు. తమిళ కావ్యములలోకూడ ఈ అర్థము తోనే తమిళ శబ్దము వాడబడినది. 'తేనుత్తై త్తమిళ్', 'తమిళ్తళీ ఇయళాయలవర్' 'ఇనిమైయుం నీర్మైయుం తమిళెనలాగుం' అని ప్రాచీన తమిళకవులు తమ భాషను ప్రస్తుతించిరి. తమిళ నవయుగ ప్రవక్తయగు సుబ్రిహ్మణ్య భారతి 'మే మెఱిగిన భాషలలో తమిళమువలె తీయనిభాషను మఱెచ్చటను చూడము' అని పేర్కొనెను. కాగా తెలుగువలె తమిళము కూడ తీయనిభాష అనదగును.

ద్రావిడభాషల తీరు తెన్నులను సునిశితముగ పరిశీలించి తులనాత్మక వ్యాకరణ మొకటి రచియించిన కాల్డ్వెల్ దొర తమిళ శబ్దము సంస్కృత శబ్ది మైన ద్రావిడ శబ్దభవ మని నుడివెను. ద్రావిడము నందలి దకారము తొలుత ళకారముగాను, పిమ్మట ழ కారముగాను మార్పు చెందియుండ నగునని ఆయన విశ్వసించెను. నేటికి మున్నూరేండ్లకు మునుపు నివసించిన సుబ్రిహ్మణ్య దీక్షితర్ అను పండితుడు తొలుత ఈ వాదమును లేవదీసెనని తెలియుచున్నది. కాల్డ్వెల్ సిద్ధాంతములతో చాలవరకు ఏకీభవించుచున్న తమిళ పండితు లీవిషయమున భిన్నాభిప్రాయులై యున్నారు. ద్రావిడ శబ్దముకూడ సంస్కృతశబ్దము కాదనియు, అది తమిళ శబ్దమే అని వాదించు పండితులును తమిళులలో కొందరు లేకపో లేదు ప్రాచీన తమిళ వాఙ్మయమునందు తమిళ్ శబ్దము ప్రియుక్తమై యుండుట వలనను, తమిళ్లోని ழ (ళ) కారము సంస్కృతాద్యార్య భాషలందు లేకపోవుట వలనను, తమిళశబ్దము తమిళభాషా శబ్దమే కాని పరభాషా శబ్దభవ మనుట అసమంజస మనియు తమిళ పండితులు నుడువుదురు. ఇదియే సత్యసమ్మత మని తోచుచున్నది.

ఇక తమిళ వాఙ్మయ ప్రాచీనతను పరికింతము. ఒకానొకప్పుడు తమిళము భారతావని యందేకాక బాబిలోనియా మున్నగు దేశములందును వ్యవహారమున నుండెననియు, సంస్కృతము గ్రీకు మొదలగు భాషలలోనికి కూడ అరవ

మాటలు కొన్ని ప్రవేశించెననియు తమిళ పండితుల యభిప్రాయము. ఈ విషయమున పరిశోధనలు సలిపిన కనక సభాపతిపిళ్లై, కృష్ణస్వామి అయ్యంగారు, సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులు తమిళభాషా ప్రాచీనతను క్రీస్తునకు పూర్వము కొన్నివేల సంవత్సరముల వరకు తీసికొని వెళ్ళిరి. ఏది యెట్లున్నను, తమిళ భాషా వాఙ్మయములు మాత్రము ప్రాచీనములనుట నిర్వివాదాంశము. కాని ఒక్క విషయము. లిపిసహాయము లేకుండ వాఙ్మయము వ్యాప్తిలోనికి రాదనుట పండితులంగీకరించిన విషయమే. మనకు తెలిసినంతవరకు బ్రాహ్మిలిపియే మన దేశమునందలి ప్రాచీనలిపి. బ్రాహ్మిశాసన రచనాకాలము క్రీ.పూ. మూడవ శతాబ్దమని పండితుల యభిప్రాయము. అందువలన తమిళ వాఙ్మయము క్రీ. పూ. మూడవ శతాబ్దమునకు పిమ్మట బహుళ ప్రచారములోనికి వచ్చియుండ నగునని భావింపవచ్చును. సుప్రసిద్ధ తమిళ పండిత పరిశోధకులగు యస్. వైయాపురిపిళ్లై యిటులనే విశ్వసించిరి.

తమిళలిపిని గురించి కూడ ఇచ్చట పేర్కొనుట సమంజసము. తమిళమునకు అక్షరములు ముప్పది. వీనిలో అచ్చులు పండ్రెండు; హల్లులు పదునెనిమిది. ఒత్తక్షరములు లేవు. తమిళమున ஃ అను నక్షర మొకటి కలదు. దీనిని ఆయ్దం అని వ్యవహరింతురు. ఉచ్చారణలో ఇది 'హ'గా మారుచున్నది. ఉదా: ఎஃకు అను మాట ఎహ్కు అని ఉచ్చరించబడుచున్నది.

బ్రాహ్మిలిపినుండి తమిళలిపి యేర్పడెనని తమిళపండితులు తలచుచున్నారు. దక్షిణాపథమున ఈ బ్రాహ్మిలిపి వట్టెళుత్తుగాను, గ్రంథలిపిగాను మార్పుచెందెను. ఈ రెండు లిపులును నేటి తమిళ లిపికి రూపరేఖలు దిద్దినవి. గ్రంథలిపిలోనే నేటికిని తమిళులు సంస్కృత గ్రంథములు వ్రాసికొనుచుండిరి.

## యుగ విభజనము

తమిళ లాక్షణికులు తమ వాఙ్మయమును ఇయల్ (సాహిత్యము), ఇశై (సంగీతము), నాటకము అని విభజించిరి. ఇయల్‌ను ఇలక్కణం (లక్షణము), ఇలక్కియం(లక్ష్యము)అని రెండుభాగములు చేసిరి. ఇలక్కణ ఇలక్కియములు సంస్కృత శబ్దభవములుగా కనబడుట గమనింపదగిన యంశము.

తమిళ వాఙ్మయ చరిత్రను పండితు లీవిధముగ యుగవిభజన మొనర్చిరి.

1. సంగయుగము.
2. జైనబౌద్ధుల యుగము.
3. శైవ వైష్ణవాచార్యుల యుగము.
4. కవిత్రయ యుగము.
5. మతాధిపతుల యుగము.
6. ఆధునిక యుగము.

కొందరు సంగకాలము, సంగమునకు తరువాతి కాలము, పల్లవుల కాలము, చోళుల కాలము, నాయక రాజుల కాలము, ఐరోపీయుల కాలము – అని యుగ విభజన మొనర్చిరి.

సంగయుగపు సారస్వతమునకు సంబంధించిన వివరములు నేటికిని స్పష్టముగ తెలియరాలేదు. కొందరు పరిశోధకులు సంగము కేవలము కల్పనమని నుడివిరి. కాని ప్రాచీన తమిళ కావ్యములందు సంగప్రశంస కానవచ్చుచున్నది.

సంగము సంస్కృత శబ్దమైన సంఘమునకు సన్నిహితముగ నున్నట్లు కనబడుచున్నది మహావీరుని అనుయాయులగు శ్రావికా శ్రావకుల ధర్మబద్ధమైన సమూహమును జైనులు సంఘమని వ్యవహరించిరి. అటులనే బౌద్ధధర్మావలంబకుల సమూహమును కూడ బౌద్ధులు సంఘమని వ్యవహరించిరి. ప్రప్రథమ జైన సంఘము క్రీ.శ. 470వ సంవత్సరమున మధురలో స్థాపింపబడెను. సంగమునకు సమానార్థకమగు తమిళ శబ్దము 'కూట్టం'. మధురలో సంఘము వెలసిన కారణమున తన్నగరమునకు కూడల్ అను నామాంతరము కలిగెను. సంగయుగము క్రీస్తునకు పూర్వమే ఆరంభమై క్రీస్తునకు వెనుక మొదటి రెండు శతాబ్దములలో ముగిసెనని కొందరు తలచుచున్నారు. మరికొందరు క్రీ.శ. 7, 8 శతాబ్దములలో సంగము వర్ధిల్లెనని తలచుచున్నారు. కాని సంగయుగము క్రీస్తుశకము మొదటి శతాబ్దమునకు పూర్వమే ప్రారంభ మయ్యెనని పలువురు విశ్వసించుచున్నారు.

కవి సమూహమును సంగమని పేర్కొనవచ్చును. ఇట్టి కవిసంఘములు మూడు వర్ధిల్లెను. వీనిని తలైచ్చంగం (తొలి సంగము), ఇడైచ్చంగం (మధ్య

సంగము), కడైచ్చంగం (కడసంగము) అని అందురు. కవుల కృతులలోని బాగోగులను నిర్ణయించి సత్యాసత్యనిర్ణయ మొనర్చుటయే సంగపుపని. సంగకవుల యామోదమును బడసిన గ్రంథమే ప్రచారములోనికి వచ్చుచుండెను. సంగకాలపు సాహిత్య మానాటి తమిళ సంఘమును మనోజ్ఞముగ చిత్రించుచున్నది. అలనాటి తమిళుల యాచార వ్యవహారములు, యుద్ధవిధానము, తమిళ భూపతుల గుణ గణములు మొదలగు వానిని సంగకాలపు కృతులనుండి గ్రహింపవచ్చును.

## సంగయుగము

తొలిసంగము మధురలో వర్ధిల్లెననియు,అందు 549మంది కవులుండిరనియు శివుడు, మురుగన్, అగత్తి(స్త్య)యన్ మొదలగువారు సభ్యులుగా నుండి రనియు నుడువుదురు. ఈ సంగమున వెలసిన యుద్గ్రంథములలో అగస్త్యుడు వ్రాసెనని చెప్పబడు అగత్తియం అను లక్షణగ్రంథము పేర్కొన దగినది. ఈ లక్షణ గ్రంథము నందలి కొన్ని సూత్రములు మాత్రమే నేడుపలబ్ధములు. ఇందు 12,000 సూత్రము లుండెనని ప్రతీతి!

మహేశ్వరుడు పాణినికి సంస్కృత వ్యాకరణమును, అగస్త్యునికి తమిళ వ్యాకరణమును ప్రసాదించెనని యైతిహ్య మొకటి కలదు. కనుక అగస్త్యుడు పాణినికి సమకాలికుడగు చున్నాడు. ఈ యైతిహ్యములోని సత్యాసత్యము లెట్లున్నను, తొలి తమిళ వ్యాకరణమును ప్రసాదించిన కారణమును పురస్కరించు కొని అగస్త్యుని తమిళభాషా జనకుడని తమిళులు ప్రస్తుతించుచున్నారు. అంతే కాదు; తమిళమును అగస్త్యం అనియు పేర్కొనిరి.

అగస్త్యునికి పూర్వమే తమిళవాఙ్మయ ముండెనని కొందరియభిప్రాయము. కాని అతనికి పూర్వము లక్షణగ్రంథ మొక్కటియులేదనుట నిజమునకు దగ్గరగా నుండును. కనుక ఆకొరతను తీర్చినవాడు అగస్త్యుడే. పాణిన్యాచార్యులవారి ననుస రించి అతడు రచన చేసెననియు, అందువలననే అతని లక్షణ గ్రంథము నందును కర్మణ్యర్థము, ఏడువిభక్తులు, తద్భవ రూపమున కొన్ని సంస్కృత శబ్దములు మొదలగునవి ప్రవేశించెననియు పండితులు కొందరు నుడువుదురు.

మధ్యసంగము కపాదపురమున వర్ధిల్లెనట. అందు 59 మంది కవులుండెడి వారనియు, వారిలో అగస్త్యుడు, తొల్కాప్పియనార్ మున్నగువారు సుప్రసిద్ధులనియు తెలియు చున్నది. తొల్కాప్పియనార్ రచియించిన తొల్కాప్పియం బహుధా ప్రశంసింపదగిన లక్షణ గ్రంథము. ఇది తరువాతి లాక్షణికులకు ఒజ్జబంతి యైనది.

అగస్త్యుని పంద్రెండుగురు శిష్యులలో తొల్కాప్పియనార్ ఒకడు. ఐంద్ర వ్యాకరణము నాధారము చేసికొని అతడు తొల్కాప్పియమును సంతరించెనని విదితమగు చున్నది. 'ఐందిరం నిఱైన్ద తొల్కాప్పియన్'. ఐంద్రి వ్యాకరణము పాణినీయముకంటెను ప్రాచీనమైనదనియు, అందువలన తొల్కాప్పియనార్ క్రీ పూ ఐదవ శతాబ్దమున జీవించియుండనోపు ననియు కొందరు తలచుచున్నారు.

## తొల్కాప్పియము

తొల్కాప్పియమునందు 1,600 సూత్రములు గలవు. ఇందు ఎళుత్తు (అక్షరామ్నాయము), సొల్ (శబ్దము), పొరుళ్ (కావ్యవస్తువు) అను మూడు భాగములు గలవు. ఈ ఒక్కొక్క భాగము మరల తొమ్మిది భాగములుగా విభజింపబడెను. తొలి రెండుభాగములును కేవలము వ్యాకరణాంశములకు సంబంధించినవి. శబ్దపరిచ్ఛేదమునందు మాటలపుట్టుకయు వానియర్థములును వివరింపబడెను. శబ్దస్వభావము ననుసరించి లింగవివక్షణ చేయబడుట యీ లక్షణ గ్రంథము నందలి యొక ప్రత్యేకత. వ్యవహారమున కలసిమెలసి పోయిన మాటలన్నియు - అవి అన్యభాషా శబ్దములైనను సరే - స్వీకరింపదగినవే అని తొల్కాప్పియనార్ ఆదేశించుట ఎంతేని గమనింపదగు నంశము.

ఇక తొల్కాప్పియం ప్రత్యేకతను ప్రవక్త మొనర్చుచున్న కావ్యవస్తు విభాగమును పరిశీలింతము. కామము, తత్సంబంధమగు విషయములు, యుద్ధ విధానము, రహస్యప్రేమ, సాంసారిక ప్రణయము, సాత్త్విక భావములు, ఛందస్సు, లోకోక్తులు - మొదలగు తొమ్మిదిభాగములీ పరిచ్ఛేదమున గలవు. వీనిలో తమిళుల సామాజిక జీవనవిధానము మనోజ్ఞముగ వివరింపబడినది. వారి యభిరుచులు, ఛందస్సంప్రదాయములు, ఆచార వ్యవహారములు, జాతివార్తా

చమత్కృతులు మొదలగు వానిని తెలిసికొనుటకు ఈ పరిచ్ఛేదము తోడ్పడు చున్నది. ఇళంపూరణార్, నచ్చినార్ కినియార్ మున్నగువారు ఈ లక్షణ గ్రంథమునకు ప్రశస్తములగు వ్యాఖ్యానములు వెలయించిరి.

తొల్కాప్పియనార్ కాలమునాటికే సంస్కృతభాషా వాఙ్మయములు తమిళనాడులో ప్రచారమున నుండెననుటకు తొల్కాప్పియమే సాక్షి. తొల్కాప్పియనార్ పాణినీయమునే కాక పతంజలి మహాభాష్యము, భరతశాస్త్రము మొదలగు వానిని సంప్రతించి రచన కావించెనని తెలియుచున్నది. సంస్కృత నాటకములందలి విదూషకుని మనసులో నుంచుకొని కాబోలు అతడు ప్రణయగాథలలో బ్రాహ్మణునకు తావు కల్పించెను. ఈ కల్పనము తమిళకవి సంప్రదాయము కాదు. కనుక సంస్కృతనాటక వాఙ్మయ వికాసమునకు పిమ్మటనే తొల్కాప్పియ రచన జరగియుండ వచ్చునని పి. టి. శ్రీనివాస అయ్యంగారు విశ్వసించిరి. అయినను తొల్కాప్పియనార్ తమిళకవి సంప్రదాయము ననుసరించియే రచన చేసెననుట సమంజసము. తమిళ భాషోచ్చారణమున కనుకూలముగ మార్పుచెందిన సంస్కృత శబ్దములను మాత్రమే అతడు స్వీకరించెను. ఏ పట్టున గూడ తమిళ సంస్కృతములకు జన్యజనక సంబంధమును నిర్ణయించలేదు.

## మహాకవి తిరువళ్లువర్

కడసంగమున 49 మంది కవులుండెడి వారనియు, 449 గ్రంథములందు సమీక్షింపబడెననియు చెప్పుదురు. ఈ సంగమున కధ్యక్షుడు నక్కీ(తీ)రుడు, దిశాష్టకము నావరించు చిరయశస్సు సముపార్జించిన తిరువళ్లువర్ మహాకవి యీ సంగమునందలి కవిప్రవరులలో సంభావ్యుడు. తిరుక్కుఱళ్, పత్తుప్పాట్టు. ఎట్టు త్తొగై, పదినెణ్ కీళ్కణక్కు - మొదలగు సద్గ్రంథములు వెలుగులోనికి వచ్చినవి.

'అల్పాక్షరముల ననల్పార్థ రచనఁ
గల్పించుటయ కాదె కవి వివేకంబు'

అని నుడివిన మహాకవి పాల్కురికి సోమనాథుని మాటలకు లక్ష్యముగ నుడువ దగిన రచన మేదేని తమిళమున నున్న దన్నచో అది తిరుక్కుఱళ్ అనవచ్చును.

నీత్యుద్బోధకముగ సంతరింపబడిన యీ రసవత్కావ్యమును తమిళులు నాడు నేడు కూడ తమిళ వేదమని కొనియాడు చున్నారు. కొండంత భావమును రెండు పాదముల గీతములో (కుఱళులో) అలతి యలతి మాటలతో కుదించి రచించిన ప్రతిభాగరీయస్కుడు తిరువళ్లువర్. 'ఆవగింజను తొలిచి వళ్లువ రందులోనికి సప్తసముద్రములను చొప్పించెను.' అని ఒక ప్రాచీనకవి కుఱళును కొనియాడెను. ఇది అత్యుక్తికాదు. 'త్రివ్విన కొలంది చెలమ నేర్పడిన నీరమట్లు' చదివిన కొలది తిరుక్కుఱళులో మహోన్నతములగు భావములు స్ఫురించుచుండును.

తిరువళ్లువర్ శైవుడని కొందరు, జైనుడని మరికొందరును తలచుచున్నారు. అసలీ కవి నిజనామధేయమే చరిత్రకు తెలియరాలేదు. వళ్లువన్ అను మాటకు పంచముడు, ఏనుగునెక్కి నగరా మ్రోగించుచు రాజాజ్ఞలను తెలియజేయువాడు, ఆది ద్రావిడుల పురోహితుడు మొదలగు అర్థములు చెప్పబడుచున్నవి. అందు వలన వళ్లువర్ కులమును నిర్ణయించుటకు కూడ వీలగుటలేదు. అతడు మదరాసులోని మైలాపూరులో జన్మించినట్లు భావించుచున్నారు. ఈ కారణమున కాబోలు మైలాపూరులో తిరువళ్లువరునకు ఆలయ మొకటి నిర్మింపబడినది.

వళ్లువర్ కులమునుగురించి భిన్నాభిప్రాయములున్నటులనే, ఆతనికాలమును గురించి కూడ భిన్నాభిప్రాయములు గలవు. క్రీస్తునకు పూర్వమే అతడు జీవించి యుండెనని కొందరు, క్రీస్తుశకము తొలి మూడు శతాబ్దములలో జీవించి యుండనోపునని మరికొందరును తలచుచున్నారు. కాని జి. యు, పోప్ క్రీ. శ. 800–1000 ప్రాంతమున వళ్లువర్ జీవించి యుండవచ్చుననియు, పి.టి. శ్రీనివాస్ అయ్యంగారు వళ్లువర్ క్రీ శ.ఆరవ శతాబ్దమునకు తరువాతి వాడనియు నిర్ణయించిరి.

మహాతత్త్వవేత్తయు మహాకవియునగు తిరువళ్లువర్ చిరయశస్సు గడించుటకు కారణమాతని కుఱళ్ గ్రంథరచన మనియే నుడువవగును. సార్వజనీనము, సార్వకాలికమునగు ఈ నీతిగ్రంథము నందలి సూక్తులు సుధారసోక్తులు; సహజ సుందరములు; స్వాభావికములును. వానిలో ఏ మతప్రసక్తియు కనబడదు. ఈ యుద్గ్రంథమునకు ముప్పాల్ (త్రివర్గము), ఉత్తరవేదం, పొయ్యామొళి (యథార్థ కావ్యము), తమిళ్‌మఱై (తమిళవేదము) మొదలగు నామాంతరములు కలిగెను. అటులనే తత్కర్తకు కూడ నాయనార్ (పూజనీయుడు), నాన్‌ముగనార్ (చతుర్ముఖుడు), దేవర్ (దైవము) మున్నగు నామాంతరము లేర్పడెను.

తిరుక్కుఱళులోని ప్రాశస్త్యమును గ్రహించి పాశ్చాత్య విద్వాంసులా గ్రంథమును తమతమ భాషలలోనికి అనువదించుకొనిరి. తెలుగున కూడ కుఱళు నకు ప్రశస్తములగు అనువాదములు వెలయుట హర్షింపదగిన విషయము.*

కుఱళులో ధర్మార్థకామములకు సంబంధించిన అమూల్యాంశములు వివరింప బడినవి. కనుకనే దీనికి త్రివర్గ మను పేరు కలిగెను. దైవస్తుతితో ప్రారంభ మయిన ధర్మఖండమునందు ప్రవృత్తినివృత్తిమార్గములు మనోజ్ఞముగ విశదీకరింప బడినవి. అర్థఖండమునందు రాజ్యాంగవిధానము, కోశపద్ధతి, మిత్రిత మున్నగు విషయములేకాక పాలకులకును పాలితులకును సంబంధించిన విషయములు కూడ వివరింపబడినవి. కమనీయ కావ్య మనదగిన కామఖండమునందు ప్రేమ స్వరూపు లయిన ప్రేయసీ ప్రియుల ప్రథమ సమాగమము, వారి రహస్య ప్రేమ, పిమ్మట నానాటికి పరిణతి చెందు వారిప్రేమానురాగములు, అటుపిమ్మట విధివశమున వారి నడుమ నేర్పడు వియోగము, తత్సంబంధమగు దుఃఖము మొదలగునవి యెంతో సుకుమారముగ చిత్రింపబడినవి. వళ్లువర్ కవితాశక్తిని అవగాహన చేసికొనుటకు ఈ కామఖండము మిక్కిలి తోడ్పడును.

తిరువళ్లువర్ దృక్పథమున ఒడలువంచి, నేల పండించి ప్రపంచమున కాహారమిడు కర్షకుడును, యతులకు మృతులకు అభ్యాగతులకు దీనులకును ఏడు గడగా నుండు గృహస్థుడును పరమపూజ్యులు. వీరిరువురును లేకున్నచో సర్వ సంగ పరిత్యాగ మొనర్చి సాంద్రాటవీ సీమలలో కాలము గడపు సన్న్యాసులు కూడ కష్టముల పాలగుదురు. అటులనే గృహిణిని గురించి వళ్లువర్ ఇట్లనెను. సహధర్మచారిణి సుగుణాలవాలయగుచో దారిద్ర్యమునకు తావేలేదు. ఆమె సుగుణ సంపన్న కానప్పుడు సిరిసంపదలుండి మాత్రమేమి లాభము? కామఖండములో ప్రేమను గురించి వళ్లువర్ 'చవిచూచినగాని ద్రాక్షాసవములోని తీపు తెలియదు.

---

*తిరుక్కుఱళునకు వెలసిన తెలుగుసేతలలో సుప్రసిద్ధ విద్వత్కవులగు శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగారి త్రివర్గ మొకటి. తిరుక్కుఱళునే కాక శిలప్పదిగారము, మణిమేకలై వంటి ఉత్తమ కావ్యములను, కంబరామాయణమును తెలుగుచేసి శ్రీ శ్రీరాములు రెడ్డిగారు మనకు మహోపకార మొనర్చినారు. వీరి కృషి ప్రశంసార్హము:

కాని చూచినంతనే ప్రేమరసము మధురిమమని తోచును' అనెను. ఎంత తీయని కల్పన మిది! కాని యీ ప్రేమ మృదులాతి మృదులము! ఆ మృదుత్వమును గ్రహించి దానిని సుకుమారముగ సంరక్షించువారు చాల కొద్దిమంది మాత్రమే.

తమిళవేదమని వార్తకెక్కిన ఈ గ్రంథరాజమును పఠించినపిదప ఈ విషయాధికము ప్రధానముగ స్ఫురించును. పాలకులు, పాలితులు-అందరు ధర్మమార్గావలంబకులై సంచరింపవలెను. శాశ్వత సౌఖ్యమును ప్రసాదించు ధర్మపథము నవలంబించుటయే మానవుని లక్ష్యమై యుండవలెను. కామ క్రోధ మోహములే మానవుని కష్టపరంపరకు కారణములు. ఇవి తొలగిననాడే మానవుడు కష్టజలధినుండి గట్టెక్కగలడు.

## తమిళ వేదము

పి. టి. శ్రీనివాస అయ్యంగారు, యస్. వైయాపురిపిళ్లై, వి.ఆర్. రామచంద్రదీక్షితర్ ప్రభృతులు తమిళవేదము నందు సంస్కృతవాఙ్మయ ప్రభావము గోచరించుచున్నదని అభిప్రాయపడిరి. ఇది పరిశీలింపదగిన యంశము. కుఱళ్ రచనావిధానము సంస్కృతమునందలి సూత్ర రచనావిధానమును తలపించుచుండుట కూడ పరిశీలింపదగిన యంశమే. ఇట్లనుటచే తిరుక్కుఱళ్ స్వతంత్రరచన కాదనుకొనరాదు. ఇంతకు తమిళ వేదము నీత్యుద్బోధక రచనము; మధుర మంజుల కావ్యము. ఇది యది అననేల? తిరుక్కుఱళ్ విజ్ఞానఖని! వళ్లువర్ భావములను కొన్నిటిని చవిచూచి ఆనందింతము.

'శిష్టుఁడైనట్టి దేశికుఁ గొల్వకున్నఁ
గష్టించి నేర్చినకళ లెల్ల సున్న.'

'వర్షమే నరునకు పతనభూతమ్ము
వర్షమే యతని సంపదకు మార్గమ్ము.'

'ధర్మలాభము కంటె ధనమెద్ది జగతి
ధర్మనాశము కంటెఁ దగుపాప మెద్ది?'

'పర దైవముల వీడి పతిఁగొల్చుచాన
కురియు మన్నంతనే కురియదే వాన?'

'కసరి యిచ్చిన దానికంటె - రమ్యోక్తిఁ
బసమించు మోముతోఁ బలుకుటే రక్తి.'

'మంచి నడత వంశమర్యాద నిలుపు
కొంచెపు నడత దుష్కులునిగాఁ దెలుపు.'

'మునుముందు పొగడి వెన్వెనుక నిందించు
మనుజు మోయునో యేమొ మహి, విధియంచు.'

'ఏవిధి బ్రతుకని యేద్చు కర్షకుని
భావించి నవ్వు భూదేవి పక్కుమని.'

'పూని ద్రాక్షాసవం బానఁగా దీపి
కాని ప్రేమరసమ్ము కనినంతఁ దీపి.'*

తిరువళ్లువరునకు పిమ్మట కవయిత్రియగు అవ్వైని పేర్కొనవలెను. ఆమె వళ్లువరు సహోదరి అని చెప్పుదురు. ఆత్తిచూడి, కొంద్రై వేంద్రన్, వాక్కుండాం, నల్వళి మొదలగు నీతి గ్రంథములను ఆమె రచియించినట్లు తమిళ పండితుల యభిప్రాయము. అవ్వై పేరుగల కవయిత్రులు చాలమంది ఉండుట వలనను, కేవలకల్పనా కథలు కొన్ని ఆమె జీవితమును ఆవరించుకొని యుండుటవలనను పై రచనములలో ఏవి ఆమెవో ఏవి యితరులవో నిర్ణయించుటకు వలను పడకున్నది. ఇంతకు ఆమె నిజనామధేయముకూడ తెలియరాలేదు పూజ్యురాలను అర్థమున అవ్వైయార్ అని ఆమె వ్యవహరింప బడుచున్నది.

ఆత్తిచూడి మొదలగు గ్రంథములందలి నీతివాక్యములు నేటికిని తమిళుల జిహ్వాగ్రముల నిల్చియుండుట పేర్కొనదగిన విషయం. సుభాషితములను చూడుడు.

"అఱంజెయ విరుంబు" (ధర్మము చేయ నభిలషింపుము)
"ఐయ మిట్టుణ్" (ఒకరికి పెట్టి ఆవల భుజింపుము)

---

* ఇవి శ్రీ చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారి తెలుగుసేతనుండి గ్రహింపబడినవి.

"శని నీరాడు" (శనివారమునాడు తలంటు పోసికొనుము)
"నన్ఱి మఱవేల్" (చేసిన మేలును మరువవలదు)
"అన్నెయుం పితావుం మున్నఱి దెయ్వం" (తలిదండ్రులే ప్రత్యక్ష దైవతములు)

## సంకలన గ్రంథములు

కడసంగ కాలముననే తమిళమున సంకలన గ్రంథములు కొన్ని వెలుగులోనికి వచ్చెను. ఆ సంకలన కృతులలో ఎట్టుత్తొగై, పత్తుప్పాట్టు, పదినెణ్ కీళ్ కణక్కు మొదలగునవి సంభావ్యములు. ఇవి బహుగ్రంథ కర్తృకములు. వేర్వేరు కాలములందు కవులు చెప్పిన పద్యములు వీనియందు చేర్చబడెను. కొందరు కవయిత్రులు చెప్పిన పద్యములు కూడ ఈ సంకలన కృతులలో చోటు చేసికొనియుండుట గమనింపదగు నంశము. ఆనాటి తమిళ భూపతులయు, మంత్రివరేణ్యులయు, దండనాథులయు జీవిత విశేషము లీ కృతులలో అభివర్ణింపబడినవి.

ఎట్టుత్తొగై ఎనిమిది గ్రంథముల బృహద్గ్రంథము నట్రిణై, కుఱుందొగై ఐంగుఱునూఱు, పదిట్రుప్పత్తు పరిపాడల్, కలిత్తొగై, అగనానూఱు, పుఱనానూఱు-అనునవి ఆ యెనిమిది గ్రంథములు. అటులనే పత్తుప్పాట్టులో పదికావ్యములును, పదినెణ్ కీళ్ కణక్కులో పదునెనిమిది కావ్యములు నున్నవి. ఈకావ్యములందు పదరచనలు చేయబడినవి. పదరచనలు దేశిసాహిత్యమునకు చెందినవి. కనుక దేశి సాహిత్య సంప్రదాయములను గ్రహించుట కీ కావ్య కదంబము తోడ్పడు ననుట స్పష్టము.

పద సంఖ్యను పురస్కరించుకొని సంకలనకర్త లీ గీతికాగుచ్ఛములకు పేర్లుపెట్టిరి. అగనానూఱు, పుఱనానూఱులలోని గీతములందు 13 మొదలుకొని 17 వరకును పాదములు గలవు. కనుక వీనికి నెడుందొగై (దీర్ఘసంకలనము) అను వ్యవహారనామము కలిగెను. 4 మొదలుకొని 8 వరకును పాదములున్న గీతముల సంకలనమునకు కుఱుందొగై (లఘుసంకలనము)అను పేరు కలిగెను. నట్రిణైలో 9 నుండి 12 వరకుగల పాదములతోడి గీతములు గలవు. పత్తుప్పాట్టులోనివి చాల దీర్ఘములైన గీతములు. ఇక ఈ సంకలన కృతులలో సుప్రసిద్ధములగు అగనానూఱు, పుఱనానూఱులను దిఙ్మాత్రముగ పరిశీలింతము.

అగం అనుమాటకు స్థూలముగ ప్రేమ అని అర్థము చెప్పవచ్చును. అది నిష్కల్మషమగు ప్రేమ. ఏకమనస్కులైన నాయికానాయకులు సంతోష పురస్సరముగ వ్యక్తీకరించు మధురానుభూతియే అగం అనబడును ఇట్టి ప్రేమగీతములు ఈ కావ్యమునందు నన్నూరు గలవు. కనుకనే యీ కృతికి అగనానూఱు అను పేరు కలిగెను. పాండ్యభూపతి యగు ఉగ్రపెరువళుది అనునాతని సమాదరణమున రుద్రశర్మ అను పండితుడీ కావ్యమును సంకలన మొనర్చెను. ఈ గీత చతుశ్శతిలో 144 మంది కవులు చెప్పిన పద్యములు గలవు వీరిలో కొందరు చాల ప్రాచీనులనియు, మరికొందరు క్రీ శ. 4 5 శతాబ్దములలో జీవించిన వారనియు విజ్ఞుల విశ్వాసము.

ప్రేయసీ ప్రియుల వివాహోత్పూర్వ ప్రణయము, వివాహానంతర ప్రణయము, పిమ్మట వారికి సంభవించు వియోగము, అప్పుడు సఖీజనము నాయికననునయించుట మున్నగు విషయము లీ గీతములలో అందాలు దిద్దుకొనెను. వీని లోని భావములు సహజ సుందరములు.

కార్యార్థమై వెడలిన ప్రియుని ఉద్దేశించి ఆతని వలపు నేస్తము తన ప్రియసఖితో ఇట్లనుచున్నది. 'ఇతరులయొద్ద దేహి అని యాచించకుండ ధర్మబద్ధమైన జీవితమును సాగించుటకు ధన మావశ్యక మని తలచి నా ప్రియుడు ద్రవ్యార్జన నిమిత్తము వెడలినాడు. అతడు వెడలిన యా త్రోవ అంత మంచిది కాదు. ఆ మార్గమున జలము నాశించి మదపుటేనుగులు బయలుదేరినవి. వాని వెనుక పులులున్నవి. భద్రాజు చేతిలోని మద్దెల నడిమిభాగమున నున్న తెల్లని భాగమువలె ఆ ప్రాంతమున నీళ్లు లేని త్రోవ మీదుగ నా ప్రియుడు వెడలెను గదా!' ఆమె విరహము ఇంత మృదులముగ వర్ణింపబడినది. అగనానూఱులోని భావము లిటులనే యుండును.

తమిళకవులు ధర్మార్థ కామములకు నొసగినంత ప్రాధాన్యము మోక్షమునకొసగియుండలేదు. ధర్మార్థ కామములు సక్రమముగ నిర్వర్తింపబడుచో మోక్షము తనంతతానే సిద్ధించునని వారినమ్మకము. అఱం (ధర్మము), పొరుళ్ (అర్థము), ఇన్బం (కామము) ఈ మూటిని తమిళు లాదరించిరి. అగనానూఱు ప్రణయ

గీతికా సంపుట మగుచో పుఱనానూఱు వీరగీతముల సంకలన మనదగును. ధర్మార్థముల సమన్వయమును పుఱం అని వ్యవహరించిరి. ఈ కృతిలోకూడ నన్నూరు గీతము లుండుటచే దీనికి పుఱనానూఱను పేరు కలిగెను. ఎవరి ప్రోత్సాహమున ఇది సంకలనము చేయబడెనో తెలియరాలేదు.

పుఱనానూఱునకు చారిత్రిక ప్రాధాన్యము గలదు. ఇందు తమిళరాజ త్రయ మనబడు చేర చోళ పాండ్యవంశీయులను గూర్చియు, వారి సామంతులను గురించియు, వీరవరేణ్యులను గూర్చియు పెక్కు విషయములు చెప్పబడినవి. భారతమును తమిళ మొనర్చిన పెరుందేవనార్ అను కవి రచించిన దేవతాస్తుతి గీతముతో పుఱనానూఱు ప్రారంభ మగుచున్నది.

పుఱనానూఱులో ఒక వీరమాతను గురించి యిటుల చెప్పబడినది:

"ఆమె పండుముసలి; భర్తృవిహీన, ఆమె కొక్కడే కుమారుడు. అతడు యుద్ధ వీరుడు. అతడొకతూరి రణరంగమునకు వెడలియుండెను. యుద్ధభూమి నుండి పగవానికి వెన్నిచ్చి అతడెచ్చటికో పలాయనము చిత్తగించెనని వదంతిగా చెప్పుకొను దుర్వార్త ఆమె చెవిని పడెను. వెనువెంటనే ఆ వృద్ధమాత కత్తి చేబూని అతనికి పాలిచ్చిన తన స్తనములను మొదలంట ఛేదించుకొన యత్నించెను. అంతలో ఏదో యొక భావము ఆమెకు స్ఫురించెను. కత్తిబూనిన చేతితో ఆ ముసలి కదనరంగమునకు పయన మయ్యెను. అట పడియుండిన వీరవరుల మృతకళేబరములను శ్రద్ధాసక్తులతో ఆమె పరికించెను. తుద కొకచోట ఆమెకు తన కుమారుని మృత శరీరము కనబడెను. అతని వక్షస్థలమున కత్తి యొకటి నాటుకొని యుండెను. నా బంగరు తండ్రి పగతురకు వెన్నిచ్చి పారిపోలేదనుచు అంతులేని సంతోషములో ఆ వీరమాత కలకల నవ్వెను."

ప్రాచీన తమిళ భూపతులందు మహాపరాక్రమశాలి యనియు, వదాన్యుడనియు, కవి పండిత పోషకుడనియు కరికాల చోళుడు చిరయశస్సు గడించెను. అట్టి యశోవిశాలుడగు కరికాలచోళుని మరణవార్తను విని చింతాక్రాంతుడైన యొక కవి యిటుల విలపించెనట. "కరికాలుడు వైరివీరుల దుర్గములను ధ్వంస మొనర్చెను. గాయకులను పోషించెను. విధ్యుక్తధర్మ నిర్వహణమునందు ఆరితేరిన పురోహితుల కనుసన్నలలో అతడు మెలగెను. సుగుణ సంపన్నులగు

రాణుల మన్ననలు పొందెను. వేదోక్తముగ యజ్ఞములు చేసెను. అకటా! అట్టి మహారాజు నేడు లేడుగదా! అతనిని కోల్పోయిన యీలోకపు దురదృష్టము నేడు పండినది. వేసవికాలములో గొఱ్ఱెమందల మేతకై గోపబాలురు ఆకులు రాల్పగా వెలవెల బోవుచు కనబడు నేరేడు చెట్లవలె నేడు నగలూ నాణెములను త్యజించిన యాతని రాణులు వెలవెల బోవుచున్నారు గదా!"

ఆనాటి సామాజిక చారిత్రక విషయములను పురనానూరు నుంచి తెలిసి కొన వచ్చును. ఈ సంకలన కృతిని, మరి యితర గ్రంథములను ఆధారముచేసి కొని సంగకాలపు తమిళుల జీవన విధానమును బాగుగా గ్రహింపవచ్చును.

ఆనాటి తమిళ భూపతులలో చేర చోళ పాడ్య వంశీయులు ప్రముఖులు. తమిళ భాషా పోషకులువారు. కవిపండితులను, గాయకులను ఆదరించిన కళా హృదయులు. కాని వారిలో సఖ్యత లేకుండెను. ఒకరిని చూచి మరొకరు ద్వేషించుకొనుచుండిరి. ఆనాటి ప్రజలకు రాజభక్తి అపారము.

ఆర్యుల యాచార వ్యవహారము లప్పటికే తమిళనాడులో కూడ వ్యాప్తి లోనికి వచ్చుచుండెను. అయినను ప్రజలును రాజులును తమ ప్రాచీనాచార వ్యవ హారము లందు గాఢానురక్తులై యుండిరి. యవనదేశపు మద్యమును రాజులు సేవించుచుండిరి. ప్రజలలో కూడ మద్యపానము సామాన్యాచారమై యుండెను. నాట్య ప్రదర్శనలు, దేవోత్సవములు మొదలగువానిలో ప్రజలు పాల్గొనుచుండిరి. యుద్ధభూమిలో మరణించుటయే కీర్తిహేతువని వీరయోధులు విశ్వసించిరి. యుద్ధభూమినుండి పారిపోవుటయో, వీపు గాయములు గలుగుటయో అవమాన ముగా గణింపబడుచుండెను.

సంగయుగము ప్రచారములోనికి వచ్చిన గ్రంథములలో నీత్యుద్బోధక రచనములే ఎక్కువగా నున్నవి. సంగకవులు కావ్యవస్తువులను సంస్కృతగ్రంథ ములనుండి గ్రహింపలేదు. వర్ణనలయందును వారి ప్రత్యేకత గోచరించుచున్నది. వారికృతులలో ప్రకృతి వర్ణనలు బహుళముగ కావచ్చుచున్నవి. అట్లని వారిని కేవలము ప్రకృతి కవులని పేర్కొనరాదు. సంగకవులు సంప్రదాయ విధేయులు. వారిలో పలువురు బ్రాహ్మణేతరులు. సంగకాలమున ముప్పదిమంది కవయిత్రులు వర్ధిల్లినట్లు తెలియుచున్నది. సంగకవులలో కొందరు సంస్కృత భాషాభిజ్ఞులై యుండిరనియు తెలియుచున్నది.

# జైన బౌద్ధుల యుగము

ఈ యుగమునందు జైన బౌద్ధుల సమాదరణమున శిలప్పదిగారం, మణి మేక(ఖ)లై, జీవక చింతామణి మొదలగు కావ్యరాజములు వెలుగులోనికి వచ్చెను. వీనితో జైనబౌద్ధుల యాచార వ్యవహారములు, తాత్త్విక రహస్యములు ముచ్చుగు నవి ప్రతిబింబించుచున్నవి. ఇట్లనుటచే జైన బౌద్ధుల కాలమున సంతరింపబడిన గ్రంథములు కేవలము జైనబౌద్ధ మత సిద్ధాంతములను వ్యక్తీకరించు రచనము లని భావింపరాదు. ఆనాటి తమిళుల ప్రశాంత జీవన విధానమును, నాగరకతను, సిరిసంపదలను అభివర్ణించుచున్న యీ గ్రంథముల నుండి తమిళుల రాజకీయ పరిస్థితులను కూడ మనము తెలిసికొనవచ్చును.

## తమిళ పంచకావ్యములు

తమిళ పంచకావ్యములలో(మణిమేకలై, శిలప్పదిగారం, జీవకచింతామణి, వళయాపతి, కుండలకేశి) రచనాకాలమును బట్టి ప్రథమ కావ్యముగా పరిగణింప బడుచున్న మణిమేఖలను శీత్తలై శాత్తనార్ అను మహాకవి రచించెను. శీత్తలై అనగా చీముకారు తల అని అర్థము. ఇది అతని విఖ్యాత నామమని విదిత మగు చున్నది. భాషలోగాని, భావములోగాని దోష మేదేని కనబడుచో, తోడనే శాత్త నార్ తాను వ్రాయుచుండిన యినుపగంటముతో శిరస్సుపై పొడుచు కొనెడివాడట! ఈ కఠిన నియమమునకు ఫలితముగా అతని శిరోభాగమున గాయము లేర్పడి చీము కారుచుండెనని చెప్పుదురు.

శాత్తనార్ క్రీ.శ. 8వ శతాబ్దమున జీవించియుండెననియు, మదురానగర మున ధాన్యవర్తకుడనియు తెలియుచున్నది. అతడు బౌద్ధుడు. సంస్కృతములోనే కాక తర్కశాస్త్రము నందును అతడు పండితుడు. శాత్తనార్ కవితలో సారళ్య మెక్కువ. అర్థవంతములు, రస ప్రధానములునైన సమాస రచనలో అతడు ఘటి కుడు. అతని ప్రకృతి వర్ణనలు అత్యంత రమణీయములు. మణిమేఖలలో నాటి బౌద్ధసంఘము మనోజ్ఞముగ చిత్రింపబడెను. ముప్పదిగాథలుగా విభజింపబడినయీ రసవత్కావ్యంనందు 4,857 పంక్తులు గలవు. మణిమేఖలా సన్న్యాస మనునర్థము నొసగు "మణిమేకలైతుఱవు" అను నామాంతరము కూడ ఈ కావ్యమునకు గలదు.

మణిమేఖలయను ముద్దుగుమ్మ వేశ్యాగృహమున జన్మించిన సచ్ఛీల! ఆమె జీవితమే యీ కావ్యమునందభివర్ణింపబడెను. ప్రధాన కథతో పాటు పెక్కు ఉప కథలు కూడ చెప్పబడుటచే కథలో కొంత క్లిష్టత యేర్పడినది. అయినను పూస లలో దారమువలె ఒక కథలో మరొక కథ ఎంతో నేర్పుగా చొప్పింపబడెను.

1,652 పద్యములుగల శిలప్పదిగార మహాకావ్యము తమిళ పంచకావ్యము లలో ద్వితీయమైనను ఇది అద్వితీయమైన కావ్య మని నుడువుట సమంజసము. కథాదృష్టితో చూచినప్పుడు ఈ కావ్యమే తొలుత వెలువడెనని తోచును. మణి మేఖల శిలప్పదిగారములు జంటకావ్యము లని పేర్కొన బడుచున్నవి.

శిలంబు అనగా మంజీరము. మంజీరమునకు సంబంధించిన కథ యగుటచే ఈ కావ్యమునకు శిలప్పదిగారం అని సహేతుకముగ పేరిడబడెను. ఇది క్రీ. శ. 9 వ శతాబ్దపు మధ్యభాగమున రచింపబడెనని పరిశోధకులును, క్రీ.శ. 2 వ శతా బ్దముననే రచింపబడెనని పండితులును తలచుచున్నారు. సతీదేవి యని ప్రజా సన్నుతి చూరగొన్న కణ్ణకి దివ్య చారిత్ర మీ కావ్యములో కన్నులకు కట్టునట్లు చిత్రింపబడినది. బతకమ్మగాథను తలపించుచున్న కణ్ణకికథ తమిళుల జాతీయగాథ.

తమిళుల సామాజిక జీవనము, తిండి తీర్థములు, పల్లెలు పట్టణములు, వానికి సంబంధించిన విశేషములు, వర్తకుల స్థితిగతులు, ఇంద్రోత్సవము, తదుత్సవమున జరుగు వింతలు వేడుకలు, సంగీత నృత్యప్రదర్శనలనిన తమిళులకు గల యాద రాభిమానములు, భోగపు జనరాండ్ర తళుకు బెళుకులు, సముద్ర వ్యాపారము, మత్స్యకారుల జీవన విధానము – మొదలగు విషయముల నన్నిటిని సమగ్రముగ ఈ కావ్యము చిత్రించుచున్నది. నాటి తమిళ సామాజిక జీవితమును ప్రతిబింబించు మణిదర్పణ మీ శిలప్పదిగార మహా కావ్యము. కథా దృష్టితో చూచినచో, ఇంత చక్కని కావ్యము మరొకటి తమిళ సాహిత్యమున లేదనవచ్చును. మొత్తముమీద మణిమేఖల శిలప్పదిగార కావ్యములు తమిళ సరస్వతికి కైసేయబడిన అమూల్య భూషణము లని నిస్సంశయముగ చెప్పవచ్చును.

శిలప్పదిగారము ఇళంగో అను రాజకవి సంతరించిన మధుర సృష్టి. అతడు చేరరాజగు సెంగుట్టువన్ సోదరుడు. భ్రాతృగౌరవముచే రాజ్యలక్ష్మిని వరింపక ఇళంగో సన్న్యాసమును స్వీకరించెను. అందువలన అతడు ఇళంగో అడిగళ్ (ఇళంగో పూజ్య పాదులు) అయ్యెను.

ఇళంగో జైనమతావలంబకుడు. కనుకనే ఆతని కృతియగు శిలప్పదిగారము జైన మతాచారముల వైశిష్ట్యమును వివరించు ప్రశస్త ప్రశస్తి కావ్యముగా వెలుగొందుచున్నది. నాటక వేషము వేసికొనిన యీ కావ్యమును "ఇయల్ (సాహిత్య) ఇశై (సంగీత) నాటక పొరుళ్ తొడర్ నిలై సెయ్యుళ్" అనియు, నాటక కాప్పియం (దృశ్య కావ్యము) అనియు వ్యవహరింతురు. అనగా శిలప్పదిగారము దృశ్య కావ్యముగా సంతరింపబడిన పద్య కావ్య మనవచ్చును.

## తమిళుల జాతీయ కావ్యము

శిలప్పదిగారము నందలి యితివృత్తము కణ్ణకి జీవితగాథ యని యింతకు పూర్వమే చెప్పబడినది. చోళ దేశములో జన్మించి, పాండ్యమండలములో పాతివ్రత్యము వెలయించి, చేరనాడులో భౌతికమును చాలించిన కణ్ణకి దివ్యచారిత్రము దేదీప్యమానమై యీ కావ్యములో తేజరిల్లుచున్నది. ఆమె పవిత్ర జీవన ఘట్టములు కావేరీనదీ జలములవలె చేరచోళ పాండ్యములను ప్రాచీన తమిళ రాజ్యత్రయమును పెనవేసికొని పవిత్రతను గాంచినవి! కనుక దీనిని తమిళుల జాతీయ కావ్య మన్నను సాహస మనిపించుకొనదు. ధర్మపథమున సంచరింపని రాజును ధర్మదేవతయే హత మార్చును. పతివ్రత యగు పడతి దేవతల యాదరాభిమానములను కూడ చూరగొనును. విధిని మానవుడు మార్చలేడు—అను ఈ మూడు సత్యములను మనసు నందుంచుకొని ఇళంగో పూజ్యపాదులు శిలప్పదిగారమును సంతరించెనని నుడువదగును.

మణిమేఖల శిలప్పదిగారములకు పిమ్మట పేర్కొనదగిన కావ్యము జీవక చింతామణి. శృంగార రసప్రధానమైన యీ కావ్యమును తిరుత్తక్క దేవర్ అను నొక జైనముని రచియించెను. "చోళ కులాబ్ధి శంఖము"గా పేర్కొన బడుటచే అతడు చోళ వంశీయుడని చెప్ప వచ్చును. తిరుత్తక్క దేవర్ క్రీ. శ. 5 వ శతాబ్దమునకు చెందినవాడని కొందరు, 9 వ శతాబ్దమునకు చెందినవాడని మరి కొందరును తలచుచున్నారు.

జీవకచింతామణికి "ముడి పొరుళ్ తొడర్ నిలై సెయ్యుళ్" అని మరియొక పేరు కూడ కలదు. ధర్మార్థ కామమోక్షము లను చతుర్విధ పురుషార్థము లిందు

వర్ణింపబడుటచే దీనికీ పేరు కలిగెను. జైనుల తాత్త్వికక రహస్యములు, వారి సంప్రదాయములు మొదలగునవి యీ కావ్య దర్పణమున ప్రతిఫలించుచున్నవి. మనోహరము లగు వర్ణనలతోను, మధురమగు శైలితోను చెలువారుచున్న ఈ కావ్యము తరువాతి కవులకు మార్గదర్శకమయ్యెను. కనుక జీవక చింతామణి కావ్య ప్రాశస్త్యము నుగ్గడించుట కీ విషయ మొక్కటియే చాలును.

ఇంకను కుండలకేశి, వళయాపతి అను కావ్యములు గలవు. ఇవి జైన బౌద్ధుల కర్తృకములే. కాని దురదృష్టవశమున ఇవి నామమాత్రములుగానే నిలిచి పోయినవి. ఈ కావ్యకర్తల నామములు కూడా తెలియరాలేదు.

జైనకవులు సంతరించిన గ్రంథములలో నాలడియార్ (చతుష్పది) కూడ పేర్కొన దగినదే. దైవస్తుతితో కలుపుకొని యిందులో 401 పద్యములు గలవు. తిరుక్కుఱళ్ వలె ఇది కూడ ప్రశస్తమగు నీత్యుద్బోధక రచన. 'ఆలుం వేలుం పల్లుక్కురుది, నాలుం ఇరండుం సొల్లుక్కురుది' (మఱియు తుమ్మయు పళ్లకు గట్టి, నాలుగూ రెండూ మాటకు గట్టి)అను మధురోక్తి యొకటియున్నది. అనగా మఱిపుల్లయు తుమ్మపుల్లయు దంతములను గట్టిపరుచునట్లుగా నాలుగడుగుల నాలడియారును, రెండడుగుల తిరుక్కుఱళును మాటకు బలము చేకూర్చునని అర్థము. నిజమునకు తిరుక్కుఱళున కెంత ప్రాశస్త్యము కలదో, తమిళ సాహిత్యమున ఈ నాలడియారునకు కూడ అంత ప్రాశస్త్యము గలదు.

## ఛందోలంకార గ్రంథములు

జైన బౌద్ధుల కాలములో కావ్యములే కాక పెక్కు ఛందోలంకార గ్రంథములుకూడ వెలుగులోనికి వచ్చెను. అట్టి వానిలో 10 వ శతాబ్దపు వాడగు అమిత సాగరుడు రచియించిన యాప్పరుంగలం, యాప్పరుంగలక్కారిగై (కారికా) అను గ్రంథములు, 11 వ శతాబ్దమున నివసించిన బుద్ధమిత్రు డను పండితుడు సంతరించిన వీరచోళీయము, జైన మతస్థుడైన గుణవీరపండితుడు వ్రాసిన నేమినాదం, పవణంది ప్రణీతమైన నన్నూల్ అను లక్షణ గ్రంథము, గ్రంథకర్తృ నామము తెలియని దండియలంకారం మొదలగునవి ముఖ్యముగా పేర్కొనదగినవి. వీరిలో పలువురు సంస్కృత పండితులై యుండుట గమనింపదగిన విషయము.

తొల్కాప్పియము ననుసరించి వ్రాయబడినదే యైనను, నన్నూల్ తమిళ లక్షణశాస్త్ర గ్రంథములలో మణిపూస అనదగును సంస్కృత తమిళ వ్యాకరణ విధానములను సమన్వయపరుచు నుద్దేశముతో రచియింపబడిన గ్రంథమే వీరచోళీయము. దండియలంకారము దండికావ్యాదర్శమునకు తమిళు సేత. తమిళమునందలి యాలంకారిక రచనములలో ఇది ప్రశస్తమైనది. పింగళముని కూర్చిన పింగళ నిఘంటువు అను నొక తమిళ నిఘంటువు కూడ ఆ నాళ్లలోనే వెలుగులోనికి వచ్చెను. అంతకు పూర్వమే దివాకరం అను నిఘంటువు వెలసెను. ఇది క్రీ.శ. 8 వ శతాబ్దపు రచన యని పండితులు తలచుచున్నారు. మొత్తము మీద జైన బౌద్ధుల కాలపు తమిళ సాహిత్యము అమూల్యమని చెప్పక తప్పదు; అందులో వైవిధ్యము కూడ కానవచ్చుట ఒక విశేషము.

జైన బౌద్ధుల కాలమున వెలసిన గ్రంథములందు తాత్త్విక రహస్యములు నిండియున్నను, వానియందానాటి సామాజిక పరిస్థితులు ప్రతిబింబించుటవలనను, ఉత్తమకవితా లక్షణములు గోచరించుటవలనను ఆ గ్రంథములకు కావ్యయశస్సు మాత్రమే కాక తమిళ వాఙ్మయమునందు ప్రముఖ స్థానము కూడ లభించెను. ఇక ఆ గ్రంథముల నుండి - ముఖ్యముగా తమిళ కావ్యపంచకము నుండి - తెలియనగు రాజకీయ, సామాజిక, మత విషయములను రేఖా మాత్రముగా పరిశీలింతము.

## కావ్య పంచకము - రాజకీయ సామాజిక విషయములు

శిలప్పదిగారం కథాకాలమునాటికి చేరరాజ్యమును సెంగుట్టువన్ మన్నీడును చోళనాడును కరికాల చోళ మహీపతియు, పాండ్య మండలమును నెడుంజెలియన్ భూపతియు పరిపాలించుచుండిరి. వీరందరు మతసహిష్ణుత ప్రదర్శించిన విశాల హృదయులు. తమిళ భాషా వాఙ్మయములను, లలిత కళలను పోషించిన రస హృదయులు. ఈ తమిళ భూపతులలో పేర్కొనదగినవాడు కరికాల చోళుడు. వారు విశాల హృదయులే యైనను వారిలో వారికి అంతఃకలహము లుండినట్లు తెలియుచున్నది.

తమిళ రాజుల యేలుబడిలో కావేరీపూం పట్టణము (ప్రహార్), మధుర మున్నగు నగరములు సిరిసంపదలతో తులతూగుచుండెను. కావేరిపూం పట్టణము

ఆ నాళ్లలో ప్రసిద్ధ నౌకాశ్రయమైయుండెను. దూరదేశములనుండికూడ అచ్చటికి నౌకలు వచ్చుచుండెనట! ఆ నగరమున విభిన్నభాషలు వ్యవహరించెడువారు పలువురుండిరట! మధురానగరము నందలి వీథులు సుందరములు; సుదీర్ఘములును. యవనభటులు తన్నగర రక్షణమునకు నియమింపబడిరట!

ఆనాటి తమిళ సంఘమునందు ధనికులు, వణిక్ప్రముఖులునైన వైశ్యశిఖామణులకు విశేష గౌరవ ముండెననుట సుస్పష్టము. తమిళ పంచకావ్యములందలి స్త్రీ పురుషులలో ప్రముఖులు వైశ్యులే. వారిలో బాల్య వివాహములే జరుగుచుండె నని చెప్పవలసి యున్నది. పెండ్లి నాటికి శిలప్పదిగారములోని నాయకుడగు కోవలుడు పదునారేండ్లవాడు. కణ్ణకి పదుమూడేండ్ల పడుచు. బ్రాహ్మణులకుకూడ సంఘమున గౌరవముండెను. కాని కొందరు బ్రాహ్మణులానాటికే వేదాధ్యయనమును మాని నృత్త గీతాది లలిత కళలను చేపట్టిరి. ఆ నాళ్లలో వేశ్యాగమనము సర్వవర్ణముల వారిలోను పరిపాటిగ నుండెను. వేశ్యలు నృత్త గీతాది కళలందు విదుషీమణులై యుండిరి. సంసారస్త్రీలు లలితకళలను అభ్యసించినట్లు కనబడదు.

ఆ నాళ్లలో స్త్రీలు కూడ సన్న్యాసాశ్రమమును స్వీకరించుచుండిరి. పాతివ్రత్యమే స్త్రీలకు ముఖ్యమైన ధర్మముగా నిర్దేశింపబడెను. నోములు నోచుట, తీర్థములందు క్రుంకులిడుట మొదలగు ఆచారములు ప్రచారమున నుండెను. భర్తృసేవానిరతియే స్త్రీలకు సద్గతి ప్రసాదించునను నమ్మకము ప్రబలముగా నుండెను. అప్పటికే ఆర్య, దేశి యను భేదములు వ్యాప్తిలోనికివచ్చెను. కరికాలచోళుని సభాభవనమున మాధవియను వేశ్య తొలుత దేశినాట్యము గావించి అటుపిమ్మట ఆర్య పద్ధతిని నృత్య మొనర్చెనని శిలప్పదిగారము నుడువుచున్నది. అందు వర్ణింపబడిన అరంగేట్రుగాదై (రంగాధిరోహణ గాథ) పరిశీలింప దగినది. రంగాధిరోహణోత్సవమునందు సంగీతాచార్యులు, వైణికుడు, మార్దంగికుడు, కవి మున్నగువారు పాల్గొనుచుండిరి. పర్వతప్రాంతములందు నివసించువారు కుఱవ యను దేశి నాట్య విశేషమున సిద్ధహస్తులై యుండిరి. ఇది రాసక్రీడ వంటిదని సుప్రసిద్ధ పరిశోధక విద్వాంసులగు ము. రాఘవయ్యంగారు విశ్వసించిరి.

కర్షకులకుకూడ ఆనాటి సంఘమున గౌరవప్రపత్తులు లభించెను. శిల్పులు, చిత్ర లేఖకులు మున్నగువారు కూడ గౌరవింపబడు చుండిరి. నిర్ధనులు మట్టి

గోడల యిండ్లలో నివసించుచుండిరి. యిండ్ల కప్పులకు వారు బోదకసవు, తాటి యాకులు, కొబ్బరి యాకుయి మొదలగు వానిని ఉపయోగించు చుండిరి.

ఆ దినములలో తమిళదేశమునందు జైన బౌద్ధమతము లుచ్చస్థితి యందుం డెనని వేరుగ చెప్పనవసరములేదు. తమిళ కావ్య పంచకమునందు మణిమేకలై, కుండలకేశి కావ్యములు బౌద్ధమత ప్రాశస్త్యమును, శిలప్పదిగారము, జీవకచింతా మణి కావ్యములు జైన మత ప్రాశస్త్యము నుగ్గడించుచున్నవి. జైన బౌద్ధములు మహోన్నతదశలో నుండినను, శైవ వైష్ణవ మతములు కూడ వ్యాప్తిలోనుండెను. శక్త్యారాధనము, జంతు బలులు మొదలగునవి కూడ వ్యాప్తిలో నుండెనని విదిత మగుచున్నది. ఇన్నిమతములు ప్రచారమున నున్నను మత కలహము లున్నట్లు కనబడదు. కావేరిపూం పట్టణములో జైన బౌద్ధ విహారములతో పాటు శివ కేశ వాలయములు, కుమారస్వామి యాలయము, ఇంద్రాలయము, కృష్ణ బలరాముల మందిరములు కూడ నుండెను. ఆ నాళ్లలో కుటుంబము నందలి వారెల్లరు నొకే మతము నవలంబింపవలయు ననెడి నియమము లేదనియే నుడువ వగును. ఇంద్రోత్సవము మహా వైభవముగ జరుగుచుండెను. శకునములందును, జ్యోతిష శాస్త్రము నందును, పునర్జన్మ, కర్మ సిద్ధాంతములందును నాటిప్రజలకు నమ్మక ముండెను. ఆనాటి ప్రజలు నాగరకులనియు, దైవభక్తులనియు, రసహృదయు లనియు వ్యక్తమగుచున్నది.

ఉపసంహారమున, జైనబౌద్ధుల యుగమునందు వెలువడిన గ్రంథములందు సంస్కృత శబ్దములు, ఆర్య గాథలు ననేకములు ప్రవేశించెను. అనగా వారి కాలమున సంస్కృత భాషా వాఙ్మయములకు తమిళనాడులో బహుళ ప్రచారము లభ్యమయ్యె నన్నమాట. ఏమైనను, జైన బౌద్ధులు సంతరించిన కావ్యములకు తమిళ పంచకావ్య యశస్సు కలుగుట విస్మరింపరాని విషయము !

# శైవ వైష్ణవాచార్యుల యుగము

జైనబౌద్ధమతాచార్యుల ప్రాబల్యము తగ్గుముఖము పట్టుటతో తమిళనాడులో మరల శైవ వైష్ణవములు విజృంభించెను. శైవము అతి ప్రాచీన మగు మతము. తమిళ శైవులు నాడు నేడు కూడ శాకాహారులు. అందువలన మాంసాహారులు,

మద్యపాన నిరతులునగు ఆర్యుల యాచార వ్యవహారములు తొలుదొలుత తమిళ శైవులకు నచ్చ లేదు. కాని శైవమునందు నానాటికి క్రతు కలాపము కొండవలె పెరిగి పోవుట వలనను, మరికొన్ని హేతువుల వలనను జైనబౌద్ధములు అనాయాసముగ శైవుల యాదరాభిమానములను చూరగొనెను. పలువురు శైవులు జైన బౌద్ధములను స్వీకరించిరి. కాని కాలక్రమమున వైదిక విజ్ఞానము ప్రజాభిమానమును చూరగొనుటతో జైనబౌద్ధముల ప్రాభవము తగ్గ జొచ్చెను. అందుకు తోడుగా బసవేశ్వరుని వీరశైవము కూడ వ్యాప్తిలోనికి వచ్చెను. కాగా వైదిక శైవము, అవైదిక శైవము నను ప్రభేదములతో శైవము బహుళ ప్రచారము గడించెను.

ఒకవైపు శైవము, మరియొకవైపు వైష్ణవమును ప్రబలుచుండిన కాలమది, శైవ సమయాచార్యులకు నాయన్మారు లనియు, వైష్ణవ మతాచార్యులకు ఆళ్వారు లనియు వ్యవహార నామములు కలిగెను భక్తివాదమువలనను, తమతమ యత్యద్భుత మహిమలవలనను వారు ప్రజాభిమానమునకు పాత్రులయిరి. తమిళనాడులో క్రీ. శ. 7 వ శతాబ్ద ప్రాంతమున ఎచ్చట చూచినను మత సంబంధమయిన సమావేశములే; చర్చలే. మత విషయక వాదోప వాదములలో మునిగిపోయిన నాయన్మారులుగాని ఆళ్వారులుగాని ప్రత్యేక గ్రంథములు సంతరించకపోయినను, భక్తిరస ప్రపూర్ణములగు గీతము లనేకములు వెలయించిరి. ఆ భక్తిగీతములే తరువాతి కాలమున సంకలనము చేయబడి గ్రంథరూపమున వెలువడెను. శైవగీత కదంబమునకు తిరుమఱై యనియు, వైష్ణవగీతికా సందోహమునకు నాలాయిర దివ్యప్రబంధం అనియు వ్యవహారనామములు కలిగెను. కనుక శైవవైష్ణవ మతాచార్యుల యుగమున ప్రచారములోనికి వచ్చిన తమిళ సాహిత్యము మధురగేయమయమై భక్తిరస పరిపూర్ణమై యున్నదనుట సమంజసము.

## గేయములు - గీతములు

జైనుల ప్రాభవమునకు అడ్డుమాకలు వేయదలచిన హైందవులు కొందరు ఆ నాళ్లలో భక్త్యుద్యమమును లేవదీసిరి. భక్తిప్రధానమగు నీ యుద్యమము కుల వివక్షతను నిరసించెను. తత్ఫలితముగా ఈ యుద్యమమునకు అనాయాసముగా ప్రజాభిమానము లభించెను. భక్త్యుద్యమము బలపడుకొలది, దేవోత్సవము లెక్కువ

కాదొడగెను; గుళ్లు గోపురము లనేకములు వెలసెను. అంతకు పూర్వము కొందరు మాత్రమే చదువుచుండిన పురాణేతిహాసములను పలువురు పఠింపదొడగిరి. రామాయణ మహాభారతముల వంటి యుద్గ్రంథములు తమిళము చేయబడెను. ప్రజలభాషకు సాహిత్యగౌరవము లభింపజొచ్చెను. ఆళ్వారులును, నాయన్మారులును సంస్కృత భాషాభిజ్ఞులైనను భక్త్యుద్రేకమున వారు ప్రజల భాషయందే గీతములు పాడిరి. గేయము లయప్రధానము. అందువలన వారు పాడిన ఆ మధుర గీతములు ప్రజలను మిక్కిలి ఆకర్షించెను.

పదునొకండవ శతాబ్ద ప్రారంభమున నంబియాండార్ నంబియను నొక యర్చకుడు శైవుల గీతముల నన్నిటిని సేకరించి వానిని పదునొకండు భాగములుగా వర్గీకరించెను. ఈ గీతములను తిరుజ్ఞాన సంబంధర్ (సంబంధర్), తిరునావుక్కరశర్ (అప్పర్), సుందరమూర్తి (సుందరర్), మాణిక్యవాచకర్ మొదలగు నాయన్మారులు పాడిరి. ఇవి యన్నియు నేటికిని శైవులకు పరమప్రీతిపాత్రములు. నిజమునకీ గీతికాగుచ్ఛములు సుధారస ఖండములు; భక్తిరస ప్లావితములును.

నాయన్మారులు మొత్తము అరువదిమువ్వురు. వీరిలో అన్నిజాతులవారును గలరు వీరు క్రీ.శ. ఏడవ శతాబ్ద ప్రాంతమున జీవించినట్లు చెప్పుదురు.

తిరుజ్ఞాన సంబంధుని తేవారం శైవమతస్థులకు పారాయణ గ్రంథము. తేవారము నందలి గీతము లన్నియు శివపారమ్యము నుగ్గడించునట్టివి. ప్రతి గీతము నందును గేయాంశము మిక్కుటముగా నుండుటచే తేవారము గానానుకూలమైన గ్రంథమనుట అత్యుక్తి కానేరదు. ఈ గీతికా సంపుటమునకు గల ప్రచారము మరియే యితర శైవ గ్రంథమునకు లేదని నుడువదగును. భగవదనుగ్రహమున జ్ఞానసంబంధము కవిత చెప్పసాగెననియు, మూడేండ్ల చిన్నవయస్సుననే అతడు కవిత్వము చెప్పెననియు నుడువుదురు. తమిళనాడులో అతడు మెట్టని శివాలయము లేదు; చూడని శివవిగ్రహము లేదు; పాడని పుణ్యస్థలము లేదు.

తిరునావుక్కరశర్ పల్లవభూపతి యగు మొదటి మహేంద్రవర్మ కాలపు వాడని తెలియుచున్నది. అతడు తొలుత జైనుడు. జైనమత సిద్ధాంతము లం

ధనిష్టత యేర్పడిన పిదప అతడు శైవమును స్వీకరించెను. అతని ప్రోద్బలమున మహేంద్రవర్మ కూడ శైవుడయ్యెను. పైతృకముగ సంక్రమించిన సిరిసంపదలను కూడ ధర్మకార్యములకు వినియోగించిన మహావితరణి.

తిరునావుక్కరశర్ సంగీతప్రియుడు. అతని గీతములందు అక్షరరమ్యత ప్రధానముగా కనబడుచుండును. అతడు పెక్కుగీతములు పాడినట్లు చెప్పుదురు; కాని కొన్నిమాత్రమే నేడు లభ్యములు. ఈ క్రింది గీతమును చవిచూడుడు.

'నవ్యమోహన మధుర వీణా వినాద
మధురిమము వోలె, చల్లని మందమారు
తమువిభాతి, ప్రశాంత సంధ్యా సుధాంశు
కిరణములరీతి, పంకజాకరము మాడ్కి
లలితవాసంతికా శోభవలె చెలంగు
పావనము లైన నాతండ్రి పరమశివుని
చరణకమలంబు లతిమనోహరము, లతుల
శీతలమ్ము, లశేష సంప్రీతిదములు.'

మతసహనము లేని జైనమతస్థులు శైవమును స్వీకరించిన తిరునావుక్కరశరును ఆవము నందుంచిరట! అప్పుడా భక్తకవి నిశ్చలచిత్తుడై సర్వేశ్వరు నుద్దేశించి పయిగీతమును పాడెనని యైతిహ్యము!

శైవ సమయాచార్యులలో సుందరమూర్తికి తరువాత పేర్కొనదగినవాడు మాణిక్యవాచకర్. అతడు క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దమున జీవించెనని తెలియు చున్నది. వీరశైవు లతనిని పరమాచార్యునిగా సంభావించుచున్నారు. ఆర్యవిజ్ఞాన సర్వస్వ మాతని జిహ్వాగ్రమున నుండెనట! శాస్త్రవైదుష్యము, ఐతిహాసిక పరిజ్ఞానము, నిర్మల భక్తిభావము మొదలగునవి అతని గీతములందు మూర్తీభవించినవి. అతని నిజనామము వాదవూరర్. మాణిక్యవాచక రనునది బిరుదము. మాణిక్యములవంటి మధురోక్తులు నుడివిన కారణమున మాణిక్యవాచక రను బిరుదమాతనికి కలిగెనని విజ్ఞుల విశ్వాసము.

మాణిక్యవాచకుని కృతులలో పేర్కొనదగినది 'తిరువాచకం'. ఈ సత్కృతి వలన అతనికి తమిళవాఙ్మయములో శాశ్వతస్థానము లభించినది. ఇందలి గీతములు పొంగులువారు భక్త్యావేశముతో రచింపబడియుండుట ఒకవిశేషము. జటిలములయిన యాధ్యాత్మికవిషయములను పామరులు సైతము అర్థము చేసికొనురీతిని రచింపబడుట మరొకవిశేషము. దేశికవితాశాఖకు చెందిన అమ్మానై (అచ్చనగాయలాడు సందర్భమున స్త్రీలు పాడెడిపాట), తెళ్లేణం (గొబ్బిపాటలు), సాళల్ (జోలపాటలు) మొదలగు మధురకవిత లందును మాణిక్యవాచకుడు గీతములు వెలయించెను. అందువలన అతని రచనలకు పండితపామరుల యాదరాభిమానములతో పాటు ప్రచురప్రచారము కూడ లభించెను కాళహస్తీశ్వరశతకకర్త యగు ధూర్జటి కవివలె అతడును పరితిగీతమునందు ఆత్మోద్ధరణకై భగవంతుని ప్రార్థించెను. మచ్చున కొకగీతము.

'సాహాయ్య మేమియు సలుపక మృతశ
రీరమువలె సంచరించు హృదయమ!
ఆద్యుండై భాసించు నా నటరాజ
మూర్తియందు దేక నీకు మోహమ్ము సున్న.
ఆనందతాండవం బాతని యెదుట
చేయనే చేయవు హాయిగా పాట
పాడవు బొమికలు పొడి యగుదాక.
భక్త్యంజలులు ఘటింపవు నీ వతనికి,
శివపదంబుల తలఁ జేర్చవు నీవు
అతఁ డన్నచో భయం బసలే హృళక్కి
అతని కేమి సపర్య లాచరించెదవు?
వాడవాడలు శూలపాణికై తిరుగ
వీవు - నీవలన నాకేమి లాభమ్ము?

* * * *

అతడు జగదేక సంసేవ్యుఁ, డమలచరితుఁ
డతడు, నన్నుద్ధరించువాఁ, డితరదైవ

ములను నే గొల్వ, నతని భక్తులు మదీయ
సఖులు, మెలఁగుదు వారితో సంతతమ్ము.'

భక్త్యుద్బోధకములగు గీతములద్వారా నాయన్మారులు తమిళనాడులో జైన బౌద్ధములనుండి శైవమునుద్ధరించి తన్మతవ్యాప్తికి అనల్పమగు కృషిసలిపిరి. మత వ్యాపనముతోపాటు తమిళసాహిత్యమునుకూడ పోషించిన రసహృదయులు వారు!

## నాయన్మారులు-ఆళ్వారులు

ఈసందర్భమున నాయన్మారుల జీవితవిశేషముల నభివర్ణించుచున్న పెరియ పురాణమును (పెద్దపురాణము) గూర్చి రెండు మాటలు వ్రాయుట సమంజసముగ నుండును. శైవవాఙ్మయ చరిత్రలో దీనికి ప్రముఖస్థానముగలదు. కొందరీ గ్రంథ మును తమిళదేశపు పంచమవేదమని ప్రశంసింతురు. పెరియపురాణమునకు శ్రీభక్త విజయమను నర్థమునొసగు తిరుత్తొండర్ పురాణమను నామాంతరము గలదు. మత దృష్టితోనే కాక సాహిత్యదృష్టితో చూచినను దీనికి విలువగలదని పండితలోకము భావించుచున్నది. రెండవకులోత్తుంగుని (అనపాయచోళుడు, 1133-50)కాలమున జీవించిన సేక్కిళార్ అను మహనీయుడు పెరియ పురాణమును రచించెను.

శైవము వలె వైష్ణవము కూడ ప్రాచీన మయిన మతము. దక్షిణ భారత ములో - ముఖ్యముగా తమిళ దేశమునందు-వైష్ణవ మత వ్యాప్తికి తోడ్పడినవారు ఆళ్వారులే అనదగును. ఆళ్వారు అను మాటకు ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నుడని యర్థము. అతడు ధ్యానసిద్ధుడు. ఆతని హృదయము ప్రేమకు నెలవు. శ్రీమన్నా రాయణమూర్తియే దైవమని ఆతని ప్రగాఢ విశ్వాసము.

ఆళ్వారులు పన్నిద్దరుగలరు. తొలుత పదిమంది యాళ్వారులేయుండిరనియు తరువాతి కాలమున మరియిరువురు ఆళ్వారులుగా గణింప బడిరనియు చెప్పుదురు. పొయ్‌గై ఆళ్వారు, భూతత్తాళ్వారు, పేయాళ్వారు, తిరుమళిశై ఆళ్వారు(భక్తిసార), తిరుప్పాణాళ్వారు (మునివాహన), తొండరడిప్పొడి ఆళ్వారు (భక్తాంఘ్రిరేణు లేక విప్రనారాయణ),తిరుమంగై ఆళ్వారు(నీల), కులశేఖరాళ్వారు, పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు), శ్రీ ఆండాల్, నమ్మాళ్వారు (శఠకోప), మధుర కవి - వీరే పన్నిద్దరాళ్వారులు.

విష్ణుమూర్తి వస్తు వాహనములకు ప్రతిరూపములే ఆళ్వారులని వైష్ణవులు కొందరు భావించుచున్నారు. భక్తిభావమున వారు వెన్నుని ప్రస్తుతించుచు పాడిన గీతములు నాలుగు వేలు గలవు. వీనిని సంకలన మొనర్చినవాడు నాథముని అను విష్ణు భక్తుడు. ఈ సంకలన కావ్యమునకే నాలాయిర దివ్య ప్రబంధ మనిపేరు. వైష్ణవుల కీ గ్రంథమునందు గల యాదరాభిమానములు నిరుపమానము. నేటికిని వైష్ణవాలయములం దీ పవిత్ర గ్రంథము పఠింపబడుట పేర్కొనదగిన విషయము. నాయన్మారులలోవలె ఆళ్వారులలోను అన్ని కులముల వారుండుటకూడ పేర్కొన దగిన విషయమే.

ఆళ్వారుల కాల నిర్ణయమున భిన్నాభిప్రాయములు గలవు. కాని పొయ్‌గై, భూత, పేయాళ్వారులు క్రీ.శ. 8వ శతాబ్దము పూర్వార్ధమున నివసించియుండిరని తలచుచున్నారు వీరు ముువ్వురును నూరుగీతముల చొప్పున మున్నూరు గీతములు పాడిరి. వైష్ణవ సమయాచార్యులలో వీరు ముువ్వురును ప్రథములుగా పరిగణింప బడుచున్నారు. వీరికి తరువాతివాడు తిరుమళిశై ఆళ్వారు. 'కులంగళాయ ఈ రిరండిన్ ఒన్ద్రిలుం పిఱన్దిలేన్' (కులములు నాలుగింటిలో దేని యందును జన్మింపనివాడను) అని అతడు చెప్పుకొనుటచే అతడు నిమ్నజాతికి చెందినవాడని విజ్ఞులు తలచుచున్నారు.

తిరుమళిశై ఆళ్వారు సంస్కృతములో కూడ పండితుడనియు, వేదాంత సారమును హృద్గతము చేసికొనినవాడనియు తెలియుచున్నది. అతని గీతములలో నిశ్చలమగు భక్తిభావము జాలువారు చుండును. నాలాయిర దివ్యప్రబంధమునందలి తిరుచ్చంద వృత్తమును, నాన్ముగన్ తిరు అంతాదిని అతడు రచియించెను. ఒక గీతమున తిరుమళిశై ఆళ్వా రిట్లనెను. "పృథివ్యాపస్తేజోవాయు రాకాశములను పంచభూతము లందును నీ వున్నావు. ఈ పంచభూతముల సంయోగ వియోగముల వలన ఏర్పడుచున్న ప్రతి వస్తువు నందును నీ వున్నావు అట్టి నిన్ను నే నెట్లు భజింప గలను ?"

పన్నిద్దరాళ్వారులలోను నమ్మాళ్వారు చాల విశిష్టుడని చెప్పుదురు. నాలాయిర ప్రబంధము నందలి గీతములలో వెయ్యికి పైబడి అతనివే కలవు. నమ్మాళ్వారు మధుర రచన మగు తిరువాయ్‌మొళి ప్రశంసింప దగినది.

నమ్మాళ్వారు ప్రతి గీతము నందును భవసాగరము నుండి తన్ను బంధ విముక్తునిగా చేయుమని విష్ణుమూర్తిని ప్రార్థించినాడు. ఒక గీతములో అతడిట్లు పేర్కొనెను.

"నేను నా దను భావముల్ పూన కిపుడు,
వాని మొదలంట నరికి విశ్వ స్వరూపు
దేవదేవుని శ్రీహరిం దెలిసి కొనుము -
ఆత్మ కద్దియగాదె గమ్య స్థలమ్ము."

పెరియాళ్వారు నిజనామము విష్ణుచిత్తుడు. అనభ్య స్తశాస్త్రుడైనను, అతడు సంతరించిన గీతములు సాహితీ పరులకు పరమ ప్రీతి పాత్రములు. అన్యమత సహనము అతని రచనలో కానవచ్చుచున్నది. తిరుమొళి, తిరుప్పల్లాండు అనునవి యీతని రచనలు.

విష్ణుచిత్తుని కుమార్తెయే శ్రీ ఆండాల్ (గోదాదేవి). ఆమె ముప్పది పాశురములు పాడెను. ఇవి మధుర మంజులములని నుడువనక్కరలేదు. 'తిరుప్పావై' 'నాచ్చియార్ తిరుమొళి' అనునవి ఆమె రచనలు. రాజకవియగు కులశేఖరాళ్వారు సంస్కృత ద్రావిడ భాషలందు గొప్ప పండితుడు.

ఆళ్వారులలో కడపటివాడు తిరుమంగై ఆళ్వారు. అతని ప్రకృతి వర్ణనలు కడుమనోహరములు. అతడు తొలుత చోరుడనియు, శ్రీరంగనాథుడు ఆండాళును శ్రీవిల్లిపుత్తూరునకు వచ్చుచుండగా వారిని త్రోవలో అడ్డగించె ననియు దివ్యసూరి చరిత్రమువలన తెలియు చున్నది. తిరుమంగై ఆళ్వారు 1,361 గీతములు తెలయించెను. ఆళ్వారులలో ఈతడే మహావిద్వాంసుడని కొందరు భావించుచున్నారు.

"సారము లేనియట్టి భవ
సాగర మందు మునింగి మార్గ మే
తీరున గానలేక యతి
దీనతం గన్నులు వాడివత్తరై
సారమువోవ, నిన్ను కడ
సారికెటో తిలకించినాడ, నా

భారము తీరె నయ్య - భగ
వంతుడ వీవె రమాధినాయకా !"

తిరుమంగై ఆళ్వారు రచన యంతయు నిటులనే సాగెను.

వైష్ణవవాఙ్మయమునందు నాలాయిర దివ్యప్రబంధము, శఠగోపరంతాది, రామానుజనూత్రంతాది మొదలగునవి పేర్కొనదగిన గ్రంథములు. ఆళ్వారుల కాలమున మున్నెన్నడులేని ప్రచారము సంస్కృతభాషావాఙ్మయములకు లభించెను. తుదకు వ్యాఖ్యాతలుకూడ సంస్కృత ద్రావిడ సమ్మిశ్రితమగు మణిప్రవాళ శైలి లోనే రచన చేసిరి. అయినను వైష్ణవ వాఙ్మయము ప్రజాదరమును పొందెను.

మొత్తముమీద, శైవ వైష్ణవ సమయాచార్యుల కాలపు తమిళసాహిత్యము భక్తిరస ప్రపూర్ణమై భాసించుచున్న దనుట నిర్వివాదాంశము. శైవ వైష్ణవ కవు లందరు నొకే కులమునకు చెందినవారు కారు. కుల భేదములను నిరసించిన విశాల హృదయులు వారు. వారిలో నిమ్నజాతివారు కూడ నుండుట హర్షింపదగు నంశము. భక్త్యుద్యమ ప్రభావముచే ఒక్క త్రాటిపై నిలువ గలిగిన యా శైవ వైష్ణవ భక్త కవులు భక్తి మార్గమే తరుణోపాయమునకు సోపాన మనుటలో ఆశ్చర్యము లేదు. కనుకనే పొంగులువారు భక్త్యావేశము వారి మధుర రచనము లందు అంతర్వాహినియై జాలువారు చున్నది. నిజమునకీ భక్తిభావమే ఆ రచన లకు జీవము పోసెను.

మరియొకి విశిష్ట లక్షణము కూడ ఈ కాలపు వాఙ్మయమున కనబడు చున్నది. శైవవైష్ణవ కవులు వృత్త రచన చేసినను, సంస్కృతభాషాభిజ్ఞులేయైనను వారికి తమిళమునందు గల యాదరము మిక్కుటము. పవిత్రములగు గీతములు వెలయించిన కవులు వారు ! ఇవి గానానుకూలములై యుండుట మరొక విశేషము !

## కవిత్రయ యుగము

తమిళ సాహిత్య చరిత్రలో చోళమహీపతుల పరిపాలనా కాలము (క్రీ.శ. 850 - 1200) స్వర్ణయుగ మని తమిళ పండితులు తలచుచున్నారు. కంబన్, ఒట్టకూత్తర్ (వాణిదాసుడు), జయంగొండార్ వంటి మహాకవులు జీవించిన దీ

యుగములోనే. కావ్యములు, పురాణములు, స్థలమాహాత్మ్యగ్రంథములు, వైద్యజ్యోతి శ్శాస్త్ర గ్రంథములు-మొదలగునవి యెన్నియో యీ యుగములో వెలుగులోనికి వచ్చెను. వైద్య జ్యోతిష గ్రంథములందు కొన్నిట వ్యావహారిక తమిళము వాడ బడెను. చోళుల యేలుబడిలో సంస్కృత భాషా సాహిత్యములకు బహుళవ్యాప్తి లభించెను. తత్ఫలితముగా సంస్కృత కావ్యములు కొన్ని తమిళము చేయబడెను. సంస్కృత భాషా పరిజ్ఞానము గల పండితుల సంఖ్య కూడ ఎక్కువయ్యెను.

తమిళ సాహిత్య సదనమున మణిదీపిక వెలిగించిన మహనీయుడు కంబ మహాకవి. తమిళ వేదమును ప్రసాదించిన తిరువళ్లువరును మినహాయించినచో కంబకవివలె ప్రథితయశస్కుడైన కవి మరియొకడు తమిళ సాహిత్య చరిత్రలో లేడని చెప్పవచ్చును.

కంబడు కవిచక్రవర్తి బిరుదాంకితుడు. 'కల్వియిల్ పెరియవన్ కంబన్' (కవిత చెప్పుటలో అధికుడు కంబడు), కంబన్‌వీట్టు కట్టుత్తఱియుం కవి సొల్లుం (కంబన్ ఇంటిలోని కట్టుకొయ్య కూడ కవిత చెప్పును) అని ప్రజలు కంబని కవిత్వ మహత్త్వమును కొనియాడుచున్నారు. సుబ్రహ్మణ్య భారతి కంబకవిని గురించి యిట్లనెను.

"కల్వి సిఱంద తమిళ్‌నాడు - పుగళ్
కంబన్ పిఱంద తమిళ్‌నాడు"
(కవితకు పేరొందిన తమిళనాడు - కీర్తి
కంబడు ప్రభవించిన తమిళనాడు)

## కంబ రామాయణము

కంబని కృతులలో పేర్కొనదగినది రామావతారమను నామాంతరముగల రామాయణము. ఈ రసవత్కావ్యమే అతనికి చిరయశస్సు సమకూర్చినది. వాల్మీకి రామాయణము ననుసరించియే కంబడు రామాయణము రచియించెను. ఇట్లనుటచే కంబరామాయణము వాల్మీకి కృతికి అనువాద మనుకొనరాదు. అతడు కావించిన వర్ణనలు సహజములు; సుందరములును. అలంకారము లాతని సుకుమార హస్తమునందు అందాలు దిద్దుకొనెను. ముఖ్యముగా ఉపమాలంకారమును చెప్పుటలో అతనిని మించినవాడు మరొకడు తమిళ కవులలో లేడని నుడువుదురు.

అతని వర్ణనాంశములు దైనందిన జీవితమునుండి గ్రహింపబడినవి. కొన్ని పట్టులందు కంబ రామాయణము వాల్మీకి రామాయణము కంటె మిన్నగా నుండునని తమిళ పండితులు కొందరు తలచుచున్నారు!

ప్రాచీనాంధ్రకవుల చరిత్రవలె కంబకవి చరిత్రకూడ నేటివరకు స్పష్టముగ తెలియరాలేదు. అద్భుతవిషయములు కొన్ని అతని చరిత్రను ఆవరించుకొని యున్నవి. బాల్యమున చదువుసంతలు లేక అల్లరిచిల్లరిగా తిరుగుచున్న కంబని శడయప్పమొదలి అనునొక సహృదయు డాదరించెను.

కంబడు మూడవ కులోత్తుంగ చోళుని యాస్థానకవి. ఆ యాస్థానమున నున్న విద్వత్కవులలో ఒట్టక్కూత్తర్ అనునతడు కూడ ప్రసిద్ధుడే. ప్రభునాజ్ఞను తలదాల్చి వీరిరువురును రామాయణమును రచింప దొడగిరనియు, కాని వాణిదాసు తన రామాయణమును నాశమొనర్చెననియు చెప్పుదురు.

కంబకవి గుణగణములలో అతని కృతజ్ఞతాగుణము ప్రశంసనీయము. బాల్యమున తన్నాదరించిన శడయప్పమొదలిని కంబడు రామాయణమున పలు తావుల ప్రస్తుతించెను. దారిద్ర్యమును రూపుమపు దివ్యౌషధమట శడయప్ప! అతనిని గూర్చి కంబకవి చెప్పిన ప్రశంసావాక్యములలో ఇదియొకటి.

వాల్మీకి రామాయణము ననుసరించి కంబడు రచన చేసినను, కంబరామాయణమునందు మూలమునకు భిన్నములయిన మార్పులు కొన్ని గోచరించుచున్నవి. వివాహాత్పూర్వమే సీతారాము లొకరి నొకరు చూచుకొనుటయే కాక ప్రేమించుకొనుట, ఈ విషయమును సీతను దర్శించుతరి ఆమెకు తెలియజేయుమని రాముడు హనుమంతుని కోరుట, ఆగస్త్యాశ్రమమునుండి పంచవటికి పోవునప్పుడే మార్గమునందు జటాయువును సంధించుట, రావణుడు పర్ణశాలసహితముగా సీతాపహరణము చేయుట, ఆ పర్ణశాల నతడు తన రథము నందుంచుకొని లంకకు పయనమగుట, కైకేయిని రాముడు దూషణోక్తులాడకుండుట, అంగదుడు రాముని శరణువేడుట-మొదలగు మార్పులు పరిశీలింపదగినవి. ఈ పరివర్తనములు కథా గౌరవమును ఇనుమడింపజేసినవి.

ఆంధ్రరామాయణకర్తలవలె కంబకవికూడ శ్రీరాముని దైవమనియే సంభావించెను. సీతాదేవిని ఎట్టి సందర్భమునను రావణునిచేత స్పృశింపనీయలేదు. పైపెచ్చు పతివ్రతా తిలకమగు నామెను కనుగ తాకినచో ప్రాణాపాయ మేర్పడు ననుభయమును ఆతనికి కలిగించెను. రావణుడు వేదాధ్యయనపరుడనియు, గాయకుడనియు, శివభక్తుడనియు కంబడు పేర్కొనెను. రావణుడు గొప్పవైణికుడట! ఆతని ధ్వజమునందు వీణ యుండెనట! హనుమంతుడొక వీరయోధుడుగా వర్ణింపబడెను. రాజుగా గాక రామభక్తునిగా గుహుడు చిత్రింపబడెను. కాళహస్తి కన్నప్ప కథను మనసు నందుంచుకొని కంబడు గుహుని వర్ణించినట్లు విజ్ఞులు నుడువుదురు. వాల్మీకము నందలి రుచికరములగు గాథలను కొన్నిటిని కంబకవి పెంచి వ్రాసెను. అట్టి వానిలో అహల్యావృత్తాంత మొకటి.

కంబరామాయణములో స్త్రీపాత్రము లుదాత్తముగా చిత్రింపబడెను. వారిని గురించి అసభ్యములు, అశ్లీలములు నగువిషయములు కంబని కృతిలో లేవు. ఏ పట్టున గూడ రాముడు తన ఘనతను తాను చెప్పుకొనడు. అట్టియెడ లక్ష్మణుడు రాముని గురించి నుడువును. రామాయణమునందు వివాదగ్రస్తము లైనవిషయములలో ఒకటియగు వాలివధను కంబడు సమర్థించెను.

కవిత్వము నదీప్రవాహమువలె గంభీరముగ నుండవలెనని కంబని యభిప్రాయము. నిజమునకు కాతని కవిత యెంతగంభీరమో, అంత లలితమును. తమిళ పంచకావ్యము లందలి జీవక చింతామణిని కంబ డనుసరించెనని పండితులు తలచుచున్నారు. గోదావరిని వర్ణించునపుడు కంబకవి అణి (అలంకారము), పొరుళ్ (ధ్వని లేక భావము), తుఱై (ఉక్తివైచిత్ర్యము), తిఱై (శృంగార వీర రస ప్రధానములయిన యితివృత్తము), ఒళుక్కం (శైలీమాధుర్యము) మొదలగునవి కవితలో అంతర్లీనములై యుండవలెనని పేర్కొనెను. కంబని కవితలో ఇవి యన్నియు ఉన్నవని నుడువ వచ్చును.

కంబరామాయణము నందలి కొన్ని మధురభావములను పరికింతము.

అశోకవనము నందున్న సీతాదేవికి హనుమంతుడు రాముడొసగిన యంగుళీయకము నీయగా, దానిని చూచి ఆమె బ్రహ్మానందము చెందెను. ఆమె యానందమును కవియిట్లు వర్ణించుచున్నాడు. "కోలుపోయిన మణిని బడసిన పన్నగపు

మనస్సు, ఆశ విడిచిన యావదాస్తిని మరల బడసినవారి మనస్సు, మరణించెనని తలచిన తన యేకైకపుత్రుడు పునరుజ్జీవితుడు కాగా అతనిని చూచి సంతసించు తల్లి మనస్సు, ఏదో యొక మహిమవలన చూపును పొందిన పుట్టుకగ్రుడ్డి మనస్సు నెట్లుండునో అటుల సీతాదేవి మనస్సు ఉండెను."

గుహుని నల్లని దేహమును కనుగొని కంబకవి 'నూనె పూసిన యద్దకపు గుడ్డవలె నతనిదేహము నిగనిగలాడుచు నల్లగ నుండెను' అనెను. ఒక్కొక్క తూరి కంబడు ఉపమపై ఉపమ చెప్పును. నీలమేఘశ్యాముడగు రామచంద్రుని కంబ డిట్లు వర్ణించెను. 'మైయో (కాటుకయో), మరకతమో, మఱి కడలో (సముద్రమో), మళై ముగిలో(కారుమబ్బో)' అట్లుండెనట రాముని నీలంపు తనువు.

ఇరువది నాలుగు వేల శ్లోకముల రామాయణగాథను కంబకవి పండ్రెండు వేల వృత్తములందు రచియించెను. శఠగోపర్ అన్తాదీ, సరస్వతి అన్తాది, ఏరెళు పదు మొదలగు గ్రంథములను కూడ అతడు సంతరించెను. అన్తాది ముక్త పద గ్రస్త రచనము.

పదుమూడవ శతాబ్దమునందు దక్షిణాపథమునందేకాక తెలుగునాడునకూడ చోళులు బలహీనులయిరి. ఓరుగల్లు నేలు కాకతీయనృపు లుచ్చస్థితి యందుండిరి. కాకతీయులలో మొదటి ప్రతాపరుద్రుడు రాజ్యము చేయుచున్న కాలమున మూడవ కులోత్తుంగచోళుడు చోళదేశము నేలుచుండెను. కారణమేమో తెలియదు కాని కంబ కవికిని చోళరాజులకును నడుమ వైమనస్యము లేర్పడెను. కాగా కంబడు మొదటి ప్రతాపరుద్రుని యాస్థానమునకు పోయెననియు, అతడు కంబని కమనీయ కవి తను విని ముగ్ధుడయ్యె ననియు తెలియుచున్నది. అప్పుడు కంబడీ క్రింది పద్య మును చెప్పె నట :

'అవని ముళుదుణ్డు మయిరావతుత్తున్
బవని తోళువార్ పదుత్తుం బువని
ఉరుద్దిరా, నిన్నుడైయ ఒరంగనాట్టిల్
గురుత్తిరా వెళై క్కుళామ్-'

(అవనిగల జనులెల్లరు నీకతిథు లగుటవలనను, ఐరావతమువంటి పట్టపు చేనుగు నెక్కి నీవు ఊరేగుచుండగా నిన్నుచూచి మదవతులు మోహము చెందుట వలనను, రుద్రా! నీ ఒరంగల్లువాడున అరటియాకులు కరవయ్యెను). కంబ రామాయణములో తమ్మి, అక్కట మొదలగు తెలుగు మాటలు కానవచ్చుట గమనింపదగిన విషయము.

ఈ యుగమున విలసిల్లిన కవులలో పేర్కొనదగినవారు ఒట్టకూత్తన్, పుగళేంది, జయంగొండార్ మున్నగువారు. కంబను, ఒట్టకూత్తన్, పుగళేంది-వీరు ముప్వురు మహాకవులు. వీరిని కవిత్రయమని వ్యవహరించుటయు కలదు.

మహాభారతములోని నలోపాఖ్యానము నాధారము చేసికొని పుగళేంది నళవెణ్బా యను ప్రశస్త కావ్యమును రచియించెను. జయంగొండార్ కళింగత్తు ప్పరణి యను యుద్ధ కావ్యమును రచియించెను. ఈ కావ్యము ననుసరించి తరు వాతి కాలమున మరికొన్ని యుద్ధ కావ్యములు తమిళమున వెలసెను.

రామాయణము, నలోపాఖ్యానము, కళింగత్తుప్పరణి వంటి రసవద్రచన ములు వెలుగులోనికి వచ్చుట వలనను, కంబన్ వంటి సత్కవులు జీవించుట వలనను ఈ యుగమును స్వర్ణయుగమని నుడువుటలో ఆశ్చర్యములేదు. ఈ కాల మున వెలసిన కావ్యముల వలన తమిళ వాఙ్మయము సుసంపన్న మయ్యెననుట నిర్వివాదాంశము. స్వతంత్ర కావ్యములతోపాటు అనుసరణ కావ్యములు కూడ ప్రచారములోనికి వచ్చెను.

## మఠాధిపతుల యుగము

చోళులు పార్థివ శూన్యు లగుటతో తమిళ వాఙ్మయము రాజాశ్రయమును కోల్పోయెనని కొందరు తలచుచున్నారు. ఇది నిజమే అయినను తరువాతి కాల మున విజయనగర సమ్రాట్టులు, వారి సామంతు లనదగు నాయకరాజులు మొద లగువారు తమిళ సాహిత్యమును పోషించిరి. విజయనగరాధీశ్వరులు బలహీను లయిన పిమ్మట తమిళ సాహిత్యమును మఠాధిపతులు పోషించిరని నుడువదగును.

## క్షీణ యుగము

ఈ యుగమునందు పురాణములు, వ్యాఖ్యానములు, సిద్ధుల రచనములు, ప్రబంధములు, వేదాంత గ్రంథములు మొదలగునవి యెన్నియో వెలుగులోనికి వచ్చెను. ఇవి అంత ప్రశస్తములగు రచనలు కాకపోవుటవలనను, సృజనాత్మక సాహిత్యము అంతగా వెలయక పోవుటవలనను, ఈ యుగమును క్షీణ యుగ మనవచ్చును. అంతమాత్రమున ఈ యుగములో మహాకవులు లేరనియు, కావ్య నిర్మాణము జరుగ లేదనియు భావింపరాదు. విల్లిపుత్తూరార్, అరుణగిరినాథుడు, కాలమేఘ పండితుడు మొదలగు పండితకవు లీ యుగము నందలి కవులలో ముఖ్యులు.

విల్లిపుత్తూరార్ క్రీ. శ. 15వ శతాబ్దమున జీవించెనని తమిళ పండితుల యభిప్రాయము. అతడు సంస్కృత ద్రావిడ బాషలలో పండితుడు. అతని రచన సంస్కృతపద భూయిష్ఠము. అయినను విల్లిపుత్తూరార్ రచియించిన భారతము బహుళవ్యాప్తిని బడసెను. ఈకావ్యమునకు విల్లిభారతమను ప్రసిద్ధనామ మేర్పడెను.

విల్లి భారతములో పదిపర్వములు మాత్రమే కలవు. తరువాతి కాలపువాడగు నల్లాప్పిళ్లై అను పండితుడు భారతమును పూర్తి చేసినట్లు చెప్పబడుచున్నది.

విల్లి భారతమునకు పూర్వమే – సంగ కాలము నందే – తమిళమున పెరుం దేవనార్ అను నతడు భారతమును రచియించెనని తెలియుచున్నది. భారత వెణ్బా, అరుణిలై విశాఖర్ సంతరించిన భారతము మొదలగునవి కూడ వ్యాప్తిలోనికి వచ్చినట్లు తెలియుచున్నది.

భక్తకవి యని వ్యవహరింపబడు అరుణగిరినాథుడు కూడ ఈ యుగము లోనే వర్ధిల్లెను. తిరుప్పుగళ్, కందర్ అలంకారము, కందర్ అనుభూతి మొదలగు నవి ఆతని రచనలు. వీనిలో ప్రశస్తమైనది తిరుప్పుగళ్. ఇందు రమారమి 1,400 మధుర గీతములు గలవు. ప్రతి గీతమునందును అరుణగిరినాథునికి మురుగని (స్కందుని) యందుగల అపారమైన భక్తి మూర్తీభవించినది. నేటికిని శైవు లీ గీతములను సభక్తికముగ గానము చేయుచుండుట పేర్కొనదగిన విషయము.

## విజయనగరములో తమిళ కవులు

విజయనగరాధీశ్వరుడగు శ్రీకృష్ణ దేవరాయలవారి కొలువుకూటమున విలసిల్లిన తమిళకవి పండితకవులలో హరిదాసు ప్రముఖుడు. సమయవిళక్కల అను గ్రంథము నతడు సంతరించెను. శైవ వైష్ణవ మతములకు సంబంధించిన గ్రంథ మిది. పదునైదవ శతాబ్దమున వర్ధిల్లిన కవులలో కాలమేఘ పండితుడు కూడ పేర్కొనదగిన వాడే. ఆశుకవి యని అతడు పేరుపెంపులు గడించెను. శ్లేష కవిత చెప్పుటలో అతడు ఘటికుడు.

ఇంతవరకు పేర్కొనబడిన గ్రంథములే కాక సేతు పురాణం, భాగవత పురాణం, శీకాళత్తి పురాణం, ప్రభులింగ లీల మొదలగు పెక్కు గ్రంథములు రచింపబడెను. పురాణములతోపాటు మెయ్ జ్ఞాన విళక్కం వంటి వేదాంత గ్రంథములు, తొండైమండల శతకం వంటి చారిత్రక రచనలు, కుట్రాలకుఱవంజి, రామ నాటకం వంటి గేయ రూపకములు మున్నగునవి యెన్నియో వెలుగులోనికి వచ్చెను. అరుణాచలకవిరాయని ఈ రామనాటకము నేటికిని విశేష వ్యాప్తిలో నున్నది.

17 వ శతాబ్దమున రచింపబడిన గ్రంథములందు శీఱాప్పురాణం అను కావ్యము ఉదాహరింపదగినది. ఇది ఉమఱు పండితునిచే రచింపబడెను. ఇతడు మహమ్మదీయుడు. నబిమహమ్మదు దివ్య చారిత్ర మీ కావ్యములో అభివర్ణింప బడినది.

తమిళ వాఙ్మయాభివృద్ధికి తోడ్పడిన మఠములందు ధర్మపుర, తిరువాడుదురై మఠములు ముఖ్యముగా పేర్కొనదగినవి. ధర్మపురమునకు చెందిన కుమరగురువర స్వామి ప్రతిభావంతు డనియు, పదునారు కృతులు వెలయించె ననియు తెలియుచున్నది.

విజయనగర సామ్రాజ్య పతనానంతరము దక్షిణాపథమున కూడ మహమ్మదీయుల ప్రాభవ మధికమయ్యెను. కొంత కాలము నాయకరాజులు తమిళ నాడును పరిపాలించిరి. అటు పిమ్మట మహారాష్ట్రులు రాజ్యాధికారము చేసిరి.

వీరెల్లరు తమిళ భాషావాఙ్మయములను యథోచితముగ పోషించిరి. ఏమయినను తమిళ సాహిత్యమునకు నిజమయిన రాజాశ్రయము లభింపలేదని నుడువదగును.

## తమిళము - పాశ్చాత్యులు

ఇట్లుండగా వ్యాపారార్థమై పాశ్చాత్యులు మన దేశమునకు విచ్చేసిరి. క్రైస్తవ మతమును ప్రచారము చేయు నుద్దేశముతో పాదరీలుకూడ మనదేశమునకు విచ్చేసిరి. వారిలో కొందరు తమిళ భాషాధ్యయనము కావించిరి. అట్టివారిలో వీరమామునివర్ అను నామాంతరముగల పాదర్ బెస్కీ విశిష్టుడు.

వీరమామునివర్ ఏసుక్రీస్తు పవిత్ర జీవితమును తేంబావణి అను కావ్యమున రచించెను. ఇందు ముప్పది యధ్యాయములు గలవు. వేదియర్ ఒళుక్కం, పరమార్థగురుకదై మొదలగు రచనలుకూడ చేసెను. 'చతురగరాది' అను నిఘంటువును కూడ అతడు కూర్చెను. అంతేకాక తమిళము - లాటిన్ నిఘంటువు, తమిళము - ఫ్రెంచి నిఘంటువు, పోర్చుగీస్ - లాటిన్ - తమిళ నిఘంటువు మున్నగు వానిని కూడ వీరమామునివర్ కూర్చెను. నిఘంటు రచనా విధానమున అతడు తరువాతి వారికి మార్గదర్శకు డనుట సమంజసము.

డూప్లేయొద్ద ద్విభాషిగా నుండిన ఆనందరంగ పిళ్లై అను నతడు తమిళమున డైరీ యొకటి వ్రాసెను. ఆనాటి తమిళ భాషను గూర్చియు, చారిత్రిక పరిస్థితులను గూర్చియు తెలిసికొనుట కీ డైరీ తోడ్పడుచున్న దనుటలో సందేహములేదు.

ఉపసంహారమున, ఈ యుగమునందు రసవత్కావ్యములు బహుళముగా వెలువడక పోయినను, స్థలమాహాత్మ్య గ్రంథములు, వేదాంత గ్రంథములు పెక్కులు వెలసెను. మతపరమైన సాహిత్యమే ప్రచారమునకు వచ్చెనని పేర్కొనదగును ప్రతిభావంతులు, సాహితీ ప్రియులు నగు రాజులు లేకపోవుట, మతాధిపతులు సాహిత్య పోషకులగుట - మొదలగునవి యిందుకు కారణము లనవచ్చును.

## క్రైస్తవ మతము

ఈ యుగపు చివరిభాగమున క్రైస్తవమతమునకు తమిళనాడున నిలువ నీడ లభించెను. క్రైస్తవమత ప్రచారము నరికట్టుటకు కాబోలు 17 వ శతాబ్దపువాడగు శివప్రకాశస్వామి యనునతడు 'ఏసుమతనిరాకరణం' అనునొక గ్రంథమును రచియించెను. ఏది యెట్లున్నను, మతదృష్టితోకాక సాహిత్య దృష్టితో చూచినచో కొందరు క్రైస్తవమత ప్రచారకులు తమిళభాషా వాఙ్మయములకు చిరస్మరణీయమగు సేవ చేసిరని చెప్పకతప్పదు. ముఖ్యముగా నిఘంటు రచనావిషయమున వారు చేసిన కృషి ప్రశంసార్హము.

## ఆధునిక యుగము

తమిళసాహిత్యమున ఆధునికయుగము 19వ శతాబ్దముతో ప్రారంభమగు చున్నది. ఆంగ్ల ప్రభుత్వము స్థిరపడిన పిమ్మట, ఆంగ్లభాషా వాఙ్మయములకు బహుళవ్యాప్తి లభించెను. తత్ఫలితముగా క్రొత్తక్రొత్త భావములు తలలెత్తెను. ప్రాచీన భారతీయ సంస్కృతిని పరిరక్షించు నుద్దేశముతో మహాపురుషులు కొందరు నూతనోద్యమములు ప్రారంభించిరి. మరికొందరు మూఢాచారములను రూపుమాపవలెనను సదుద్దేశముతో క్రొత్త యుద్యమములు తలపెట్టిరి. స్వరాజ్యమును సంపాదించు నభిలాషతో జాతీయోద్యమము స్థాపింపబడెను. ఇటుల సాంఘిక రాజకీయాది రంగములందు నూతనోద్యమములు బయలుదేరెను. ఈ యుద్యమములు ఆధునిక తమిళసాహిత్యమునకు రూపురేఖలు తీర్చెనని నుడువ దగును.

19వ శతాబ్దమున వర్ధిల్లినవారిలో రామలింగస్వామి కడు ప్రసిద్ధుడు. భక్తిరస ప్లావితమయిన యాతని రచనలనుండి తమిళ నుడికారపు సొంపును గ్రహింపవచ్చును. భావగాంభీర్యమునకు అతని కవిత పెట్టినది పేరు. రామలింగస్వామి చెప్పిన పద్య సముచ్చయమును తిరువరుట్పా అని అందురు. బహుగ్రంథకర్తయు, పండిత శిఖామణియునగు మహావిద్వాన్ మీనాక్షి సుందరం పిళ్లై అనేక స్థలమాహాత్మ్య గ్రంథములు రచియించెను. ఆయన శిష్యుడే పండిత ప్రభాకరులగు డాక్టరు ఉ. వే. స్వామినాథ అయ్యరు. ఆయన మహా మహో

పాధ్యాయ, దాక్షిణాత్యకళానిధి బిరుద విరాజితులు. సంగకాలపు గ్రంథములను పెక్కింటిని పరిష్కరించి ప్రప్రథమమున ప్రకటించిన చిరయశస్సు అయ్యరు గారిదే. తన గురుదేవుని జీవిత విశేషాదికమును 'మీనాక్షిసుందరం పిళ్లై చరిత్రం' అను గ్రంథమున వెలయించి తరువాతివారికి జీవిత చరిత్ర రచన విషయమున త్రోవచూపిరి. అంతేకాక స్వీయచరిత్ర రచనలోకూడ వీరే మార్గదర్శకులయిరి. క్రైస్తవ పండితుడగు కృష్ణపిళ్లై, వినోదరసమంజరి యను వ్యాససంపుటిని వెలయించిన వీరాస్వామి సెట్టి, మనోన్మణీయమను చక్కని నాటకమును సంతరించిన సుందరంపిళ్లై ప్రభృతులుకూడ పేర్కొనదగిన యానాటి పండితులు.

## వచన రచన

ఇక ఇరువదవ శతాబ్దమున తమిళ సాహిత్య వీథులు మరింత విస్తృతము లయ్యెను. వచన రచనములకు విశేష ప్రాధాన్యము కలిగెను. ప్రాచీన గ్రంథములకు ప్రశస్తములగు వ్యాఖ్యానములు వెలసెను. పరిశోధన గ్రంథ ములు వెలువడెను. సారస్వత పత్రికలు స్థాపింపబడెను. సారస్వత సమా జములుకూడ నెలకొల్పబడెను.

ఈ శతాబ్ద ప్రారంభమున కూడ పండితులు పలువురు వర్ధిల్లిరి. రూపా వతి, మానవిజయం మొదలగు నాటకములు వ్రాసిన వి. కో. సూర్యనారాయణ శాస్త్రి, తమిళ్‌వరలాఱు, వంజిమానగర్ గ్రంథకర్తయు సెందమిళ్ పత్రికా సంపాదకులునగు మహావిద్వాన్ రా. రాఘవ అయ్యంగారు, ఆశియా జ్యోతి, మలరుంమాలైయుం మున్నగు కావ్యములు రచియించిన కవిమణి దేశికవినాయకం పిళ్లై, మహామహోపాధ్యాయ పండితమణి ము. కదిరేశన్ సెట్టియార్, బహు గ్రంథకర్తయగు మఱైమలై అడిగళ్, ప్రసిద్ధ వ్యాఖ్యాతయగు న. ము. వెంకట స్వామి నాట్టార్, బహుముఖ ప్రతిభాశాలియు, 'గాంధి అడిగళుం' 'మనిదవాళ్ క్కైయుం' మొదలగు గ్రంథములు రచించిన వి. కల్యాణసుందరం ముదలి యారు మొదలగు వారెల్లరు తమిళసాహిత్యమును సుసంపన్నము చేసిన మహ నీయులే. ఈ సందర్భమున అరాయ్‌చ్చిత్తొగుది వంటి యుద్గ్రంథములు సంత రించిన ము. రాఘవ అయ్యంగారు, ఈ నడుమనే కీర్తిశేషులైన రా. పి. సేతు పిళ్లై ప్రభృతులుకూడ సంస్మరణీయులే.

## జాతీయకవి సుబ్రహ్మణ్య భారతి

ఇక తమ జాతీయకవియని తమిళులు ప్రస్తుతించు మహాకవి సుబ్రహ్మణ్య భారతినిగూర్చి యించుక తెలుసుకొనుట ఆవశ్యకము.

తమిళదేశపు తపఃఫలము మహాకవి భారతి. ఆయన మరణించి నేటికి నలుబది యేండ్లయినది. ముప్పదితొమ్మిది సంవత్సరములు మాత్రమే ఆయన జీవించెను. అయినను ఆయన చేసిన రచనలా కోకొల్లలు. అవి రవిచంద్రు లున్నంతవరకు సజీవముగా నుండగలవు. తమిళ సాహిత్య ప్రపంచమున ఆయన చిరంజీవి !

తమిళసాహిత్యమునందు నవయుగము భారతితో ప్రారంభమయ్యెనని నుడువదగును. ఈ యుగమున వచనశాఖకుగల ప్రచారము మరి యే యితర శాఖకు లేదన్నను అతిశయోక్తి కాదు. అందును వ్యావహారికభాషా గ్రథితము లగు రచనములకు బహుళ ప్రచారము లభించుచున్నది.

## వ్యావహారిక భాష

ఈ సత్యమును కనుగొనిన తమిళ కవులలో భారతి ప్రథముడు. సమ కాలిక సామాజిక జీవనము, తమిళసాహిత్య స్థితిగతులు, రాజకీయ పరిస్థితులు మొదలగు వానిని బాగుగా గుర్తించిన వాడగుటచే, భారతి సామాన్యమానవునికి సైతము సుబోధకమగు భాషలో రచనలు చేయసాగెను. అనగా వ్యావహారిక భాషలో కావ్యరచనము చేయదొడగెనన్నమాట ! ఆయన ప్రభావము నేటి పత్రికా రచనము నందును, పలువురు రచయితలమీదను స్పష్టముగ గోచరించుచున్నది. కనుక ఇది భారతియుగ మనియు, భారతి వ్యావహారిక భాషోద్ధారకుడనియు పేర్కొనదగును.

సుబ్రహ్మణ్య భారతిని కొందరు విప్లవకవిగా అభివర్ణింతురు. కొందరు గేయకవిగా వర్ణింతురు. నిజమునకు భారతి కవితలో గేయాంశము ప్రధా నముగా గోచరించును. ప్రాతపుంతలను విడిచిపుచ్చి క్రొత్త పుంతల ననుసరింపు మని ఆయన ఉద్బోధించెను. జాతి మత భేదములను నిరసించెను. మూఢ

నమ్మకములను తూర్పారపట్టెను. అందువలన భారతిని విప్లవకవిగా వర్ణించుట పరిపాటి అయ్యెను. కాని సూక్ష్మముగా పరిశీలించుచో, ఆయన రచనములలో ప్రధానముగ కానవచ్చునది భక్తి తత్వమని స్ఫురింపకపోదు పరాశక్తిని గూర్చియు, కణ్ణన్ (కృష్ణుడు) గురించియు భారతి వెలయించిన మధుర గీతికా సముచ్చయమిందుకు తార్కాణము. దేశభక్తితో పాటు దైవభక్తియు ఆవశ్యకమని పలుతావులందు పేర్కొనెను. జ్ఞానరథం అను వచన రచనలో భారతి తాత్త్విక భావములను మనము సందర్శింప గలము. ఆయన జాతీయతా దృష్టిగల తాత్త్వికుడు !

తమిళగేయ వాఙ్మయమును సుసంపన్న మొనర్చిన యశస్సు ప్రాచీనులలో ఆళ్వారులకును, నాయన్మారులకును చెందుచున్నది. అటులనే ఆధునిక తమిళ గేయ వాఙ్మయమును సుసంపన్న మొనర్చిన యశస్సు భారతికి చెందుచున్నది. అందువలన భారతికవితలు పండితపామర రంజకములయినవి. మొత్తముమీద ఆధునిక తమిళగేయ సాహిత్యమునకు సుబ్రహ్మణ్య భారతిది ఆచార్యపీఠ మనవచ్చును.

భారతి మానవతావాది. ఆయన రచనములను పరిశీలించునప్పుడు ఈ విషయముకూడ స్ఫురించును. సామాన్య మానవుని సుఖదుఃఖము లాయనకు కావలెను. లభించు స్వాతంత్ర్యము సర్వవర్ణముల వారికిని, దరిద్రులకును ధనికులకును సరిసమానముగా సంక్రమింపవలెనని ఆయన ఆశించెను. వాల్ట్ విట్మన్‌వలె ఆయన స్త్రీలనుద్దేశించి చక్కని రచనలు చేసెను. సమాజమునందు మహిళలకు సముచిత స్థానము నొసగవలెననియు, వారికి సంపూర్ణస్వాతంత్ర్యము లభింపవలెననియు ఆయన అభిలషించెను.

భారతి గుణగణములలో ముఖ్యముగా నుడువదగినవి ఆయన భాషా సహనము, మతసహనమును. భాషా సమస్యలు మతస్పర్ధలును తలలెత్తుచున్న యీ దినములలో భారతివంటి విశాల హృదయుల యవసర మెంతేని కనబడుచున్నది.

## భారతి దృష్టిలో తెలుగు సీమ

మహాకవి భారతి దృష్టిలో తెలుగు సుందరమయిన భాష. ఈ గీతమును పరికింపుడు.

"విరియ గాచిన వెన్నెల రాత్రిలో
చేర దేశపు చెలులు వెంటరా
సుందరాంధ్ర పదమ్ము పాడుచున్
సింధునదిని పడవ నడుపుచు నాడుదాం"

ఎక్కడి చేరదేశము! ఎక్కడి సింధునది! కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకును గల అఖండ భారతము తన మాతృదేశమని భారతి విశ్వసించెను. ఆయన తొలుత భారతీయుడు ; పిమ్మట తమిళుడు. సుందరాంధ్ర పదమును పాడుచు సింధునదిలో నౌకావిహారము చేయవలెనట ! ఎంత తీయని కల్పనమిది !

1917వ సం॥జూన్ మొదటి తేదీని నెల్లూరులో జరిగిన ఆంధ్రమహాసభను గురించి "శక్తిదాసన్" అను గుప్తనామమున భారతి తమిళము నందొక ప్రశస్తమైన వ్యాసము వ్రాసెను. అందులో తెలుగు వారి న్యాయపరిపాలనము ప్రశంసింపబడినది. "......సభాధ్యక్షులు శ్రీ కొండా వేంకటప్పయ్య పంతులుగారు చేసిన ప్రసంగము పరిశీలింప దగినది. రాజనీతి శాస్త్రములో తెలుగువారు ప్రాచీన కాలమున గూడ పేరుపెంపులు గడించినవారు. తెలుగువారు తమిళనాడును పరిపాలించిన యా దినములందు న్యాయము చక్కగా నెలకొనెను తెలుగువారికొక న్యాయ మనియు, తమిళుల కొక న్యాయ మనియు ఉండెడిది కాదు. తెలుగు జాతి రాజనీతి శాస్త్రమున అందెవేసిన చేయి!...."చంద్రిక అను కథలో కందుకూరి వీరేశలింగం పంతులుగారిని భారతి ప్రశంసించెను. అటులనే పోతన కవివరేణ్యుని, త్యాగరాజును ఆయన ప్రస్తుతించెను. ఒక్కమాటలో, తెలుగుభాష యన్నను తెలుగువారన్నను ఆయనకు అపారమగు గౌరవముండె ననుట స్పష్టము!

సర్వమానవ సౌభాత్రమును నాశించి చక్కని చిక్కని రచనలు చేసిన సహృదయుడు, తమిళజాతిని మేల్కొలిపిన వైతాళికుడు నగు సుబ్రహ్మణ్య భారతి ముప్పదితొమ్మిదేండ్ల వయస్సులోనే కాలధర్మము చెందుట దురదృష్టము!

ఈ సందర్భమున మదరాసు విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన బృహత్పదకోశ మను "టమిల్ లెక్సికన్" గురించి రెండు మాటలు నుడువవలసి యున్నది. ఈ నిఘంటువు అంతకుమున్ను ప్రచారమున నున్న నిఘంటువు లన్నికంటెను శ్రేష్ఠమయినది. దీనిని పూర్తి చేయుటకు ఇరువది మూడు వత్సరములు (1913-36) పట్టెను. దీనికి చాలాకాలము సంపాదకులుగా నుండిన యస్. వైయాపురి పిళ్లైగారి పరిశ్రమము ప్రశంసనీయము!

## నాటక రచన

ఇక నాటకము, నవల, కవిత, కథానిక మొదలగు సాహిత్య ప్రక్రియలు తమిళమున ఎట్లు వికసించి పరిణతి చెందెనో రేఖామాత్రముగ పరిశీలింతము.
నాటకము: సంగయుగమునందే పెక్కునాటకములు వెలసెననియు అవియన్నియు, కాలగర్భమున కలిసిపోయె ననియు తమిళ పండితులు నుడువుదురు, దేవోత్సవములందు జరిగెడి ఆటపాటలే కాలక్రమముగా నాటకముగా పరిణమించెననియు, అట్టినాటకములందు తొలుత కథతోడి సంభాషణలు లేవనియు తెలియుచున్నది. ఆ సంభాషణలు కూడ తొలుత పద్యరూపమున నుండెడివి.

నాటక ధోరణిలో సంతరింపబడిన శిలప్పదిగారమును మినహాయించినచో, తమిళములో 18 వ శతాబ్దము పూర్వార్ధము వరకును నాటకములు లేవనియే తలంపబడుచున్నది. ఆధునిక నాటకము ఆంగ్లభాషా వాఙ్మయముల సంపర్కమునకు పిమ్మటనే తమిళములో వెలసె ననుట నిజమునకు దగ్గరగా నుండును. అయినను తొలినాళ్లలో వెలసిన అరుణాచల కవిరాయుని రామనాటకము, గోపాల కృష్ణ భారతి వెలయించిన నందనార్ చరిత్ర కీర్తనై, రామాస్వామి అయ్యారు అల్లినాటకము మొదలగునవి పేర్కొనదగినవి.

తమిళ నాటక వాఙ్మయమున మణిపూసగా గణింపబడుచున్న మనోన్మణీయము సాహిత్యపు విలువగల నాటకము. దీనిని సుందరం పిళ్లై రచించిరి.

ఇది పద్యరూపమున సాగిన దృశ్య కావ్యము. వి. జి. సూర్యనారాయణశాస్త్రి సంతరించిన కళావతి, మానవతి మున్నగు నాటకములు కూడ సాహిత్యపు విలువ గలవే. రంగస్థలమును మనసు నందుంచుకొని తమిళమున నాటకములు వెల యించిన చిరయశస్సు పి. సంబంధం ముదలియారు గారికి దక్కుచున్నది. ఎనుబ దేండ్లు నిండిన వయోవృద్ధులు వీరు. దాదాపు నూరు నాటకములు రచియించిన జ్ఞానవృద్ధులును. వీరి నాటకములలో కొన్ని పౌరాణికములు, కొన్ని సాంఘిక ములును. వీరి నాటకములలో పాటలు పరిమితము చేయబడెను. మనోహర, వేదాళవులగం, సభాపతి మొదలగునవి వీరి రచనములలో ఉదహరింపదగివి.

జాతీయోద్యమపు ప్రభావమున తమిళము నందును దేశభక్తి ప్రబోధకము లగు నాటకములు కొన్ని వెలసెను. రాజరాజచోళన్, అవ్వైయార్ మున్నగు చారిత్రక నాటకములు; వేలైక్కారి, ఇనస్పెక్టర్ మొదలగు సాంఘిక నాటక ములు బహుళ ప్రచారమునకు వచ్చినవి. ఆధునిక నాటకకర్తలలో ఎ. శ్రీనివాస రాఘవన్, శివకుప్పుస్వామిపిళ్లై, టి. జానకిరామన్. అరు. రామనాధన్ ప్రభృ తులు పేర్కొనదగినవారు.

ఈ సందర్భమున రేడియో నాటకములనుగురించికూడ నుడువుట సమంజ సము. రేడియో నాటక శిల్పమున నొక ప్రత్యేకత కలదనుట నిర్వివాదాంశము. కె.ఎ.పి. విశ్వనాథన్, పూర్ణం విశ్వనాథన్, తురైవన్ ప్రభృతులు చక్కని రేడియో నాటకములు వెలయించినారు.

తమిళ నాటకరంగమును గురించి నుడువునప్పుడు నవాబ్ రాజమాణిక్కం పిళ్లైని ప్రశంసించక తప్పదు. వీరి నాటక ప్రదర్శనలు చలన చిత్రములను తల పించుచుండును. రంగాలంకరణమునకై వీరు వహించుశ్రద్ధ గమనింపదగినది. అవ్వైయార్‌వంటి ఉత్తమనాటకములను ప్రదర్శించుచున్న టి.కె.యస్. సోదరులు కూడ ప్రశంసార్హులు.

## నవల

ఆధునిక సాహిత్య ప్రక్రియలలో నవలకు గల ప్రచారము ఇతర శాఖలకు లేదనవచ్చును. తమిళమున గూడ నవలలు బహుళ ప్రచారమున నున్నవి.

•లి నవల యగు ప్రితాపముదలియార్ చరిత్రిం వెలసెను. దీనిని ్యకంపిళ్లై అను నతడు రచించెను. ఇది సాంఘిక నవల. ఇందు ్చోటు చేసికొనుట ఒక విశేషము. ఆనాటి తమిళ రచన శైలిని › కూడ ఈ నవల తోడ్పడుచున్నది. ఇది మరొక విశేషము. ;చన రచనలు లేని కొరతను తీర్చు నభిలాషతో వేదనాయకంపిళ్లై ్వాసెను. ఈ విషయమును పీఠికలో ఆతడే చెప్పికొనెను.

౯మున వెలసిన రెండవ నవల పి. ఆర్. రాజమయ్యరు రచియించిన చరిత్రము. ఇదికూడ సాంఘిక నవలయే. అటుపిమ్మట అ. మాధ ుంచిన పద్మావతి, విజయమార్తాండం మున్నగునవి పేర్కొనదగిన రణి కుప్పుస్వామి ముదలియార్. వడువూర్ దురైసామి అయ్యం ్నాయకి ప్రిభృతులు అపరాధపరిశోధక, సాంఘిక నవలలు

›నిక నవలా వాఙ్మయమున "కల్కి" రా. కృష్ణమూర్తి రచియించిన వలలు ముఖ్యముగా పేర్కొన దగినవి. కల్కి ప్రిముఖ కథానికా ్రసిద్ధ పత్రికారచయిత. ఎందరో యువ రచయితలకు ప్రోత్సాహ ్రిని వెలుగులోనికి తీసికొనివచ్చిన సహృదయుడు. అలైఓశై, పార్థి పొన్నియిన్ సెల్వన్ మొదలగునవి కల్కి నవలలందు ప్రసిద్ధములు. ్యు ప్రచుర ప్రిచారమును గడించుటయే కాక తరువాతి చారిత్రక ్థ ప్రిదర్శనము లయ్యెననియు నుడువదగును. కాని యీ నవలల ్న్ని చారిత్రకాంశములు సంశయాస్పదము లని విమర్శకులు కొందరు ు. "కల్కి" ప్రభావమో మరియేమి కారణమో చెప్పలేము కాని, పత్రికలలో చారిత్రక నవలలకు విశేష ప్రాధాన్యము గలదు. చరి › ధారావాహికముగ ప్రకటింపబడని వార, మాస పత్రికయి లేవన్నను ్తి కాదు!

ు. వరదరాజన్ వ్రాసిన "నెంజిల్ ఒరుముళ్" "సోము" (మి. ప. ్వరం) రచియించిన రవిచంద్రిక, తి. జానకిరామన్ వెలయించిన మోహ

ముళ్, అఖిలన్ సంతరించిన పావై విళక్కు మొదలగునవి బహుళ జనాదరమును చూరగొన్న ఉత్తమ నవలలు, స్థూలదృష్టికి కూడ తమిళమున ఈ నడుమ పెక్కు నవలలు, నవలికలు వెలువడెనని తెలియచ్చును.

## కవిత, కథానిక

తమిళమున నున్న ప్రాచీన కావ్య సంపదను పురస్కరించుకొని చూచినచో, నేడు తమిళనాడున కవితకు అంత ప్రచారము లేదని నుడువవలసి యుండును. నేడు తమిళమున వచన కవితలు పెక్కులు వెలువడుచున్నవి. అంత మాత్రమున సంప్రదాయ బద్ధమైన కవితారచన వాడుకలో లేదనుకొన రాదు.

నేటి తమిళకవులలో నామక్కల్ వె. రామలింగం పిళ్లై, కి. వా. జగన్నాథన్, భారతిదాసన్, పెరియస్వామి తూరన్, "సోము", త్రిలోక సీతారాం, శుద్ధానంద భారతి, తురైవన్ మున్నగువారు ప్రసిద్ధులు. జగన్నాథన్ మేఘ మండలం, సోము "ఇళవేనిల్", భారతిదాసన్ కృతులు మొదలగు కవితా సంపుటములు పేర్కొనదగినవి. భారతిదాసన్ అభ్యుదయ కవిగా పేరుపెంపులు గడించినాడు. యువకవులు పలువురీతనిని అనుసరించుచున్నారు.

ఇటీవల సంకలన కావ్యములుకూడ తమిళమున వెలువడినవి. రా. పి. సేతుపిళ్లై సంధానించిన తమిళ్ కవిత్తైక్కళంజియం, సెంజొల్ కవిక్కోవై మొదలయినవి ప్రాచీన కవితాకదంబములు. నవ్యకవితా సముచ్చయములు కూడ వెలుగులోనికి వచ్చుట గమనింపదగు నంశము. గేయఫణితిని కొత్త మంగలం సుబ్బు రచించిన గాంధిమహాన్‌కదై సంభావింపదగిన రచనము.

ఈ నడుమ కొందరు ప్రకాశకులు ఉత్తమ తమిళ కావ్యములను చక్కగా ముద్రించి చౌకధరలకు ప్రజలకు అందజేయుచున్నారు. ఇది యెంతయు హర్షింపదగిన విషయము. ఇటుల వెలుపడిన వానిలో తిరువాయ్‌మొళి, తిరువాచగం, మణిమేకలై శిలప్పదిగార కావ్యములు, కంబరామాయణము, సుబ్రహ్మణ్య భారతి కావ్యములు మొదలగునవి పేర్కొనదగినవి. వీనిలో కొన్నిట విసంధి పాటింపబడుట కూడ పేర్కొనదగిన యంశమే !

ఇక కథా సంపుటములా అనేకములు వెలువడినవి ; వెలువడు చున్నవి. కథానికా రచనమునకు పత్రికలు ఎక్కువగా దోహదమొసగుచున్నవి. 'పుదుమై ప్పిత్తన్,' కు. ప. రాజగోపాలన్, పిచ్చమూర్తి, సోము, అళగిరిస్వామి, త. నా. కుమారస్వామి, చిదంబర సుబ్రహ్మణ్యన్ మొదలగువారు ప్రసిద్ధ కథా రచయితలుగా పరిగణింపబడుచున్నారు. ఇంకను పలువురు చక్కని కథల నెన్నిటినో వెలయించి తమిళకథా సాహిత్యమునకు వన్నెచిన్నెలు సమకూర్చి నారు. సంగయుగమున వెలువడిన గ్రంథముల నాధారము చేసికొని కి.వా. జగన్నాథన్ ప్రశస్తములగు కథా సంపుటములు వెలయించిరి.

## విమర్శ

నేడు తమిళములో విమర్శ గ్రంథము లనేకములు వెలువడు చున్నవి. ఉత్తమ విమర్శ కావ్యరసాస్వాదనమునకు మిక్కిలి తోడ్పడును కనుక, ఇది సంతసింపదగిన విషయమే. తమిళవేద మగు తిరుక్కుఱళునకు ప్రాచీనులే కొందరు ప్రశస్తములగు వ్యాఖ్యానములు వెలయించిరి. అయినను నేడుకూడ ఆ యుద్గ్రంథమునకు వ్యాఖ్యానములు కొన్ని వెలువడినవి. వానిలో నామక్కల్ వె. రామలింగం పిళ్లై 'తిరుక్కుఱళ్ పుదుఉరై', ము. వరదరాజన్ వ్రాసిన 'తిరువళ్లువర్', టి. పి. మీనాక్షిసుందరం సంతరించిన 'వళ్లువర్ కండనాడుం, కామముం' అనునవి ప్రశస్త రచనములనదగును. ఈ నడుమ వళ్లువరు జీవితము నభివర్ణించు కాక బృహత్కావ్యము కూడ వెలుగులోనికి వచ్చెను.

ఆర్. పి. సేతుపిళ్లై తమిళ సాహిత్యమును గూర్చియు, తమిళుల సంస్కృతిని గూర్చియు రచియించిన తమిళిన్బం అను వ్యాససంపుటి పేర్కొన దగిన గ్రంథము. శతాబ్దముల వారీగా వెలువడిన టి ఎ. సదాశివ పండారత్తార్ 'తమిళ వాఙ్మయ చరిత్ర', యస్. రామస్వామి నాయుడు రచించిన తమిళిక్కియం, మయిలై సీని వేంకటస్వామి రచియించిన 'శమణముం తమిళుం', 'బౌద్ధముం తమిళుం' మొదలగు గ్రంథములు తమిళవాఙ్మయ పరిశీలనమునకు తోడ్పడగల వనుటలో సందేహము లేదు.

సాహిత్య విమర్శకు సంబంధించిన గ్రంథములు కూడ తమిళమున వెలువడుట గమనింపదగు నంశము. ఎ. యస్. జ్ఞానసంబంధం వ్రాసిన "ఇలక్కియకలై", ము. వరదరాజన్ రచించిన 'ఇలక్కియత్తిఅన్', కి. వా. జగన్నాథన్ వెలయించిన 'తమిళ కాప్పియంగళ్' మున్నగునవి ప్రసిద్ధములు. భాషా తత్త్వశాస్త్రమునకు సంబంధించిన గ్రంథములలోన ము. వరదరాజన్ సంతరించిన 'మొళివరలారు', 'మొళినూల్', పైయాపూరి పిళ్లై సంతరించిన సొత్కలైవిరుడ్డు మొదలగునవి నుడువదగినవి.

ఇక బహుముఖ ప్రతిభాశాలియగు చక్రవర్తి రాజగోపాలాచార్యులవారి (రాజాజీ) రచనా వ్యాసంగమును గురించి యించుక పరిశీలింతము. వీరి చక్రవర్తి తిరుమగన్, వ్యాసర్ విరున్దువంటి ఉత్తమ రచనము లీ నడుమ ప్రచుర ప్రచారమును గడించినవి. అల్పాక్షరములలో అనల్పార్థ రచన చేయగల రచయిత రాజాజీ. నేటి తమిళ పండితులు కొందరివలె శుద్ధ (సంస్కృత భాషాసంపర్కము లేని) ద్రావిడమునే గ్రంథములందుపయోగించవలెనని వాదించని సహృదయుడాయన. రాజాజీ వ్యావహారిక భాషావాది. ఆయన వచన రచన ముఖ్యముగా పేర్కొనదగినది. ఆయన రచనలలో భావము, భాషయు సమప్రాధాన్యము వహించి యుండును ; ఇవి రెండును జోడు గుర్రాలవలె పరువు లెత్తుచుండును. పైపెచ్చు రాజాజీది సమతగల శైలి. ఆయన రచనములందు హాస్యరసము చిప్పిలు చుండును. ఆయన వాక్యములు చిన్నవిగా నుండును ; కాని మహా శక్తివంతములు ; ఆలోచనాత్మకములును. భావములు సూటిగా హృదయమున హత్తుకొని పోవుచుండును. జటిలములగు తాత్త్వికములను కూడా రాజాజీ సులభసుందరమైన వాడుకభాషలోనే చెప్పును. ఇది ఆయన రచనలోని విశేషము. రాజాజీ మంచి విమర్శకులు; ఉత్తమ కథకులు. బూజుపట్టిన విషయములను కూడ రసవత్తరముగ చెప్పగల గొప్ప రచయిత. ఈ నడుమ రాజాజీ బాలబాలికల నుద్దేశించి రచియించిన నీతికథల సంపుటమగు కర్పనైక్కాడు (కల్పనాటవి) ప్రశస్తమైన రచన అనవచ్చును. ఈ సందర్భమున బాలవాఙ్మయమునందు అవిరళ కృషి సలుపుచున్న ఆళ, వళ్లియప్ప, కల్విగోపాల కృష్ణన్, తంబి శ్రీనివాసన్ ప్రభృతుల రచనలుకూడ పరిశీలింపదగినవే. ముఖ్యముగా పిల్లలకవిగా పేరుపెంపులు గడించిన వళ్లియప్ప వెలయించిన కొన్ని కమ్మని కవితలు ప్రశంసింపదగినవి.

## ఆధునిక విజ్ఞానము - పత్రికలు

సాహిత్యమనగా కథలు, కవితలు మాత్రమేయను భావము నేడు సన సన్నగా తొలగిపోవుచున్నది. ఆధునిక విజ్ఞాన శాస్త్రమును గురించి కూడ చక్కని రచనలు చేయవలెనను నభిలాష తమిళ రచయితలకు కలిగినది. కొందరు తమిళ రచయితలు నిజముగానే చక్కని రచనలు వెలయించిరి. శివపాద సుందరం వ్రాసిన 'ఒలిపరప్పుక్కలై' శబ్దప్రసారమునకు సంబంధించిన ప్రశస్త రచన. పి. యన్. అప్పుస్వామి ప్రభృతు లీకోవకు చెందిన రచన లనేకములు చేసిరి. ఎ. కె. చెట్టియార్ వ్రాసిన 'ఉలగంసుట్రు తమిళన్' (ప్రపంచము తిరిగే తమిళుడు) చక్కని ప్రయాణ గ్రంథము. ఈయన యిట్టివే మరికొన్ని గ్రంథములు కూడ వ్రాసిరి.

ఆధునిక సాహిత్య ప్రక్రియలను ప్రోత్సహించుచున్న పత్రికలనుగురించి కూడ నిట రెండుమాటలు వ్రాయుట అవసరము. తమిళమున నేడు వెలువడు చున్న దిన, వార, పక్ష, మాసపత్రికల సంఖ్యను తిలకించినచో తమిళులకు తమ భాషాసాహిత్యముల యందు గల ప్రేమానురాగములు ప్రవ్యక్తములగును. తమిళమునందు మొత్తము 877 పత్రికలు వెలువడుచున్నట్లు విదితమగుచున్నది. తమిళుల కంటె తెలుగువారమయిన మనము సంఖ్యలో ఎక్కువగా నున్నను తెలుగులో 266 పత్రికలే వెలువడుట శోచనీయము. *

## తమిళములో తెలుగు రచనలు

ఇంతవరకు రేఖామాత్రముగ ఆధునిక తమిళ వాఙ్మయమును పరిశీ లించితిమి. ఇక తమిళము చేయబడిన కొన్ని తెలుగు రచనలను గురించి ఒకింత పరికింతము.

ప్రాచీన కాలము నుండియు తెలుగు వారికిని తమిళులకును నడుమ రాజ కీయముగానే కాక సాంస్కృతికమైన సంబంధముకూడ నున్నది. ఈ సంబం ధము వలననే తెలుగు మాటలతో పాటు తెలుగు రచనలుకూడ తమిళ సాహి త్యమున ప్రవేశించెననవచ్చును.

* ఈ వివరములు 1960 నాటివి.

వాంచియార్ (రేచన) రచియించిన వడుగుచ్ఛందం (ఆంధ్రఛ్ఛందం) 'యాప్పరుంగలక్కారిగై'కి మాతృక యని విజ్ఞులు తలచుచున్నారు. తమిళ బసవ పురాణమునకు కూడ పాలకురికి సోమనాథుని బసవపురాణమే మాతృక. రామరాజభూషణుని వసుచరిత్రము, పెద్దనామాత్యుని మనుచరిత్రము, పుష్పగిరి తిమ్మనార్యుని భాగవతసారము, వెలగపూడి కృష్ణయామాత్యుని భానుమద్విజయము, వేమన పద్యములు, ఏనుగుల వీరస్వామయ్యగారి కాశీయాత్ర మున్నగునవి తమిళము చేయబడెను. వీనిలో కొన్ని యింకను అచ్చుపడలేదు ; వ్రాతప్రతులుగానే యున్నవి. ఆధునికాంధ్ర వాఙ్మయము నందలి ఉత్తమ కథలను, కథానికలను తమిళమొనర్చి తమిళుల కందించుచున్న యస్.కె. సీతాదేవిగారిని కూడ నిట సంభావించుట సమంజసము. కళాపూర్ణోదయ కథను రత్నమాల యను పేరున వీరు తమిళులకు పరిచయము చేసినారు.

ఉపసంహారమున, ఆధునిక యుగము విజ్ఞానశాస్త్ర యుగ మనియు ప్రజాసామ్య యుగమనియు మన రచయితలు గుర్తింపవలెను. లేకున్నచో, ఆధునిక సాహిత్యము సమకాలిక సామాజిక జీవనమునకు దర్పణమై ప్రతిభాసింపజాలదు. ఈ దృష్టితో చూచినప్పుడు ఆధునిక తమిళ సాహిత్యమున ఇంకను ఎక్కువగా విజ్ఞానశాస్త్ర పరిశోధనలకు సంబంధించిన రచనలును, ప్రజల సమస్యలను సజీవముగా చిత్రించు రచనలును వెలువడవలె ననుట సాహసము కాదు.

---

## ఆధార గ్రంథములు :


(1) కన్నడ సాహిత్య -
శ్రీ K. వెంకటరామప్ప M.A.

(2) సంచార పుస్తకమాలె గ్రంథములు -
(పంప - హరిహర - లక్ష్మీశ సర్వజ్ఞ ముద్దణ మొ॥)

(3) కన్నడ కైపిడి - ౨ భాగము. (కన్నడ సాహిత్య చరిత్ర)
శ్రీ బి. యం. శ్రీకంఠయ్య.

(4) కన్నడ సాహిత్యవాహిని -
శ్రీ N. K. కులకర్ణి.

(5) కన్నడ సాహిత్య చరిత్ర -
శ్రీ. రం. శ్రీ. ముగళి.

(6) Kannada Literature
Sri V. K. Gokak

# 1

## ఉపక్రమణిక

సామాన్యముగా భాషతోపాటు సాహిత్యము కూడ ఉదయించును. అనుభవమును సుందరముగ వెల్లడించుటయే 'సాహిత్యము' అని విద్వాంసుల అభిప్రాయము. ఈ సాహిత్యమునకు మూల సత్వము సాధనమైన భాషలో నుండును. సాహిత్యము గ్రంథరూపమున స్థిరత్వము నందుటకు ఆ భాషకు లిపి యొకటి ఉండవలెను. గ్రంథకర్తయందు కళతోకూడిన కూర్పరితన ముండవలెను. సాధారణముగ సాహిత్యము మత ప్రచారమునకు, ప్రజలకుపదేశించుటకు పుట్టునని పండితులనుచున్నారు. బాహ్యమైన నాగరికత, ఆంతరికములైన రసికతా సంస్కృతులు ఒకస్థాయి నందుకొనినపుడు సాహిత్యము పుట్టి పరంపరగా సాగుచుండనని చెప్పవచ్చును.

## కన్నడ సాహిత్యోదయము

కన్నడ సాహిత్య మెప్పుడు మొదలయ్యెనో సరిగ చెప్పుట కష్టము అందుకు సరియగు ఆధారములు లేవు; ఉన్న సామగ్రి కొద్దిపాటిది. ఇంచుమించుగ దాక్షిణాత్య సాహిత్యములన్నియు ఈ స్థితియందే యున్నవి. అభిమానముతో, అల్పమైన సామగ్రిని ఆధారము చేసికొని, మింటికి మంటికి సూత్రము లల్లుచుండుట సహజము. ఇతర సాహిత్యముల ప్రాచీనతా వాదములన్నియు ఈ తరగతిలోనివే. కన్నడమున నింతవరకు దొరకిన మొట్టమొదటి గ్రంథము "కవిరాజ-మార్గ" అనునది. అది తొమ్మిదవ శతాబ్దమున రచింపబడినదని నిర్వివాదముగ చెప్పవచ్చును. దొరికిన వానిలో ఇప్పటికిది మొదటిదైనను కన్నడమునకిదే ప్రథమ గ్రంథమై యుండదు. అంతకుముందే కన్నడ సాహిత్యము పుట్టి ఒక శిష్ట సాంప్రదాయముతో వెలసియుండు ననుటకు కొన్ని ఆధారములున్నవి.

కొందరు ఋగ్వేద కాలము నాటికే కన్నడ భాష, దానిని మాట్లాడు ప్రజలు, వారున్నదేశము ప్రసిద్ధినొందియుండెనని వాదించుచున్నారు. ఈ ఊహ సాహసముతో గూడినది. క్రీ.శ. 1, 2 శతాబ్దములలో ఈజిప్టు దేశమున దొరకిన గ్రీకు ప్రహసనమున కొన్ని కన్నడ పదములున్నవని నిరూపించి, ఆ సాహిత్యము

ప్రథమ శతాబ్దమునకు ముందే పుట్టియుండునని "శ్రీగోవిందపై" నిర్ణయించినారు. క్రీ. పూ. 3 వ శతాబ్దమునందలి అశోకుని కాలమునుండి క్రీ. శ. 5 వ శతాబ్ది వరకు కన్నడ దేశమున దొరకిన తామ్ర. శిలాశాసనములన్నియు సంస్కృత, ప్రాకృతములలోనే ఉన్నవి. క్రీ. శ. 5 వ శతాబ్దములోని "హల్మిడి" శాసనమున తొలిసారి ప్రాచీన కన్నడభాష కానవచ్చినది. ఈ శాసనకాలమును గూర్చి కూడ చాల అభిప్రాయ భేదములున్నవి. కాని, అది క్రీ. శ 450 సంవత్సర ప్రాంతము నాటిదని పలువురు నిర్ధారించినారు. కన్నడ సాహిత్యసాగరమును మథించిన విబుధులు "శ్రీ బి. ఎం. శ్రీ కంఠయ్య, శ్రీ K. వెంకటరామప్ప, శ్రీ. రం. శ్రీ. ముగళి" మొదలైనవారు 5, 6 శతాబ్దములకు ముందు కన్నడ శాసనముగాని, గ్రంథముగాని లభింపలేదని తెలిపినారు. శ్రీ కంఠయ్యగారు "నృపతుంగు"ని కాలమునకు ముందు కొందరు కన్నడ కవులున్నను వారి గ్రంథములు సామాన్యములుగ నున్నందున, కవిశిక్షణ కొరకే నృపతుంగుడు "కవిరాజమార్గ"ను వ్రాయించెనని భావించినారు. ఈ వాదము సమంజసమైనది కావచ్చును.

తరువాతి కన్నడ కావ్యములలో ప్రశంసింప బడిన పూర్వ కవులందు "శ్రీ వర్ధదేవుడు, శ్రీ విజయ, అసగ, గుణనంది, గుణవర్మా"దులు, నృపతుంగుడు పేర్కొన్న "దుర్వినీ" తాదులు కానవచ్చుచున్నారు. వీరిలో దుర్వినీతుడు 6 వ శతాబ్దము నందుండిన పశ్చిమ "గాంగరాజు". ఇతని కాలము నుండియే కన్నడ గ్రంథరచన మొదలై యుండునని చరిత్రకారుల యభిప్రాయము.

భారతీయ సాహిత్యములలో సంస్కృత ప్రాకృతములు చాల ప్రాచీనములైనవి. వాని తరువాత తమిళము, కన్నడము గణనకు వచ్చును. కన్నడ ఆది కావ్యమైన "విక్రమార్జున విజయ"మును "పంప"డు 10 వ శతాబ్దమున రచించెను. తరువాత నూరేండ్లకు తెలుగు తొలికబ్బమగు "నన్నయ" భారత ముదయించినది.

## సాహిత్య ప్రచోదక శక్తి

కన్నడ సాహిత్యమునకు సాధారణముగ ధర్మమే ప్రేరకమని తెలుసు. పంపడు మొదలుకొని ప్రసిద్ధ కవులందరు తమ మత సందేశములను చాటుటకే

సాహిత్యమును చేపట్టినారు. జైనుడగు పంపడు "జినాగమ"మును విశ్వమున వెలిగింప జేయుటకు "ఆదిపురాణము''ను వ్రాసినాడు. (ఆదిపురాణ దొళరివుదు కావ్యధర్మమం, ధర్మముమం). అతనినే గురువని యెంచిన జైన కవులందరును మత - ప్రచారమునకే తమ ప్రౌఢకావ్యములను విరచించినారు, జైనులే కాక తరువాతి కవులందరును ఈ మార్గమునే అనుసరించిరి. 'బసవ'న మొదలైన వచనకారులు వ్రాసిన వచనములన్నియు "వీరశైవ" ప్రచారము నుద్దేశించినవే. ఆ తరువాత వచ్చిన వైష్ణవ దాససాహిత్యము కూడ ఈ కార్యమునే కొనసాగించినది. ఈ విధముగా మత ప్రచారమునకై వ్రాసినంత మాత్రమున నీ గ్రంథములు తాత్కాలిక ప్రయోజనము నుద్దేశించినవి కావని చెప్పవచ్చును. సంపూర్ణ సాహిత్య లక్షణములతో నిండి శాశ్వత స్థానమును సంపాదించుకొన్న మహా కావ్యము లనుటలోగూడ సందేహము లేదు.

సాహిత్యమే అననేల భారతీయ సంస్కృతియే 'ధర్మము' అను పునాది మీద నిలచియున్నది. ప్రాచీన సంస్కృతిని వెల్లడించు వాస్తు శిల్పాది కళలతో కూడ మత ధర్మ ప్రచారములు ప్రాధాన్యము వహించినవి. కావున కళలన్నిటికి ధర్మ మత ప్రచారములు ప్రచోదక శక్తులై యున్నవని చెప్పవచ్చును. ఇందుకు తగిన కారణములుకూడ లేకపోలేదు.

మన దేశమున రాజకీయ విప్లవములు ప్రజలమీద తమ ప్రభావమును ఎక్కువగ వేయలేదు. భారత దేశములో ధార్మిక విప్లవములు చెలరేగినవి ; బౌద్ధ, జైన, వీరశైవ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత మత విప్లవములు నిరంతరము సాగినవి.

ఈ ధర్మక్రాంతి పరిణామము సాహిత్యములోను కానవచ్చుట సహజము.

## కన్నడ సాహిత్య స్వరూపము

కన్నడ సాహిత్య వాహిని ఇంచుమించు 15 వందల సంవత్సరముల నుండి శాఖోపశాఖలతో, మహారూపమునంది ప్రవహించుచు, పండిత పామరుల నలరింపజేయుచున్నది. ఈ సాహిత్యము పలువురు కవులు, కవయిత్రులు, పండితులు, జ్ఞానులు, మహానుభావులు, శివశరణులు, హరిదాసులు, రాజులు,

రాజోద్యోగులు, గ్రామీణులు, గ్రామముఖ్యులు ఎందరో పోషింపగా విశ్వరూపము దాల్చినది. శాస్త్రీయ – దృక్పథముతో ప్రౌఢిమదృష్టితో పరిశీలించిన కన్నడ మునకు తక్కిన భారతీయ సాహిత్యముల వరుసలో సముచిత స్థానమున్నది. కన్నడ సాహిత్యము వివిధాంగములచే పరిపుష్టిని పొందియున్నది.

సుప్రసిద్ధ కన్నడ వైయాకరణి 'భట్టాకళంకుడు తన శబ్దానుశాసనము' నందు "శబ్దాగమ, యుక్త్యాగమ, పరమాగమ విషయాణాం తథా కావ్య, నాట కాలంకార, కళాశాస్త్ర విషయాణాంచ బహూనాం గ్రంథానామపి భాషా కృతానాం ఉపలభ్యమానత్వాత్" అని తెలిపి కన్నడ సాహిత్యములోని వైవిధ్య మునకు ఆశ్చర్యము నందినాడు. కన్నడ సాహిత్యమును పరిశీలించినచో అందు మహాకావ్య, నాటకాలంకారములు, ఛందోవ్యాకరణములు, నిఘంటువులు, వైద్య, జ్యోతిష, పాక, గణిత శాస్త్రములు, కామశాస్త్ర, స్వరశాస్త్ర, రత్నశాస్త్ర, సాముద్రిక శాస్త్రములు, ధనుర్విద్య మొదలైన విషయములు, జీవిత చరిత్రలు, ఇతిహాసములు కాన్పించును.

స్థూలముగ కన్నడ సాహిత్యాంగముల నిట్లు విభాగింప వచ్చును. కావ్యములు, వచనములు, కీర్తనలు, నాటకములు, శాస్త్రములు అని. కావ్య ములలో చంపూ, రగళె, షట్పది, సాంగత్య, గద్యములను విభాగములున్నవి. చంపు కావ్యములు – ఆగమికములు (పురాణములు), లౌకికములు అని రెండు విధములు. ఇవన్నియు కన్నడ సాహిత్య వైవిధ్యమునకు, విశిష్టతకు నిదర్శనములై యున్నవి.

## కాల విభాగము

కన్నడ సాహిత్య చరిత్ర దీర్ఘకాలముతో కూడినది. అనేక రూపములు, అసంఖ్యాక గ్రంథములు ఇందున్నని. వాని నభ్యసించుటలో సౌకర్యముగ నుండుటకు కాలవిభాగ మవసరము. ఈ విభాగమును గూర్చి అనేక మత భేదములున్నవి. సాధారణముగ ఈ విధాగమున కొక క్రమము పాటింపబడు చుండును.

కన్నడ సాహిత్య చరిత్రకు కావలసిన సామగ్రి కీ శే. R. నరసింహాచార్యులు సంతరించిన "కర్నాటక కవి చరితె" నుండి గ్రహింపబడుచున్నది. వారు కన్నడ కవులను స్థూలముగ జైనులు, వీరశైవులు, వైష్ణవులు అను మూడు వర్గములుగ విభాగించినారు. ఇది మత ధర్మములను దృష్టిలో పెట్టుకొని చేసిన విభాగము. ఈ క్రమమే చాలకాలము వరకు బహు - సమ్మతమై యుండెను. తరువాత 'E. P. రైస్' సాహిత్య చరిత్రను శాఖోపశాఖలతో కూడిన మహా ప్రవాహముగ పోల్చి మూల ప్రవాహము శుద్ధజైన ప్రవాహమని, వీరశైవ వాహిని దానిలోచేరి తన ప్రత్యేకతలతో కలసి పారెనని, ఆ తరువాత వైష్ణవ వాహిని పై రెండిటితో గలసి త్రివేణీ సంగమమైనదని వర్ణించినాడు. ఇది నరసింహాచార్యుల వాదమునకు మెరుగులు దిద్దుచున్నది. కన్నడ నిఘంటుకారుడు 'కిట్టెల్' భాషాదృష్టితో నీ విభాగమును 'హళగన్నడ, నడుగన్నడ, హోసగన్నడ" ములుగ విభాగించెను. శ్రీ కంఠయ్యగారు కన్నడ సాహిత్య చరిత్రను "ఆరంభకాల - మతప్రాబల్యకాల - నవీనకాల" ములుగ విభజించిరి. శ్రీ రం. శ్రీముగళి ఈ విభాగములు సరికాదని మత తత్వమున కంటె కవి, అతని కృతులు ప్రధానమైనవని ఒక్కొక్క కాలములో ఒక్కొక్క మహాకవి ఆ కాలము వారిచే అనుసరింపబడెనని సహేతుకముగ చర్చించి "పూర్వయుగ-పంపయుగ-బసవయుగ-కుమారవ్యాసయుగ" ములుగ విభాగించినారు. ఈ విభాగక్రమము చక్కగ నున్నది. మనము దీనికి ఆధునిక యుగమును చేర్చినచో 'సాహిత్య చరిత్ర' సమగ్రము కాగలదు.

ఇక్కడ ఒక విషయము గమనింపవలసియున్నది. కన్నడ సాహిత్య చరిత్రను వ్రాసిన వారందరును పై విభాగక్రమములతో 6 వ, శతాబ్దమునుండి 19 వ, శతాబ్దాంతము వరకు గల సాహిత్య చరిత్రను మాత్రమే వివరించినారు. నవీన యుగమును గూర్చి ఏమియు వ్రాయక పోవుట గమనార్హమైనది. సత్యము విచారించిన 'నవీనయుగ' మను దానిలో పాశ్చాత్య సాహిత్య ప్రభావమునకులోనై ఇంకను ప్రయోగదశ ననుభవించుచున్న ప్రక్రియలే విశేషముగ కానవచ్చుచున్నవి. వీనిని గూర్చి అప్పుడే యొక చరిత్రను వ్రాయుట సమంజసము కాకపోవచ్చును. సమకాలికులై, సజీవులై యున్న రచయితలను గూర్చి యేదైన వ్రాసినపుడు కొన్ని చిక్కులుగూడ కలుగవచ్చును. వీనినన్నిటిని దృష్టిలో పెట్టుకొని కన్నడ విద్వాంసులు బుద్ధిపూర్వకముగ ఆధునిక యుగమును వదలిపెట్టిరేమో!

# 2
# పూర్వయుగము (క్రీ.శ. 5-10వ శతాబ్ది ఆరంభమువరకు)

ఈ యుగములో కన్నడ సాహిత్యము ప్రారంభమైనప్పటి నుండి పంపని వరకు గల కాలవిశేషములు వివరింపబడినవి. ఈ కాలమున "కవిరాజమార్గ" ఒక్కటే ఇంతవరకు దొరకిన మొదటి గ్రంథము. అది కన్నడ సంస్కృతికి సంబంధించిన అనేక విశేషములను వివరించుచున్నందున చాలముఖ్యమైనదిగ గణింపబడుచున్నది.

9వ శతాబ్దమునకు ముందు వ్రాయబడిన గ్రంథములేవియు లభింపలేదు కాని, కన్నడ భాషాసాహిత్యములు అంతకుముందే ప్రచురములై యుండెనని చెప్పుటకు కొన్ని ప్రాచీన శాసనములు ఆధారములుగ యున్నవి. ఈ శాసనములలో చాలభాగము గద్యములోను, కొన్ని పద్యములలోను వ్రాయబడిఉన్నవి. వానిలో ముఖ్యములైన మూడు శాసనములు ఈ సందర్భమున పరిశీలింపదగినవి.

## 1. హల్మిడి శాసనము

బేలూరు దగ్గరనున్న "హల్మిడి" గ్రామమున నీ శాసనము ఉన్నది. దీని రచనా కాలము దాదాపుగ క్రీ. శ. 450 వ సం॥మని పలువురు చరిత్రకారులు నిర్ణయించినారు ఇంతవరకు లభించిన కన్నడ శాసనాలలో ఇదే ప్రాచీనమైనది. దీనిలో ఒక కదంబరాజు "విజయరసు" అను వానికి రెండు గ్రామములను దానము చేసిన విషయము తెలుపబడినది. సంస్కృత శ్లోకముతో శాసనము మొదలగును. తక్కిన భాగమంతయు సంస్కృత బాహుళ్యమైన కన్నడ వచనము. ఎంచి నల్గిరువది కన్నడ పదములున్నవి. శాసన కాలము నాటికి కన్నడ భాష మీద సంస్కృత ప్రభావము విశేషముగ ఉండినట్లు కనబడును.

## 2. బాదామీ శాసనము

దీని కాలము క్రీ.శ. 700. ఇది బిజాపురము జిల్లాలోని "బాదామీ" నగరమున లభించినది. ఈ శాసనము "త్రిపది"ఛందస్సులో, రచింపబడియుండుట

గమనింపదగియున్నది. ఈ త్రిపది అచ్చగన్నడ ఛందస్సు. భాష సంస్కృత మయమైన కన్నడము. ఆ కాలమున ఈ విధమైన పద్యరచన ప్రజలలో వాడుక యందుండెనని చెప్పచ్చును. శాసనములో "కలియుగ విపరీత" బిరుదాంకితు డైన "కప్పెఅరభట్టు" స్తుతింపబడినాడు.

ఉదాహరణము:- "సాధుగె సాధు, మాధుర్యంగె మాధుర్యం
బాధిప్ప కలిగె, కలియుగ విపరీతం
మాధవ నీతన్ పెరనల్ల"

## 3. శ్రవణ బెళగోళ శాసనము

ఇది 7వ, శతాబ్దమున వ్రాయబడినది. ఇందు కన్నడ పదముల కంటె సంస్కృత పదములే హెచ్చు: దీర్ఘసమాసములు. పూర్వహళగన్నడ రూపములు కలవు. ఇందు "నందసేను"డను జైనముని వైరాగ్యముతో ఐహిక సుఖములను పరిత్యజించి దేవలోకమును చేరిన విషయము వర్ణింపబడినది. అప్పటి కన్నడ పద్య స్వరూపము తెలియుటకై అందలి ఒక పద్యము నుదాహరించుచున్నాను.

"సురచాపంబోలె విద్యుల్లతెగళ తెరవోల్ మంజువోల్ తోరిబేగం
పిరిగుం శ్రీరూపలీలా ధనవిభవ మహోరాశిగళ్ నిల్లవార్గం
పరమార్థం మెచ్చినానీ ధరణియశిర వానెందు సన్యాసనం గె
య్దురు సత్వన్ నందసేన ప్రవర మునివరం దేవ లోకక్కెసందాఀ"

10వ శతాబ్దపు శ్రవణ బెళగోళ శాసనములో 'అక్కర' కనబడుచున్నది. ఈపై శాసనములనుబట్టి అప్పటి కన్నడ నుడి స్వరూపమును, దాని కవితా రీతిని గ్రహింపవచ్చును. తొమ్మిదవ శతాబ్దమునకు ముందున్న కన్నడభాష హళ గన్నడమున కంటె ప్రాచీన రూపములతో తమిళమునకు దగ్గరి పోలికగలదై యుండును. సంస్కృత పరిచయము, దాని అనుసరణము అప్పటివారిలో చాలవరకున్నను 'దేశీ' పద్ధతికూడా 'మార్గ' పద్ధతితోపాటు సమానగౌరవము నందియుండెనని యూహింపవచ్చును. శ్రవణ బెళగోళ శాసనములలో కన్నడ సాహిత్య స్వరూపమునుగూర్చి ప్రాచీన కవులనుగూర్చి తెలియజేయు విషయ ములు చాలగలవు.

శాసనముల తరువాత ఈ యుగములోని కన్నడ సాహిత్యస్థితిని తెలిసి కొనుటకు ముఖ్యాధారము "కవిరాజమార్గ" అని ప్రసిద్ధినందిన లక్షణగ్రంథము. ఇది రాష్ట్రకూట చక్రవర్తి 'నృపతుంగు'ని కాలమున రచింపబడినది. ఇతడు క్రీ. శ. 814-877 సం॥లో నున్నవాడు. ఇతనికి "అమోఘవర్ష," "అతిశయ ధవళ" అను బిరుదములు కలవు. ఈ గ్రంథములో కావ్యమునకు సంబంధించిన గుణదోషాలంకారములు వివరింపబడియున్నవి. ఇందలి పూర్వకవి ప్రశంసలో "శ్రీ విజయ, కవీశ్వర, పండిత, చంద్ర, లోకపాలా" దులు పద్యకావ్యకర్తలుగ, "విమలోదయ, నాగార్జున, జయబంధు, దుర్వినీతులు" గద్యరచయితలుగ స్తుతింపబడినారు. కొందరి రచనల నుండి లక్ష్యము లొసగబడినవి. తరువాతి కన్నడ కవులు మరికొందరు ప్రాచీన కవులను పేర్కొనిరి. వారిలో "అసగ, గుణనంది, గుణవర్మ"లు ముఖ్యులు. వీరిని గురించి తెలిసినది స్వల్పము. వీరి గ్రంథము లేవియు లభింపలేదు.

## కవిరాజమార్గ

ఈ గ్రంథము క్రీ. శ. 825 సం॥ ప్రాంతమున రచింపబడియుండునని పరిశోధక పండితుల అభిప్రాయము. ఈ గ్రంథకర్తను గూర్చి చాల మతభేదములున్నవి ఆ వాదములనన్నిటిని చర్చించి సత్యాన్వేషకులైన విద్వాంసులు ఆ లక్షణ గ్రంథమును నృపతుంగుడు రచింపలేదని, అతని ఆస్థాన కవియైన జైన పండితుడొకడు రాజాజ్ఞచే "దండికావ్యాదర్శనము" ననుసరించి వ్రాసెనని తేల్చినారు. గ్రంథములో "నృపతుంగ దేవానుమతమైన కవిరాజమార్గము" అనియు "నృపతుంగ సభాసదుడు ఈ విశిష్ట కావ్యమును వ్రాసె" ననియు, ఆ కర్త "శ్రీ విజయు"డను కవీశ్వరుడనియు తెలుపబడియున్నది.

ఈ మొదటి గ్రంథమున 'దోషాదోషాను వర్ణన నిర్ణయ', 'శబ్దాలంకార' 'అర్థాలంకార' అను మూడు పరిచ్ఛేదములున్నవి. ఇందు లాక్షణిక విషయములతో పాటు చారిత్రక, వ్యావహారిక విషయములు కూడ తెలుపబడినవి. ఇది కేవలము దండి 'కావ్యాదర్శ'మున కనువాదము కాదు. గ్రంథకర్త నృపతుంగుని ప్రోత్సాహముచే సర్వతోముఖ ప్రజ్ఞా విశేషమును ప్రదర్శించి కన్నడదేశ విస్తీర్ణమును, అందలి జన-జీవనమును కన్నులకు గట్టునట్లు వర్ణించినాడు.

దండి భామహుల సంస్కృత లక్షణముల ననుసరించి నప్పటికిని అనేక విషయ ములను స్వతంత్రముగ చర్చించి తరువాతి కవులకు మార్గదర్శకుడైనాడు. ఈ విధముగ కవిరాజ మార్గము ఆద్యగ్రంథ మైనప్పటికిని 'కర్ణాటక దర్శన' మనదగియున్నది.

## "వడ్డారాధన"

ఇది జైన మతమునకు సంబంధించిన కథల సంగ్రహము. చక్కని గద్యములో వ్రాయబడిన ఈ గ్రంథము కన్నడ వాఙ్మయమున కపూర్వాలం కారము. దీని రచనా కాలమునుగూర్చి కూడ అనేక వాదోపవాదములున్నవి. అంతరిక ప్రమాణాల ఆధారముతో రచనాకాలము 925 సం ప్రాంతము కావచ్చునని నిర్ణయించినారు. అనగా ఇంచుమించు పంపనికి సమకాలిక మన్నమాట. దీనిని 'శివకోట్యాచార్యుడు' రచించెను. ఇందు మార్గ పద్ధతికి, 'దేశికి' సమాన ప్రాధాన్య మొసగబడినది. రచయిత తన అనల్ప కల్పనా చమత్కృతిని, ఉక్తి వైచిత్ర్యమును ప్రదర్శించి కన్నడ భాషా మాధుర్యమును లోకమునకు చవిజూపెను. ఇది ఈ యుగములోని ఉత్తమ గద్య గ్రంథమే గాక, కన్నడ సాహిత్య చరిత్రలో విశిష్ట స్థానము నందదగినది.

దేశి మార్గ పద్ధతులను గూర్చి తెలిసికొనుట అవసరము. సంస్కృత ప్రాకృతచ్ఛందస్సుల ననుసరించినచో దానిని 'మార్గపద్ధతి' అని, సంస్కృతాది ఛందో గ్రంథములలో కానరాక సామాన్య జనులలో, స్త్రీలలో పాటల రూపమున వాడుకయందుండిన పద్ధతిని 'దేశి' అని వ్యవహరించుచున్నారు. 'దేశి' ఛందస్సులో బ్రహ్మ, విష్ణు, రుద్ర గణములతో కూడిన ద్విపది, త్రిపది, చౌపది, అక్కర, గీతిక, ఏల, షట్పది మొదలైన పద్యములున్నవి. వీనిని తాళ లయల ననుసరించి పాడుకొనవచ్చును. ప్రాకృత ఛందస్సుల నుండి కందము, రగళ గ్రహింపబడినవి. తెలుగు నుండి ద్విపద, సీసము, గీతము, తీసికొనబడినవి. సంస్కృత ఛందస్సులోని అనేక వృత్తములను అను ష్టుప్, ఇంద్రవ్రజ, వంశస్థ, మాలిని, ఆర్యా, మొదలైన వానిని కన్నడ కవులు ఆరంభదశలో ఉపయోగించినను అవి కన్నడమునకు పొందవని గుర్తించి చంపక, ఉత్పల, శార్దూల, మత్తేభాది ప్రసిద్ధ వృత్తములనే తరువాత విశేషముగ

వాడుకొన్నట్లు తెలియుచున్నది. ఈ సంస్కృతాది వృత్తములకు సంస్కృత ప్రాకృతములలో లేని ప్రాసనియమమును కన్నడ కవులు పాటించిరి. తెలుగు వారు మరొక అడుగు ముందుకువేసి ప్రాసనియమముతోపాటు యతిని అక్షర మైత్రినికూడ పాటించినారు.

కన్నడ కవులలో జైనులు విశేషముగ సంస్కృత వృత్తములను, కంద మును తమ చంపూ కావ్యములలో వాడినారు.

ఈ విధముగా పూర్వయుగమున నృపతుంగునకు ముందే కన్నడ కావ్య రచన సాగి సంస్కృత భాషామిశ్రణముతో ఒక ప్రౌఢశైలి రూపొంది తరువాతి 'పంప', 'రన్న' మొదలైన వారలకు అనుసరణీయమైనదని చెప్పవచ్చును.

3

# పంప యుగము (10వ శతాబ్ది ఉత్తరార్ధము నుండి 12వ శ. పూర్వార్ధము)

ఈ యుగము పంపనినుండి బసవేశ్వరుని వరకని నిర్ణయింపబడినది. పూర్వ యుగములో తలయెత్తిన ఉత్తమ సాహిత్య సంప్రదాయములు పంపని యుగములో ప్రౌఢములైనవి. పదవ శతాబ్దములో కన్నడ సాహిత్యము కొందరు మహాకవులచే అభివృద్ధిని పొంది కవితా సామ్రాజ్య స్థాయిని సాధించినది.

## యుగ విశేషములు

10 నుండి 12వ, శతాబ్దము వరకు జరిగిన కాలము రాజకీయముగా, ధార్మికముగా చాల ఒడుదుడుకులకులోనై యుండెను. బాదామీ చాళుక్యులను నిర్వీర్యులను చేసి రాష్ట్రకూటులు 9వ, శతాబ్దమున మహాసామ్రాజ్యమును స్థాపించిరి. 10వ, శతాబ్దమున అదియు పతనమైపోయెను. ఉత్తర కర్ణాట కమున చాళుక్య, రాష్ట్రకూటుల ఆశ్రయములో "పంప", "పొన్న" కవులు, దక్షిణ కర్ణాటకములో గాంగుల ఆశ్రయమున "చావుండరాయ", "నాగవర్మ"లు

ఈ ఉభయుల పోషణను పొందిన "రన్నడు" ధార్మిక, లౌకిక, శృంగార కావ్యములను రచించి తరువాతి వారికి మార్గదర్శకులైరి.

ధార్మిక దృష్టితో చూచిన ఈ యుగమందు జైనధర్మమునకు బయటి శైవరాజులచే ఒత్తిడి కలుగుచున్నను, స్వదేశములోని వైదిక మతీయుల సానుభూతి లభించుచుండెను. కళ్యాణీ చాళుక్యులు చోళుల నరికట్టి కన్నడనాడును కాపాడినట్లే, జైనమతమును గూడ రక్షించిరి. చోళదేశము నుండి విజృంభించిన శ్రీ వైష్ణవ ధర్మ ప్రచారము జైన ప్రచారమును స్తంభింపజేసినది. దక్షిణమున చోళుల ప్రాబల్యమునకు తలకాడు గాంగులు నిస్తేజులైనందున జైనమునకు చాల దెబ్బ తగిలెను. పండితులుకూడ పరస్పర ద్వేషాసూయలతో దూషణ, తిరస్కార యుద్ధములు చేయుచుండిరి. ఈ అగమ్య స్థితిలో జనులను తమతమ ధర్మములవైపు త్రిప్పికొనుటకు జైన, శైవ, వైష్ణవములు తీవ్ర ప్రయత్నములు చేయుచుండెను.

సాహిత్యదృష్టితో ఈ యుగము మార్గపద్ధతిలోని ప్రౌఢ సంప్రదాయాలకు, దేశి పద్ధతిలోని సరళ రీతులకు చక్కని సమన్వయమును సాధించెనని చెప్ప వచ్చును. ఈ యుగమున పలువురు కవులు జైనులు. వీరు స్వతంత్ర రచనలు చేసినారు. కొందరు బ్రాహ్మణ కవులు సంస్కృతానువాదములను చేసిరి. జైనుల గ్రంథములు లౌకికములని, ధార్మికములని విభాగించుటకు తగియున్నవి. ధార్మిక కావ్యములు తీర్థంకరుల, మహాపురుషుల జీవన చారిత్రములై జైన మతమును ప్రచారముచేయు సాధనములుగ రచింపబడినవి. లౌకిక కావ్యములు ప్రసిద్ధములైన రామాయణ, మహాభారత పురాణాదులనుండి కథలను గ్రహించి తమ్ము పోషించు రాజుల చరిత్రలను, సమకాలిక జనుల జీవనమును సూచించునట్లు రచింపబడిన "ధ్వనికావ్యము" లనదగి యున్నవి. ఈ పద్ధతికి చెందిన రచనలు ఇతర భారతీయ సాహిత్యములకు సరిక్రొత్త వనవచ్చును. ఇంచు మించుగా ఈ కావ్యములన్నియు చంపువులే. ధార్మిక పురాణములలో అద్భుత, శాంతరసములు, లౌకిక కావ్యములలో వీర, రౌద్రములు ప్రతిపాదింపబడి చక్కగా నిర్వహింపబడినవి. సంస్కృత కావ్యముల ననుసరించినను కన్నడ కవులు శృంగారమునకు ప్రాధాన్య మొసగకుండుట గమనింపవలసిన విషయము.

ప్రాంతమున ఇతడు గ్రంథరచన చేసెను. ఇతడు మొదట "ఆదిపురాణము"ను, తరువాత "విక్రమార్జున విజయ"మును రచించెను. రెండునూ చంపూకావ్యములే. ఈ యుగమున బుట్టిన చంపువులకెల్ల పంపడే మార్గదర్శకుడు. సుప్రసిద్ధ మహా కవులలో పలువురీకాలమున పుట్టినందున కన్నడ సాహిత్య చరిత్రలో ఈ కాల మును "స్వర్ణయుగ" మనవచ్చును.

## ఆది పురాణము

పంపని మొదటికృతి "ఆదిపురాణము''. ఈ కావ్యము నతడు ఆత్మసంతోష మునకై సంతరించెను. ఇది ప్రథమ తీర్థంకరుడైన ''వృషభనాథు''ని చరిత్రము. జైనమత ప్రచారకులలో ముఖ్యులను "తీర్థంకరు"లందురు. వారి సంఖ్య 24. వారిలో వృషభుడు మొదటివాడు. పంపడీ కథను ''జినసేను''ని సంస్కృత ''పూర్వపురాణ''ము నుండి గ్రహించెను పురాణమగుటవలన ఇందు కల్పనా చమత్కృతికి, కథన కౌశల్యమునకు అవకాశము తక్కువ. గ్రంథములో చాలా భాగము శుష్కములైన జన్మాంతర గాథలతో నిండియున్నందున జనాదరణమును పొందలేదేమొ! ఈ గ్రంథము నితడు మూడునెలలలో వ్రాసెనట.

ఈ సందర్భములో జైనపురాణ లక్షణములను తెలిసికొన్నచో తక్కిన జైన కావ్యముల నన్నిటిని సులభముగ తెలిసికొనుటకు వీలగును. ఆదిపురాణము 16 ఆశ్వాసముల గ్రంథము; అందలి కథలో పురుదేవుని పూర్వజన్మగాథలను, అతని జననమాదిగా విద్యావిహార రాజ్యభార వైరాగ్య పరినిష్క్రమణ ధర్మ విహారాదులను, అతని కుమారుడైన 'భరత' చక్రవర్తి దిగ్విజయమును, తమ్ము డైన "బాహుబలి"తో జరిగిన యుద్ధమును, బాహుబలి "జినదీక్షా" స్వీకరణము, వృషభనాధ, బాహుబలి, భరతుల మోక్షమును కవి వర్ణించినాడు. "ముఖ్యముగా అర్థకామముల తృష్ణతో చేసిన కర్మలకు ఫలముగా 'తిర్యక్ మనుష్య నారక దేవ' అను నాల్గు గతులను పొందు జీవుడు జినధర్మము నవలంబించి 'సమ్యగ్దర్శన, సమ్యజ్ఞాన, సమ్యక్చారిత్రము'లను రత్నత్రయముచే పరిష్కృతుడై, దానధర్మ వైరాగ్య తపస్సులచే ఉత్తమ జన్మములను పొందుచు, జన్మముల అవసానము నందు 'అహమింద్రు'డై దేవలోకము నందుండి పరిశుద్ధాత్ముడై మనుష్యలోకము నకు వచ్చి, చరమ దేహధారియై వైరాగ్యముచే సకలమును త్యాగము చేసికొని

తపస్సొనరించి, కర్మక్షయమును సాధించి, తీర్థంకరుడై జైనధర్మమును లోకమునకు బోధించి నిర్వాణమును పొందు చరిత్రియే తీర్థంకర పురాణ సారాంశము." సాధారణముగా జైనపురాణములన్నియు ఈ పడియచ్చులో పోతపోసినట్టివే. ప్రతి పురాణములో భవావళి, పంచకల్యాణములు, వైరాగ్యము,తపస్సు, ముక్తిస్థలము, ఇంద్రిపూజ, ఆనంద నృత్యములు విధిగా వర్ణింపబడును. పంచకళ్యాణములనగా: స్వర్గావతరణ కల్యాణము, జన్మాభిషేక మహాకల్యాణము, పరినిష్క్రిమణ కల్యాణము, సౌధర్మేంద్ర కల్యాణము, పరినిర్వాణ కల్యాణము అనునవి. ఇవి ప్రితి తీర్థంకరునకు వర్ణింపబడును. ఈ గ్రంథము పంపని విక్రిమార్జున విజయమువలె సర్వజన సమాదరణీయము కాలేదు. కావ్యదృష్టితో నిది పంప భారతమునకంటె కొన్నిపట్టుల ఉత్కృష్టమై యున్నదనుటలో సందేహము లేదు.

## విక్రమార్జున విజయము

పంపడు ఆదిపురాణమును మూడు మాసములలో వ్రాయగా 'విక్రమార్జున విజయము'ను ఆరుమాసములలో పూర్తి చేసెను. దీనినే "పంపభారత" మనియునందురు. ఈ గ్రంథమును ఆశ్రయదాతయైన అరికేసరికి ర్తికై వ్రాసినాడు. మహాభారతము వైదికులకు పవిత్ర గ్రంథము ; పంచమ వేదము. జైనులకు భారతమును గురించి అంత పూజ్యభావము లేదు. వినయగుణ పూర్ణుడైన పంపనికి వ్యాస మునీంద్రునిపై అపార భక్తి కలదు. అతడు జైన భారతమునను సరింపక వైదిక భారతమునే అనుసరించినను కథలో కొన్ని మార్పులను చేసికొనెను. ఆశ్రయదాత, ప్రాణమిత్రుడు అయిన అరికేసరిని అర్జునునితో పోల్చదలచినందున పంపనికి మార్పులు అనివార్యములయ్యెను. పాంచాలి పాండవులందరి పత్ని కాదు. అర్జునునికే ధర్మపత్ని. జైన భారతములో ఇట్లే కలదు. ఈ ఒక్క అంశము తప్ప మరొక్కచోట జైన కథా ప్రభావము లేదు. కాని ఆదేపనిగ వెదకినచో ఎక్కడనో జైనమత వాసన గొట్టు మాటలో మార్పో కానరావచ్చును. మహాభారతకథా సూత్రధారియైన శ్రీకృష్ణుని మహిమను పంపకవి ప్రస్తావింపక పోవుటకు అతని జైనదృష్టి కారణమైయుండును. ద్రౌపదిని అర్జునునికే పత్నినిచేసినను చివరివరకు దానిని పంపడు నిర్వహింప లేకపోయెను. ద్రౌపది పరాభవమునకు ప్రతీకారము చేయుటకై భీముడు

ప్రతిజ్ఞలు చేయును. దుశ్శాసనునిచీల్చి ఆ రక్తముతో ద్రౌపది కేశపాశమును ముడివేసినవాడు భీముడు. ఆ సమయమున నతడు ద్రౌపదిని మరదలిగగాక తన తలోదరిగనే సంబోధించును. విరాటనగరితో కీచకుని బాధలను సహింప లేక ద్రౌపది మొరపెట్టుకొన్నది భీమునితో. వానిని భీముడే చంపును. విక్రమార్జున విజయములో సుభద్రార్జునుల కల్యాణమును పంపడు ప్రత్యేక శ్రద్ధతో రచించెను. యుద్ధానంతరము పట్టము కట్టుకొన్నవాడు అర్జునుడే. అతనితో సింహాసనమెక్కినది ద్రౌపదికాదు, సుభద్ర. ఈ మార్పునకు అప్పటి చారిత్రకవిషయములు కారణము కావచ్చును. అరికేసరి రాష్ట్రకూటుల ముఖ్య సామంతుడు – బంధుడు. మూడవ ఇంద్ర చక్రవర్తి కుమార్తె లోకాంబికను (రేవకనిర్మడిని) అతడు పెండ్లాడెను. ఆమె అన్నయగు నాల్గవగోవిందునితో అరికేసరి పోరాడి అతని భయముచే తన్ను శరణుజొచ్చిన 'బిజ్జ'ని రక్షించి గోవిందుని సింహాసనభ్రష్టుని చేసెను. రాష్ట్రకూటులు యాదవులు. సుభద్రా లోకాంబిక లిద్దరును యాదవకన్యలు. అర్జునుడు బలరామునితో వైమనస్యము నొందినట్లే అరికేసరి గోవిందునితో వైరము పూనియుండును – ఈ సత్యము నెరిగిన పంపడు పై మార్పు చేసెనేమో! సుప్రసిద్ధమైన కథనుమార్చి పంపడిట్టి దోషములకు గురి అయ్యెను.

పంపడు వ్రాయదలచినది సమస్తభారతమును. సమాసమనగా కూర్చుట. ఈ భారతకథలో తన ఆశ్రయదాత చరిత్రను జోడించి వ్రాసినాడని పండితులు తేల్చినారు. వ్యాసభారతమును కిరాతార్జునీయ వేణీసంహారాది కావ్య నాటకాదులను గూడ ఇతడు చూచినాడు. వ్యాసభారతములోని ఉపాఖ్యానములను వదలి ముఖ్యకథా గమనము కుంటు పడకుండ ఇతడు రచించెను. తన ప్రభునిపైగల విశేషభక్తిని పురస్కరించుకొని అరికేసరిని అర్జునునితో పోల్చుటతో తృప్తిపడక ఆ మహారాజు బిరుదములన్నిటిని నిరర్థకముగ అర్జునునకు వాడెను. మహాభారతేతిహాసమొక సామాన్యసామంతుని చరిత్ర గర్భితమైన కావ్యమైనది. ఈ విధముగ కూడ ఈ ధ్వనికావ్యము అనౌచిత్య దోషముల పాలైనది. ఆంధ్ర భారతకర్త నన్నయభట్టారకుడు పంపని మార్పుల నంగీకరింపక పోయినను అతని ప్రౌఢశైలికి ప్రభావితుడయ్యెనని చెప్పవచ్చును.

పంపని పాత్రచిత్రణ మపూర్వము. ఏ సందర్భమున నెవరెట్లు పలుకుదురో అది తూచిప్రాయుట అతనికి వెన్నతో అబ్బినవిద్య. పంపభారతమున అర్జునుడు ముఖ్యనాయకుడు. అతనిపై అభిమాన మున్నట్లే అతని శత్రువగు కర్ణుని మీదగూడా పంపనికి విశేషాభిమానము. విక్రమార్జున విజయములో కర్ణున కతడొసగిన స్థానము ఉత్కృష్టమైనది. ఆ పాత్రనతడు చిత్రించిన పద్ధతి ఉదాత్త మైనది. కర్ణుని చరిత్ర కర్ణరసాయనమని కీర్తించినాడు. భీముడు ధర్మవీరుడు, న్యాయమూర్తి, శిక్షా దైవము, పాపియైన దుర్యోధనుని మీదగూడ పంపనికి గల సానుభూతి అపారము. ఈ మహా కావ్యమున పంపడు ప్రదర్శించిన ప్రతిభ అసామాన్యము.

ఈ విస్తారమైన చంపూకావ్యమునందు ప్రధాన కథకు ఉపాఖ్యానములతో గల సంబంధమును పోషించు సుందరవర్ణన లున్నవి. వాగ్వైచిత్రియున్నది. వీని నన్నింటిని మించిన విశేష లోకానుభవమున్నది. ఆ అనుభవమును రమణీయముగ వ్యక్త మొనర్చు ప్రజ్ఞ యున్నది. పంపనికి కథా కథన నైపుణ్యముకలదు. అతని పలుకులలో ఇంపు, సొంపు, గాంభీర్యము లున్నవి. అలతి అలతి మాటలలో మహార్థమును ఇముడ్చు శక్తి ఉన్నది. అందువలననే గుణార్ణవుడును, గుణలుబ్ధుడును అగు అరికేసరి పంప కవిని 'కవితా గుణార్ణవ' బిరుదము నొసగి 'ధర్మపురి' అగ్రహారముతో సన్మానించినాడు. పంపడే స్వయముగ తన్ను గూర్చి 'హితమిత మృదువచన' 'ప్రసన్నగంభీర వచనరచన చతుర'అని వ్రాసికొన్నాడు. తన కావ్యగుణములను కోమలం, సూక్తిగర్భం, మృదుసందర్భం, విచారక్షమం, ఉచిత పదం, శ్రవ్యం అని నిరూపించుకొన్నాడు. ఇవి సార్థకమైన వనుటలో సందేహము లేదు - ఇతని శైలికి మచ్చు.

మ. "కదన ప్రారంభ శౌండం రిపునృప బల దావానలం వైరిభూభృ
న్మదవన్మాతంగ కుంభస్థళ దళన ఖరోగ్రాసి పంచాస్య ధైర్యం
విదిత ప్రత్యక్ష నాకాకరి నికటతట క్రాంతదానం భరంగె
య్దిదిరోళ్ విక్రాంత తుంగం హరిగనిరె బిగుర్తాంప సంతాప గండం?"

చ. "నెనెయ దిరణ్ణ భారతదొళిం పెరరారుమ నొందె: చిత్తదిం
లెనెవొడె కర్ణనంనెనెయ కర్ణనొళార్దొరె కర్ణ:నేరు క
. ర్ణన కడునన్ని కర్ణనళవంకద కర్ణన చాగవెందు క
ర్ణన పడెమాతి నోళ్పదిదు కర్ణరసాయన మత్తె భారతం!"

చ. "చళద నిళాహతక్షుభిత భంగుర తుంగ తరంగ మాళికా
వళన సముచ్చళన్మణి గణాత్తమరీచి లతాప్రతాన సం
వళయిత విద్రుమద్రుమ విళాస విశేషిత బాడవానళా
విళజళమం మనం బయసినోడి దనర్ణవమం గుణార్ణవం

విక్రమార్జున విజయ".

"చిదాకార లింగాంఘ్రి యొళ్ చేతనాగ్రం
సదానందదిం బెచ్చిరల్ భక్తియిందం
మదానీకమం మెట్టి మాంగల్య రూపం
ముదంబెత్తు మేణుద్భటం కణ్గొళిప్పం"

'ఉద్భటకావ్య'

## పొన్నకవి

పంపని తరువాత పొన్నడు రత్నత్రియములో రెండవవాడు. ఇతడు కూడ వేంగీ మండలము వాడు కావచ్చును. కన్నడ సంస్కృతములలో ఉద్దండ పండితుడు. రాష్ట్రకూట చక్రవర్తి "కృష్ణుడు" పొన్నకవిని "కవిచక్రవర్తి" బిరుదమునిచ్చి గౌరవించెను. ఆ విషయమును ఇతడు తన "శాంతిపురాణా" వతారికలో పేర్కొనెను.

క. "భువనద కన్నడ సక్కద
కవిగళ్సలె సాలె సోలె సవణంగిత్తం
సవివేక "ముభయకవి చ
క్రివర్తి" పెసరం నిజాహితోష్ణం కృష్ణం"

క. "కవితా విలాసమం చ
కవ్రర్తి తానిర్దు మచ్చి పెసర్గొండెరడుం
కవితెయొళ "ముభయ కవి చ
కవ్రర్తి" యెనె నెగళ్దనీ కురుళ్గళ సవణం".

ఇతడు "శాంతిపురాణ"మును, "భువనైక రామాభ్యుదయ", "జినాక్షర మాలె" అను గ్రంథములను వ్రాసెను. రెండవది లభింపలేదు. జినాక్షరమాలె 29 కంద పద్యముల జినస్తుతి. శాంతి పురాణము 16 వ తీర్థంకరుడగు శాంతి నాథుని జీవితమును వర్ణించు జైన పురాణము; 12 ఆశ్వాసముల చంపూకావ్యము. ఈ పురాణమును వేంగీ విషయములోని కమ్మనాటికి చెందిన 'పుంగనూరి' యం దున్న 'నాగమయ్య' అను జైన బ్రాహ్మణుని పుత్రుడు 'మల్లపార్య, పున్న మార్య' ల ప్రేరణచే వ్రాసెను. ఇతడు పంపని సమకాలికుడు, అతడు సామం తుడగు అరికేసరిని ఆశ్రయింపగా, నితడు చక్రవర్తియగు 'కృష్ణ'నే ఆశ్రయించి "ఆది పురాణ"మును మించిన ఉదాత్త కావ్యము వ్రాయవలెనను స్పర్ధతో 'శాంతి పురాణ' మును వ్రాసి యుండెనని ఊహింప వచ్చును. ఇతడు తన కావ్యమున పంపని పేరెత్తలేదు. శాంతి పురాణ కథా వస్తువు సామాన్యమైనది.

ఇతనికి ఆత్మోత్కర్షపై ప్రీతిమెండు. తన కవితాశక్తిని పొగడికొనుటలో ఎట్టి సంకోచమును లేదు. కాళిదాసుని రఘువంశ కావ్యమును అనేక స్థలము లలో అనుకరించెను. కాళిదాసుని కంటె నూరురెట్లెక్కువ వాడనని చెప్పికొను టలో వెనుకాడలేదు. అది క్షమింపరాని ధార్ష్ట్య వచనము ! తన శాంతి పురాణ మునకు "పురాణ చూడామణి" బిరుదును తానె ఇచ్చుకున్నాడు. ఆత్మ ప్రశంస ఎంత చేసుకొన్నను పంపనివలె ఉదాత్త సృష్టిని చేయలేక పోయెను. ఇతడు పంపనివలె శాంతి పురాణమును ధార్మిక కావ్యముగ రచించినట్లే రామాయణ గాథను గ్రహించి, తన ఆశ్రయదాత చరిత్రనందు గర్భితము చేసి లౌకిక కావ్య ముగ "భువనైక రామాభ్యుదయ" కావ్యమును వ్రాసి యుండెనేమొ !

## రన్నకవి

కన్నడ రత్నత్రియములో పై యిరువురు గాక మూడవవాడు రన్నకవి. ఇతడు సుమారు క్రీ.శ. 993 ప్రాంతమున "ముధోళ్" నందు జైనులైన గాజుల

సెట్టి కులములో పుట్టి. విద్యాబుద్ధుల నార్జించి మహాకావ్య నిర్మాణము చేసిన విద్వత్కవి. ఆతనికి ''గంగమండల" మందలి ''అజిత సేనాచార్యుడు" గురువు; చావుండరాయడు పోషకుడు. విద్యాగురువైన అజిత సేనాచార్యునితో "శ్రవణ-బెళగొళ"లో వసించి "గొమ్మట'' విగ్రహమును ఆరాధించెను. దానచింతామణి యైన "అత్తిమబ్బె'' ప్రేరణచే ''అజిత పురాణ'' మును వ్రాసెను. ఇతడు మొదలు సామంత మండలేశ్వరుడై యుండెను. చివరి దినములలో చాళుక్య చక్రవర్తి ''తైలప'' నాస్థానముచేరి యువరాజగు "సత్యాశ్రయు''ని నాయకునిగ వరించి "సాహస భీమవిజయ''మును వ్రాసెను. ''కవిచక్రవర్తి" బిరుదమును, రాజ మర్యాదలను పొందెను. ఈ సాహసభీమ సేన విజయమునే "గదా యుద్ధ'' మందురు. ఇంతవరకు పై రెండు గ్రంథములు మాత్రమే లభించినవి. ఇతని ''పరశురామ చరిత'', ''చక్రేశ్వర చరితము'' లింకను దొరకలేదు.

పంపనికి నమ్రత ఎక్కువగనుండిన రన్ననికి ఆత్మప్రత్యయ మెక్కువ. ఆతడు తనను విశేషముగ పొగడుకొనినాడు. ఈ పొగడిక పోల్లుకాదు. రన్నడు నిజముగ కవిరత్నమే.

క. "కవిముఖ చంద్రం కవి చ
క్రవర్తి కవిరాజ శేఖరం కవిరాజం
కవిజన చూడా రత్నం
కవితిలకం కవిచతుర్ముఖం కవిరత్నం"

క. "కొండాటద సామంతర
మండళికర సకల చక్రవర్తిగళ సభా
మండల దొళభయ కవిముఖ
మండన మాగిర్పరత్నమీ కవిరత్నం".

పంపనివలె ఒక ధార్మిక కావ్యమును, ఒక లౌకిక కావ్యమును రచించెను. "అజిత పురాణము" రెండవ తీర్థంకరుడగు అజితనాథుని చరిత్రము, జైనపురాణ కథలన్నియు ఇంచుమించుగ ఒకేరీతిగ నుండును. కవియోగ్యత

ననుసరించి యందలి వర్ణనలలో కొద్దిభేదము కనబడును. ఈ పురాణములలో కవికి స్వేచ్ఛతక్కువ. తన ప్రతిభను ప్రదర్శించుటకు తగిన అవకాశ మెక్కడనో కాని ఎక్కువగ లభింపదు. రన్ననిమీద పంప, పొన్నకవుల ప్రభావము పూర్తిగ పడియున్నను అతడు తన ప్రత్యేకమైన ప్రతిభను ప్రదర్శించినాడు. మొత్తముమీద "అజితపురాణ"ములో రన్నడు కవిగాకంటె శాస్త్రజ్ఞుడుగ గోచరించును.

## "గదాయుద్ధ"ము

రన్నని సంపూర్ణ శక్తి సామర్థ్యములు గదాయుద్ధ కావ్యములో గోచరించును. పంప భారతములోని 18వ ఆశ్వాసమును చదివి, ఆ ఘట్టమునే రన్నడొక స్వతంత్ర కావ్యముగ రచించెను. ఈ "సాహస భీమ సేన విజయ"ములో భీముడు కథానాయకుడు. సుప్రసిద్ధ భారత గాథలోని ఒక ఘట్టమును మాత్రమే గ్రహించిన రన్ననికి తన ప్రతిభను, సరస్వతీ ప్రసన్నశక్తిని ప్రదర్శించుటను, కన్నడ సాహిత్యములో నొక మహోత్కృష్ట కావ్యమును నిర్మించుటకు అవకాశము లభించినది. పంపడు అరికేసరిని తన "విక్రమార్జుని విజయ" నాయకుని చేసి అర్జునునితో పోల్చినట్లే రన్నడు చాళుక్య సత్యాశ్రయుని "గదాయుద్ధ" నాయకుని జేసి భీమసేనునితో పోల్చి కీర్తించినాడు. పంపడు అర్జునునకు పట్టముగట్టి, ద్రౌపదికి మారు సుభద్రను సింహాసన మెక్కించుటలో పడిన బాధను గమనించి రన్నడు సత్యాశ్రయునే భీముడుగ వర్ణించి తన పత్నియైన ద్రౌపదితో పట్టాభిషేకమునందున్నట్లు వర్ణించి కృతార్థుడైనాడు. పంపనివలెనే ఇతడును రాజభక్తిలో మునిగి భీమునకు సరిపోని సత్యాశ్రయుని బిరుదములనంటగట్టి సారస్యభంగము చేసెనని చెప్పక తప్పదు.

గదాయుద్ధములో వస్తువిన్యాసము, సంభాషణలో నాటకీయత, ఉదాత్తరస నిర్వహణము, ప్రౌఢశైలి, మితవర్ణన, చక్కని పాళ్లలో ఒదిగిన సంస్కృత కన్నడ పదమిశ్రణము ప్రశస్తములై హృదయంగమములై ఉన్నవని నిస్సందేహముగా జెప్పవచ్చును. ఇందలి పాత్రలలో భీముడు, దుర్యోధనుడు, ద్రౌపది ముఖ్యులు. ద్రౌపదీ భీములు నాయికానాయకులు; దుర్యోధనుడు ప్రతినాయకుడు; రసము రౌద్రము. రన్నని దుర్యోధనుడు దాత్తపురుషుడు. పంపనికి కర్ణునిపై

ఉన్నట్లే రన్ననికి దుర్యోధనునిపై సానుభూతి కలదు. భీముడు సత్యరక్షకుడు, అన్యాయశిక్షకుడునై దుర్యోధనుని శిక్షించునపుడు కరుణా దృష్టిని కనుపరచు మహనీయుడుగ చిత్రింపబడినాడు. గదాయుద్ధము చిన్నదైనను మహాకావ్య మనదగినది. అతనికి ఆత్మాభిమానమున్నను పంపనిమీద విశేషభక్తి కలదు. మచ్చునకు రెండు పద్యములు:

క. "కవిజన దోళ్ రత్నత్రయ
పవిత్రరెనె నెగళ్ద పంపనుం, పొన్నిగనుం
కవిరత్నను మీమూవర్
కవిగళ్, జినసమయ దీపకర్ పెంరొళరే?"

ఉ. "శ్రీయువతీ ప్రియం బలయుతం బలిదర్పహరం జితారి దై
తేయ ననంత భోగనిలయం ప్రతిపాలిత ధర్మచక్ర న
బ్జాయతనేత్ర నాది పురుషం పురుషోత్తమ నీ చళుక్య నా
రాయణదేవ నీగెమగె మంగళకారణ నుత్సవంగళం".

## చావుండరాయ

రత్నత్రియము తరువాత చావుండరాయుడు సుప్రసిద్ధుడు. ఇతడు 10వ, శతాబ్దమున నుండిన వీరలోక చూడామణి; కలమును, ఖడ్గమును పట్టగల సవ్యసాచి. పశ్చిమ గాంగరాజైన "రాచమల్లు"నకు మంత్రియై, సేనాపతియై అనేక యుద్ధములలో విజయమును సాధించిన మహాయోధుడు. శ్రవణబెళగోళలోని 'గోమతేశ్వరుని' ప్రతిష్ఠించి అచట 'బసది'ని కట్టించిన జినభక్తుడు. శ్రావణబెళగోళ శాసనములలో చావుండరాయడు జైనభక్తుడని, దాతయని, వీరుడని, కవిజన పోషకుడని కీర్తింపబడినాడు. మహాకవులైన రన్న, నాగవర్మలకు ఆశ్రయదాతయై తన విద్యాప్రియత్వము చాటినాడు. బ్రహ్మక్షత్రియ కులములో పుట్టి, అజిత సేనాచార్యుల శిష్యుడై, మారసింహ, రాచమల్ల, రక్కసగంగుల సేనాపతి, మంత్రి బాధ్యతలను వహించి, కవులను ప్రోత్సహించి తానే కవియై "చావుండ రాయ పురాణ"మును ప్రౌఢ గద్యములో వ్రాసి పేరుగనినాడు. దీనినే "త్రిషష్టి

శలాకా లక్షణ మహాపురాణ''మని వ్యవహరించెదరు. ఇందులో అక్కడక్కడ కొన్ని పద్యములున్నను గ్రంథమంతయు సరళ వచనములో వ్రాయబడినది. కవి ఈ గ్రంథమును 978 క్రీ.శ. సం॥ములో వ్రాసితినని చెప్పికొనినాడు.

ఈ గ్రంథములో 63 శలాకా పురుషుల చరిత్రలు గలవు. సంస్కృతమున జినసేన, గుణభద్రులు వ్రాసిన ''మహాపురాణము'' ననుసరించి ఇతడీ గ్రంథమును వ్రాసెను ఇందు చంపువులలోని గద్యల, అలంకారముల ఆడంబరములు లేవు. ఈ గ్రంథమున జైనమత విశ్వాసములు, తత్వములు, చరిత్రలు నిండియున్నవి. 63 శలాకాపురుషులనగా: 24 తీర్థంకరులు, 12 గురు చక్రవర్తులు, 9 బలదేవులు, 9 వాసుదేవులు, 9 ప్రతివాసుదేవులు. ఇందలి గద్యము లాలిత్య గంభీర గతులతో సాగి చావుండరాయని రచనాశక్తిని చాటుచున్నది.

చ. "కవి పరమేశ్వరర్ బరెదుదం జినసేన మహామునీశరి
యవవిగె పేళ్దమాణి గుణభద్రముని శ్వరరెద్దొ పేళ్దప
ల్లవిసిదుదం త్రిషష్టిపురుష ప్రతిబద్ధ పురాణమం మహో
త్సవదొళె భవ్యకోటి గళెయల్ బరెదం గుణరత్న భూషణం".

క. "శ్రీమదమరేంద్ర రుద్ర శి
ఖామణిగణ కిరణజాళ జటిలిత చరణర్
చామీకరాంగ రజిత
స్వామిగళెమగీగె మోక్షలక్ష్మి పదమం".

దీనినిట్లు తెలుగు జేయవచ్చును.

కం. శ్రీమదమరేంద్ర రుద్ర శి
ఖామణి గణకిరణ జాల జటిలిత చరణుల్
చామీకరాంగు లజిత
స్వాములు మాకిత్రు మోక్షలక్ష్మి పదముఁ'.

కన్నడమున 'యతి' పాటింపబడదు. ప్రత్యయములు మాత్రమే తెలుగు చేయబడినవి.

## 1. నాగవర్మ

చావుండరాయని ఆశ్రితులలో రన్ననివలె సుప్రసిద్ధుడు నాగవర్మ. ఇతడు 10 వ శతాబ్దము చివరిభాగమున ఉండెను. పంపనివలె వేంగిపటు అగ్రహారమున వైదిక బ్రాహ్మణ వంశములో పుట్టెను - తండ్రి వెన్నమయ్య. ఇతడు మహాకవి యైనట్లే మహా యోధుడునై యుండెను. ప్రతిభలో పాండిత్యములో పంపాదులకు తీసిపోని మహాకవి. ఈ యుగమున సాధారణముగ జైనులు తప్ప వైదిక సంప్రదాయమునకుచెందిన బ్రాహ్మణకవులు ధార్మిక గ్రంథములను కన్నడమున వ్రాయుట కిష్టపడరు. అందువలన సంస్కృతమునుండి శాస్త్ర గ్రంథములను అనువదించుట గాని, లౌకిక విషయములతో గ్రంథములను రచించుటగాని వీరు చేసిరి. ఆదృష్టి తోడనే నాగవర్మ లౌకిక విషయమున బాణుని 'కాదంబరి'ని అనుకరించియుండెను. 'కర్ణాటక కాదంబరి' తో పాటు 'ఛందోంబుధి' అను కన్నడ ఛందశ్శాస్త్రమును గూడ రచించెను. ఇంతవరకు దొరికిన కన్నడ ఛందశ్శాస్త్రములలో ఇదే మొదటిది. 9 వ, శతాబ్దములో రచింపబడినట్లు ఊహింపబడుచున్న "గుణగాంకియం"లభింప లేదు. ఇతనికి కవిరాజహంస, బుధాబ్జవన కలహంస బిరుదములు కలవు. నాగవర్మ పాండిత్యమునకు మెచ్చి భోజరాజు జాత్యశ్వముల నిచ్చి గౌరవించెనట. ఈయన మతమును గురించి అనేక మత భేదములున్నవి. ఇతని గ్రంథములలో శివపార్వతీ స్తుతులు విశేషముగా కానవచ్చుచున్నందున ఇతడు వైదికుడని చెప్పుట తప్పుకాదు.

'ఛందోంబుధి' యందు సంస్కృతచ్ఛందో విభాగముతోపాటు "కర్ణాటక విషయ జాతి" అను ప్రత్యేక విభాగమును చేర్చినాడు. శాస్త్ర దృష్టితో ఈ వర్గీకరణము కన్నడ ఛందోభేదములను, స్వరూపములను వివరించుచున్నది. కర్ణాటక "కాదంబరి" బాణుని సుప్రసిద్ధ గద్య కావ్యమునకు చంపూరూపమున చేయబడిన కన్నడ అనువాదము. ఇది యథామాతృకానువాదము కాదు. సంస్కృత కాదంబరి ఉదాత్త శృంగార కావ్యము. మూలమును చదివి గ్రహించుటయే కష్టము. అట్టి ప్రౌఢ గ్రంథమును కన్నడమున పరివర్తించుటకు సాహసించి నాగవర్మ చాల వరకు సాఫల్యము నందెను. మూలకథకు, రమణీయ వర్ణనలకు లోపము కలుగకుండునట్లు నాగవర్మ కాదంబరిని స్వతంత్రముగ రచించినట్లే రచించెను. కాదం

బరిని గూర్చి ఇతడే స్వయముగ ఇట్లు చెప్పికొనెను :

క. "కృతిపతి నరేంద్ర చంద్రం
కృతియం పేళ్దం బుధాబ్జవన కళహంసం
కృతి కాదంబరి యనె స
త్కృతి కథిత కథావతారమేం కేవళమే ?"

మ. "ఇదుచోద్యం కవిహృద్గతం నవరసం నిర్దోషమెందిగళా
దుదు కాదంబరి సేవ్యమాదు దనితుం తానెద్దె భూభాగదోళ్
ఉదిత శ్రీకవి నాగవర్మన వచస్సందోహదిం దోషమం
దదలంకారద వస్తుబంధమిదు తానెం మాడదేంగెయ్యదో !"

ఇతడు తన్నుగూర్చి 'జితబాణం'అని చెప్పికొని బాణకాదంబరిలోని దీర్ఘ వర్ణనలను వదలి, కుంచించి, భావరసములకు పుష్టి గలిగించెను. వాక్యములను పద్యములలో పొదిగి, పాత్రల వైలక్షణ్యమును పోషించి, కథను కన్నులకు గట్టునట్లు చిత్రించి ఉదాత్త కళాసృష్టి నొనరించినాడు. శాంతవీరములను చూరగొన్న కర్ణాటకులకు ఉదాత్త శృంగార రసానుభూతిని కలిగించినాడు. భార్య మృతభర్తననుసరించు సహగమన పద్ధతినిగూర్చి బాణుడు వ్రాసిన వాక్యములకు నాగవర్మ వ్రాసిన పద్యములు చదువ దగినవి.

ఉ. "సత్తళె కామదేవన పరోక్ష దొళారతి ? పాండు సత్తొడం
సత్తళె కుంతి ? మత్తమభిమన్యు కుమారకనందు సత్తొడే
నుత్తర సత్తళే ? నెగళ్ద సింధు నృపాలక నందు సత్తొడం
సత్తళె దుశ్శళావనితె యేంబివు నీవరిదంద మల్లవే ?"

## దుర్గసింహుడు

11 వ, శతాబ్దారంభమున చాళుక్య జయసింహుని కాలములో అతని దండనాయకుడై, సంధి విగ్రహియై పేరు పొందిన యోధకవి దుర్గసింహుడు. ఇతడు

స్మార్త భాగవత సంప్రదాయమునకు చెందిన పండితవంశములో పుట్టెను. ఇతని గ్రామము సయ్యడి. అక్కడ హరిహరాలయమును కట్టించెను. ఈ కవి "వసు నాగభట్టు" సంస్కృతమున వ్రాసిన పంచతంత్రమును చంపూకావ్యముగా అనువదించెను. "గుణాఢ్య" పండితుని "బృహత్కథ" నుండి అయిదు కథలను గ్రహించి వసునాగభట్టు పై పేరుతో సంస్కృతమున వ్రాసెను. విష్ణుశర్మ వ్రాసిన "పంచతంత్రము" సుప్రసిద్ధమైనది. లోకము దానినే యెఱుగును. దుర్గసింహుడు చెప్పువరకు వసునాగభట్టు "పంచతంత్ర" మును వ్రాసినట్లు తెలియ లేదు. ఈ కన్నడ పంచతంత్రములో జైనమత తత్వములు వివరింపబడి యున్నవి. కవి వైదికుడు. అతనిని పోషించిన మహారాజుకూడ వైదికుడే కాని జైన సంప్రదాయములను తెలుపు గ్రంథ మేల వ్రాయవలసి వచ్చెనో తెలియదు. ఈ గ్రంథమున వైదికాచారముల సమర్థనము కూడ చాల ఉన్నది. మూలకారుడగు "వసునాగభట్టు" ఉదార చరితుడై అట్లు వ్రాసి యుండును. దుర్గసింహుడు కూడా విశాల బుద్ధితో దాని ననుసరించెనేమో ? ఈ పంచతంత్రము ప్రౌఢ కావ్యము. ఇతని 'దేశి, మార్గ' సమ్మిశ్రణము విశిష్టమైనది.

11 వ, శతాబ్దమున మహాసామంతుడగు చంద్రరాజు "మదనతిలక"అను కామశాస్త్రమును సంకలనము చేసెను. అట్లే "శ్రీధరాచార్య"దును "జాతకతిలక" అను జ్యోతిషగ్రంథమును కన్నడ వృత్తములలో రచించెను. కన్నడశాస్త్రకారులు అనేక సంస్కృత గ్రంథముల నుండి విషయములను సేకరించి హృదయంగమత్వము లోపించకుండ వ్రాసి స్తుతి పాత్రులైనారు.

చాళుక్య భువనైకమల్లుని కాలములో ఉన్న "నాగవర్మాచార్యుడు" చంద్రచూడామణి శతకమును వ్రాసెను. కన్నడములో నిదే మొదటి శతకము. ఇంత వరకు జైనులు మాత్రమే కన్నడమున ధార్మిక రచనలు చేయుచుండిరి. బ్రాహ్మణ కవులు కేవల లౌకిక గ్రంథములనే వ్రాయుట పరిపాటి. అద్వైతియైన నాగవర్మాచార్యుడు మొట్టమొదట ఈ తాత్విక శతకమును రచించి తరువాతివారికి మార్గదర్శకుడయ్యెను.

10 వ, శతాబ్దము కన్నడ సాహిత్య చరిత్రలో స్వర్ణయుగము. 11 వ, శతాబ్దము ప్రారంభింపగనే కావ్యములలో నుదాత్తత లోపింపదొడగెను జైనులు చోళుల దండయాత్రలచే ఆలజడి నొందుచుండిరి. బ్రాహ్మణ రచయితలు కన్నడ సాహిత్య నిర్మాణమున ఎక్కువ శ్రద్ధ వహించినట్లు కానరాదు. వారివన్నియు సంస్కృతానువాదములు.

## నాగచంద్ర

12 వ శతాబ్దారంభమున ఉద్దామ కవీశ్వరుడు "నాగచంద్రుడు" జన్మించెను. ఇతడు జైనాచార్యుడు. తననుగురించి ఇతదేమియు తెలుపుకొనలేదు. బిజాపురంలో ఒక బసదిని గట్టించితినని తన గ్రంథములో వ్రాసికొన్నందున ఇతడాప్రాంతము వాడు కావచ్చును. ఇతడు రన్ననివలె కన్నడ దేశమునంతయు చూచియుండును. అనేక రాజులను సందర్శించి సన్మానములందియుండును. ఇతడు త్తమ సాహిత్య కళోపాసకుడని తరువాతి కవులు కీర్తించినారు. ఈ కవికి పంపనిపై విశేషాభిమాన మున్నందున తన్ను "అభినవ పంప" దని వ్రాసికొన్నాడు. నాగచంద్రుని గ్రంథ ములు "మల్లినాథపురాణ", "రామచంద్రచరిత్రపురాణ"ములు. ఆద్యగ్రంథము "మల్లినాథపురాణము". 19 వ, తీర్థంకరుడైన మల్లినాథుని చరిత్ర 14 ఆశ్వాసము లలో వ్రాయబడినది. జైన కావ్యములలో సాధారణముగా ఉండునట్లే శాంతరస మిందు కలదు. కథ చిన్నదైనను మనోహర వర్ణనలచే విస్తరించినది. పంపని ఆది పురాణచ్ఛాయలు కొన్ని కానవచ్చును. కాని ఆ సుందర సన్నివేశములు, పాత్ర పోషణ యిందు కానరాదు.

కం. "ధరెపొగళి పీతరాగన
చరిత దొళళవడిసి సకళరసమం కవితా
పరిణతియం మెరిదం కా
వ్యరసార్ణవ పూర్ణచంద్ర నభినవ పంపం".

అని తన్ను గూర్చి వ్రాసికొనినాడు.

ఇతని రామచంద్ర చరిత పురాణము కన్నడమున వ్రాయబడిన మొదటి జైన రామాయణము. ఇందు నాగచంద్రుని పరిపక్వమైన కవితాశక్తి సంపూర్ణముగ

గోచరించును. ఇదొక మహాకావ్యము. వాల్మీకి రామాయణమునకు, దీనికి పోలిక లేదు. నాగచంద్రుడు "విమలసూరి" ప్రాకృతములో వ్రాసిన "సౌమ్య చర్య" (పద్మచరిత)నుండి, ''రవిషేణు"ని సంస్కృత రామాయణమునుండి కథా వస్తువును గ్రహించి తన కావ్యమునకు మెరుగులు పెట్టినాడు. జైన రామాయణములో వాల్మీకి రామాయణ గాథ ఇష్టము వచ్చినట్లు మార్చబడినది. ఆ మార్పులలో కొన్ని తెలుపబడుచున్నవి.

రాముడు విష్ణుని అవతారము కాదు; మనుష్యమాత్రుడు. రామలక్ష్మణులు బలవాసుదేవులు. రాముడు ధర్మనాయకుడు; అహింసావ్రతి – చరమ దేహధారి. లక్ష్మణుడు వీరనాయకుడు. రావణు నితడే సంహరించును. ప్రతినాయకుడైన రావణుడు రాక్షసుడు కాడు, దశముఖుడు కాడు – మహా ధర్మాత్ముడు, పర స్త్రీ పరాఙ్ముఖుడు. కాని, ఎందుకో సీతను చూడగనే మోహావేశుడై లంకకుదెచ్చును. అప్పుడప్పుడు సీతపట్ల జాలినిగూడ పొందుచుండును. ఇందులో యజ్ఞములులేవు, విశ్వామిత్రుడులేడు, శివధనుర్భంగములేదు, పరశురాముని ప్రసక్తిలేదు, మంథర లేదు. సీత భూసుత కాదు, జనకపత్ని గర్భమున జనించినది. భరతుడు రామలక్ష్మణుల వైభవమును జూచి దుఃఖింపగా కైక వరములు కోరి రాముని అడవులకు బంపును. వాలి సుగ్రీవులు కపులు కారు – కపిధ్వజులు. లంకకు సేతుబంధనము జరుగదు. ఆకాశగమన విద్యతో సైన్యము లెగురుచుండును. హనుమంతుడు రావణుని మేనల్లుడు. అతని అకార్యము నసహ్యించుకొని రాముని మిత్రుడగును. విభీషణుడు గూడ ఆంజనేయు ననుసరించును. హనుమంతుడు విమానము నెక్కి సముద్రము దాటును. రామలక్ష్మణులు వేల సంఖ్యలో వివాహములు చేసికొందురు. ఈ మార్పు లన్నియు జైనాచార్యులు తమ ధర్మ ప్రచార దృష్టితో జనుల నాకర్షించుటకై చేసికొన్నట్లు కానవచ్చుచున్నది. కథలో, పాత్ర చిత్రణలో యథేచ్ఛముగా దొరలిన ఆభాసలను నాగచంద్రుడు గమనింప లేదు. ఇతడు తక్కిన జైనులవలె లౌకిక కావ్యమును వ్రాయక రెంటిని ధార్మిక గ్రంథములుగ రచించెను. ఇతని కవిత్వమున ధారాశుద్ధి, జైన భక్త్యావేశము విశేషముగ కాన్పించును.

మ. "పరమ బ్రహ్మశరీరయష్టి, జనలోకాంతర్దృష్టి కైవల్య బో
ధరమా మౌక్తిక హారయష్టి, కవితావల్లీ సుధావృష్టి, స

ర్వ రసోత్పాద నవీన సృష్టి, బుధహర్షాకృష్టి, సర్వాంగ సుం
దరి విద్యానటి నాటకం నలిగె మత్కావ్యస్థలీ రంగదోళ్!"

క. "జగమం యుగమం మన్వా
దిగళం కాళస్వరూపమం జినరం చ
క్రిగళం హలధర కృష్ణా
దిగళం శ్రీరామ చరితెదోళ్ వర్ణిసువెం".

## నయసేనుడు

12 వ, శతాబ్దారంభమున "నయసేను"డు పండిత చూడామణియై రాజ మర్యాదల ననుభవించి పేరుగాంచిన వాడు. అతడు "ధర్మామృత" మను 14 ఆశ్వాసముల కావ్యమును వ్రాసెను. ఇందు జైనమతాచారములలో "చతుర్దశ - మహారత్నము"లని పేరు బొందిన వ్రతముల నాచరించి సద్గతిని బొందిన మహా పురుషుల కథలు వర్ణింప బడినవి. ఇంతవరకు జైనకవులు వ్రాసిన పురాణము లన్నియు ప్రౌఢకావ్యములై సామాన్య జనులకు కొఱకరాని కొయ్యలై యుండెను. వైదిక పురాణము లట్లుగాక సరళములుగా నుండి జనులలో విశేష ప్రచారము నంది యుండెను. జైనులీ రహస్యమును గుర్తించిరి. దాని ఫలితమే నయసేనుని 'ధర్మామృతము'. ఇతడు కథను జెప్పుచు నడుమనడుమ దృష్టాంతములతో నింపి వేయును. ఇది అతనిలోని గొప్పదనము. అక్కడక్కడ అనవసర ప్రసంగములు దీర్ఘములై సారస్యమును చెరచుచుండును. ఇతనికి శుద్ధకన్నడమున గ్రంథమును వ్రాయవలెనను కోరిక కలదు. పంపని కాలములో గ్రంథ రచన పండితరంజన మునకై చేయబడినది. పామరులకై రచన చేసిన కన్నడ కళారాధకులలో నయ సేనుడు పేర్కొన దగినవాడు.

ఈ యుగము చివరిభాగమున "బ్రహ్మ శివకవి" "సమయ పరీక్ష"అను ఒక అపూర్వ గ్రంథమును వ్రాసెను. ఇది చంపూకాదు, ఇందులో కథ లేదు. పాత్రములులేవు, అన్యమత దూషణము విశేషముగచేసి జైన మతమును పొగడి నాడు. కన్నడమున నిది మొదటి దూషణ కావ్యము. అదేకాలమున 'కర్ణపార్య'డు "నేమినాథ పురాణ"మును వ్రాసెను. ఈ యుగమున నుండిన "రెండవ నాగ

వర్మ" కన్నడ సాహిత్యాభ్యాసమునకు సహాయకములైన వ్యాకరణ, ఛందో అలంకార, కోశములకు సంబంధించిన "శబ్ద స్మృతి", "భాషాభూషణ", "కావ్యావలోకన", "వస్తుకోశ", "ఛందోవిచితి" మొదలైన ముఖ్య శాస్త్ర గ్రంథములను వ్రాసి మహోపకారమును చేసినాడు.

ఈకాలపు కవులందరును ధర్మప్రచారమునకే కలము పట్టిరి. జనోపయోగకరములైన శాస్త్రగ్రంథములను వ్రాసిరి. ఈకాలపు సాహిత్యము రాజాస్థానములలోనే నెలకొని యుండెను. ప్రభువులు, అమాత్యులు, దండనాథులు, ఆస్థాన విద్వాంసులు గ్రంథకర్తలై యుండిరి. సంస్కృతానువాదములు, సంస్కృతానుసరణములు విశేషముగ నుండెను. రచనా విషయమేగాక రచనా పద్ధతి కూడ సంస్కృతమే. ఈ విధముగా భాష, వస్తువు, ఛందస్సు మొదలైన అన్ని విషయములలో ఈ కాలపు కన్నడ సాహిత్యమంతయు సంస్కృతసార సంగ్రహ లక్షణము కలదై యుండెను.

8 వ, శతాబ్దమునకు ముందే సంస్కృతమున "అశ్వఘోష", భాస, "కాళిదాసా"ది మహాకవులు వ్రాసిన నాటకములు సకల భారతమున విశేష ప్రచారములో నుండెను. వాని నందరునూ చదివి యుండిరి. కాని యొకరును వానిని నాటక రూపమున అనువదింపక పోవుట విచిత్రము ! పంప, రన్నాదులు తలచి యున్నచో ఉత్తమ నాటకములు పుట్టి యుండెడివి. అట్లు జరుగక పోవుట దురూహ్యము. ఆంధ్ర సాహిత్యమున గూడ ఇట్లే జరిగి యుండుట గమనింపవలసిన విషయము.

## 4

# బసవ యుగము

(12 వ, శతాబ్ద ఉత్తరార్ధమునుండి 14 వ శతాబ్దాంతమువరకు)

12 వ, శతాబ్దమున కన్నడ సాహిత్యము స్వతంత్ర యుగములో ప్రవేశించెను. క్రీ. శ. 1160 ప్రాంతమున బసవేశ్వరుడు ప్రసిద్ధికి వచ్చి కన్నడ సాహిత్యమున కొక క్రొత్త రాచబాటను వేసెను. "బసవేశ్వరు"ని నుండి "కుమార

వ్యాసు''ని వరకు ఈ యుగము సాగినది. విభిన్నములైన దృక్పథములు-ధర్మములో, సమాజములో కలిగిన మార్పులు, సంఘర్షణలు, సామరస్యములు మొదలైనవి ఈ యుగ సాహిత్యమునకు వైలక్షణ్యమును, వర్చస్సును కూర్చినవి. పండితులతోపాటు ఎందరో అనుభావులు, ఆత్మదర్శనులు రచనలు చేసిరి. వీరందరికిని ''భక్తి భాండారి బసవేశ్వరుడు'' మార్గదర్శకుడయ్యెను.

ఈ కాలము నందలి రాజకీయ, ధార్మిక విప్లవాల వలన ప్రజా జీవనమే స్తంభించి పోయెను. దాని ప్రభావము అప్పటి వాఙ్మయము మీద ప్రసరించినది. మహావైభవము ననుభవించిన చాళుక్య సామ్రాజ్యము అంతమైనది. ముఖ్య సామ్రాజ్య భాగములు స్వతంత్రములై పరస్పరము పోరాడుచు అశాంతిని రేపుచుండినవి. పులిమీద పుట్రవలె 13 వ, శతాబ్దమున ముస్లిం దండయాత్రలు ప్రారంభమయ్యెను. దేవగిరి యాదవులు, హొయ్సల బల్లాళులు తురకల దురాగతాలచే అంతరించిరి. కన్నడ భూమిలో హాహాకారములు చెలరేగెను. ఈ మహా సంకట సమయములో మహానుభావుడగు ''శ్రీ విద్యారణ్య స్వామి'' తపోబలముచే విజయనగర సామ్రాజ్యము తలయెత్తెను. ఆ సామ్రాజ్యచ్ఛత్రము క్రింద దక్షిణా పథమంతయు సమస్త క్లేశములనుండి ముక్తి గాంచి నూత్న తేజముతో కలకలలాడెను. మరల కళలకు, వాఙ్మయములకు ఆలంబము లభించెను.

రాజకీయ పరిణామాల ప్రభావము ప్రజల మీద ప్రతిఫలించును. 12 వ శతాబ్దమున జైనము పూర్వౌన్నత్యమును కోలుపోయెను. వైదికమతములు శుష్కాచారములలో పడియుండెను. నూతనోత్తేజమును కలిగించి సమాజమును సరియైన మార్గమున నడిపించుటకై బసవాది శివశరణులు ఉదయించిరి. విజయనగర కాలములో వైదిక, జైన, వీరశైవములు సహజీవనమున కలవాటు పడినవి.

కన్నడ సాహిత్యముకూడ అనేక పరిణామములందెను. 'మార్గ' పద్ధతినుండి 'దేశి' పద్ధతికి పరివర్తన మొదలయ్యెను. విషయములో, భాషలో, ఛందస్సులో దేశి ప్రాధాన్యము ఎక్కువైనందున దీనిని ''స్వతంత్ర యుగ''మని కొందరనిరి. ఈ కాలములో ''వచనము'' అను సాహిత్య రూపము పుట్టెను. ''రగళె'', ''త్రిపది'', ''షట్పది''అను అచ్చ గన్నడ ఛందస్సులో గ్రంథములు వెలసెను. శివలీలలు, శరణుల చరిత్రలు, వైదిక పురాణ గాథలు కావ్య వస్తువు లయ్యెను.

భాషాదృష్టితో "హళ గన్నడ"మునకు "హొస గన్నడ"మునకు మధ్య "నడు గన్నడ"ము వాడుకలోనికి వచ్చెను. వీర, శాంత రసములతోపాటు శృంగార రసమునకు స్థానము లభించెను.

## వచన వాఙ్మయము

ఈ యుగ వైశిష్ట్యమగు "వచనము" బసవేశ్వరునకు కొన్నేండ్లు ముందే పుట్టి ప్రచారమునకు వచ్చియుండెను. ఈ వచనముల భాష సరళము. ఇందు క్లిష్టమైన సంస్కృత పదాడంబరము ఉండదు. అవి సామాన్య జనులకై వ్రాయ బడినవి. మిగుల స్వతంత్రములైనవి. వీనిని పాటలుగ గూడ పాడుకొన వచ్చును. వచనకారులలో శివశరణులు, శరణ భక్తులు ఉన్నారు. ఈ భక్తులలో పేరెన్నిక గన్న స్త్రీలు కూడ కలరు.

## ప్రభుదేవర

అల్లమ ప్రభుదేవర బసవేశ్వరునకు, శివశరణులకు తలమానికమైయుండెను. అతడు వీరశైవ సిద్ధాంత సారమును ప్రసారముచేసి శరణ మార్గమునకు గురు వయ్యెను. అప్పటికి దక్షిణాపథములో వైదికమైన "ఆరాధ్యశైవము", ఆగమోక్త మైన "పాశుపతము" ప్రచారము నందుండెను. శివశరణులు వాని సారమును గ్రహించి "వీరశైవ"మను పేరుతో ఒక స్వతంత్ర మార్గమును ప్రచారమునకు తెచ్చిరి. సాధారణముగా "శరణుల" ప్రధాన లక్ష్యము అన్యమత విధ్వంసము గాని, వీరశైవ ప్రచారము కాని కాదు. సర్వమానవ ప్రేమ, నైతిక వర్తనము, శివభక్తి, సమాన భావము కలిగియుండు క్రొత్త సామాజిక వ్యవస్థను ఏర్పరచుట అయియుండెను. అల్లమ ప్రభు డీ కార్యమును ఆదర్శవంతముగ కొనసాగించెను. అతడు జ్ఞాని. పరిణతప్రజ్ఞుడు, శివాద్వైతమూర్తి, యోగసిద్ధుడు. అతని వచనములు కన్నడ వాఙ్మయమునకే గాక విశ్వ సాహిత్యమునకే అపూర్వ శోభను ప్రసాదింప జాలినవి. ఆయన ఏ కట్టుబాట్లకును లొంగక, ఎక్కడ ఉత్తమ గుణమున్నను మెచ్చి అవగుణములను ధిక్కరించెను. అతని తీవ్ర విమర్శలకు ఇతర సంప్రదాయములతోబాటు వీరశైవముకూడ గురియైనది. ప్రభుదేవర వచనములలో చాల భాగము తత్త్వవేత్తలకు కూడ గ్రాహ్యము కానివి కలవు. అతని

మాటలు సామాన్యములైనవి కావు. అగాధమైన అనుభూతి నుండి, మహోన్నత జ్ఞాన శిఖరము నుండి వెలువడిన దివ్య సూక్తులవి.

"కామమును గాల్చి, హోమమును దెలిపి, త్రిపుర సంహారపు కీలెరుంగుదురె? యోగియైన నేమి, భోగియైన నేమి, శైవుడైన నేమి, సన్యాసియైన నేమి? ఆశన మందని వాడు, వ్యసన మొందని వాడు గుహేశ్వర లింగమందు వారె పెద్దలందును."

"నేను ఘనుడ, తాను ఘనుడ నన్న పెద్దలందురె? జగమున ఆ పెద్దల పెత్తనమున నేమయినది? పెద్ద, చిన్న అనెడు శబ్దమడగినచో అతడె శరణుడవు గుహేశ్వరా!"

"ఆచారము నెరుగక, పిథవ మణగక, కోపమెడలక, తాపము దీరక ఉత్తబత్తులైతిమంచు, బొబ్బలిడెడివారి చేతలకు నే కెరలెదనయ్యా గుహేశ్వరా!'

"భస్మము పూసి, బిత్తల ఉన్ననేమి? బ్రహ్మచారియా?
అశనము మెక్కి వ్యసనము దక్కిన బ్రహ్మచారియా?
భావము బిత్తలై మనసు గంభీరమైనచో అది సహజ నిర్వాణమయ్యా -
గుహేశ్వరా!"

ఈవిధములైన ఉదాత్తభావములతో గూడిన నిగూఢవచనములెన్నో ఉన్నవి.

## బసవన

అల్లమప్రభుడు మహాజ్ఞాని అయినట్లే బసవేశ్వరుడు మహాభక్తుడు. వినయ. భక్తి, వైరాగ్యములచే పూర్ణుడై తన్ను పరమ శివున కర్పించుకొని శరణలోక చూడామణి యయ్యెను; శివసాక్షాత్కార మందెను. జనులకు ధర్మము నెరిగించుటకై "షట్‌స్థల సిద్ధాంతము" నుపదేశించి లింగైక్యము నొంద గల్గుటకు మార్గమును చూపెను. "గురు, లింగ, జంగ మార్చనలు" భక్తుల ముఖ్య కర్తవ్యములని చాటెను. బసవేశ్వరుడు హృదయంగమమైన భాషలో విశ్వజనీనములు, సార్వకాలికములు అయిన నీతులను తన వచనములలో నింపి లోకమున కందించెను. అతని వచనములలో శివభక్తి పెల్లుబుకుచుండును అప్పుడప్పుడు సమాజములోని

అత్యాచారములు కారుణ్యమూర్తి యగు బసవని హృదయమును కలత పెట్టినవి, అట్టి పట్టుల ఆత డుగ్రరూపము ధరించును. అతని విమర్శలు కటువైనవి. దోషమున్నచో నిర్దాక్షిణ్యముగ ఖండించి, గుణమున్నచో నోరార కీర్తించుట ఆయనకు వెన్నతో వచ్చిన విద్య. ఎవరిమీదను అతనికి ద్వేషములేదు. అన్యాయముతో, అసూయతో కూడిన అప్పటి సాంఘిక వ్యవస్థ మీదనే అతడు ఖడ్గమెత్తెను. బసవన్న వచనములలో సర్వమానవ సమానత, జీవకారుణ్యము, నీతి నిష్ఠ నిండియుండును. ఆ వచనములన్నియు ఆణిముత్యములే !

"నాదుకాయము దండముగ చేయవయ్యా
నాదుశిరము కిన్నెర చేయవయ్యా,
నాదునరము తంతిగ జేయవయ్యా,
నాదు వ్రేలు కడ్డిగ చేయవయ్యా,
పెక్కు రాగములు పాడవయ్యా
ఎదన నొత్తి వాయించు కూడల సంగమదేవా !"

"చంపువాడె చండాలుడు, పొలసుదిండియే మాలడు
కుల మేదయ్యా, వారి కులమేమి ?
ఎల్ల జీవులకు సదా మేలు కోరునట్టి కూడల సంగముని
శరణులే సత్కులజులు !"

"మర్త్యలోక మనునది నాణెగాని టంకసాల
ఇందు చెల్లువారు అందును చెల్లెదరయ్యా
ఇందు చెల్లకున్న అందునూ చెల్లరయ్యా కూడల సంగమదేవా!"

"దేవలోక, మర్త్యలోకములను నవి వేరెందు లేవయ్యా
సత్యము నుడువుచో స్వర్గము; మిథ్యలు నుడువుటే
మర్త్యలోకము.
ఆచారమే స్వర్గము, అనాచారమే నరకము -
కూడల సంగమదేవా!"

''జాతి నాగము జూచి పాలు బోసెదరు !
నిజమైన నాగమును పొడిచి చంపెదరు
తినెడు జంగము రాగ అదలింతురు.
తినని లింగమునకు బోనాలు పట్టెదరు -
ఏమి చిత్రమయ్యా కూడల సంగమదేవా!''

సాహిత్యదృష్టితో ఈ వచనముల శబ్ద శక్తి అచ్చెరువు గొల్పును. లోకమునుండి గ్రహించిన అనేకానుభవములు, చక్కని పలుకుబడులు పాఠకులకు చవులూరింప జేయుచుండును. కొన్ని వచన గద్యములు ''వృత్త గంధులు''గా మారుటయు గలదు. బసవని వచనములన్నియు లలితములై, మనోహరములై వీరశైవమును, విశ్వధర్మమును చాటుచున్న వనుటలో అతిశయోక్తి లేదు.

## అక్కమహాదేవి

బసవని సమకాలికులలో "మడివాళమాచయ్య", "అంబిగరచౌడయ్య" "సిద్ధరామయ్య", ''సకలేశమాదరసు'' మొదలైన శివశరణులు సుప్రసిద్ధ వచనకారులు. కొందరు స్త్రీలుకూడ వచనములు వ్రాసినారు. ఈ కాలములో ఉన్నంత మంది కవయిత్రులు మరేకాలమునను లేరని చెప్పవచ్చును. అట్టివారిలో ''అక్కమహాదేవి'' ప్రముఖ శివశరణి. ఈమె కన్నడ సాహిత్యములో మొదటి కవయిత్రి. సాంప్రదాయకమైన సాంసారిక బంధములను త్రెంచివైచి అవివాహితయై మల్లికార్జునస్వామిని భర్తగా బడయుటకు ఆమె చేసిన ఉగ్ర సాధన, సాధించిన సిద్ధి అద్భుతమైనవి. ఆమెవచనములలో సమాజవిమర్శ కానరాదు. స్పష్ట వాక్యత, ఉదారదృష్టి అడుగడుగున గోచరించును. ఆమె కొన్ని వచనములను, ''త్రిపది'' ఛందస్సులో ''యోగాంగ త్రివిధి'' అను లఘు గ్రంథమును వ్రాసెను. ఇది ఆమె ఆధ్యాత్మిక జ్ఞానమును, దివ్యానుభూతులను విదితము చేయును.

''అళిసంకులమా! మాకందమా! పండువెన్నెలా! పరభృతమా! మిమ్ము, మిమ్ము నందరను బందు వేడెదను; నా బడెయడు చెన్నమల్లికార్జున దేవుని కాంచిన పిలచి చూపరే.''

"ఆకలికి భిక్షాన్నములున్నవి. తృష్ణయౌనెడ చెరువు, వాగు, బావులుండె. పడకకు పాడు దేవళంబులుండె, చెన్నమల్లికార్జునయ్య తోడునీడయైయుండె. ఏరు లేని దాననంచు అడలి కలత చెందనేల? ఏమి చేయ నెంచినను నేను బెదురుదాన గాను, లేజివ్వురుల మెక్కుచు నేనుంటిని. తీవచుట్టమీద నొరగి నేనుంటిని. నిప్పు నిప్పు రాచుకొన్న నాకు క్షుధాతృష్ణ లడగెనందును. మిన్ను విరిగిపడిన నాకు మజ్జనంబు జరిగెనందు. మీద కొండ కూలుచో పూలు బడినవంచు నెంతు. చెన్న మల్లికార్జునయ్యా! తల పగిలి కూలుచో అసువులు మీ కర్పింతును."

## చెన్న బసవేశ్వర

ఇతడు బసవని మేనల్లుడు. అల్లమప్రభునిచే "మహాజ్ఞాని" యని పొగడ బడిన శరణుడు. అతడు అల్లముని వలె అనాసక్తుడు కాడు; వీరశైవ వ్రతాచార మునకై నిలచిన దృఢవ్రతుడు. అతని వచనములు దీర్ఘములై, సిద్ధాంత వివర ణాదులతో నిండియున్నందున శైలిలో మార్దవము లోపించినది. స్వమతాభిమానము పరదూషణము ఎక్కువైనందున ఇతని వచనములు కావ్య గౌరవమును తగ్గింప జేసినవి. ప్రభుదేవర, బసవేశ్వర వచనములలో కానవచ్చు సాహిత్య ఘనత ఇతని వచనములలో మృగ్యము. ఈ యుగమున రాజులు, మంత్రులు, పండి తులు కొద్దిమంది మాత్రమే రచనలు చేసిరి. తక్కిన వారందరును ఆధ్యాత్మిక సాధకులైన సామాన్యులు. వివిధ వృత్తుల వారయ్యును, ఉచ్చనీచములు లేక శరణులై అనుభవ మంటపమున సమాన గౌరవము నందినవారు. ఇంత వరకు రెండు వందల వచనకారుల పేర్లు లభించినవి. వీరి దేశ, కాల, చరిత్రలను గూర్చి పరిశోధింప వలసియున్నది. ఏది యెట్లున్నను 12 వ, శతాబ్ద మధ్య భాగము కర్ణాటక తాత్విక జీవనమునందు శోభాయుతమైన పంటకాలమని చెప్ప వచ్చును. వచన కారులలో అక్షర-జ్ఞానము కలవారు, నిరక్షరాస్యులు ఉన్నారు. ఇవికొన్ని గీతజాతికి చేరినవని, కొన్నిటికి గణములున్నవని, కొన్ని సలక్షణము లైన పాటల వంటివని పండితులు తెలిపినారు. కన్నడమున కివి అపూర్వమైనవి. తెలుగులోని "వేంకటేశ్వర వచనము" లీ తెగకు చెందినవి. అనంతుడు తన తెలుగు ఛందస్సులో "వచనము"నకు లక్షణము కూడ చెప్పినాడు.

ఆంధ్ర పండిత త్రయమని ప్రసిద్ధినందిన "శివలెంక మంచన", "శ్రీపతి పండిత", "మల్లికార్జున పండితారాధ్యులు" వీరశైవమత ప్రసారమున ముఖ్య పాత్రను వహించినారు. వీరందరును బసవేశ్వరుని సమకాలికులు. వీరిలో మంచెన, మల్లికార్జునులు కన్నడ వచనములను వ్రాసిరి. వీరశైవ పంచాచార్యులలో కొందరు వచనకారులే.

వచన సాహిత్య మొక మహా వాహినివలె ప్రవహించి కొంత వడి తగ్గిన తరువాత దానిచే స్ఫూర్తి నొంది కొందరు సాహిత్య నిర్మాణము చేసిరి. వారిలో 'హరి హర', 'రాఘవాంక' పద్మరసులు' చెప్పదగినవారు.

## హరిహర

పేరెన్నిక గన్న భక్త కవి హరిహరుడు. ఇతడు క్రీ. శ. 12 వందల ప్రాంతమున ప్రసిద్ధ హంపీ క్షేత్రములో నుండెను. ఇతని గ్రంథములలో భావ నిర్భరమైన, భక్తిపూర్ణమైన వ్యక్తిత్వము గోచరించును. ఇంతవరకు దొరికిన ఇతని గ్రంథములు "పంపాశతకము", "రక్షాశతకము" "గిరిజాకల్యాణము", "శివశరణుల రగళలు" ప్రసిద్ధములు. ఇతనికి "రగళ" మీద ప్రీతి ఎక్కువ. "రగళ"లో పూర్తికావ్యమునే వ్రాయుటకు ఇతడే మొదటివాడు. ఈ కన్నడ ఛందస్సును వ్యాప్తికి తెచ్చి కన్నడ సాహిత్యమునకొక నూతనాలంకారమును కూర్చెను. ఇతని గిరిజాకల్యాణము ప్రౌఢచంపూ కావ్యము. శైవపురాణముల నుండి కథలను గ్రహించి తన మెరుగులతో ఇతడీ కావ్యమును వ్రాసెను. పార్వతీ పరిణయ మిందలి కావ్యవిషయము. కథావస్తువులో నితడు చేసిన మార్పులు చక్కగాలేవు. కొన్ని అనౌచిత్యములు దొరలినవి. జైనకవులలో పంపనికెంత గౌరవస్థానము కలదో, వీరశైవ కవులలో హరిహరున కట్టి స్థానమున్నది. హరిహరుని "శివశరణుల రగళలు" అతని వ్యక్తిత్వ సిద్ధికి ప్రతీకలు. ఇవి 12 వందల లఘుకృతులు. అన్నియు రగళ ఛందస్సులో వ్రాయబడినవి. దీర్ఘరఘటాబంధ కావ్యములలో అక్కడక్కడ గద్యపద్యములను వాడి ఒకవిధమైన 'రగళచంపు'వును సృష్టించినాడు.

కన్నడములోవలె తెలుగులోకూడ కొన్ని విధముల రగడలు కలవు.

## రాఘవాంకు

హరిహరుని మేనల్లుడై, దీక్షనందిన ముఖ్యశిష్యుడై, విద్వత్కవియై వాసికెక్కినవాడు రాఘవాంకుడు. 1225 ప్రాంతము. ఇతడు తన మామచే ప్రభావితుడైనను కావ్యరూపములో, కథానిర్వహణములో సరిక్రొత్త మార్గము ననుసరించెను. విద్వన్మణియైనను చంపువును చేపట్టక, సంస్కృత ఛందస్సునే ఉపయోగింపక దేశియగు "షట్పది"లోనే తన కావ్యములను వ్రాసెను. ఇతని కృతులలో "సోమనాథ చరితె", "వీరేశ చరితె", "సిద్ధరామపురాణ", "హరిశ్చంద్ర చారిత్ర" అనునవి ప్రకటింపబడినవి. "ఉభయకవి కమలరవి" అను ఇతని బిరుదము కన్నడ సంస్కృత పాండిత్యము నుగ్గడించును. ఇతడు స్వతంత్ర రీతిలో కావ్యరచన చేసినప్పటికి అష్టాదశవర్ణనల వంటి పాతపోకడల మీద మోజు మానలేదు. సంభాషణలు నడుపుటలో రాఘవాంకుడు దిట్ట. వర్ణనలలో ఇతని కల్పనాశక్తి అనల్పము. "వీరేశ చరితము" 127 పద్యముల చిన్న కావ్యము. ఇందు భర్గుని కోపమున వీరభద్రుడుద్భవించి దక్షాధ్వరమును ధ్వంసము చేసిన కథ వర్ణింపబడినది. ఈ కృతి చిన్నదైనను గుణములో మిన్నయని చెప్పతగినది. రసోచితముగా రాఘవాంకుడీ కావ్యమును "ఉద్దండ షట్పది"లో వ్రాసినాడు. రాఘవాంకుని కావ్యసిద్ధి "హరిశ్చంద్ర కావ్య" మున గోచరించును. హరిశ్చంద్రుని కథ వేదపురాణాదులలో ప్రసిద్ధమైనది ఆ ప్రాచీన గాథను తన మూసలో కరగించి సుందరసృష్టి చేసినాడు. వస్తురచన, పాత్రనిర్వహణ రసపోషణ, వర్ణనాదులలో ఈ కావ్యము మహోన్నతస్థాయి నందుకొన్నదని చెప్పవచ్చును. హరిశ్చంద్ర కావ్యము రాఘవాంకుడు కన్నడ సాహిత్యమున కొసగిన మేలికానుక. తెలుగు ఛందశ్శాస్త్రములైన కవిజనాశ్రయ, అప్పకవీయములందు షట్పది లక్షణములు చెప్పబడినవి. కాని వానినెవరును తెలుగులో వాడుకొనలేదు.

హొయ్సళ నరసింహ బల్లాళుని మంత్రియై దండనాథుడైన "పద్మరసు" కన్నడమున "దీక్షాబోధ"ను వ్రాసెను. ఇతడొక చెరువును త్రవ్వించినందున "కెరెయ పద్మరసు" అని వ్యవహరింపబడినాడు.

వీరబల్లాళుని ఆస్థానమున సుప్రసిద్ధులైన "నేమిచంద్ర", "రుద్ర భట్టులు" మార్గకావ్యములనె వ్రాసిరి. నేమిచంద్రుడు (క్రీ. శ. 1200) శాస్త్ర పారంగతుడు. శృంగార రస ప్రధానమైన "లీలావతీ ప్రబంధము"ను వ్రాసెను. ఈ కావ్యములో ఇద్దరు ప్రేమికులు స్వప్నమునందొకరి నొకరు ప్రేమించి వివాహమాడిన ప్రణయగాథ వర్ణింపబడినది. ఇది అనువాదము కాదు కల్పనా చమత్కృతిలో నేమిచంద్రుడు సాటిలేనివాడు. ఇతడు "నేమినాథపురాణమును" వ్రాసి తన జైననిష్ఠకు, ఆశ్రయదాత విష్ణుభక్తికి సరిపోవునట్లు, "హరివంశ, కురువంశము"లను వర్ణించినాడు. ఇందు కృష్ణ లీలలు, కంసవధ చక్కగా చిత్రింపబడి నేమిచంద్రుని ప్రజ్ఞను వెల్లడించుచున్నవి.

## రుద్రభట్టు

వీరబల్లాళుని ఆస్థానముననే రుద్రభట్టు ఉండెను. ఇతడు స్మార్తవైదిక బ్రాహ్మణుడు. విష్ణుపురాణ గాథ ననుసరించి "జగన్నాథవిజయ" కావ్యమును వ్రాసెను. కృష్ణజన్మము నుండి సాళ్వవధవరకు గల కథ ఈ ప్రౌఢకావ్యములో చిత్రితమైనది. ఇందలి పారిజాతాపహరణ ఘట్టము మిక్కిలి సుందరమైనది. ఇతడు కథలో కొన్ని రసోచితములైన మార్పులను చేసెను. విశాలమైన భాగవత దృష్టి ఉపనిషత్పరిజ్ఞానములు ఇతని కావ్యమున గోచరించును. వైదికులలో పురాణగాథను గ్రహించి భక్తిభరితముగా కన్నడమున ధార్మిక కావ్యమును వ్రాయుటకు రుద్రభట్టే శ్రీకారమును చుట్టినాడు. ఈ మహా కావ్యమును "కావ్యరసార్ణవ" మని కీర్తించెదరు.

> "నీరజోత్పల వర్ణనాడిద నాడిదం కమలేక్షణం
> చారు హాస విలాస నాడిద నాడిదం సుభగం శుభా
> కారనాడిదనెందు గోపియరాడి సుత్తుమిరల్కె సం
> సార నాటక సూత్రధారి మురారికై పఙిగాడిదం"

జగన్నాథ విజయము.

## పాల్కురికి సోమనాథుడు

ఈయుగమందలి వీరశైవ కవులలో పాల్కురికి సోమనాథుడు ముఖ్యుడు (1200). తెలుగునాట పుట్టి ప్రతిభా పాండిత్యములను ప్రదర్శించు సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో అనేక గ్రంథములను వ్రాసి పండిత పామరుల నలరించిన సకల భాషా కవితాసనాథుడు సోమనాథుడు. ఇతని తెలుగు బసవపురాణమునే భీమకవి కన్నడీకరించెను. కన్నడమున రగళలను, వచనములను వ్రాసి తరువాతి వారిచే స్తుతింప బడినాడు.

## ఉద్భటు

క్రీ. శ. 1225 ప్రాంతమున సోమరాజు ప్రసిద్ధి నందిన కవి. శృంగార సార మనదగిన ఉద్భట కావ్యమును వ్రాసెను. ఇతడు తక్కిన కవులవలె ఉద్ధతుడుకాడు. మహా వినయ గుణసంపన్నుడు. ఈ కవిశేఖరుడు తన కావ్యములో అల్లమ ప్రభుని పరమాత్మ స్వరూపునిగ వర్ణించి తన గురు శివభక్తులను చాటెను.

## జన్నకవి

పంపనివలె సర్వతోముఖ ప్రజ్ఞావంతుడు జన్నకవి. ఇతడు (1225) హొయిసల నరసింహభల్లాళునిచే 'కవి చక్రవర్తి' బిరుదమునందెను. "యశోధర చరితె'' 'అనంతనాథపురాణ'ములను వ్రాసెను. మొదటి గ్రంథము 310 పద్యములలో వ్రాయబడిన లఘుకృతి. ఇందు నాలుగవతారము లున్నవి. ప్రతి అవతారములో కంద పద్యములు, చివర రెండు మూడు వృత్తములు ఉండి సంస్కృత కావ్య ఫక్కిని తలపించుచున్నది. ఇతడు కథా వస్తువును వాదిరాజు సంస్కృతమున వ్రాసిన 'యశోధర చరిత్ర' నుండి గ్రహించెను పంపాదులు మొదలిడిన జైనధర్మ కావ్యధర్మ సమన్వయము నితడు సమర్థవంతముగ నిర్వహించినాడు. ఈ కావ్యము మహోజ్జ్వలముగ రచింపబడినది. ''అనంతనాథ పురాణము'' గూడ సంస్కృత ప్రచుర శైలికి, కథన కౌశల్యమునకు, పాత్ర పోషణకు పేరొందిన మహాకావ్యము.

## ఆండయ్య

(1235) పూర్వకవులవలె చంపువుల నాదరించియు, కథలో, వస్తువులో భాషలో, శైలిలో తన ప్రత్యేకతను చాటినవాడు ఆండయ్య. ఇతడు ఒక తత్సమ పదమును వాడక, దేశ్యతద్భవములను వాడి అచ్చగన్నడమున 'కబ్బిగరకావ' అను కావ్యమును వ్రాసెను. ఇందలి కథ మన్మథ విజయము. వైదిక జైన సంప్రదాయములకు చెందిన కథలను గ్రహించి అక్కడక్కడ తన జైనతత్వముల ఆధిక్యతను వెల్లడించుటకై కొన్ని మార్పులను చేసెను. "మన్మథ పరివారములోని చంద్రుని శివుడపహరింపగా కాముడు శివునిపై దండెత్తును - శివునోడించి అతని నర్ధనారిగా చేయును. తుదకు శివునిచే శపింపబడి కొంతకాలము అజ్ఞాతుడై యుండును. దండెత్తు కాలములో మారుడొక జైనమునిని దండింపబోయి భంగపడును." ఈ కల్పనము స్వతంత్రమైనది. సంస్కృత పదములు వాడనిదే కావ్యమునకు శోభ లేదని వాదించువారికి అచ్చగన్నడ పదములతో కావ్య రచన చేసి కన్నడ మాధుర్యమును చవి చూసెను. ఇతని శైలి మృదు మధురమైనది.

కుళిర్వ పూగొళంగ ళల్లి
తళిర కావణంగ ళల్లి
తుంబి వింటినంతె పాడి
జక్కవక్కి యంతె కూడి
దెసెయ నిచ్చెయిందె నోడి
సొగయి పంచె యంతిరాడి"

"మావినడి యొళాడుతుం
పాడనెద్దె కేళుతుం
పొత్తనింతు కళెయుతుం
తొలగదిర్ద రెసెయుతుం"

"కబ్బిగరకావ"

ఈ యుగమున 'హస్తి మల్లుడు' 'పూర్వ పురాణము'ను గద్యములో రచించెను. కొందరు శాస్త్రకవు లుదయించి శాస్త్రములను వ్రాసిరి. వీరిలో పలువురు జైనులు. మల్లికార్జునుడు 'సూక్తి సుధార్ణవ' మను సంకలన గ్రంథమును కూర్చెను. ఇందు వివిధ కావ్యముల నుండి అష్టాదశ వర్ణనలకు సంబంధించిన వేల పద్యములు సేకరింపబడినవి. ఇట్టి సంకలన గ్రంథముల కితడే మొదటివాడు ఇతని కుమారుడే సుప్రసిద్ధ కన్నడ వైయాకరణి కేశిరాజు.

## కేశిరాజు

ఇతడు కందపద్యములలో హళగన్నడ వ్యాకరణమును రచించెను. దానిని 'శబ్దమణిదర్పణ' మందురు. నాగవర్మ రచించిన శబ్దస్మృతి నుండి కొన్ని లక్ష్యములను, లక్షణములను గ్రహించెను. స్వయముగ కొన్ని క్రొత్త సూత్రములను కల్పించెను. ఇతని సూత్రములు కందపద్యములలో కల్పించబడినను అన్వయక్లిష్టత లేక రమ్యములైయున్నవి. అతడుదాహరించిన లక్ష్యములు అతని సరస కవితా నిర్మాణమునకు నిదర్శనములై యున్నవి. శుష్కమైన వ్యాకరణమును ఇంత సొగసుగ రచించినవారు లేరు. ఇతడు వ్రాసిన ఇతర గ్రంథములు దొరకలేదు.

"సూత్రం స్వరమిది రొళిరె విభక్తి
స్వరకం ప్రకృతి స్వరక్కమక్కుం లోపం
వరసంస్కృత కర్ణాటక
మెరడ ఱొళం నామరూఢి యశియద పక్షం"

"శబ్దమణిదర్పణ"

వీరశైవులు, జైనులు మార్గపద్ధతి నుండి దేశికి మారి కావ్యరచన చేసినట్లే వైదిక కవులు కూడ చేసిరి. 14వ శతాబ్దము తరువాత సంపూర్ణముగ దేశితనము ప్రాబల్యము వహించెను. దీనికి దాసవాఙ్మయము ముఖ్యనిదర్శనము. దాసవాఙ్మయము 13వ శతాబ్దమున నరహరి తీర్థులచే ప్రారంభింపబడినది. ఆయన దాసకూటమున కాదిపురుషుడు.

ఈ యుగమునందలి బ్రాహ్మణకవులలో రుద్రభట్టు తరువాత 'చౌండరసు' చెప్పదగినవాడు. ఇతడు (క్రీ. శ. 1300) యాదవ సింఘణదేవుని కాలములో నుండెను. నాగవర్మ కాదంబరిని చంపుకావ్యముగా వ్రాసినట్లే ఇతడు 'దండి' దశకుమార చరిత్రము చంపువుగా కన్నడీకరించెను. లౌకిక కథల ననువదించుచు ఆధ్యాత్మిక భావములను జొప్పించుటకు ఇతడు ప్రయత్నించెను. కథానాయకులందరు - జారులు, చోరులు అయినప్పటికిని "అన్ని జీవులలో భగవంతుడున్నందువలన దేనిని వర్ణించినను అది హరిస్తుతి యగును" అని సమర్థించుకొనినాడు. ఇతడు వ్రాసిన "అభినవ దశకుమార చరితె" దండి రచనకు యథామాతృకానువాదము కాదు. అక్కడక్కడ కొన్ని మార్పులు చేయబడినవి. ఈ యనువాదములో నాగవర్మ "కాదంబరి" యందలి ప్రౌఢిమ కానరాదు. కన్నడ దశకుమార చరితము పుట్టిన 50 సం॥లకే తెలుగులో "అభినవదండి" - కేతన వ్రాసెను.

14వ శతాబ్ది మధ్యమున "భీమకవి" తెలుగు బసవపురాణమును "భామినీ షట్పది"లో అనువదించి కన్నడ "బసవపురాణము"ను వ్రాసెను. రాఘవాంకుడు ప్రారంభించిన చారిత్రక కావ్య సాంప్రదాయము నితడు కొనసాగించి సాఫల్యమునందెను. ఇతని వలెనే "పద్మణాంకుడు" కెరెయ పద్మరసు, హరిహరుల చరిత్రములను "పద్మరాజపురాణ" మనుపేర "వార్ధక షట్పది"లో రచించెను. ఈ విధముగా బసవన యుగమున దేశి, మార్గ ప్రవాహములు కలిసికొని పారినవి. విషయములో, రూపములో, భాషలో స్వాతంత్ర్యము, నూతన ప్రయోగముల మీద ఆసక్తి ఎక్కువైనవి. వచనములు, షట్పదులు ఈ యుగాలంకారములు.

## 5

## కుమారవ్యాస యుగము

### (15 వ శతాబ్దము మొదలు 19 వ శతాబ్దాంతము వరకు)

ఈ యుగములో వివిధరీతులకు చెందిన గ్రంథములు రచింపబడినను, దేశి ప్రాబల్యమును పురస్కరించుకొని దీనిని "దేశి" యుగమన్నను తప్పు లేదు. షట్పది సాంగత్యము, త్రిపది, కీర్తనలు ప్రాధాన్యము వహించినవి.

కొన్ని చంపువులునూ పుట్టినవి. విజయనగర సార్వభౌముల, సామంత మండలేశ్వరుల, మైసూరురాజుల ప్రాపకములో ఈ యుగ వాఙ్మయము విభిన్న మార్గముల వృద్ధిబొందినది. ప్రతిభాశాలియగు "కుమారవ్యాసు"డీ యుగమునకు కర్తయై తరవాతి కవులకు మార్గదర్శకుడయ్యెను.

5 శతాబ్దముల కాలములో ఈ యుగమున అనేక సంఘటనలు జరిగినవి. ఈకాలమున దక్షిణభారతమే రాజకీయముగ, సాంస్కృతికముగ ఔన్నత్యమును, పతనమును అనుభవించినది. "తళ్లికోట" యుద్ధముతో హిందూ సామ్రాజ్యమస్తమించినందున ముష్కరతురుష్కుల అత్యాచారములతో, అంతఃకలహములతో దక్షిణాపథము వేగిపోయినది. అట్టి విపత్కాలములో కన్నడ సంస్కృతికి మైసూరు రాజులు ఆలంబమై నిలిచిరి. 19వ శతాబ్దమున సకలభారతమే పారతంత్ర్యము పాలయెను. దానిఫలితముగ కర్నాటకము ముక్కలు, ముక్కలై పరిసర రాష్ట్రములలో చేరిపోయెను.

పంపయుగములో ప్రౌఢమార్గ కావ్యములు ప్రాచుర్యమునందగా, బసవ యుగములో దేశిపద్ధతివైపు మొగ్గు చూపబడినది. ఈ యుగములో దేశి ప్రాచుర్యము నందినది. రచయితలకు ప్రజాదృష్టి హెచ్చినది. దాసకూటము స్థిరపడి ద్వైతమతాచారముల ప్రచారము విరివిగ జరిగినది. శ్రీ వైష్ణవ సంప్రదాయములను బోధించు సాహిత్యము వెలువడినది. పద్యముతోపాటు గద్యము ప్రాధాన్యము వహించెను.

## కుమార వ్యాసుడు

ఇతని స్థలమునుగూర్చి, కాలమునుగూర్చి, కులమునుగూర్చి, మతమును గూర్చి, పేరునుగురించి ఎన్నో మతభేదములు, వాదోపవాదములు ఉన్నవి. ఇతడు కన్నడ కవి చూడామణులలో నొకడు. స్థూలముగ క్రీ. శ. 1400 ప్రాంతమున ఇతడుండెనని నిర్ణయించినారు. జైనభారతముతో తృప్తినందక వైదిక సాంప్రదాయానుసారముగ కన్నడ మహాభారతమును వ్రాయబూని "గదగు వీరనారాయణస్వామి"కి అంకితముగా పదిపర్వములను వ్రాసి కాలధర్మమునందెను. తరువాత కృష్ణదేవరాయల ఆజ్ఞచే ఆస్థానకవి తిమ్మన

తక్కిన పర్వములను పూర్తిచేసెను. కుమార వ్యాసునిపేరు "నారాయణప్ప" అని వ్యవహరించుచున్నారు. ఆదిపంపని తరువాత ఇతడే సమగ్ర భారతరచన కుపక్రమించినాడు. సమగ్ర భారతమనగా వ్యాస భారతములోని కథాభాగ మంతయూ అనికాదు ; మానవజీవన జటిలగాథను కళామయముగా చిత్రించి, దానికి ప్రేరకమైన భగవద్భక్తిని తనివిదీర వర్ణించి తరించుటయే కుమార వ్యాసుని లక్ష్యము ; అదే అతని విశిష్టత. ఎల్లప్పుడు వ్యాసభారతమును మన నముచేసి, సాక్షాత్కారమునుపొంది అందలి రసభావములకు తన్మయుడై, అంతఃప్రజ్ఞనుబొంది ఈ భారత మహాకావ్యరచన కుపక్రమించియుండును. ఇది వ్యాసభారతమున కనువాదముకాదు. స్వతంత్రముగ చేసిన ప్రతిసృష్టి. కన్నడదేశములో గదగు భారతమును చదువని పల్లెలేదు. చదివి తన్మయత్వము నందని కర్ణాటకుడు లేడు. కథా సంవిధానములో, శైలిలో, పాత్ర పోష ణములో రసనిర్వహణములో అద్వితీయుడు. పంప, కుమారవ్యాసులలో ఎవరు గొప్ప అనునది తెగనిప్రశ్న. ప్రతిభ, భాష, కల్పనాశక్తి, నవీనభావ భావ నము ఈ విధముగ ఏ దృష్టితో జూచినను కుమారవ్యాసుడు మహోన్నత స్థానమున గోచరించును. అతని భారతము కన్నడ మహాకృతులలో అగ్ర గణ్యమనుటలో సందేహములేదు. ఇతని రచనా వైశిష్ట్యమునకు కొన్నిమచ్చు తునకలు :

"షట్పది :— ధరణియను బిడదశెదు హెచ్చిద
చరణవిదు కాళింగ మర్దన
చరణవిదు హరశాదహల్యయ శాపహరణవిదూ
చరణవిదు సురనదియ సృజిసిద
చరణవిదు శకటప్రభంజన
చరణవిదు ఎనుతేనుత కొండాడి దళహరిపదవా".

"షట్పది :— బందనే గోవింద భక్తర
బంధువే ఈతనొబ్బ మనసిగె
బంద మనుజర నెణస మాడువరారు భువనదలీ

ఎం దెనుత దూర్వాస మునిపతి
బందు కండను కృష్ణరాయన
నందు కుంతీ సుతన రాయన పర్ణశాలెయలీ",

ా్యసుని తరువాత అతనిచే ప్రత్యక్షముగ, అప్రత్యక్షముగ
వైదిక బ్రాహ్మణులైన "భాగవత కవి" పరంపర ఒకటి ఈ
నది. భారత, భాగవత, రామాయణములు, పురాణములు,
నెములు, మతత్రయ గ్రంథములు ఈ కాలమున విశేషముగా

ా్యసునిచే ప్రభావితుడై "కుమార వాల్మీకి" బయలుదేరెను.
గవత సంప్రదాయము వాడు. బిజాపురము జిల్లాలోని "తొరవె
భక్తుడు. 16వ శతాబ్దమున నుండినవాడు. ఇతని గ్రంథ
వె రామాయణ" ప్రసిద్ధమైనది. అది 5000 లకు పైగా
ములున్న మహాగ్రంథము. వైదిక సంప్రదాయము ననుసరించి
న్న కాండల ననువదించిన కన్నడ రామాయణమిది. ఇతడు
కిని అనుసరించినను తన భాగవత దృష్టితో శ్రీ రామచంద్రుని
వర్ణించి చరితార్థుడైనాడు. కుమార వాల్మీకిలో భక్తియున్నంత
పండితుల అభిప్రాయము.

ా్యసుని భారతమును పూర్తి చేసినాడు తిమ్మణ్ణ. ఇతడు కృష్ణ
నము నలంకరించిన కవిదిగ్గజము. ఆ మహారాజు కాలములో
సాహిత్యములు పరస్పర ప్రభావమును పొందినవి. తిమ్మణ్ణకు
తిక్కనపై విశేష గౌరవము. అతని భారత రచనలో తిక్కన
ంచును. ఆంధ్ర పారిజాతాపహరణ కర్తయగు నంది తిమ్మన
యమును''ను ఎన్నిసారులో చదివియుండును. తిమ్మణ్ణ కవితలో
కలదు.

ఇదేకాలమున "చాటు విఠ్ఠలనాథు"ని కన్నడ "భాగవత"ము వెలువడినది. దీనిని విఠ్ఠలనాథు డొక్కడేకాక "ఆరాధ్యేంద్ర", విద్యానాథ", "సదానంద", "నిర్వాణనాథ" అనువారు కూడ భాగవత రచనలో భాగస్వాములైనారు. ఆంధ్ర భారత, భాగవతముల వలెనే కన్నడ భారత, భాగవతములు కూడ అనేక కర్తృకములై యుండుట విచిత్రము !

## లక్ష్మీశ కవి

16 వ శతాబ్దమున సుప్రసిద్ధుడగు "లక్ష్మీశ"కవి పుట్టెను. ఈతని స్థల, కాల, మతములను గూర్చి చాల వివాదములున్నవి. అతడు సంస్కృత జైమిని ముని భారతమును కన్నడీకరించెను. అతని గ్రంథమునందలి యాధారమునుబట్టి లక్ష్మీశుడు "దేవనూరి" వాడని, "అణ్ణమాంకుని" పుత్రుడని, భారద్వాజస గోత్రుడని, "కర్ణాటకవి చూతవన చైత్ర"అను బిరుదము కలవాడని "దేవ పుర లక్ష్మీరమణ" భక్తుడని తెలియుచున్నది. ఇతడు శివకేశవుల వ్యత్యాసము లేని భాగవత సంప్రదాయమునకు చెందినవాడని ఊహింపవచ్చును.

సంస్కృతములో 68 అధ్యాయముల విస్తార గ్రంథముగా రచింపబడిన "జైమిని భారత"మును లక్ష్మీశుడు కన్నడమున సగమునకు తగ్గించెను. అతనిని ఉత్తమ సంగ్రహకారుడుగ గణింపవచ్చును. కథాసరణిలోకాని, పాత్ర సృష్టిలో కాని అతడు ఎక్కువ మార్పులను చేయలేదు. సాధ్యమైనంతవరకు క్రొత్త సన్నివేశములను కల్పించకుండ మూలమునే అనుసరించెను. రస నిరూపణలో కూడ ఇతడు మూలమునకు ఋణపడి యున్నాడు. మూల గ్రంథము పురాణ మగుట వలన కథతోపాటు నీతి - ప్రతిపాదనము, ధర్మోపదేశము, పుణ్య క్షేత్ర వర్ణనము మొదలైన విషయములతో నిండియున్నది. అందలి దీర్ఘవర్ణనలు నీరసములై అనేక సందర్భములలో విసుగెత్తించును. లక్ష్మీశుడు తన కవితాశక్తిచే, వర్ణనా చాతుర్యముచే మూలము నందలి విషయములను కుంచించి, సందర్భోచితముగా పెంచి కన్నడమున ఒక మహాకావ్యమును రచించినాడు. ఇదొక స్వతంత్ర గ్రంథమువలె ఉన్నది. పండిత, పామరులలో అవిరళ ప్రచారము నందియున్నది, కన్నడ దేశములో ఈ కావ్యమును చదువనివారరుదు.

లక్ష్మీశుడు రసపక్షపాతి, అతని గ్రంథములో నవరసములకు నుచితస్థాన మున్నను, శృంగార, వీరరసములు ముఖ్యముగ నిర్వహింపబడినవి. పాత్రపోష ణలో కూడ లక్ష్మీశుడు చతురుడు. అతని జీవనము నిండైనది. జన స్వభావము నతడు పూర్ణముగ నెరిగిన వాడగుట వలన పాత్రలన్నియు విలక్షణములై యున్నవి.

"మల్లికాస్మిత రుచిరె, కుందకుట్మలరదనె,
పల్లవాధరె, భృంగకుంతళె, కుసుమగంధి
సల్లలిత కోకిలాలాపె, చంపకవర్ణె మృదుమధుర కీరవాణి ।
ఫుల్లలోచనె, చారుచంద్ర బింబాననె, ల
సల్లతా గాత్రెజానకి విరాజిసిదళ్ స
ముల్లాసదిం పుష్పవతియాగి వికసిత వసంత లక్ష్మియ తెరదొళు"

"కత్తలెయ మనెగె మణిదీప మాదంతె సలె
బత్తిద సరోవరకె నవజలమొదవి దంతె
బిత్తరద కావ్యరచనెగె దేవతాస్తుతి నెగళ్దంతె భూతళదొళు ।
మత్తె సంతాన మిల్లద కుళిందన బాళ్గె
గుత్తమ కుమార నాదం చంద్రహాసనెన
లుత్తరోత్తర మప్పు దచ్చరియె దేవపుర లక్ష్మీవరన భక్తరు".

## దాస కూట – దాస వాఙ్మయములు

13 వ, శతాబ్దమునందు ఉడిపిదగ్గర ద్వైతమత ప్రవర్తకులగు శ్రీమధ్వా చార్యులు అవతరించిరి. వీరు సర్వార్పణ రూపమగు భక్తి వలననే ముక్తి లభించునని నిరూపించి కన్నడదేశములో భాగవత ధర్మమును పునరుద్ధరించిరి. బసవేశ్వరుడు మహాశివభక్తుడైనట్లే ఈయన విష్ణుభక్తశిరోమణి. ఇద్దరు మతప్రవక్త లుదయించి దేశమును భక్తిరస ప్లావితమును చేసినారు. ఆ మహాభాగ్యము కన్నడ దేశమునకే లభించినది. ఈ ఆచార్యుడు నాటిన భక్తిబీజము పెరిగి పుష్పించి ఫలించినది. ఆ ఫలమే దాసకూటము. మధ్వాచార్యుల శిష్యుడు నరహరితీర్థులు దాసకూట

నిర్మాతయై పేర్గొనెను. అతని తర్వాత 14-15 శతాబ్దులలో తగిన నేతలు లేక దాసకూటము స్తంభించి యుండెను. అట్టి దానిని 16 వ శతాబ్దారంభమున శ్రీపాదరాయలు పునరుద్ధరించిరి. ఇంచుమించు 15 వ శతాబ్దము చివరి కాలము వరకు బ్రాహ్మణ రచయితలకు కన్నడమున ధార్మిక గ్రంథములను రచియింప వలెనను నిశ్చయము కుదురలేదు. విజయనగర సామ్రాజ్య కాలములో నీయభిప్రాయము దృఢమైనది. విజయనగర సామ్రాజ్య పతనము తరువాత మరల దాసకూటము స్తబ్ధత్వము వహించెను. దానిని మరల విజయదాస జగన్నాథ దాసాదులు లేవనెత్తిరి. రానురాను విదేశీయులు, విమతీయులు దేశము నాక్రమించిన తరువాత బ్రాహ్మణ్యమునకు సంభవించిన మహావిపత్తువలన దాస కూటము నిస్తేజమునందెను.

శరణకాలపు వచన వాఙ్మయమువలె దాసవాఙ్మయము ప్రజలలో నవ చైతన్యము కలిగించినది. ఈ వాఙ్మయములో జీవనసిద్ధి వ్యక్తిత్వ వికాసము స్పష్టముగ కనబడును. జైన, వీరశైవులవలె బ్రాహ్మణ కవులుగూడ జన సామాన్యమున కందుబాటులో ఉండునట్లు సాహిత్య నిర్మాణముచేసి సంగీతమును జోడించిరి. వీరి సంగీత బద్ధములైన కీర్తనలలోని గూఢములైన వేదాంత తత్వములు సుందరముగ సుబోధకముగ వివరింపబడినవి. దాసవాఙ్మయమును దేవరనామములచే వెలయింపజేసిన మహాపురుషుడు శ్రీపాదరాయలు.

## శ్రీపాదరాయలు

మధ్వాచార్యుల శిష్యుడగు పద్మనాభతీర్థుల పరంపరకుచెంది 'ముళుబాగిలు' మతమునకు గురుడైన శ్రీపాదరాయస్వామి ఉద్దండ పండితుడు. ఇతడు కన్నడమున ద్వైతమత గ్రంథములను పరివర్తింప జేయుటకై ఇక భాగవత సమూహము నేర్పరచి దైవపూజా సమయములలో వారిచే 'దేవరనామ' ములను పాడించుట మొదలుపెట్టెను. ఈ స్వామి కన్నడములో వ్రాసిన కీర్తనలు 'రంగవిఠల' మకుటముతో కొన్నిమాత్రమే లభించినవి. ఈ పాటలలో పద లాలిత్యము, భాషాప్రౌఢిమ, భక్తిశృంగారములు నిర్వహింపబడి శ్రోతల నాకర్షించు చుండును.

## వ్యాసరాయలు

శ్రీపాదరాయల ముఖ్యశిష్యుడు, విద్వద్వరిష్ఠుడు, తపస్సంపన్నుడు వ్యాసరాయస్వామి. శ్రీకృష్ణదేవరాయల కాలములో ఆ సామ్రాజ్యమునకు తన తపశ్శక్తిని ప్రసాదించుచు మహారాజుచే పూజలను సత్కారములను పొందెను. అనేక సంస్కృత గ్రంథములను వ్రాసి ప్రసిద్ధినందెను. కన్నడ దేవర నామములను వ్రాసెను. ఇతని కాలములో దాసకూటమున చిన్నచీలిక ఏర్పడి 'వ్యాసకూట' మని వ్యవహరింపబడినది. మనోహరములైన నూర్లకొలది కీర్తనలను వ్రాసి ఇతడు దాసకూటమును ఉన్నత స్థానమునకు తెచ్చెను.

## పురందరదాసు

వ్యాసరాయల ప్రియ శిష్యులలో పురందాసుడు ప్రథమ గణ్యుడు, మహా పండితుడు; వాగ్గేయకారక చక్రవర్తి. అతడు ఆగర్భ శ్రీమంతుడై పుట్టి లుబ్ధాగ్రేసరుడై జీవించి కడపటి దినములలో వైరాగ్యమునందెను. సర్వస్వమును దానము చేసి వైచి వ్యాసరాయల సన్నిధికి చేరి ఆయన మంత్రోపదేశముచే దాస ముఖ్యుడయ్యెను. ఆయన వ్రాసినన్ని కీర్తనలు మరెవ్వరును వ్రాయలేదు. తెలుగువారికి త్యాగరాజెట్టివాడో కన్నడిగులకు పురందరదాసట్టివాడు. పురందరదాసుని ప్రభావము త్యాగరాజుపై విశేషముగ కలదు. అతని కీర్తనలలో సంసార నిస్సారత, వైరాగ్యబోధ, భక్తి మహిమ, బాహ్యాడంబర విమర్శ, ఉత్తమ జీవన ప్రశంస, ద్వైతమత ప్రచారదృష్టి, విశాల ధార్మిక దృక్పథము విశేషముగ గోచరించుచున్నవి. కీర్తనలతోపాటు 'సుళాదులు' 'ఉగాభోగము'లను గూడ అతడు రచించెను. ఇవి యొక విధమైన పాటలు. పురందరదాసు కర్ణాటక సంగీతాభ్యాసమునకు చక్కని ప్రణాళిక నేర్పరచి దక్షిణ భారతమునకే చిరస్మరణీయుడైనాడు.

## కనకదాసు

వ్యాసరాయల ముఖ్యశిష్యులలో కనకదాసుకూడా చెప్పదగినవాడే. ఇతడు 'కురువ' కులములో జన్మించిన మహావీరుడు, వృత్తిచే సేనా నాయకుడు. అశోకుని వలె యుద్ధమును రోసి విరక్తుడైనవాడు. ఇతడు వ్రాసిన కీర్తనలు జనులలో విశేష ప్రచారమున నున్నవి. వానిలో శ్రీవైష్ణవ, మాధ్వ సాంప్రదాయములు

కానవచ్చును. పురందరదాసులు ద్వైత సంప్రదాయమునకు ప్రతిబింబము. కనక దాసుది సర్వమత సమన్వయముకల భాగవతదృష్టి. ఈ మహాకవి కీర్తనలను, "హరిభక్తిసార", "రామధాన్య చారిత్రె", "నళచరిత్రె", "మోహన తరంగిణి" అను షట్పది కావ్యములను, "నృసింహ స్తవ" అను సాంగత్య గ్రంథమును రచించెను. హరిభక్తిసార110 భామినీ-షట్పదుల ఉత్తమకృతి. ఇది కన్నడిగులకు పారాయణ గ్రంథమై యున్నది. రామధాన్యచరిత్రె కనకదాస కపోల కల్పితము. భగవంతుడు బీదల కొంగుబంగారమని నిరూపించుటకు రాగి, వరి ధాన్యముల సంవాదము, రాగి ధాన్య విజయము చక్కగా వర్ణింపబడినది. తక్కినవి భారత, భాగవతములనుండి కథలను గ్రహించి మనోహర కావ్యములుగ రచింపబడినట్టివి. ఇతని కీర్తనలలో పండిన లోకానుభవము, సుజ్ఞాన, వివేకములు పదము పదమున కానవచ్చును. అతడు మహాభక్తుడు; మహాకవి.

## వాదిరాజ తీర్థులు

ఉడిపి అష్టమఠములలోని "సొదె"మఠమునకు స్వామియై, న్యాయవేదాంతాది శాస్త్రపారంగతుడై పేరుపొందినవాడు వాదిరాజతీర్థుడు. ఇతడును వ్యాసరాయల శిష్యుడే- వ్యాసకూట, దాసకూటములకు ముఖ్యుడై అనేక సంస్కృత గ్రంథములను, కన్నడ కీర్తనలను రచించెను. ఇతని కీర్తనలు తర్కబద్ధములు, సాహిత్య పూర్ణములు, ద్వైత సిద్ధాంత ప్రతిపాదకములు అయియున్నవి. 17 వ శతాబ్దాంతమున దాసకూటము స్తబ్దత నొందగా 18 వ శతాబ్దమున "ప్రసన్న వేంకటదాస", "గోపాలదాస", "విజయదాస", "జగన్నాథదాసులు" పునరుద్ధరించిరి.

## జగన్నాథదాసు

దాసకూట పరంపరను మహోజ్వలముగా కొనసాగించిన మహా పురుషుడు జగన్నాథదాసు. ఆయన కీర్తనలలో వైదుష్యము, విశాల దృష్టి, భక్తి వైరాగ్యములు కానవచ్చును. ఇతడు "తంత్ర సార", "హరికథామృతసార" గ్రంథములను, అనేక కీర్తనలను వ్రాసెను. మొదటిదీ లఘుగ్రంథము. రెండవది 32 సంధులు, వేయి భామినీషట్పదులుకల ఉద్గ్రంథము. ఇందు ద్వైతమత తత్వములు వివరింపబడినవి. జగన్నాథదాసు మత తత్వములను సంపూర్ణముగ నెరిగి వానిని లోకోద్ధరణకై హృదయంగమముగ బోధించిన మహానుభావుడు.

ఈ విధముగా దాసవాఙ్మయము కన్నడ సాహిత్య మహా నిధులలో నొక టిగా పరిగణింపదగినది. శరణసాహిత్య, దాససాహిత్యములు సామాన్యజనులలో సంస్కృతిని వ్యాపింపజేసినవి. ప్రజలకివి పరిచయమైనట్లు ప్రౌఢకావ్యములు కాలేదు.

## మైసూరురాజుల కాలపు బ్రాహ్మణ సాహిత్యము

విజయనగర సామ్రాజ్యము తరువాత మైసూరురాజులు విద్యాపోషకులైరి. వీరి కాలములో కన్నడ సాహిత్యము పలుపోకడల బోయినది. అందు చారిత్రిక కావ్య నిర్మాణము ముఖ్యమైనది. పంపయుగమున లౌకిక కావ్యములలో చారిత్రక ధ్వని సూచింప బడినను చరిత్ర కొరకే వ్రాసిన కావ్యములు లేవు. ఈ పద్ధతికి 'నంజుండకవి' "కుమార రామన చరితె' శ్రీకారము చుట్టినది. 17 వ శతాబ్దమధ్య మున గోవింద వైద్యుడు"–"కంఠీరవ నరసరాజవిజయ"మను సాంగత్య గ్రంథ మును రచించెను. ఇందు మైసూరు రాజ వంశము, నరసరాజు వీర కార్యములు, కర్ణాటకముపై ఎత్తివచ్చిన "రణదుల్లాఖాను"ని అత్యాచారములు కన్నులకు కట్టి నట్లు వర్ణింపబడినవి.



దక్షిణమున "రామానుజమతము" 12 వ శతాబ్దము నాటికే ప్రాచుర్యము వహించినను కన్నడదేశములో విశేషప్రచారము నందలేదు. "చిక్కదేవరాయల" కాలములో శ్రీవైష్ణవ గ్రంథములు పుట్టెను. ఆ మహారాజు ఆస్థానము నందలి "తిరుమలార్యుడు", "సింగరార్యుడు", "చిక్కుపాధ్యాయుడు", "హొన్నమ్మ" "తిమ్మకవి" మొదలైన కవులు ఉత్తమ గ్రంథములను రచించిరి.



### తిరుమలార్యుడు

(క్రీ. శ. 1700). మైసూరురాజ్య పరిపాలనమును నేర్పుతో నడిపిన మహా మంత్రి, పండితకవి, ప్రతిభాశాలి తిరుమలార్యుడు. ఇతడు 'అప్రతిమవీర–చరిత' "చిక్కదేవరాజవిజయ" "చిక్కదేవరాయవంశావళి" అను గ్రంథములనువ్రాసెను. అప్రతిమ వీర చరిత కువలయానందము ననుసరించి వ్రాయబడిన అలంకార గ్రంథము. లక్ష్యములలో చిక్కదేవరాయల చరిత్ర వర్ణింపబడినది. 'అప్రతిమవీర' అనునది ఆ మహారాజు బిరుదు. రెండవదియైన చిక్క దేవరాజ విజయము ప్రౌఢ చంపూకావ్యము. మూడవది చిక్కదేవరాజ వంశావళి మైసూరు రాజవంశ చరిత్ర

నుగ్గడించు ప్రౌఢ గద్య కావ్యము. తిరుమలార్యుడు ఉత్తమ శ్రేణికి చెందిన కవి శేఖరుడనుట నిరాక్షేపము. ఇతడు విశిష్టాద్వైత మతమునకు చెందినవాడు.

కం. ''శుభమక్కె సుజన కనికం
సఫలం తానక్కె సకల ధనికర ధనముం ।
ప్రభువక్కె భవ్యశీలం
విభవం తానక్కె విశ్వవిద్వజ్జనకం''.
("చి. దే. విజయ").

"శ్రీరమణన దివ్యలీలెవోల్ । భూరిభువన పోషకంమహో॥
దారన చికదేవరాయనా । వీరవిలసితం విరాజికుం॥
(అ. వీ. చ").

## చిక్కుపాధ్యాయుడు

తిరుమలార్యునివలెనే చికదేవరాయల మంత్రియై, విద్వత్కవియై విరాజిల్లినవాడు చిక్కుపాధ్యాయుడు. ఇతని పేరు లక్ష్మీపతి. జన్మస్థలము 'తెరకణాంబి'. అనేక గ్రంథములను రచించినాడు. ముప్పదికిపైన ఇతని రచనలున్నవి. కన్నడ సాహిత్యచరిత్రలో ఇన్ని గ్రంథములను వ్రాసిన మరొక కవిలేడు. వానిలో "విష్ణుపురాణ", "రుక్మాంగదచరితె", "సాత్వికబ్రహ్మ - విద్యావిలాస", ''కమలాచలమాహాత్మ్య'' మొదలైనవి చంపూ గ్రంథములు. శృంగారశతక, రంగధామస్తుతి మొదలైనవి ''సాంగత్యములు", "కామందక నీతి'' "శుకసప్తతి" గద్య గ్రంథములు. మరికొన్ని శృంగారకీర్తనలు ముఖ్యమైనవి. కన్నడమున విశిష్టాద్వైత తత్వములను ప్రవచించి ప్రచారము చేసినవాడు చిక్కుపాధ్యాయుడు. ఇతని చంపువులన్నియు సంస్కృత మయములై ప్రౌఢములైనవి. సాంగత్య గ్రంథములు సరళ కన్నడములో రచింపబడినవి.

తిరుమలార్యుని తమ్ముడు సింగరార్యుడు. ఇతడు మొట్టమొదటి కన్నడ నాటకమైన ''మిత్రవిందాగోవింద"మును వ్రాసెను. అది శ్రీహర్షుని రత్నావళి

నాటకమున కనువాదము. అందలి కథాభాగమును, పాత్రలపేరులను, గ్రంథ నామమును పూర్తిగ మార్చినాడు. కథానాయకుడైన కృష్ణపాత్ర కల్పనము దోషభూయిష్ఠమై యున్నది. నాటకము మిక్కిలి సామాన్యమైనది.

సింగరార్యుని శిష్యురాలు "హొన్నమ్మ". ఈమె చిక్కదేవరాయల అంతఃపుర పరిచారిక. అడపగత్తెయైన ఈమె తెలివితేటలను గ్రహించి మహారాజు సింగరార్యునికడ విద్యావ్యాసంగము చేయించి ఈమెను స్త్రీధర్మములు తెలుపు గ్రంథమును వ్రాయునట్లాజ్ఞాపించెను. రాజాజ్ఞచే విద్యావతియై "హది బదెయధర్మ" అను సాంగత్యగ్రంథమును రచించెను. ఇందొక కథలేదు. భారత, రామాయణ, మనుస్మృతులనుండి విషయములను గ్రహించి లోకమునకు పతివ్రతా ధర్మములను దెలుపుటయే గ్రంథోద్దేశ్యము. ఇందు హొన్నమ్మ కవితాశక్తి సువ్యక్తమగుచున్నది. "సాంగత్యము" అనునది మాత్రాచ్ఛందస్సులోనిది. ఒకటవ, మూడవ పాదములలో నాలుగేసి విష్ణుగణములు; రెండు, నాలుగు పాదములలో రెండేసి విష్ణుగణములు; చివర బ్రహ్మగణము ఉండును. ఈ ఛందస్సు మొదటిసారి కన్నడమున "శివమాయణ"ని కావ్యములో కానవచ్చును. సాధారణముగ స్త్రీల పాటలన్నియు ఈ వృత్తములోనే వ్రాయబడియున్నవి.

హొన్నమ్మ తరువాత చెప్పదగిన కవయిత్రి "గిరియమ్మ". ఈమె భక్తిచే పెంపొందించుకొన్న కవితావేశమున "చంద్రహాసనకతె", "సీతా కళ్యాణ" ఉద్దాలకనకతె" మొదలైన గ్రంథములను వ్రాసెను.

17వ శతాబ్దమున "రంగనాథుడు", 18వ శతాబ్దమున "చిదానందావధూత" అనువారు దుర్గ్రాహ్యములైన అద్వైత వేదాంత తత్వములను సులువుగ బోధించుటకై షట్పదులలో "అనుభవామృత", "జ్ఞానసింధు" అను గ్రంథములను వ్రాసిరి.

## ఈ యుగమందలి వీరశైవ సాహిత్యము

విజయనగర సామ్రాజ్యకాలములో వీరశైవ సాహిత్యము అనేకవిధముల వృద్ధిబొందెను; కొన్నివచనములు, పూర్వవచనముల సంకలనములు, వానికి

టీకలు, శైవపురాణములు, శరణచరిత్రలు, నీతిగ్రంథములు, శాస్త్రములు రచింపబడినవి. షట్పది, సాంగత్య, త్రిపది, వచన, గద్య, అక్షరవృత్తములు కూడ వాడబడినవి. ప్రౌఢదేవరాయల కాలములో నూరుల కొలది విరక్తులు విజయనగరమున ఉండిరట. 12వ శతాబ్దములో ఉన్నట్లు స్వతంత్ర వచన కారులు ఈ కాలములో 5, 6 కంటె ఎక్కువలేరు. వారిలోను బసవాదుల వర్చస్సు కానరాదు. మాయదేవాదులు వీరశైవ సిద్ధాంతగ్రంథములను వ్రాసిరి. ఈ కాలపు శివయోగులలో చెప్పదగినవాడు "నిజగుణ శివయోగి". ఇతడు మహానుభావుడైన విద్వాంసుడు. ఇతని గద్యపద్యములు కన్నడదేశమున విశేష ప్రచారములో నున్నవి. ఇతడు వీరశైవుడైనను అద్వైత సిద్ధాంతమును వివరించినాడు. ఇతని రచనలలో "వివేక చింతామణి" సర్వోత్కృష్టమైనది. ఇది మతాతీతమై కన్నడ వాఙ్మయమున కలంకారమై యున్నది. ఈ కాలము నందలి "ముప్పిన షడక్షరి", "మహంత శివయోగి", "శిశునాళ షరీఫు సాహెబ్" మొదలైనవారు భక్తిగీతములను, తత్వములను వ్రాసినారు.

ఈ యుగమందలి శరణ చరిత్రలలో "చామరసు" – ప్రభులింగలీలె శ్రేష్ఠకావ్యము. ఇతడు ప్రౌఢదేవరాయని కాలపు విరక్తులలో అగ్రగణ్యుడు. ప్రభులింగలీల అతని ప్రతిభకు తార్కాణము. అతని కల్పనాశక్తి, రచనాశక్తి అందు ప్రత్యక్షమగు చుండును. ఇతని శైలిలో ఆడంబరములేదు. సంస్కృత బాహుళ్యము లేదు. లాలిత్యము లాస్యము చేయుచుండును. చామరసు మహా కవి శ్రేణికి చెందినవాడు.

పలువురీ యుగమున శతకములను రచించిరి. వానిలో 'శతకత్రయీ' 'శంకరశతక' 'పంచకశతక' 'శివమహిమా శతక' 'అనుభవ శతకములు' సుప్రసిద్ధములు.

## సర్వజ్ఞ

క్రీ. శ. 1700 ప్రాంతములో కన్నడ మహా పురుషుడగు "సర్వజ్ఞుడు" జీవించెను. "ఇంతటి వ్యవహార జ్ఞానము కలవాడు, వివేకవంతుడు లేడ"ని ప్రసిద్ధి గనెను. తెలుగువారికి వేమన ఎట్టివాడో కర్ణాటకులకు సర్వజ్ఞుడట్టివాడు. అతని స్థలము, కాలము, కులము, మతము వివాదగ్రస్తములై ఉన్నవి. అతనిని గూర్చి

్రయో ఉన్నవి. 'అతనిజన్మ అసాంప్రదాయికమైనదని, బాల్యము జన్మభూమిని వదలిపోయి ఎన్నో ప్రదేశములలో తిరిగి గొప్ప ను సంపాదించె'నని చరిత్రకారు లూహించినారు. చిన్నతనమున రములకు గురి అయినందున సమాజమునకే శత్రువు కావలసిన కరుణచే మహాపురుషుడైనాడు. అతని పేరేదియో తెలియదు. ్దైన సర్వేశ్వరుని మనస్సులో పెట్టుకొని 'సర్వజ్ఞ' మకుటముతో వాసినందున ఇతడు సర్వజ్ఞుడుగ ప్రసిద్ధుడయ్యెను. విజయనగర ౩నము తరువాత దేశములో అరాజకము ప్రబలి ప్రజా జీవనము ్మై పోయెను. ఆ సమయములో ఇతడు జనించి సమాజ రోగము ుత్సను చేసినాడు.

ేక త్రిపదులను వ్రాసెను. వీనినే 'సర్వజ్ఞ వచనములు' అందురు. ` సర్వజ్ఞ మకుటములో అనేక పద్యములను కూర్చి ఇందు చేర్చిరి. రు పరిశోధించి 2000 సర్వజ్ఞ వచనములను ప్రకటించినారు. ఇతడు కావ్యము. అది ఉత్తమ కావ్యమనుటలో సందేహము లేదు. అతని దైవము, గురువు, శమదమాదులు, విధులు, కర్మలు, త్యాగబుద్ధి, ు, లోకనీతి, సంసారము, స్త్రీలస్థానము, కాలజ్ఞానము, రసవాదము, ఖండనము, సత్ప్రవర్తనము మొదలైన అనేక విషయములను ంబడి యున్నది. అతనిలో ఉత్తమ కవితా శక్తి యున్నది. అతని ్నయు జ్ఞాన భాండారములు. కన్నడ సాహిత్యములోని శుద్ధదేశి ్వజ్ఞునిలో మూర్తీభవించినది.

"ఆదేవ ఈదేవ నెనబేడ
ఆదేవర దేవ భువనప్రాణిగళి
గాదవనె దేవ సర్వజ్ఞ"

"చిత్తవిల్లదె గుడియ సుత్తిదడె ఫలవేను
ఎత్తు గాణవను హొత్తుతానిత్యది
సుత్తి బందంతె సర్వజ్ఞ"

"సుట్టబూదియ తందు దట్టవాగియె బడిదు
శ్రేష్ఠస్వర్గవను అడరువడె కత్తెతా
కెట్ట కీడేను సర్వజ్ఞ"
"కోతిగె గుణవిల్ల మాతిగె కొనెయిల్ల
సోతుహోదవగె సుఖవిల్ల ఆళిదవగె
జాతియే ఇల్ల సర్వజ్ఞ"

(సర్వజ్ఞ వచనములు)

ఈ యుగములో జైనులు చంపూకావ్యముల జోలికి పోలేదు. చిక్కదేవర కాలములో షడక్షరదేవుడు ప్రౌఢ చంపూ కావ్యములను వ్రాసి వీర శైవ మత ప్రచారము చేసెను. ఇతడు మహావిద్వాంసుడు. సకల శాస్త్రములలో నిష్ణాతుడు. రాజశేఖర విలాస, శబర శంకర విలాసాది ఉద్గ్రంథములను రచించినాడు. ఇతనిలో పరిపక్వమైన కావ్య నిర్మాణ సామర్థ్యము కానవచ్చును.

"చిదంబర స్వరూపె చిత్తజన్మవంద్యె చిన్మయే
కదంబవాటికా నివాసె కాళికాల భంజనే
సదంబుజాయతాక్షి చక్రపాణి చక్రసేవితే
మదంబె రక్షిసెన్న నిందుమౌళిపత్ని పార్వతీ".

—వృషభేంద్రవిజయ
''రాజశేఖరుడు''

"స్ఫురద్ధను శ్రీకర చంచలేక్షణం, శరధ్యుపాత్తోరు శరం ఘనస్వనం
హరిప్రభం నీరదరాజ నట్టిదం, ధరాతిసంతాపదనం నిదాఘనం".

'రాజశేఖర విలాస'

## ఈ కాలపు జైన సాహిత్యము

ఈ యుగమందలి జైనులు పూర్వ పద్ధతులను వదలి కాలము ననుసరించి గ్రంథములు వ్రాసిరి. ఈ రచనలలో పేర్కొనదగినది "జీవంధర చరిత్ర". దీనిని

భాస్కరుడు (క్రీ. శ. 1425) భామినీ షట్పదులలో వ్రాసెను. ఇతడు శైవ బ్రాహ్మణుడై యుండి జైనమును స్వీకరించినవాడు. ఇతనిపై కుమారవ్యాసుని ప్రభావము చాలా ఉన్నది. ఇంచుమించు ఆ కాలముననే ఉన్న "మాయదేవుడు"- "త్రిపురదహన సాంగత్య", "అంజనాచరిత"ములను వ్రాసెను. శైవపురాణములలోని "త్రిపురదహన" గాథను జైన తత్వమున కనుకూలించునట్లు మార్చి కావ్యరచన చేసెను. ఇందలి త్రిపురములు జన్మ, జరా, మరణములు. వానిని ఆదీశ్వరుడు దహించును. ఇతడు పండితుడు కాడు. కన్నడసాంగత్యకారులలో పేరెన్నిక గన్నవాడు. "మంగరస", "మల్లికార్జునుడు" మొదలైన పలువురు ఉత్తమ గ్రంథములను రచించిరి. 16 వ శతాబ్ది మధ్యమున "సాళ్వ"దను పండితకవి "రసరత్నాకర","సాళ్వభారత"ములను రచించెను.

ఈ యుగ కవిశేఖరులలో ప్రసిద్ధుడు "రత్నాకరవర్ణి". ఇతడు 16వ శతాబ్ది నడుమ ఉండిన క్షత్రియ కులాలంకారుడు. మొదలు వీరశైవుడై తర్వాత జైనుడయ్యెను. ఇతని గ్రంథములలో "త్రిలోక శతక'', "అపరాజితేశ్వర శతక", "భరతేశ వైభవ''ములు ప్రసిద్ధములు. చివరి గ్రంథమున ప్రథమ తీర్థంకరుడగు పురుదేవుని పుత్రులు భరతచక్రవర్తి, బాహుబలి కథలు సుందరముగా వర్ణింపబడినవి. ఇది 80 సంధులున్న గొప్ప సాంగత్య గ్రంథము. ఇందు చిత్రవిచిత్ర కథాపద్ధతి కలదు. క్రొంగ్రొత్త వర్ణనలున్నవి. నవరస పుష్టి యున్నది. ఎంతగొప్ప విషయమునైనను కొలది పదములతో చెప్పగల శక్తి రత్నాకరవర్ణికి విశేషముగ ఉన్నది.

19వ శతాబ్దము ప్రారంభమైనప్పటినుండి క్రొత్తసాహిత్య రూపములు వెలసెను. "ముమ్మడి కృష్ణరాజ ఒడయరు" కన్నడ, సంస్కృత విద్వాంసుడై సుమారు 50 గ్రంథములను వ్రాసెను. వానిలో రెండు, మూడు మాత్రమే పద్యరూపములు. తక్కినవన్నియు గద్యరచనలే. ఈ కాలమున "హొసగన్నడ" గద్యము ప్రాధాన్యమునకు వచ్చినది. కృష్ణరాజు ఆశ్రయములోని "కెంపునారాయణ" (1823 సం॥) "ముద్రామంజూష"ను వ్రాసెను. ఇది ముద్రారాక్షస కథను ఆధారము చేసికొని స్వతంత్రముగ రచించిన గద్య గ్రంథము. కృష్ణరాజు బంధువు అళియలింగరాజు పండితకవియని పేరుపొంది 47 గ్రంథములను వ్రాసినాడు.

ఈ శతాబ్దాంతము నందలి గ్రంథకర్తలలో ప్రత్యేకముగ పేర్కొనదగిన పండితుడు "బసవప్పశాస్త్రి". ఇతడు "శాకుంతల", "చండకౌశిక", "ఉత్తర రామచరిత", "శూరసేన చరిత్ర" అను నాటకములను వ్రాసెను. మొదటి మూడును సంస్కృతానువాదములు. నాలుగవది "షేక్స్పియర్" - ఒథెల్లో నాటకమున కనువాదము. ఇదిగాక "దమయంతీ స్వయంవర" చంపువును, "సావిత్రీ చరిత్రె" షట్పది కావ్యమును కూడా అతడు వ్రాసెను. కన్నడమున ఇంతవరకు గల నాటకముల కొరతను "బసవప్పశాస్త్రి" తీర్చి ఘనతకెక్కెను.

పై కాలములోనే "నందళికె లక్ష్మీనారాయణప్ప" హళగన్నడ - హొస గన్నడముల సంధికాలమున అపూర్వ రచనలు చేసెను. ఇతనికే "ముద్దణ" అని ఇంకొక పేరుకలదు. ఇతడొక పాఠశాలలో డ్రిల్‌మాస్టరుగా ఉండి స్వయం కృషిచే కన్నడసాహిత్యవేత్త, ఉత్తమ గ్రంథకర్త అయినాడు. ఇతనికి యక్షగానముల మీద ప్రీతి. వివిధములైన రచనలు చేసెను. "రత్నావతీ కళ్యాణ" "కుమార విజయము"లు యక్షగానములుగ వ్రాసెను. గద్యముతో "అద్భుత రామాయణము"ను రచించెను. వార్ధక షట్పదిలో 'రామపట్టాభిషేక' కావ్యమును సంతరించెను. సుప్రసిద్ధ గద్యకావ్యముగ "రామాశ్వమేధము"ను వెలయించెను. ఎన్నో వ్యాసములను, విమర్శలను వ్రాసెను. ఇతనిపై పాశ్చాత్యప్రభావము కలదు. ఇతని రచనలన్నిటిలో ప్రసిద్ధమైనది రామాశ్వమేధము. ఇది పద్మపురాణమందలి శేష రామాయణకథ. ఇందలి కథనపద్ధతి నూతనమైనది. ప్రాచీన సంప్రదాయము ననుసరించి ఇష్టదేవతలను స్తుతింపక వర్షాకాలవర్ణనతో ముద్దణ కావ్యము నారంభించెను. ఇందు పురాణదంపతులగు సీతారాములతోపాటు ఆధునిక దంపతులైన "మనోరమా, ముద్దణ"లను కల్పించి రచనకొక నవీన శోభను కూర్చినాడు. ముద్దణా మనోరమల సంవాదము హాస్యరసభరితమై పఠితల నాకర్షించును.

ప్రారంభమునుండి కన్నడమునకు రాజాశ్రయము లభించినప్పటికిని ఎవరి యాశ్రయమూ లేక కొందరు కవులు జనసామాన్యము విని సంతసించుటకై కవితల నల్లినారు. వాని నెవరువ్రాసిరో, ఎప్పుడు వ్రాసిరో తెలియదు. స్త్రీలలో, సామాన్యులలో ఎక్కువగా వ్యాపించియున్న ఈ వాఙ్మయమును "జానపద

మనుచున్నారు. ఇందు స్త్రీల పాటలు, లావణీలు విశేషముగ
ఈ వాఙ్మయములో నిజమైన జీవన విమర్శ ఉన్నది.

ఈ విధముగా కన్నడ సాహిత్యము 1500 సం॥ల చరిత్రకలదై ఆశ్చర్య
'లుపుచున్నది. కవుల, కావ్యముల సంఖ్య విశేషము. కన్నడ సాహి
సంస్కృత ప్రభావమున ఉదయించి పెంపొందినను, రూపములో,
విషయములో తన వ్యక్తిత్వమును నిలుపుకొనిన దనుటలో సందేహము
జైన, శైవ, శాంకర, రామానుజ, మాధ్వ సంప్రదాయములు చక్కని
యము నంది కర్ణాటకులకు, కన్నడ సాహిత్యమునకు విశిష్టతను
వి.

## 6

# ఆధునిక యుగము

## ( 20 వ శతాబ్దము )

క్రైస్తవ మిషనరీలు కన్నడభూమిపై కాలుపెట్టిన 19వ శతాబ్దము
పే కన్నడ భాషా సాహిత్యములు మార్పును బొందుచు క్రొత్తరూపములను
నవి. ఈ సంధియుగమునకు "కెంపూ నారాయణ" వ్రాసిన "మద్రా
'ష" చిహ్నమని చెప్పవచ్చును. హొసగన్నడ సాహిత్యము కెంపూ
ణచే ప్రారంభింపబడి ముద్దణచే వృద్ధిగాంచెను. ఈ యుగమున గద్య
ఎక్కువ ప్రాధాన్యము కలిగినది. ముమ్మడి కృష్ణరాయల కాలములోనే
సాధాన్యము తలసూపినది.

## ్చాత్య సాహిత్య ప్రభావము

19 వ శతాబ్దమున ఉండిన "మిల్", "బర్క్," "రూసో" మొదలైన
య విద్వాంసుల భావమారుతములు తక్కిన ప్రాంతములందు వలెనె
క నేలపై వీచినవి. కన్నడిగుల దృక్పథములో విచిత్రమైన పరిణామము
ను. క్రొత్త దృష్టి, క్రొత్త ధోరణి అలవడినవి. నవల, కథ, చరిత్ర,
గ్రంథములు, స్వీయచరిత్రలు, జీవితములు, వ్యాసములు, విమర్శలు, దిన

చర్యలు, గేయములు మొదలైన వివిధసాహిత్య ప్రక్రియలు తలయెత్తినవి. తమ సాహిత్యమును ఈ విధముగా సంపన్నము చేసుకోవలెనను ఉత్సాహము హెచ్చినది. ఆంగ్ల సంస్కృత సాహిత్యములు కన్నడముపై తమ ప్రభావముద్ర వేసినవి. ఎందరో యువకులు ఉన్నత శిక్షణపొంది గ్రీక్, ఇంగ్లీషు సాహిత్యములనుండి అనువాదములు చేయనారంభించిరి.

దేశమున నూత్నయుగారంభమైనది. గాంధీమహాత్ముని స్వాతంత్ర్య సమర శంఖారావము అన్నిప్రాంతములలో ప్రతిధ్వనించుచుండెను. కర్ణాటకములో జాతీయతా పాంచజన్యమును పూరించినవాడు కర్ణాటక పితామహుడు "ఆలూరు వేంకటరాయడు". ఆయన మార్గము ననుసరించి "శ్రీ బి. ఎం. శ్రీ కంఠయ్య" నవయుగ వైతాళికుడై కర్ణాటక పూర్వవైభవమును గానము చేసెను. ఆంగ్ల విద్యాభ్యాసము వలన ఆ సాహిత్య సంప్రదాయములనేగాక, భారతీయుల ఔన్నత్యముకూడ ఆకళింపునకు వచ్చెను. క్రొత్తగా అలవడిన జాతీయ దృక్పథము వలన వేదోపనిషత్తుల మహత్త్వము గ్రాహ్యమైనది. కాళిదాసాదుల గ్రంథముల మీద భక్తి పెరిగినది. "బసవప్పశాస్త్రి" తొలిసారిగా కాళిదాసుని "శాకుంతల" మును యథారూపమున అనువదించినట్లే, "ముద్దణబాగిలు" 'ఉత్తరరామచరిత'మును, "తురుమర" కాదంబరిని నవగన్నడములో పరివర్తన చేసినారు. సంస్కృత కావ్యానుకరణము పూర్వకాలమునుండి సాగుచునే యున్నను, ఈ కాలములో క్రొత్తరీతిలో యథామూలముగా సాగినది.

కన్నడ సాహిత్య పునరుజ్జీవనమునకు క్రైస్తవ మిషనరీలు పునాదులు వేసి తమ మతప్రచారమునకు వీలుకలిగించుకొన్నారు. దానివలన కన్నడమునకు చాల ఉపకారము జరిగినది. "కిట్టెల్" కన్నడ నిఘంటువును సప్రమాణముగ, సమగ్రముగ కూర్చినాడు. 'కావ్యకళానిధి' రచనలు ప్రాచీన కావ్యపరిచయము చేసినవి. 'హళకట్టి' కన్నడ సాహిత్యములోని వచనవాఙ్మయము నుద్ధరించెను. "సర్వజ్ఞ" వచనములు, దాసవాఙ్మయము చక్కని వివరణలతో, టీకలతో వెలసినవి. 'కాక్సన్' కన్నడ ముద్రాయంత్రమును నెలకొల్పెను. 'ఎపిగ్రాఫికా కర్నాటికా' సంపుటములను "రైస్" ప్రకటించుటతో చరిత్రాభ్యాసమున నూత్నదృష్టి యలవడి "కన్నడ కవి చరితె" సంపుటములు వెలువడినవి. 'మధురచెన్న', 'బేంద్రే' కన్నడ జానపద సాహిత్యమును ఉద్ధరించినారు.

## సాహిత్య సంఘములు

1914లో 'కన్నడ సాహిత్య పరిషత్తు' స్థాపితమైనది. ప్రతిభావంతులైన రచయితలెందరో ముందుకువచ్చి ఉత్తమ రచనలు చేయుటకు వీలుకలిగెను. పరిషత్తు వలన ప్రసిద్ధిపొందిన వారిలో 'బి. రామారావు', 'ఆలూరు వేంకటరావు', 'ముశియ తిమ్మప్పయ్య', 'ముదివీడు కృష్ణారావు' 'ఎన్. జి. నరసింహాచార్యులు' మొదలైనవారు ముఖ్యులు. 'బి. ఎం. శ్రీ కంఠయ్య', 'మాస్తి వెంకటేశయ్యంగార్', 'డి. వి. గుండప్ప' నడపిన 'తళిరు గుంపు', 'పంజె మంగేశరావు', 'గోవిందపై' అధ్వర్యములో సాగిన "మంగళూరు మిత్ర మండలి", ధారవాడ నుండి "బేంద్రే" నాయకత్వమున వెలసిన "గెళెయరగుంపు" మొదలైన సంఘములు చాల కృషి చేసినవి. వీనినుండి వెలువడిన రచనలు మనోహరములై జనుల నాకర్షించినవి. విద్యార్థికులైన యువరచయితలు కె వి. పుట్టప్ప, వి. సీతారామయ్య, రాజరత్నం, మధుర చన్న, ముగళివంటి సుప్రసిద్ధులెందరో ఈ సంఘముల నుండి పైకి వచ్చిరి. నవ్య కవిత్వము విశేషముగా వెలువడినది. ఈ కవితలలో గేయములు, మాత్రాచ్ఛందస్సులు, వర్ణనాత్మకములు, ఆత్మాశ్రయములు, సంస్కృతులు, గేయ నాటికలు, ఏక పాత్ర భాషణలు మొదలైన నవ్య కావ్య ప్రక్రియలు సాధింపబడెను. చిన్న కథలు, నవలలు తాత్కాలికోద్వేగమును గాక శాశ్వత ప్రయోజనము నుద్దేశించి, చిరస్థాయిగా ఉండునట్లు వ్రాయబడినవి.

## నవ్య కావ్యములు

బి. ఎం. శ్రీకంఠయ్యగారు ఆంగ్ల సాహిత్య రత్నాకరము నుండి ఆణిముత్యములనేరి కన్నడమునకు కానుక యిచ్చిరి. వారు ఇంగ్లీషు 'లిరిక్' పద్ధతిని కన్నడమునకు తెచ్చి ఎన్నో గేయములను వ్రాసినారు. వారి అనువాద సంకలనము ప్రకటింపబడిన తరువాత కన్నడ కవితా రచనలో అపూర్వ పరిణామము కలిగి తరువాతివారికి ఒరవడి అయినది. శ్రీకంఠయ్యగారి శిష్యవర్గమునకు చేరిన "వి. సీతారామయ్య", కె. వి పుట్టప్ప, పు. తి. నరసింహాచార్యులు, రాజరత్నంగారలు స్తబ్ధమై ఉన్న ప్రాచీన జగత్తునకు ఉత్తేజితమైన నూత్న జగమునకు నడుమ సేతువును కట్టుటకు ప్రయత్నించిరి. నవ్యులలో కె. వి. పుట్టప్పగారు ముఖ్యులు. చక్కని ప్రతిభ, చిక్కని పాండిత్యము కలవారు; ప్రకృతి ప్రియులు.

వీరి గీతములలో ప్రకృతిమాత దివ్య సౌందర్య విలాసములు చిత్రింపబడినవి. సీతారామయ్యగారి కావ్యము నిర్మల గంగా తరంగిణి వలె ప్రవహించును. ఆయన కవితలలో 'నిరాశా వాదము' కనపడుచుండును. పు. తి. నరసింహాచార్యులు మధుర గేయ రచయితలు. వీరి గీతములు కరుణ రస ప్రధానములు. దాస సాహిత్యమునకు క్రొత్తదనము నిచ్చి జనుల హృదయములను భక్తితో, ఆశతో, విశ్వాసముతో నింపి వేసినారు. రాజరత్నముగారి పద్ధతి ప్రత్యేకమైనది. ఉమర్ ఖయాం వలె మద్యమును కావ్యవస్తువుగ గ్రహించి జనుల సుఖఃదుఖాలను సహజ ముగ చిత్రించినారు. గ్రామీణ భాషలో కావ్యరచనకు వీరే మొదటివారు. ఉత్తర కర్ణాటకమున ప్రతిభావంతుడైన రచయిత "దత్తాత్రేయ బేంద్రె". ఆయన రచన లలో అరవిందుల ప్రభావము గోచరించును. నేటి నవ్య కావ్యములలో అనివార్య ముగ కానవచ్చు అస్పష్టత అతని రచనలో విశేషము. భక్తి గేయములను వ్రాసిన వారిలో "శిశునాళ షరీఫు సాహెబు" పేరెన్నిక గన్నవాడు.

## నవలలు

"స్కాట్", 'బంకించంద్ర' 'ఆప్టే'ల ప్రభావము వెంకటాచారి, గళగ నాథుల మీద విశేషముగ పడినది. వారనువదించిన కన్నడ నవలలు సుప్రసిద్ధ ములు. కన్నడమున 1915 లో ఎం. ఎస్. పుట్టణ్ణ - "మాడిద్దుణ్ణో మారాయ" "మునుగు తెగెయే మాయాంగనె" అను నవలలు వ్రాసిరి. 1920 లో 'కరూరు వాసుదేవాచార్యులు - 'ఇందిరా', ఔరంగజేబు' రచించిరి. 1930 వరకు కన్నడ రచయితలు నవలలమీద దృష్టి సారింపలేదు. ఆ తరువాత బెటగేరె కృష్ణశర్మ, 'అ. న. కృష్ణారావు, శివరామకారంత్, కస్తూరి, దేవుడు నరసింహశాస్త్రి, మిర్జీ అణ్ణారాయ - 'ఆద్య', వి. ఎం ఇనాందార్. వి. కె. గోకాక్. తారాసుబ్బరాయ, మాస్తి వేంకటేశయ్యంగార్, కె. వి. పుట్టప్ప మొదలైనవారు నవలా రచనలో సిద్ధహస్తులై ఉత్తమ నవలలను వ్రాసినారు. వానిలో చారిత్రకములు, వ్యంగ్య ప్రధానములు, సామయికములు - తాత్వికములు, సామాజికములు, విభిన్నములు కలవు. అపరాధ పరిశోధకములు నేటి తెలుగు 'డిటెక్టివ్'ల వలె ప్రాథమిక రచయితల చేతిలోనే యున్నవి.

## నాటకములు

ఈ శాఖలో చెప్పదగిన ప్రతిభాశాలి "టి పి కైలాసం" ఆయన సరిక్రొత్త ఫక్కీలో 'టొళ్లుగట్టి' అను నాటకమును వ్రాసి నవ్యనాటకమునకు నాందీవాచకము పలికెను. ఇప్పటి సాంఘిక సమస్యలను గ్రహించి, పౌరాణిక గాథలను నూతనార్థమును పొదిగి సుమారు 60 నాటకముల వరకు వ్రాసి సాటిలేని కీర్తిని గడించెను. ఆ నాటకములు గురుజాడవారి "కన్యాశుల్కము" వలె ఇంగ్లీషు భాషా మయములైయున్నవి. కైలాసం, ఆద్య, బేంద్రేలు ఏకాంకికలను వ్రాయుటలో నేర్పరులు. "గరుడ సదాశివరావు" సి. కె వేంకటరామయ్య, ముగళి, గోకాక్, ఆద్య మొదలైనవారు చక్కని పౌరాణిక, సాంఘిక, వ్యంగ్యనాటకములను వ్రాసినారు. గేయ నాటకమగు 'అశ్వత్థామన్' శ్రీకంఠయ్యగారు గ్రీకు నాటక పద్ధతిలో వ్రాసిరి. కె. వి. పుట్టప్ప, డి. వి. గుండప్ప, మాస్తి గారలు "బ్లాంక్ వర్స్" నాటకాలను "షేక్స్పియరు" ననుసరించి వ్రాసినారు. ఈ సాహిత్యము వృద్ధి పొందుటకు "కృష్ణారావు, కారంత్, కైలాసం, జాగీర్దార్" అను నలుగురు చేసిన కృషి అపారము.

## చిన్న కథ

కావ్యముతో సమానముగ కన్నడమున వృద్ధి బొందిన ఆధునిక సాహిత్యాంగములలో చిన్న కథ జనప్రియమైనది. దీనిని 'మాస్తి' మధ్య తరగతివారి జీవన వృత్తముతో పా్రరంభించిరి. వీరు పుట్టు కథకులు. ఈయనను పలువురు రచయితలనుకరించిరి. 'బెటగేరె', 'ఆనంద', 'గోపాలకృష్ణరావు' 'కృష్ణకుమార్', 'గొరమ్మ', ఏ. సీతారాం మొదలైన వారెందరో చిన్నకథను వివిధ దృక్పథములతో తీర్చి దిద్దినారు. సంఘటన, పాత్ర చిత్రణ, పారంపరిక విశ్వాసము, ఆలోచన, వాతావరణము, మనస్తత్వము మొదలైన విషయములను దృష్టియందుంచుకొని నూతన ప్రయోగములను చేసినారు.

## వ్యాసములు

కన్నడ వ్యాసము వివరణాత్మకముగ ఆరంభమై తరువాత ఊహా కల్పన నిండి రాను రాను ఉన్నత స్థాయి నందుకొన్నది. 'ఎ. ఎన్. మూర్తిరావు' గారి

'హగలుగనసుగళు', 'నారాయణ భట్ట ఉపన్యాసగళు', 'ఎన్. కె. కులకర్ణి', 'ఆద్య' మొదలైన వారి వ్యాసాలు పేర్కొన దగినవి. బేంద్రే - 'సిద్ధవ్వనహళ్ళి కృష్ణశర్మ' శీలచిత్రణ వ్యాసములను, పుట్టప్ప వర్ణనాత్మక వ్యాసములను, పి.టి. ఎన్. కథన పద్ధతి వ్యాసములను, గోకాక్ - భౌగోళిక, సాంస్కృతిక, వ్యాసములు వ్రాసినారు. ఈ విభాగములో చక్కని వైవిధ్యము సాధింపబడినది.

## సాహిత్య విమర్శలు

కన్నడ సాహిత్య భాండారమును సాహిత్య విమర్శలు లోకమునకు పరిచయము చేసినవి. తీ. నం. శ్రీకంఠయ్య వ్రాసిన "కావ్య మీమాంసె", ముగళి వ్రాసిన "సాహిత్య చరిత్రె" ఆర్. కృష్ణశాస్త్రి వ్రాసిన "సంస్కృత నాటక", కృష్ణమూర్తి పరిష్కరించి అనువదించిన "ధ్వన్యాలోక", కర్కి - వ్రాసిన "ఛందోవికాస" మొదలైనవి ఈ శాఖలో మిగుల ఉత్తమమైనవి.

## పరిశోధనము

కావ్య విమర్శ, పరిష్కరణములు, చరిత్ర పరిశోధనము కొందరు విద్వాంసుల ఉదాత్త సేవచే ఉన్నత స్థాయికి వచ్చినవి. 'గోవిందపై', 'కె. జి. కుందణగార', 'తి. నం. శ్రీ కంఠయ్య', ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి, డి. ఎల్. నరసింహాచార్యులు, శ్రీకంఠశాస్త్రి, బసవనాళ్, గుండప్ప, వెంకటరామయ్య, టి.ఎన్. వెంకణ్ణయ్య, ఆర్.ఎన్. పంచముఖి మొదలైనవారు చేసిన కృషి మహత్తరమైనది. ఈ మహనీయుల కృషి ఫలితముగ ఎన్నో ప్రాచీన కన్నడ కావ్యములు పరిష్కరింపబడి విలువగల పీఠికలతో సుందరముగ ముద్రింపబడినవి. ఎన్నో శాసనములు వెలుగు చూచినవి. వివిధ విషయములపై ఉత్తమ చరిత్రలు వెలసినవి.

## అనువాద సాహిత్యము

ఇతర దేశ సాహిత్యముల నారాధించి అందలి సౌందర్యమును గ్రహించుటలోకూడ కర్ణాటకము ఇతర ప్రాంతములకు తీసిపోదు. బి. ఎం. శ్రీకంఠయ్య గారు, వారి శిష్యులు గ్రీక్, ఆంగ్ల గ్రంథములను అనువదించినట్లే మరికొందరు విద్వాంసులు ఇతర భాషలనుండి ఉత్తమ రచనల ననువదించినారు. హిందీనుండి

"గురునాథ్ జోషి", మరాఠీ నుండి 'వి. ఎం. ఇనాందార్', పాండురంగరావులు, తమిళము నుండి 'జయలక్ష్మి', శ్రీనివాసన్', బెంగాలీ నుండి నారాయణ స్వామయ్యర్, తెలుగు నుండి పి. వెంకోబాచార్యులు, రా.రా. సుబ్బారాయడు మొదలైన వారు అనువాదములు చేసినారు. గాంధీ సాహిత్యమును సిద్ధవనహళ్ళి, ఆర్.ఆర్. దివాకర్, రామస్వామయ్యంగార్ మొదలగువారు భాషాంతరీకరించిరి. ఏ. ఎన్. మూర్తిరావు మోలియర్ వ్రాసిన "తార్తుఫ్" ఫ్రెంచి నాటకమును పరివర్తించి అనువాదకుల కొక చక్కని మార్గమును చూపెను. దేవుడు నరసింహ శాస్త్రి "హౌస్మన్", "మాస్ ఫీల్డ్" నాటకములను, ఎస్. జి. శాస్త్రి "ఇబ్సెన్" నాటకములను అనువదించిరి.

## జీవితములు

డి. వి. గుండప్ప, పుట్టప్పలు, గోఖలే, వివేకానంద జీవిత చరిత్రలను వ్రాసిరి. మొదటిసారిగా కన్నడ స్వీయ చరిత్రలను "మధుర చెన్న", "రాజ రత్నం", "గోకాక్", "దివాక"రులు సంతరించినారు. గోకాక్ వ్రాసిన "సముద్రిద ఆచెయంద", 'ఎ. రావ్' వ్రాసిన "బిడుగడెయమూల్య" అనునవి కన్నడములో వచ్చిన 'దిన చర్యలు'. వి. సీతారామయ్య, గోసావి, మాన్వి మొదలైన వారు యాత్రా గ్రంథములను, పండిత తారానాథవంటివారు 'సమాజశాస్త్ర' ధర్మశాస్త్ర, దాంపత్య విజ్ఞాన, సంతాన విజ్ఞాన, ఆహార విజ్ఞాన" మొదలైన విజ్ఞాన గ్రంథములను వెలయించిరి,

## పత్రికలు

సాహిత్యాభివృద్ధికి ఉత్తమ పత్రికలు కూడ అవసరము. మొట్టమొదటి కన్నడ పత్రిక మైసూరునుండి 1865 లో "కర్ణాటక ప్రకాశిక"అను పేర ప్రకటింపబడినది. కన్నడ సాహిత్య పరిషత్తు "పరిషత్పత్రిక" ను, మైసూరు విశ్వవిద్యాలయము "ప్రబుద్ధ కర్ణాటక"ను ప్రకటించుచున్నవి. ఇవి త్రైమాసికములు. "అక్షర ప్రచార సమితి"వారి "పుస్తక ప్రపంచ", "జయ కర్ణాటక", "జయంతి", "జీవన", "కస్తూరి" మొదలైన ఉత్తమ సాహిత్య పత్రికలు ఉదాత్త సేవ చేయుచున్నవి. ఉన్నత స్థాయి నందుకొన్న దిన పత్రికలు, వార పత్రికలు, పక్ష పత్రికలకు కూడ కొరత లేదు.

## అభ్యుదయ సంఘములు

సమకాలిక సాహిత్యముపై ఆవరించిన అంధకారమును తొలగించి క్రొత్త రచయితల నెందరినో వెలుగునకు తెచ్చిన కీర్తి బెంగుళూరులోని "ప్రగతి శీల సంఘము" నకు చెందును. సాహిత్యము సార్వజనికమై ప్రజావాణి కావలయు ననుట ఈ సంఘోద్దేశము. ఈ సంఘమువారు ఆగస్టు విప్లవానంతరము దేశీయ సాహిత్యమును ప్రగతిమార్గము పట్టించిరి. వ్యర్థములైన లతలమీద, పుష్పముల మీద కవితలల్లుచున్న కవులను హెచ్చరించి వారి దృష్టిని దేశారాధన వైపు మరల్చిరి. ఈ సందర్భములో ధారవాడయందలి "విద్యావర్ధక సంఘము" కూడ కన్నడ సాహిత్యాభివృద్ధికి దోహద మొనరించిది. "మించినబళ్ళి", "మనోహర గ్రంథమాలె", "సంచార పుస్తకమాలె" మొదలైన గ్రంథమాలలుకూడ కన్నడ సరస్వతికి అమూల్యాభరణములను సైసేసినవి.

1939 తరువాత తక్కిన భాగములలో వలెనే కన్నడమున కూడ మరొక దశ ఆరంభమై సమకాలిక సాహిత్యములో నూత్న చైతన్యము ప్రసారితమైనది. చెప్పదగిన బాల సాహిత్యము, వయోజన సాహిత్యములు కూడ ఉదయించినవి.

19 వ శతాబ్దము వరకు రచనా వ్యాసంగమున ఉండిన వారందరును పండితులు, పండిత కవులు మాత్రమే. ఈ యుగములో భాషాసేవకు అన్నివర్గముల వారు మతములవారు ఎట్టి తారతమ్యము లేకుండ నడుముకట్టినారు. ఇందు హిందువులతో పాటు 'ఉత్తంగి' వంటి క్రైస్తవులు – మిషనరీలు, 'అక్బరలీ' వంటి ముస్లిములు ఉన్నారు. బ్రాహ్మణులు, జైనులు, వీరశైవులు, కర్షకులు మొదలైన వారున్నారు. షరీఫ్‌సాహెబు వంటి అక్షరాస్యులు, 'కైలాసము' వంటి ఉన్నత శిక్షణ పొందినవారు ఉన్నారు. 'బసవనాళ్', 'ముద్దణ'లవంటి ఉపాధ్యాయులు; దేశాయి, దత్తమూర్తులవంటి గుమాస్తాలు; గోవిందపైవంటి జమీందారులు; వాలి, వెంకటశెట్టి వంటి వర్తకులు; మాస్తి వంటి సివిలియనులు; పంజె మంగేశ్వరరావు వంటి స్కూళ్ళ ఇన్‌స్పెక్టర్లు; సిద్ధవ్వనహళ్ళివంటి కార్యకర్తలు; దివాకర్ వంటి నాయకులు, వకీళ్ళు, పత్రికా రచయితలు, విశ్వవిద్యాలయాధ్యాపకులు రచననే వృత్తిగా పెట్టుకొన్న భాషారాధకులు ఎందరో ఎన్ని విధములుగనో కన్నడ సాహిత్య సేవ చేసినారు. కావ్య సమృద్ధిలో, వస్తు వైవిధ్యములో, ఉదాత్తతలో కన్నడ సాహిత్యము ఏ దృష్టితో చూచినను తక్కిన భారతీయ భాషలకు ఏమాత్రము తీసిపోదు. భారత పునరుజ్జీవనములో కన్నడము తనవంతు పూర్తిగా చెల్లించినదని చెప్పవచ్చును.

---

# మలయాళ సాహిత్యము

రచన

డా. కె. యం. జార్జి

అనువాదము

చల్లా రాధాకృష్ణ శర్మ

# 1

## ఉపక్రమణిక

మన దేశమున మాట్లాడు భాషలను ఇండో యూరోపియన్ భాషలనియు, ద్రావిడ భాషలనియు విభజింప వచ్చును. హిందీ, బెంగాలీ, మరాఠీ, గుజరాతీ మున్నగునవి ఇండోయూరోపియన్ భాషా కుటుంబమునందలి ముఖ్యమైన భాషలు. తమిళము, తెలుగు, కన్నడము, మలయాళము మొదలగునవి ద్రావిడ భాషా కుటుంబమునకు చెందిన నాగరక భాషలు. తుళు, కొడగు, కోట, బ్రాహూయీ, కోలామీ మొదలగునవి అభివృద్ధి చెందని కారణమున, వీనిని అనాగరక భాషలని వ్యవహరించుచున్నారు. ఇవి కూడ ద్రావిడ భాషా కుటుంబమునకు చెందినవే.

మన రాజ్యాంగ చట్టమునందు నాలుగు ద్రావిడ భాషలు మాత్రమే-అనగా తమిళ తెలుగు కన్నడ మలయాళములు-పేర్కొనబడినవి, వీనిలో జనాభానుబట్టి చూచినచో తెలుగునకు అగ్ర స్థానము లభించుచున్నది. హిందీ మాట్లాడు వారికి పిమ్మట, తెలుగు మాట్లాడువారే అధిక సంఖ్యాకు లనవచ్చును. కాని భాషాసార స్వతముల ప్రాచీనతను పురస్కరించుకొని చూచిన, తమిళమునకు అగ్రస్థానము లభించుచున్నది. జనాభాయందుగాని, భాషాసారస్వతముల ప్రాచీనతయందుగాని మలయాళమునకు నాలుగవ స్థానమే లభించుచున్నది. 1951 జనాభా లెక్కల ప్రకారము మలయాళమును 1.33 కోట్ల ప్రజలు మాటాడుచున్నారని స్పష్ట మగుచున్నది.

## కేరళము - మలయాళము

మలయాళభాషను వ్యవహరించువారు మనదేశమునందలి వివిధ ప్రాంతము లందున్నను, కేరళదేశమును మలయాళ ప్రదేశ మనుట సమంజసము. ఇది పడ మటి కనుమలకును అరేబియా సముద్రమునకును నడుమనున్నది. కేరళమున మలబారు, కొచ్చిన్, తిరువాంకూరు అను మూడు ప్రధాన భాగములు గలవు. ప్రస్తుతపు కేరళ రాష్ట్ర మవతరించుటకు పూర్వము మన భూగోళ పాఠ్య పుస్తక ములందు కేరళ మనుపేరు కనబడదు. అయినను, కేరళ దేశపుచరిత్ర ప్రాచీన మయినది. కొందరు పండితులు కేరళ మను శబ్దము కేర (కొబ్బరి చెట్లు) అను

మాటను సూచించు చున్నదని తలచుచున్నారు. నిజమునకు కేరళము కొబ్బరి తోపులకు పెట్టినది పేరు.

రామాయణ మహాభారతములందు కేరళ ప్రశంస కానవచ్చుచున్నది. తమిళ వాఙ్మయము నందలి సంగకాలపు కావ్యములగు శిలప్పదిగారము, మణిమేకలై మొదలగు వానియందు చేరరాజులనుగూర్చియు, చేర (కేరళ) దేశమును గూర్చియు పలు విషయములు చెప్పబడెను. చేరరాజులకు పిమ్మట కేరళము నందొక విధమగు ప్రజాస్వామ్యము నెలకొనెను. అటు పిమ్మట పెరుమాళ్ అను పేరుగల రాజవంశీయులు పరిపాలన మొనర్చిరి. తొమ్మిదవ శతాబ్దమున పెరుమాళ్ రాజుల పరిపాలనము అంతమయ్యెను. అనంతరము కేరళ పలుఖండములుగా విభాగితమయ్యెను. అటుపిమ్మట బుడతకీచులు, డచ్చివారు, ఆంగ్లేయులు మొదలగువారు కేరళ దేశమును పాలించిరి.

పెరుమాళ్ రాజులకు పిమ్మట కేరళము సాంఘిక రాజకీయ మత శక్తుల వలన పలు భాగములైనను, పలువురు పరిపాలన మొనర్చినను, మలయాళీలు ఒక్క త్రాటిమీద నిలువ గలిగి రన్నచో అందులకు కారణము వారి సంస్కృతి యనవచ్చును. ఆ సంస్కృతి వారి కళలందును, పండుగ పబ్బములందును ప్రతిబింబించుచున్నది.

## మలయాళ భాషా వికాసము

ఇక మలయాళ భాషా వికాసమును పరిశీలింతము.

మలయాళ మను మాటలో మల, ఆళం అను రెండుమాటలు గలవు. మల అనగా కొండ. ఆళం అనగా సముద్రము. నిజమునకు కేరళ దేశము అరేబియా సముద్రమునకును, పడమటి కనుమలకును నడుమనున్నది. కాని కొందరు విద్వాంసులు ఆళం కాదనియు, అది అళం అనియు నుడువుదురు అళం అను మాటకు భూమి అని అర్థము చెప్పవచ్చును. కాగా మలయాళ మనుటకు కొండభూమి అని అర్థము చెప్పవలసియున్నది. ఇదియే సత్యసమ్మతమని తోచుచున్నది.

మలయాళ భాషా వికాసమును గూర్చి పండితులలో భేదాభిప్రాయములు గలవు. మలయాళము సంస్కృతము నుండి ఉద్భవించిన భాష యని కొందరు

పేర్కొనిరి. అట్టివారిలో కోవుణ్ణి నెడుంగాడి ప్రథముడు. 1875 లో ప్రచురింపబడిన కేరళ కౌముది అను తన వ్యాకరణ గ్రంథమునందు ఆయన పైయభిప్రాయమును వ్యక్తీకరించెను. హిమవన్నగమైన సంస్కృతము నుండి గంగానదియగు కేరళ భాష యుద్భవించి కాళింది యను ద్రావిడ భాషతో కలిసెనని ఆయన పేర్కొనెను. సంస్కృతమునుండి కాక ప్రాకృత భాషనుండి మలయాళముద్భవించెనని కొందరు నుడివిరి. ఏమైనను, డా. కాల్డువెల్ ప్రభృతులు ద్రావిడ భాషా కుటుంబమునకు ఇండో యూరోపియన్ భాషా కుటుంబము మాతృక కాదని సహేతుకముగా నిరూపించుటచే, ఈ రెండు వాదములను చర్చించుట లాభకరముగాదు.

మరికొందరు మలయాళము తమిళమునకు పుత్రికయని పేర్కొనిరి. ఇట్లు పేర్కొనినవారిలో కాల్డువెల్ ప్రముఖుడు. పలువురు తమిళ పండితులును, కేరళ పాణినీయమును రచియించిన రాజరాజవర్మవంటి మలయాళపండితులును ఈ వాదమును సమర్థించుచున్నారు. తమిళ మలయాళములకు నడుమ సన్నిహిత సంబంధమున్నమాట వాస్తవమే. కాని మలయాళము తమిళమునకు పుత్రిక అనుట సబబు కాదు. అది తమిళమునకు సోదరి. ఈ యభిప్రాయమును గుండర్ట్, ఉళ్లూర్ యస్. పరమేశ్వర అయ్యర్ మొదలగువారు సమర్థించిరి.

మరియొక వాదముకూడ గలదు. సంస్కృత తమిళభాషల సంపర్కము వలన ఏర్పడిన భాషయే మలయాళ మనునది ఆ వాద సారాంశము. మలయాళమునందు సంస్కృత శబ్దములును, అరవ మాటలు ననేకములున్నవి. కేవలము పదపరికరము నాధారము చేసికొని భాషల సంబంధ బాంధవ్యములను నిర్ణయించుటకు పూనుకొనరాదు. ఇందుకు వ్యాకరణాంశములను పరిశీలింపవలెను. ఏలయన, శబ్దజాలమును గ్రహించినంత సులభముగా వ్యాకరణాంశములను గ్రహించుటకు వీలుపడదు. కనుక ఈ వాదముకూడ సరిగాలేదని స్పష్టమగుచున్నది.

పై సిద్ధాంతములు ఇంచుమించుగా ఊహాజనితములని నుడువదగును. భాషాతత్త్వశాస్త్రమును పురస్కరించుకొని చేయబడిన సిద్ధాంతములు కావవి. అయినను, వానిలో మలయాళము తమిళమునకు పుత్రిక యను వాదము పరిశీలింపదగినది.

## తమిళ మలయాళములు

తమిళ మలయాళములకు నడుమ దగ్గరి చుట్టరికము గలదనుట నిర్వివాదాంశము. అంతమాత్రమున ఒక భాష మరొక భాషకు పుత్రిక యనుట సమంజసముగాదు. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ద ప్రాంతమున మలయాళము తమిళము నుండి విడివడి యుండవచ్చునని రాజరాజవర్మ తలచెను. ఆట్టూర్ కృష్ణ పిషారోడి అను పండితుని మతము ననుసరించి మలయాళము తమిళమునుండి యిటీవలికాలమున ఏర్పడిన భాష కాదనియు, అది మూల ద్రావిడ భాషనుండి విడివడిన భాషయనియు తెలియుచున్నది. కేరళ సాహిత్య చరిత్రకర్తయగు మహాకవి ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్ మలయాళము తమిళమునకు సహోదరియని పేర్కొనెను.

మొత్తముమీద మలయాళము ప్రాచీనకాలముననే మూలద్రావిడ భాషనుండి విడివడిపోయి స్వతంత్ర భాషగా రూపొందెనని చెప్పవచ్చును, ఇతరద్రావిడభాషలవలె మలయాళభాషకూడ స్వతంత్రము, ప్రాచీనమునగు భాష యనియు పేర్కొన దగును.

## 2

## యుగ విభజనము

గ్రాంథిక భాషయందును (సాహిత్యభాషయందు), వ్యావహారిక భాషయందును మార్పు లెప్పుడును ఏర్పడుచునే యుండును. ఒక్కొక్కమాటు గ్రాంథికమునందు మార్పులు త్వరితగతిని ఏర్పడవచ్చును. వానిని కనుగొనుటకు కూడ వీలుండక పోవచ్చును. కాని వ్యావహారిక భాషలో కలుగు మార్పులు త్వరితగతిని ఏర్పడవు. ప్రజలు తమ నిత్యవ్యవహారమునకు దానిని వాడుకొనుచుండుట వలన, అందులో మార్పులు చేయుటకు మహాకవులు ప్రయత్నించినను వారి ప్రయత్నము అంత విజయవంతము కాజాలదు. మూడువందల యేండ్లకు పూర్వమున్న మలయాళ గ్రాంథిక భాషాస్వరూపమును గ్రహింపవచ్చునుగాని, ఆనాటి వ్యావహారిక భాషా స్వరూప మెట్లుండెనో మన మూహింపవలసినదే.

కాల్డువెల్ మతమునసుసరించి తమిళమునందు కావ్య వాఙ్మయము క్రీ.శ. 10 వ శతాబ్దమునుండియు, కన్నడమునందు 12 వ శతాబ్దమునుండియు, తెలుగున

14 వ శతాబ్దినుండియు, మలయాళమున 16 వ శతాబ్దినుండియు ప్రారంభమయ్యె నని చెప్పవలసియున్నది. కాని ఆయా భాషలలోని పండితు లీ యభిప్రాయముల నంగీకరింపలేదు. ఏది ఎట్లున్నను, తమిళమునందలి గ్రాంథిక భాషను ఒక ప్రత్యేక భాష యనవచ్చును. కాని మలయాళమునందలి గ్రాంథిక భాషకును, వాడుక భాషకును మధ్య అంత భేదము కానరాదు.

మలయాళమునందు ఆధునిక యుగము ఎళుత్తచ్చన్ యుగముతో ప్రారంభ మయ్యెనని మలయాళ పండితులెల్లరు నంగీకరించిన విషయమే. మలయాళ వాఙ్మ యమును ఆది యుగము, మధ్య యుగము, ఆధునిక యుగము – అని వారు విభ జించిరి. ఆదియుగమున తమిళభాషా ప్రభావము, మధ్యయుగమున సంస్కృత భాషా ప్రభావము మలయాళముపై నున్నట్లు వారు చెప్పుదురు. కాని యీ యుగ విభజనము సహేతుకముగా లేదు.

మలయాళ వాఙ్మయమునందు ఎళుత్తచ్చన్ అను మహాకవికి విశిష్ట స్థానము గలదు. అతడు యుగకర్త అనుటలో సందేహము లేదు. అతనితో పోల్చదగిన మరొక మలయాళ కవియు లేడనుట సత్యము. అతనితోనే మలయాళమున ఆధు నిక యుగము ప్రారంభ మయ్యెనని కొందరందురు. ఇది అంత సమంజసమైన వాదముకాదు. అతనికి పూర్వమే ఆధునికయుగ మారంభ మయ్యెననుట స్పష్టము. 15 వ శతాబ్దమున వెలసిన కృష్ణగాథ యను కావ్యమునుండి యీ విషయమును గ్రహింప వచ్చును. తత్కర్తయగు చెరుశ్శేరి ప్రారంభించిన యుద్యమమును ఎళుత్తచ్చన్ పూర్తి కావించెను. కనుక ఆధునిక యుగము కృష్ణగాథతో – అనగా 15 వ శతాబ్దితో – ప్రారంభ మయ్యెనని చెప్పవలసి యున్నది.

## ఆది యుగము

ప్రారంభ దశలో గ్రాంథిక మలయాళమును తీర్చిదిద్దుటకు 'పచ్చ' మల యాళము, తమిళము, సంస్కృతము మొదలగునవి తోడ్పడెను. పచ్చమలయాళ మనగా శుద్ధ మలయాళము. ఇది సంస్కృత తమిళ భాషల ప్రభావము లేని మలయాళ భాష అన్నమాట !

ఏ భాషయందైనను తొలుత గేయ సారస్వతము వెలుగులోనికి వచ్చును. అటుపిమ్మట కావ్యవాఙ్మయము ప్రచారములోనికి వచ్చును. అయినను జాతీయ

ములు, లోకోక్తులు మొదలగువానియందుగూడ కావ్యలక్షణములుకనబడుచుండును. మలయాళమున వందల కొలది జానపద గేయములు, లోకోక్తులును గలవు. కాని అవి యన్నియు నేడు ప్రచారమున లేవు. పండితులు కూడ వీనియందు శ్రద్ధాసక్తుల ప్రకటింపలేదు. సి. పి. గోవింద పిళ్లై కొన్ని జానపద గేయములను, పాటలను సేకరించి వానిని 'పళయ పాట్టుగళ్' (ప్రాచీన పాటలు) అను పేరున ప్రకటించెను. సి. ఎ. మీనన్, పెర్సీ మెక్వీన్ ప్రభృతులు కూడ జానపద గేయములను సేకరించిన వారిలో సంభావ్యులు.

ఈ జానపద గేయములందు సులభ సుందరమైన భాష వాడబడినది. ఈ భాష వాడుకభాషకు సన్నిహితముగా నుండును. సంస్కృత తమిళ భాషల సంపర్కము లేని భాష యిది! అనగా శుద్ధ మలయాళ మన్నమాట ! ఈ గేయములెప్పుడు రచింపబడెనో యిదమిత్థముగ చెప్పలేము; కాని కొందరు వీని రచనా కాలమును క్రీ. శ. పదియవ శతాబ్ద మనియు, మరికొందరు నాలుగవ శతాబ్దమై యుండ నగుననియు విశ్వసించిరి. కాలక్రమమున ఈ పదసారస్వతము నందలి భాషా స్వరూపము మారిపోయినను, ఆ సారస్వతము ప్రాచీన మలయాళ భాషా స్వరూపమును తెలియజేయుచున్నదని చెప్పవచ్చును ప్రస్తుతము కొన్ని ప్రధాన గేయములను మాత్రము పరిశీలింతము. భద్రకాళిపాట్టు, తీయాట్టుపాట్టు, పుళ్లువన్ పాట్టు, శాస్త్రకళి, తోట్టంపాట్టు మున్నగునవి పేర్కొనదగిన గేయములు. వీనిని ఉత్సవాదులందు పాడుదురు.

కాళికాదేవికి సంబంధించిన గేయము భద్రకాళిపాట. పుళ్లువన్‌పాట్టు అనునది పాముపాట. కనుక దీనికి సర్పపాట్టు అను నామాంతరము కూడ గలదు. ఇది చాల ప్రాచీనమైన గేయ మనియు, శుద్ధ మలయాళములో వ్రాయబడిన దనియు భావింపబడుచున్నది. కేరళ దేశపు బ్రాహ్మణులును క్షత్రియులును శాస్త్రకళి గేయమును పాడుదురు.

క్రీస్తుశకము తొలిశతాబ్దములలోనే పశ్చిమతీర ప్రాంతమున స్థిరనివాసము నేర్పరచుకొనిన క్రైస్తవులుకూడ కొన్నిగేయములు రచియించిరి. వానిలో మార్గంకళిపాట్టు ప్రశస్తమైనది. ఇందులో సెయింట్‌థామస్ మహిమలు వర్ణింపబడినవి.

ఇవికాక పండుగ వేళలందును, వ్యవసాయ పనులు చేసెడి వేళలందును పాడబడెడి పాటలు కూడ చాల గలవు. ఈ తెగకు చెందిన వానిలో ఓణప్పాట్టు, కృషిప్పాట్టు, వంజిప్పాట్టు (పడవ పాటలు) మున్నగునవి ముఖ్యమైనవి.

పాటలకు మలబారు ప్రాంతము కాణాచి. ఉత్తరమలబారులోని పదములను డా. సి. ఎ. మీనన్ ఒక సంపుటముగా ప్రకటించి మహోపకార మొనర్చెను. కాని యీ గేయములను రచించిన వారెవరో సరిగా తెలియరాలేదు. అయినను తద్రచయితలు విద్యావంతులనియు, వారు వాడిన భాష శిష్టులుపయోగించు భాషయనియు నిస్సంశయముగ చెప్పవచ్చును.

## తమిళ భాషా ప్రభావము

పెరుమాళ్ రాజవంశీయులు తమిళ భూపతులు. కేరళమున వారి దొరతనము క్రీ. శ. 825 లో అంతమయ్యెనని తెలియుచున్నది. తమిళ సంస్కృతి కేరళమున వ్యాప్తమగుటకు ఈ రాజవంశీయులే కారణమనుట స్పష్టము. అప్పటికి మలయాళమున గ్రాంథిక భాష యేర్పడక పోవుటచే, తమిళము నందలి కావ్య భాషకు కేరళమున ప్రాధాన్య మేర్పడెను. తమిళ భాషా ప్రభావము పదునారవ శతాబ్దమువరకు ఏదో ఒక రూపమున నుండెను. దీనిని కొందరు ద్రావిడ భాషా ప్రభావమని పేర్కొనిరి. ఏ పేరున వ్యవహరించినను, తమిళ వాఙ్మయ ప్రభావము మలయాళ వాఙ్మయమున స్పష్టముగ కనుబడుచున్న దనుట నిజమునకు దగ్గరగా నుండును. ఇందుకు గ్రంథ సాక్ష్యము కూడ లభించుట గమనింపదగు నంశము. ఈ కోవకు చెందిన కావ్యములందు రామచరితము ముఖ్యముగా పేర్కొనదగినది.

రామ చరితము పండ్రెండవ శతాబ్దమున రచింపబడెనని చెప్పుదురు. ఇది రామాయణము నందలి యుద్ధకాండము నాధారముగా చేసికొని వ్రాయబడినది. ఈ కావ్యమునందలి కొంతభాగమును తొలుదొలుత ఉళ్లూర్ పరమేశ్వరఅయ్యరు పరిష్కరించి ప్రకటించిరి. "ప్రాచీనము, అపూర్వమునగు నీ మలయాళ కావ్యము నందలి భాషా తత్త్వశాస్త్ర విషయములను పరిశీలింపవలెనని భాషాతత్త్వ శాస్త్రజ్ఞులను కోరుచున్నాను." అని అయ్యరుగారు తమ మున్నుడిలో పేర్కొనిరి. అంతే కాదు, ప్రాచీన మలయాళ భాషను గురించి తెలిసికొనుటకుగూడ రామచరితము

మిక్కిలి తోడ్పడును. ఇందలి భాష చాల కఠినముగ నుండును. తమిళ కావ్య భాషలోను, ప్రాచీన మలయాళములోను చక్కని పరిజ్ఞానమున్నవారుగాని యీ కావ్యమును సరిగా అర్థము చేసికొనలేరు. మలయాళమున వెలసిన తొలి కావ్య మిది. కాని నేడీ విషయమును పలువురు సంశయించుచున్నారు. గ్రంథ కర్తృత్వము. తద్రచనాకాలము మొదలగు వానిని గురించికూడ అభిప్రాయభేదములు గలవు. ఈ వ్యాసకర్త రామచరితమును గురించి పర్యాప్తమగు పరిశీలన మొనర్చి 'రామ చరితం అండ్ ది స్టడీ ఆఫ్ యర్లీ మలయాళం' అను గ్రంథమును సంతరించినాడు. తద్రచనము నందలి ముఖ్యాంశముల నిట నుదాహరింతును.

రామచరితము ఒక విచిత్రమైన భాషలో వ్రాయబడినది. దీనిని కృతక భాష అనవచ్చును. శబ్ద జాలమును చూచినచో దీనియందు సంస్కృత భాషా ప్రభావము కూడ కనబడును. కాని ఇందు తమిళ భాషా ప్రభావమే ఎక్కువగా కలదనుట సత్య సమ్మతము. తుదకు కొన్ని మలయాళ శబ్దములకు తమిళ రూపము నొసగబడెను. మొత్తముమీద ఈ కావ్యమునందు మలయాళము కంటె తమిళ భాషా ప్రభావమే ఎక్కువగ నున్నట్లు కనబడును. ఇట్లనుటచే కవి కావలెనని యిట్టి భాష వాడెననుకొనరాదు. ఆ నాళ్లలో ఇట్టి కృతక భాషను కూడ పరిగణించిరి. పదునాలుగవ శతాబ్దమున వెలువడిన లీలాతిలకమను లక్షణగ్రంథమునందు ఈ తెగకు చెందిన భాష పాట్టు అను పేరున పేర్కొనబడెను. యుద్ధ వీరుల నుత్సాహపరచుటకు ఈ కావ్యము రచింపబడె ననియు, చేరమన్ అను నతడు దీనిని రచియించెననియు విదిత మగుచున్నది. ఇంతకుమించి కవినిగురించి ఎక్కువగా తెలియరాలేదు.

రామచరితమునకు పిమ్మట కణ్ణశన్ పాట్టుగళ్ పేర్కొనదగిన కావ్య సంపుటము. ఇందు కణ్ణశ రామాయణము ముఖ్యముగా పేర్కొనదగినది. దీనిని రామపణిక్కర్ అనునతడు రచియించెను. ఇతనిది పండితవంశము. ఈ వంశములోని వారగు మాధవ పణిక్కర్ భగవద్గీతను సంతరించె ననియు, శంకర పణిక్కర్ అనునతడు భారతమాల అను కావ్యమును వ్రాసెననియు తెలియుచున్నది. కణ్ణశన్ అనునది వంశ నామ మనియు, ఆ వంగడమునకు మూల పురుషుడగు కరుణేశన్ అను వాని నుండి కణ్ణశన్ అను రూప మేర్పడి యుండవచ్చు ననియు

విదిత మగుచున్నది. కణ్ణశన్ కవులు సంస్కృత మలయాళము లందు మంచి పండితులు. వీరు 1375 – 1475 ప్రాంతముల నివసించి యుందురని పండితుల యభిప్రాయము.

కణ్ణశన్ కావ్యములందు తమిళపు పాలు తక్కువగా నున్నది. మలయాళ మునకు ప్రాధాన్య మేర్పడెను. అంతేకాదు; సంస్కృత శబ్దములును సంస్కృత సమాసములును చోటు చేసికొనెను. కణ్ణశన్ కవులొక క్రొత్త ఛందస్సును కూడ నుపయోగించిరి. దానికి సిరణవృత్తం అని పేరు. దీనికి మాతృక ఒక తమిళ ఛందో విశేషమని విజ్ఞులు విశ్వసించుచున్నారు.

తమిళభాషా ప్రభావమునకు పాల్పడిన పెక్కు వచన రచనలు కూడ కాన వచ్చుచున్నవి. ఇవి చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నందును, తిరువనంత పురములోని విశ్వవిద్యాలయ లిఖిత పుస్తక భాండాగారము నందును గలవు. వీనిలో మతము, వేదాంతము, చరిత్ర, గణితము, వైద్యము, జ్యోతిషము మున్నగు వానిని గురించి పెక్కువిషయములు చెప్పబడినవి. వీనిని సునిశితముగ పరిశీలింప వలసిన యవసర మెంతేని కలదు. ఈ వచన రచనములందు తమిళ శబ్దములు తక్కువ సంఖ్య యందున్నను, తమిళ భాషా ప్రభావము వీనిపై గల దని నుడువదగును.

నేడును తమిళము మాటాడబడుచున్న దక్షిణ తిరువాంకూరు ప్రాంతము నందు కొన్ని పాటలు ప్రచారమున నున్నవి. ఉలకుతయ పెరుమాళ్ పాట్టు (రోకంటి పాటలు), అచ్చుతం పురాన్ పాట్టు, రామకథ పాట్టు, ఇరవుకుట్టిపిళ్ళ పోర్‌పాట్టు మున్నగునవి వీనిలో ముఖ్యములు. వీని రచనా కాలము స్పష్టముగా తెలియరాలేదు. 13-17 శతాబ్ద ప్రాంతము లందివి రచింపబడెనని తలచుచున్నారు.

## సంస్కృత భాషా ప్రభావము

కేరళభాషా వాఙ్మయములపై సంస్కృతభాషా వాఙ్మయముల ప్రభావము గల దనుట నిర్వివాదాంశము. సంస్కృత శబ్దములను గ్రహించుటయే కాక మల యాళము వానిని తనవిగా చేసికొనినది. భారతదేశమున వ్యవహరింపబడు భాష లన్నియు సంస్కృతము నుండి యెన్నో శబ్దములను స్వీకరించినవి. కాని అవి

అన్యభాషా శబ్దములుగానే నిలిచి పోయెను. మలయాళమున అటుల జరగలేదు. సంస్కృత మలయాళ శబ్దములు క్షీరనీరన్యాయ్యమున కలసి మెలసి పోయినవి; తత్ఫలితముగా మణిప్రవాళమను నొక క్రొత్త శైలి మలయాళమునం దేర్పడెను. మణిప్రవాళ మనగా సంస్కృత ద్రావిడ శబ్ద సమ్మేళన మని యితర ద్రావిడ భాషల వారు భావింపవచ్చును. కాని మలయాళమునందు మణిప్రవాళమున కొక విశిష్ట స్థానము గలదు.

## మణి ప్రవాళము

సంస్కృతమున వ్రాయబడిన లీలాతిలకమను మలయాళ లక్షణగ్రంథము నందు మణిప్రవాళమును గూర్చి సవివరముగ చెప్పబడినది. ఈ లక్షణగ్రంథము పదునాలుగవ శతాబ్దమున వెలువడెను. మణిప్రవాళమను హారమునందు మణులు (మలయాళ శబ్దములు), ప్రవాళములు (సంస్కృత శబ్దములు) నుండును. వీనిని చక్కగా గుచ్చవలెను. అప్పుడే యా హారము కన్నులపండువు సేయు చుండును. సంస్కృత మలయాళ శబ్దములు ఒకదానితో నొకటి కలసిమెలసి పోవలెను. తరువాతి కాలమున పై నియమములు పాటింపబడక పోవుటవలన, మణిప్రవాళ రచనములకు ప్రచారము తగ్గెను.

సంగ్రహముగ చెప్పవలె నన్నచో, మధురములగు మలయాళ సంస్కృత శబ్దముల సమ్మేళనమే మణిప్రవాళ మనదగును (మధుర మధురభాషా సంస్కృతా న్యోన్య సమ్మేళన సురభిళా.) ఉత్తమ, మధ్యమ, అధమ – అని యీ మణి ప్రవాళము తొమ్మిది విధములుగ విభజింపబడినది.

ప్రశస్తమగు మణిప్రవాళ శైలిని చవిచూచుటకు చంద్రోత్సవ కావ్యము నందలి శ్లోకములను ఉదాహరణములుగా పేర్కొనవచ్చును. ఈ క్రింది శ్లోకమున కేరళదేశపు సౌభాగ్యము వర్ణింపబడినది.

"పరభృతమొళి చుట్టుంమట్టు ఖండంగశెట్టుం
దదిలుం అధికహృద్యం దక్షిణ భారతాఖ్యం
విరళినిల మలర్ సూదిన్నె అంగజెన్నుం త్రిలోకీ
చరుతొడు కురిపోలె చేరమాన్నాడు యస్మిన్–"

మణిప్రవాళ సారస్వతశాఖలో కృషి యొనర్చిన పి. శంకరన్ నంబియార్ అను పండితుడు తద్రచనా విధానమును గూర్చి ప్రస్తావించుచు నిట్లనెను: "సంస్కృత కావ్యములను పండితులు కానివారు కూడ చవిచూడవలెనని నంబూద్రి బ్రాహ్మణులు కొందరభిలషించి యుందురు. అట్టివారికి సంస్కృత శబ్దజాలమును, వ్యాకరణమును చిన్నచిన్న మోతాదులలో చతురతతో అందించినచో, వారు అనాయాసముగా వానిని స్వీకరింప గలుగుదురు. తత్ఫలితముగా తమకు తెలియకుండగనే వారు కావ్యరసాస్వాదన మొనర్చుచు సంస్కృత వ్యాకరణ రహస్యములను గూడ గ్రహింప గలుగుదురు..."

మణిప్రవాళమున రచియింపబడిన కావ్యములు వృత్తములందే వ్రాయబడెను. రసము, అలంకారము, రచనా విధానము – మున్నగువానికి నొసగబడిన ప్రాధాన్యమును పరిశీలించినచో, సంస్కృతభాషా ప్రభావము మణిప్రవాళమున ఎంతవరకు గలదో మనము తెలిసికొనవచ్చును. కాని యీ రచనా విధాన మెప్పుడు ప్రారంభమయ్యెనో ఖచ్చితముగా చెప్పలేము. కులశేఖర పెరుమాళ్ ఆస్థానకవియగు తోలన్ అనునతని హాస్యరస స్ఫోరకమగు రచనతో మణిప్రవాళ రచనావిధానము ప్రారంభమై యుండవచ్చునని కొందరు నుడువుదురు. అతడు క్రి. శ. తొమ్మిదవ శతాబ్దమున వర్ధిల్లెననియు చెప్పుదురు. ఏది యెట్లున్నను, సంస్కృత ప్రభావము కేరళమునందు నాలుగు శతాబ్దాలకు పైబడియే యుండెను. ఆనాళ్ళలో ఎన్నియో గ్రంథములు సంతరింపబడెను. వాని నన్నిటిని ఇచ్చట ఉదాహరించుట సమంజసము గాదు. అయినను సందేశ కావ్యములను, చంపువులను మాత్రము పరిశీలింతము.

కాళిదాసుని మేఘదూతము ననుసరించియే యీ సందేశకావ్యములు సంతరింపబడెను. ఈ రకపు కృతులందు పూర్వభాగమున దేశవర్ణన ముండును. ఉత్తర భాగమున నాయిక గుణగణములు, సందేశము మొదలగునవి వివరింపబడును. మలయాళమున వెలసిన సందేశ కావ్యములందు ఉణ్ణునీలి సందేశము తలమానికము వంటిది. కావ్యకర్తృనామము తెలియరాలేదు. ఇందలి కథానాయకుడు ఒక రాజవంశీయుడని తెలియుచున్నది. 1893 లో దీని యునికి తెలియవచ్చెను. 1918 లో ఈ కావ్యమునకు ముద్రణ భాగ్యము గలిగెను.

దీనికి ఉపోద్ఘాతము వ్రాసిన ఎ. కె. పి. షారోటి మతము ననుసరించి యిది 1316 లో వ్రాయబడెనని నుడువదగును. కాని జాగ్రత్తగా పరిశీలించినచో, తమిళభాషా ప్రభావము నీకృతియందు కనుగొనవచ్చును. అటనట తమిళ శబ్దములు కూడ కానవచ్చుచున్నవి.

గద్య పద్యమయమైన రచనము చంపువు. సంస్కృతమున చంపూరచనము బహుళప్రచారము గడించెను. ఈ తెగకు చెందిన రచనలు మలయాళమున గూడ వెలసెను. దేవోత్సవము లందు విధిగా నాట్యప్రదర్శనము లుండెడివి. ఈ ప్రదర్శనములకు కూత్తులని వ్యవహారనామము గలదు. కూత్తున కుపయోగపడు సాహిత్యము కావలసివచ్చెను. ఈ కారణమున మళయాళమునందు చంపువులు వెలసెనని కొందరు పండితులు నుడువుదురు. ప్రప్రథమమున ఈ కూత్తులు ఆలయమునందే జరుగుచుండెడివి. కాని కాలక్రమమున ఇవి ప్రజల యాదరాభిమానములను చూరగొనెను. కాగా, ఆలయమునకు వెలుపల గూడ ప్రదర్శించుకొనుటకు వీలుగానుండు రచనలు తరువాతికాలమున వ్యాప్తిలోనికి వచ్చెను. ఇట్టి రచనను 'పాఠకం' అని అందురు.

ఇతర సాహిత్యప్రక్రియలతో పోల్చి చూచినప్పుడు, మలయాళమునందు పెక్కు చంపువులు వెలసెనని చెప్పవలసియున్నది. వానిలో అనేకములు ఆధునిక యుగమున సంతరింపబడెననుట సమంజసము. ఇవికాక సంస్కృత భాషా ప్రభావమును వ్యక్తీకరించు వచన రచనలు కూడ ఎన్నో వెలసెను. వానిలో సుందరకాండము, భగవద్గీతా గద్యం మొదలగునవి ముఖ్యములు.

## శుద్ధ మలయాళము

ఇంతవరకు తమిళము, సంస్కృతము, పచ్చమలయాళము – అనువానిని గూర్చియు, వానికి సంబంధించిన కొన్ని ముఖ్యరచనలను గూర్చియు రేఖా మాత్రముగ పరిశీలించితిమి. పచ్చ (శుద్ధ) మలయాళము, వ్యావహారిక భాషకు సన్నిహితముగా నుండుటచే కడమ రెండు భాషలవలన దీనికి ముప్పు అంతగా వాటిల్లలేదు. శుద్ధ మలయాళ భాషా ప్రభావము క్రీ శ. 5 వ శతాబ్దము నుండియే ప్రారంభమయ్యెనని నుడువదగును. కాని యిందుకు

ప్రబలసాక్ష్య మేదియు లేదు. ఎనిమిదవ శతాబ్దము నాటికే భద్రకాళిపాట్టు, దక్షిణ, ఉత్తర మలబారులలో కొన్నిపదములును వ్యాప్తిలోనికి వచ్చెను. తమిళ భాషా ప్రభావము 12-16 శతాబ్దము లందుండెను. సంస్కృత భాషా ప్రభావము తొమ్మిదవ శతాబ్దమునందే కానవచ్చినను, అది 14-17 శతాబ్దములందు బహుళముగా నుండెనని చెప్పవగును. కనుక సంస్కృత ప్రభావమునకు పూర్వమే తమిళము మలయాళమున చోటు చేసికొనెను. అయినను పచ్చమలయాళ మీ రెండుభాషలను కొంతవరకు తీర్చిదిద్దెనని చెప్ప వచ్చును. ఉణ్ణునీలి సందేశము (14 వ శతాబ్దము), కణ్ణశన్‌పాట్టుగళ్ (14 లేక 15 వ శతాబ్దము), కృష్ణ గాథ (15 వ శతాబ్దము) - ఈ కావ్య త్రియమును సూక్ష్మముగా పరిశీలించినచో పై విషయము సుస్పష్టమగును. పచ్చమలయాళమునుండి పెక్కు శబ్దములను స్వీకరించి కడమరెండు భాషలును మలయాళమునకు సన్నిహిత మగుటకు ప్రయత్నించెను. ఏ భాషయందైనను మంచియన్నది యున్నచో, దానిని స్వీకరించి మలయాళ గ్రాంథిక భాషకు చక్కని రూపము నొసగిన చిరయశస్సు ఎళుత్తచ్చన్ కవిపుంగవునకు చెందు చున్నది. ఈ విభిన్న భాషల ప్రభావమును లీలాతిలకమను లక్షణ గ్రంథము నందుండి కనుగొనవచ్చును.

ప్రాచీన మలయాళ భాషాస్వరూపమును తెలిసికొన నభిలషించువారికి లీలాతిలకము మిక్కిలి తోడ్పడుననుట పొల్లుమాట కాదు. దీనినెవరు రచి యించిరో నేటికిని సరిగా తెలియరాలేదు. తదర్చయిత తమిళ మలయాళ సంస్కృతములందు విద్వాంసుడై యుండవచ్చునని మాత్రము నిశ్చయముగ చెప్పవచ్చును. ఆతని భాషా తత్త్వ శాస్త్రాభినివేశము ప్రశంసార్హము. లీలా తిలకము మణిప్రవాళ శైలికి సంబంధించినదే యైనను, అందు మలయాళ భాషా తత్త్వము, అది తమిళమునకు ఎట్లు భిన్నముగా నున్నదో మున్నగు విషయములు కూడ వివరింపబడినవి. అందు ఎనిమిది భాగములు గలవు. ఒక్కొక్క భాగము నకు "శిల్పం" అని పేరు. కాని యిది మలయాళమునకు వెలసిన సమగ్ర లక్షణ గ్రంథము మాత్రము కాదు. తొలి మూడు శిల్పములును మలయాళ భాషా చరి త్రకును, వ్యాకరణమునకును సంబంధించినవి. కడమ శిల్పములందు సాహిత్య మునకు సంబంధించిన విషయములు పేర్కొనబడినవి. ఈ యుద్గ్రంథమును తొలుత పరిష్కరించి ప్రకటించినవారు ఎ. కె. పిషారోడి. ఈ నడుమ కె. వాసు

దేవన్ మూసత్, శూరనాట్టు కుంజన్‌పిళ్లై, ఇళంకుళం కుంజన్‌పిళ్లై మొదలగువారు లీలా తిలకమును పరిష్కరించిరి.

3

## ప్రాచీన మలయాళ వాఙ్మయము

ప్రాచీన మలయాళ వాఙ్మయము నందలి ప్రశస్త కావ్యములలో కృష్ణగాథ యొకటి. కృష్ణునకు సంబంధించిన కథయని పేరునుబట్టి తెలిసికొనవచ్చును. కాని గాథయను మాట కొక విశిష్టమగు నర్థము మలయాళమున గలదు. కృష్ణగాథ మంజరీ ఛందస్సున వ్రాయబడెను. ఈ ఛందస్సున వ్రాయబడిన కావ్యమునకే గాథ యను వ్యవహార నామ మేర్పడెను. మలయాళము నందెన్నియో గాథలు వెలసెను. వానిలో కృష్ణగాథయే ప్రశస్తమైనది.

మలయాళకవులు సంస్కృత తమిళముల నాదరించినంతగా మలయాళము నాదరింప లేదని నుడువదగును. మలయాళ ఛందస్సులను వారు చిన్న చూపు చూచిరి. అట్టి దినములలో కృష్ణగాథ వెలసెను. తత్కావ్య కర్త ఒక ఛందో విషయమునందే కాక భాషా విషయము నందును స్వాతంత్ర్యము వహించెను. కృష్ణగాథ యందు సులభమైన భాషయే వాడబడెను. వ్యవహారమున నున్న మల యాళ సంస్కృత శబ్దములే యిందు ప్రయుక్త మగుటచే మలయాళమున ఏ మాత్రమైనను పరిచయ మున్న చాలును. దీనిని చక్కగా అర్థము చేసికొన వచ్చును. ఈ కారణమున తత్కృతికి మణిప్రవాళ రచనల కంటెను ఎక్కుడు ప్రచారము లభ్యమయ్యెను.

ఈ రసవత్కావ్య కర్తృత్వ విషయమున నేడును పండిత లోకమున అభి ప్రాయభేదములు గలవు. పి. గోవింద పిళ్లై, పి. కె. నారాయణ పిళ్లై మొదలగు వారు కృష్ణగాథను చెరుశ్శేరి నంబూద్రి అను నతడు వ్రాసెనని విశ్వసించిరి. చెరుశ్శేరి అనునది గృహనామ మని తెలియుచున్నది. చెరుశ్శేరి గృహ నామము మలబారులో లేదనియు, పూనం నంబూద్రి యను నతడు కృష్ణగాథకు కర్త యనియు కొందరు తలచుచున్నారు.

కవి పేరు సరిగా తెలియక పోయినను, కావ్య రచనా కాలము మాత్రము స్పష్టముగా తెలియవచ్చుట గమనింపదగిన యంశము. కోలత్తునాడును క్రీ. శ. 1446 నుండి 1475 వరకు పరిపాలించిన (మలయాళ శకము : 621–650) ఉదయవర్మ అను మహీపతి వ్రాయుమని కోరగా తాను కృష్ణగాథను సంతరించితినని కృతికర్త పేర్కొనెను. అందువలన ఇది 15 వ శతాబ్దమున వెలసిన కావ్యమనియు ఉదయవర్మ ఆస్థాన కవీశ్వరులలో ఎవరో యొకరు దీనిని సంతరించి యుందు రనియు భావింపదగును.

భాగవతము ననుసరించి రచింపబడిన కావ్యము కృష్ణగాథ. కృష్ణునిబాల్యము మొదలుకొని స్వర్గారోహణము వరకు గల కృష్ణకథాంశము లీకావ్యమున మనోజ్ఞముగ నభివర్ణింపబడినవి. కొన్ని చోట్ల కవి భాగవతము ననుసరించెను. మరికొన్ని చోట్ల భాగవత భాగముల ననువదించెను. ఇట్లగుటచే ఇది మౌలిక రచన కాదనుకొనరాదు. తన కల్పనా శక్తిచే కవి మూలములోని కొన్ని ఘట్టములకు మెరుగులు సంతరింపగలిగెను. ఈ కావ్యకర్త భక్తుడని ఆతని కథా సంవిధానమును బట్టి గ్రహింప వచ్చును. 47 కథలతో విరాజిల్లుచున్న యీ కావ్యము వెలుగులోనికి వచ్చి ఐదు వందల సంవత్సరము లైనను, దీనిని మించిన కృష్ణ కథా కావ్యము మరొకటి మలయాళమున వెలువడ లేదనవచ్చును. ఇంతకు మునుపు పేర్కొనినట్లు, ఇందలి భాష వాడుక భాషకు సన్నిహితమైనది; సరళమైనదియును. కాని స్వర్గారోహణ పర్వమునందు మాత్రము సంస్కృతపద భూయిష్ఠమైన భాష వాడబడెను.

కృష్ణగాథలో మనోహరములగు వర్ణనము లెన్నియో కలవు.

ఒక వెలయాలి సుందరవదనమును వర్ణించుపట్టున కవి యిట్లనుచున్నాడు: "ఆమె ముఖము నాశ్రయించుటకు కలువలరేడును, కలువకన్నెయు పోటీపడిరట. వారి కలహము శ్రుతిమించి రాగాన పడగా, అప్పుడు లక్ష్మీదేవి యేతెంచి తీర్పునొసగెనట. కలువల రేడా! నీ వేమో ఆమె నాసికాగ్రభాగము నాశ్రయింపుము. కలువ పడతీ! నాసికకు క్రిందిభాగమును నీ వాశ్రయింపుము. సరిహద్దులకై వారు తగవులాడుదు రేమో అని తలచి లక్ష్మీదేవి సరిహద్దును కూడ నిర్ణయించె నట. ఆ వెలయాలి నల్లని కనుబొమలే ఆ సరిహద్దు!" ఆ కావ్యములోని వర్ణన లిట్లుండును.

కృష్ణగాథను రచియించిన కవి భక్తుడే కాక మంచి అలంకారికుడనియు తెలియుచున్నది. ఉపమ, ఉత్ప్రేక్ష మున్నగు నలంకారముల నితడు వాడెను. ఉత్ప్రేక్షను చెప్పుటలో ఆతడు సిద్ధహస్తుడు. కావ్యమంతయు ఉత్ప్రేక్షమయమే. కృష్ణగాథలో కానవచ్చి నన్ని యుత్ప్రేక్షాలంకారములు మరియొక మలయాళ కావ్యమునందు కనబడవు. ఇది అతిశయోక్తి కాదు. మరియొక వైశిష్ట్యము కూడ ఈ కావ్యమున గలదు. ఇందు హాస్యరసము చక్కగా పోషింపబడినది. మచ్చున కొక యుదాహరణము. కపట సన్న్యాసివేషము ధరించిన అర్జునునకు సపర్య లొనర్చుటకు సుభద్ర నియోగింపబడెనుగదా! మారువేషమున నున్నను, అతనిని చూడగానే సుభద్రకు అర్జునుడు స్ఫురణకు వచ్చెను. తుద కతడు అర్జునుడై యుండనోపు ననియు నామె తలచెను. ఈ ఘట్టము కవికి హాస్యరస పోషణము నకు అవకాశ మొసగెను. ఒకనాడు సుభద్ర అర్జుననకు అన్నము వడ్డించు చుండెను. ఏవి ముందు వడ్డింపవలెనో కూడ ఆమెకు తెలియలేదు. ఆమె మనస్సు మనస్సులో లేదు. అరటిపండును వేయుటకు బదులు, సుభద్ర తోలు తీసి దానిని అర్జునుని విస్తరియందుంచి పండును విసరివేసెను. అర్జునుని మనస్సు మాత్రము ఆతని యధీనమున నున్నదా ? లేదు. ఆతడా తోలునే పండనుకొని తినెను.

అలంకారములందు ఉత్ప్రేక్ష యందెట్లు అభిమానమును ప్రదర్శించెనో, కృష్ణగాథ కృతికర్త రసములందు శృంగారము నెడ మక్కువ చూపెను. కనుక ఏతత్కావ్యము శృంగార రస ప్రధానమని వేరుగ చెప్ప నవసరము లేదు కాని కొన్ని పట్టుల ఆతని శృంగార వర్ణన వెగటనిపించుచున్నది.

గాథలలో భారతగాథకూడ పేర్కొనదగిన రచన. భారతము ననుసరించి వ్రాయబడిన యీ కావ్యమును ఎవరు వ్రాసిరో నిస్సంశయముగ తెలియరాలేదు. కృష్ణగాథను రచించిన యా కవియే దీనిని కూడ సంతరించి యుండ నోపునని బాలకృష్ణ నాయర్ మొదలగు పండితులు విశ్వసించిరి. భారతగాథ కృష్ణగాథ వంటి రసవత్కావ్యము మాత్రముకాదు. అందువలన భారతగాథను రచియించిన కవి మరొకరని కొందరి వాదము. మహాకవి ఉళ్లూర్ పరమేశ్వర అయ్యరు ఈ కావ్యము నందలి గుణదోషములనెల్ల చూపి, కృష్ణగాథను సంతరించిన కవియే

భారతగాథను సంతరించె ననుట అసంగతమని తెలియజెప్పిరి. కనుక భారతగాథ మరొకరిచే వ్రాయబడెనని తలచుటయే సమంజసము.

## 4

## మలయాళ మహాకవి - ఎళుత్తచ్చన్

మలయాళ వాఙ్మయ చరిత్ర యందు ఎళుత్తచ్చన్ వంటి కవిశేఖరుడు "న భూతో న భవిష్యతి" అనవచ్చును. అతడంతటి మహాకవి! అతని కృతులు మలయాళ వాఙ్మయమునకు అమూల్యాలంకారములు. అతని సుకుమార హస్తమున కిళిప్పాట్టు అను ఛందో విశేషము అందాలు దిద్దుకొనెను. కిళిప్పాట్టు అనగా చిలుక పాట అని అర్థము. ఈ చిలుక పాటకు మలయాళ సాహిత్యమున విశిష్ట స్థానము గలదు. కావ్యారంభమున, కావ్యమును నుడువుచున్న పక్షి పేరు సూచింపబడును. కొన్ని కావ్యములలో చిలుకకు బదులుగా హంసగాని తుమ్మెదగాని యుండును. అయినను వీనికి చిలుక పాట లనియే వ్యవహార నామ మేర్పడెను. ఈ తెగకు చెందిన పాటలు 16-17 శతాబ్దముల మధ్య వ్యాప్తిలోనికి వచ్చెను. ఇవి సాధారణముగా ఆధ్యాత్మిక విషయముల నభివర్ణించు నవియై యుండును. ఆధ్యాత్మికములు కాని విషయములు కూడ కొన్ని పాటలందు చోటు చేసికొనెను.

కిళిప్పాట్టును వ్యాప్తిలోనికి గొనివచ్చిన వారిలో ఎళుత్తచ్చన్ ప్రథముడని చెప్పుదురు. కాని యిది నిజము కాదు. అతనికి పూర్వమే కిళిప్పాట్టు లనదగినవి కొన్ని వెలసెను, ఇక కిళిప్పాట్టు పుట్టు పూర్వోత్తరములను గురించి విభిన్నాభిప్రాయములు గలవు. సరస్వతి చేతిలోని చిలుకయే కిళిప్పాట్టులోని చిలుక యని కొందరందురు. పౌరాణిక గాథా నిధియగు శుకమహర్షికి చిహ్నముగ చిలుక వాడబడెనని కొందరి యభిప్రాయము. భగవంతుడు శుక రూపమున ప్రత్యక్షమై ఎళుత్తచ్చనుకు ధర్మోపదేశ మొనర్చెననియు, తరువాతి కాలమున ఆ యుపదేశము ననుసరించి అతడు కృతులు వెలయించె ననియు, ఎళుత్తచ్చన్ శూద్రుడగుటచే తాత్త్విక రహస్యముల నతడు చిలుక చెప్పినట్లు పేర్కొనె ననియు కొందరి యభిప్రాయము. కథనాత్మక మైన కవితయందు కథను మరింత రసవత్తరముగ నుడువు నభిలాషతోను, కథను వినుచున్నప్పుడైనను అందు నమ్మకము కలిగించు

నుద్దేశముతోను చిలుకను ప్రవేశపెట్టియుండనోవునని ఆధునిక విమర్శకులు కొందరు తలచుచున్నారు. ఇది కొంతవరకు సహేతుకముగ నున్నట్లు కనబడు చున్నది.

నేడు కిళిప్పాట్టు కేక, కాకళి, కళకాంచి మొన్నగు ఛందోవిశేషములను సూచించుటకు కూడ వాడబడుచున్నది. ఇవి యన్నియు ఎళుత్తచ్చన్ కృతులలో కనబడుచున్నవి. వీనిని తమిళము నుండి గ్రహించెనని కొందరభిప్రాయపడిరి. ఇట్లనుట సమంజసముకాదు. ఎందుకనగా తమిళమున ఛందస్సునకు "అశై" ప్రధానము. కాని మలయాళమునందలి ఛందోవిశేషములు గాన ప్రధానములు. కనుక ఇవి మలయాళ ఛందోరీతులనియు, వీనికి కావ్యగౌరవము కలిగించినవాడు ఎళుత్తచ్చన్ అనియు చెప్పుటయే సమంజసము.

ఎళుత్తచ్చన్ దక్షిణ మలబారునందలి తిరూరునకు దగ్గరగా నున్నయొక గ్రామమునందు జన్మించెను. అతడొక నంబూద్రికిని, నాయర్‌కులమునకు చెందిన యొక స్త్రీకిని పుట్టిన వాడని కొందరు నుడువుదురు. కులమును గురించి స్పష్టముగా తెలియరానట్లే, ఎళుత్తచ్చన్ నిజనామధేయము కూడ స్పష్టముగా తెలియరాలేదు; పై పెచ్చు అభిప్రాయ భేదములు కూడ గలవు. ఎళుత్తచ్చన్ అను మాటకు సాహిత్యాచార్యుడని అర్థము చెప్పవచ్చును. కనుక ఇది బిరుదముగా తోచుచున్నది. కేరళమునందలి ఒక వర్గమువారు నేటికిని ఈ పేరును పెట్టుకొనుచున్నారు. తుంకాట్టు అనునది యీతని గృహనామమై యుండవచ్చుననియు, శంకరన్ లేదా రామానుజన్ యీతని నిజనామధేయమై యుండనోవుననియు కొందరు తలచుచున్నారు.

ఎళుత్తచ్చన్ కాలమును గురించి కూడ స్పష్టముగా తెలియరాకపోవుట శోచనీయము. ఇతడు క్రీ. శ. పదునారవ శతాబ్దమున నివసించెననుట యుక్తము.

ఎళుత్తచ్చన్ సంస్కృత తమిళ భాషలనుబాగుగ అభ్యసించెను. అతడు పెక్కు రచనలు చేసెను. వానిలో ఆధ్యాత్మ రామాయణము, భారతము, భాగవతము మున్నగునవి ముఖ్యముగా ఉదాహరింపదగినవి.

వాల్మీకి కృతి ననుసరించియే ఎళుత్తచ్చన్ రామాయణము రచియించెను. వాల్మీకి కృతిలో పురుషోత్తముడుగను, ప్రజా రంజక పరిపాలకుడుగను వర్ణింప బడిన రాముడు ఎళుత్తచ్చన్ రామాయణమునందు దైవముగా చిత్రింపబడినాడు. పలుతావుల నతడు కీర్తింపబడెను. రాముని ప్రశంస వచ్చిన చాలును. ఎళుత్తచ్చన్ భక్త్యుద్రేకముతో రామనామ సంకీర్తనము చేయ మొదలిడును. అట్టి సందర్భము లందతడు రామభక్తుడుగా దర్శనమిచ్చును. అతని పాత్ర పోషణ కూడ సజీవముగ నుండును. అతని రామాయణము రసవత్కావ్యమే యైనను ఎళుత్తచ్చన్ సంపూర్ణ ప్రతిభ అందు ప్రవ్యక్తము కాలేదు.

మహాభారతము సాగరము వంటిది. అయినను ఎళుత్తచ్చన్ దానిని కూడ రసవత్కావ్యముగ రచింప గలిగెను. రామాయణమునందు అతడు కొంతసేపు కవిగా కనబడును; కొంతసేపు తాత్త్వికునిగా కనబడును. కాని మహాభారతము నందు ఎళుత్తచ్చన్ కవిగానే కనబడుచుండుట గమనింపదగు నంశము. వర్ణనల యందేమి, రసపోషణము నందేమి, పాత్ర పోషణము నందేమి మహాభారతములో అతని సంపూర్ణ ప్రతిభ ప్రవ్యక్తమగుచున్నది. ఈ కావ్యమునందలి భాష సరళముగ నుండును; కాని గంభీరముగ నుండును. అందలి వర్ణనలా మధుర మోహనములు. కణ్వాశ్రమమునుండి శకుంతల తరలివెళ్లు నప్పటి దృశ్యము నిందులకు ఉదాహరణముగా పేర్కొనవచ్చును. నవరసములను అతడు చక్కగా పోషించినను, ఎళుత్తచ్చన్ వీరరసపోషణము కడుంగడు హృద్యముగ నుండును. అతని యుద్ధ వర్ణనలందు కేరళము నందలి యుద్ధవిధానము తొంగి చూచుచుండును. అతని కరుణరస పోషణమునకు గాంధారిశోకమును, దుర్యోధనుని మరణమును ఉదాహరణములుగా పేర్కొనవచ్చును.

రామాయణ మహాభారతములనే కాక, ఎళుత్తచ్చన్ తొమ్మిది స్కంధముల భాషా భాగవతము, ఉత్తర రామాయణము, హరినామ కీర్తనం, చింతారత్నం మొదలగు గ్రంథములను కూడ రచియించెను. ఇవి రామాయణ భారతములవంటి రసవత్కావ్యములు గావు. మొత్తము మీద ఎళుత్తచ్చనుకు మలయాళ వాఙ్మయమునందు విశిష్ట స్థానము గలదనుట నిర్వివాదము. తన కాలము నందలి గ్రాంథిక భాషా స్వరూపమును గ్రహించి, ఎళుత్తచ్చన్ ఒక క్రొత్త శైలిని ప్రవేశపెట్టెను.

అతడు మలబారు ప్రాంతీయుడైనను, ఆతని కావ్యములందు మాత్రము మలబారు ప్రాంతపు వాడుక భాష చోటు చేసికొనలేదు. ఎళుత్తచ్చన్ ప్రవేశ పెట్టిన యీ క్రొత్త శైలియే నేటి మలయాళ రచయితలకు ఒరవడిగా నున్నది. అనగా మలయాళమున ప్రామాణికమైన కావ్యభాషను ప్రవేశపెట్టినవాడు ఎళుత్తచ్చన్ అనుట సముచితము.

## చంపువులు, సందేశ కావ్యములు

సంస్కృత సాహిత్యములోని వివిధ సాహిత్య ప్రక్రియలను మలయాళ రచయితలు స్వీకరించిరి. అట్టివానిలో చంపువు ఒకటి. మలయాళమున వెలసిన చంపూ రచనలలో పద్యము లన్నియు వృత్తములందే యుండును. భాష మణిప్రవాళమై యుండును. ఇందలి వచనము నేటి వచనము మాత్రము కాదు. అది లయాన్వితమైన గద్యము. అది సాధారణముగా మలయాళము నందలి తరంగిణి యను ఛందో విశేషమునకు సన్నిహితముగా నుండును.

సంస్కృతము నందలి రామాయణ భారత చంపువులు కేరళ దేశమున గూడ బహుళ ప్రచారము గడించెను. ఇందుకు చాక్కియారుల కృషియే కారణ మనవచ్చును. వీరు తమ కూత్తు (నృత్య) ప్రదర్శనముల ద్వారమున ఎంతటి వారినైనను సరే విమర్శించుచుండిరి. వీరు తమ కూత్తులకు చంపువులనే స్వీకరించిరి. నారాయణ భట్టాద్రి యను సంస్కృత విద్వాంసుడు ముప్పది చంపువులు రచించెను. రాజసూయం, గజేంద్ర మోక్షం, సుభద్రాహరణం, దక్షయాగం, పాంచాలీ స్వయంవరం మున్నగునవి ఆతని రచనములలో ముఖ్యమైనవి.

మలయాళము నందలి చంపువులను ప్రాచీనము లనియు, ఆధునికము లనియు ద్వివిధముగా విభజింపవచ్చును. చంపువులు మొత్తము 200వరకు గలవు. వీనిలో రామాయణ చంపువు చాల ముఖ్యమైనది. ఇందులో రావణుని జన్మవృత్తాంతము మొదలుకొని రామ పట్టాభిషేకము వరకు గల కథలు చెప్పబడినవి. ఇది భారత చంపువునకంటె రెండురెట్లు పెద్దది. దీనిని రచించినవాడు పునం నంబూద్రి. వీరు ఆలయ పరిచారకులు.

పునం నంబూద్రి చంపూ రచన యెట్లుండునో తెలిసికొనుట కీ క్రింది శ్లోకమును పరికింపుడు.

"మందీ భూతే జనౌఘే
    పరిమళబహుళం
కై యిల్ ఆదాయ మాలాం
    మందారాభోగ మందస్మిత మధురముఖీ
మంగళశ్రీ సమేతా
    మందం మందం నయంతీ ఘనజఘన భరం
ప్రాభృతపాత్రియ మగ్రే
    మందాక్షాలంకృతాక్షీ మనసిజ కళికా
మైథిలీ సా నడన్నాళ్"

కళ్యాణమండపమునకు వెడలుచున్న సీతను కవి పై పద్యమున వర్ణించినాడు. ఇందు కైయిల్ (చేతిలో), నడన్నాళ్ (నడిచెను) అను రెండు మలయాళ శబ్దములు తప్ప మిగిలిన వన్నియు సంస్కృత శబ్దములే. "మనసిజ"కు వక్షోజమని అర్థము చెప్పుకొనవలసియున్నది.

రామాయణ భారత చంపువులకు పిమ్మట నుడువదగినది నైషధచంపువు. మూలమంగళం నారాయణన్ నంబూద్రి యను నతడు దీనిని వ్రాసెను. అతడు పదునారవ శతాబ్దమునకు చెందినవాడు. ఇంకను మరికొన్ని చంపువులు గలవు. వీనిలో అనేకములు నంబూద్రి బ్రాహ్మణులచే వ్రాయబడినవి. కొన్నిపట్టుల భాషకొంచెము జటిలముగా నుండును.

మలయాళమున సందేశకావ్యము లెన్నో వెలసెను. వీనికి గూడ బహుళ వ్యాప్తి గలదు. ఇవి కాళిదాసుని మేఘదూతము ననుసరించియే రచింపబడెను. వీనిలో ఉణ్ణునీలి సందేశకావ్యము ప్రశంసింపదగినది. ఇందలి యొక పద్యము లీలాతిలకము నందుదాహరింపబడినది. ఈ సందేశ కావ్యము నుండి ఆనాటి

కేరళదేశపు చారిత్రక సాంఘిక పరిస్థితులను తెలిసికొనవచ్చును. శృంగారరస ప్రధానమైన యీ డచనము నందలి వర్ణనలు స్వతంత్రములని నుడువవచ్చును.

ఒకానొకప్పుడు సందేశకావ్యములు ప్రచుర ప్రచారము నందుండుటచే సందేశకావ్యములు వెలయించుట నాటి కవిపండితులకు పరిపాటిగ నుండెను. ఈ కారణమున కాబోలు ప్రతి కవియు ఏదేని ఒక సందేశ కావ్యమును రచియించెను. కాగా తత్కావ్యముల సంఖ్య పెరిగిపోయెను. ఈ పరిస్థితిని చూచి యొక కవి కాకసందేశమను హేళనకావ్యము నొకటి వ్రాసెను. ఇందులో ఒక కాకి సందేశము గొనిపోవునట్లు చెప్పబడెను.

## 5

## ఆట్టకథ

కేరళ మనగానే సాధారణముగా మలయాళీలు కానివారికి కథకళి ప్రదర్శనము స్ఫురణకు వచ్చుట పరిపాటి. ఈ కథకళికి విదేశములందును ప్రచారము లభించినది. కథకళి యనుమాటలో కథ, కళి యను రెండుమాటలు గలవు. కళి యనగా నాటకము; నాటకవేషము వేసికొనిన కథ అనుట సమంజసముగ నుండును. కథకళికి ఉపయోగింపబడు అట్టకథ నిజముగానే సాహిత్యపు విలువగలది. ఆట్టకథలో కథకు ప్రాధాన్యమొసగగా, కథకళిలో ప్రదర్శనమునకు ప్రాధాన్యమొసగబడెను. సంప్రదాయము ననుసరించి కథకళిని రాత్రి వేళలందే ప్రదర్శింపపలెను. సాధారణముగా అది తొమ్మిది గంటలకు ప్రారంభమై ఆ మరునాడు తెల్లవారువేళ ముగియును. కథకళి యందలి కథ పౌరాణికమై యుండును. కనుక కథ అందరకు తెలిసినదై యుండును. కాని ప్రదర్శన విధానమున మాత్రము కొంచెము క్లిష్టత గలదు. ఇది కేరళమున ఆవిర్భవించిన కళావిశేష మనుటలో సందేహము లేదు.

కథకళి పుట్టుకను గురించి పెక్కు వాదములు గలవు. జయదేవుని గీతగోవిందమే దీనికి మాతృక యని తొలినాళ్లలో వెలసిన కథలను పరిశీలించిన విదితము కాగలదు. గీత గోవిందములో వలె ఆట్టకథ యందును శ్లోకము లుండును. ఇవి రెండును గానానుకూలములు. కవి మాటలు సాధారణముగ

శ్లోకరూపమున నుండును. నటీనటుల మాటల పాటలలో నుండును. కళా దృష్టితో చూచినచో, కథకళిని నృత్య మన వచ్చును. ఇందు ఇరువది నాలుగు ప్రధాన ముద్రలు గలవు. నటీనటులు పాడరు. వారెంతసేపటికిని ముద్రల ద్వారమున భావప్రకటనము చేయుచుందురు. ప్రధాన నటులకు వెనుక భాగమున కొందరు నిలబడియుందురు. వారే శ్లోకములు పఠింతురు; పాటలు పాడుదురు. ఈ కళావిశేషము బహుళ ప్రచారము నందుండుటచే, దీనికి సంబంధించిన యుత్తమ సాహిత్యము కూడ కొంత వ్యాప్తిలోనికి వచ్చెను.

కొట్టారకార తంబురాన్ అను నతడు రచియించిన రామనాట్టం ప్రప్రథమ మున వెలసిన ఆట్టకథ యని కొందరి యభిప్రాయము. ఈ రామనాట్టం కృష్ణ నాట్టము ననుసరించి వ్రాయబడెననియు, కృష్ణనాట్టం గీతగోవిందము ననుసరించి వ్రాయబడెననియు కొందరు చెప్పుదురు. అసలు రామనాట్టం ప్రప్రథమ ఆట్టక్కథ యగునా కాదా అని సంశయించువారును కొందరు గలరు. ఆచార్య డి.పి. ఉణ్ణి ఈ ఆట్టక్కథ సారస్వతమునకు కొట్టాయత్తు తంబురాన్ కారణభూతుడని తలచిరి, కాని నేడీవాదము విమర్శకు గురియైనది. నేటికిని ఈ వాదమును గురించి చర్చ జరుగుచునే యున్నది. ఏది యెట్లున్నను, ఆట్టక్కథకు ఉండవలసిన లక్ష ణము లన్నియు రామనాట్టంలో ఉన్నను, సాహిత్య దృష్టితో చూచినచో ఇది అంతప్రశస్తమైన రచనగా తోచదు.

రామనాట్టంలో రామాయణగాథ యంతయు ఎనిమిది భాగములుగా విభ జింపబడింది. ఒక్కొక్క భాగమును ఒక్కొక్క రాత్రి చొప్పున ప్రదర్శింప వచ్చును. పుత్రకామేష్టి, సీతాస్వయంవరం, విచ్ఛిన్నాభిషేకం, ఖరవధం, బలి వధం, తోరణయుద్ధం, సేతుబంధనం, యుద్ధం-అనునవి యీ విభాగములు, వాల్మీకి, తమిళ రామాయణ కర్త యగు కంబన్, పునం నంబూద్రి మొదలగు వారి రచనల నుండి రామనాట్టం కృతికర్త పెక్కు విషయములను గ్రహించెను. కాని ఎళుత్తచ్చన్ రామాయణము నతడెంతవరకు అనుసరించెనో ఖచ్చితముగా చెప్పుటకు వీలుపడకున్నది.

తంబురాన్ పదునేడవ శతాబ్దపు వాడని తెలియుచున్నది. బకవధం, కల్యాణసౌగంధికం, కాలకేతువధం మొదలగు కృతులను గూడ అతడు వెల

యించెను. ఇతర ఆట్టక్కథల కంటె ఈతని కృతులే కథకళీ నటులను మిక్కిలి ఆకర్షించెను. వానికి గల వ్యాప్తిని పురస్కరించుకొని తంబురానును తరువాతి రచయితలు కొందరనుసరించిరి. తంబురాను రచనలు సాహిత్యపు విలువగలవి అని చెప్పవచ్చును.

తంబురానునకు పిమ్మట కార్తికతిరునాళ్ (18వ శతాబ్దము) అశ్వతి తిరునాళ్ (18వ శతాబ్దము) ప్రభృతులు ప్రశంసార్హులు. కాని ఆట్టక్కథ సారస్వతములో తంబురానునకు పిదప ఉణ్ణాయి వారియర్ ప్రముఖుడుగా పరిగణింపబడుచున్నాడు. కాని అతని అసలు పేరేమో నేటికిని తెలియరాలేదు. అతడు పదునేడవ శతాబ్దపు చివరి భాగమున జీవించినట్లు తెలియుచున్నది. అతడు రచియించిన నలచరిత్రమున నాటకలక్షణములు గోచరించుచున్నవి. స్వతంత్రరచన మిది. దీనికి మలయాళ వాఙ్మయమున విశిష్టస్థానము గలదు. కథాకథనమున వారియర్ స్వాతంత్ర్యమును ప్రకటించెను. పెక్కువ్యాకరణాంశములను కూడ పాటింపలేదు. అయినను నలచరిత్రమునందలి కథాకథన విధానము అత్యద్భుతముగ నుండుటచే, ఈ వ్యాకరణదోషములు రసజ్ఞులకు స్ఫురించవు. ఇంకను ఉత్తరాస్వయంవరం, దక్షయాగం, కీచకవధం, తాటకవధం మొదలగు పెక్కు ఆట్టక్కథలు గలవు.

మహాకవి వళ్లత్తోళ్ నారాయణమీనన్ కూడ ఒక ఆట్టక్కథను వ్రాసెను. అతడు ఆట్టక్కథా రచయిత యని లోకమునకు తెలియదు. కాని పలువురతనిని కేరళ కళామండలము నందలి ప్రధానవ్యక్తిగా నెరుగుదురు. పతనావస్థకు పాల్పడిన యీ ఆట్టక్కథను పునరుద్ధరించుటకు ఈ కళామండలము అమోఘమగు కృషి యొనర్చెను. ఈ కారణము వలన కథకళి అభిమానులు వళ్లత్తోళును విస్మరింపలేరు.

## 6

## తుళ్లల్

కేరళము నందలి ప్రసిద్ధ కళావిశేషములలో తుళ్లల్ ఒకటి. దీనికి సంబంధించిన వాఙ్మయము కూడ కొంత కలదు. దీని ప్రాదుర్భావమునకు

కుంజన్ నంబియార్ అను కవిపండితుడు కారణభూతుడని చెప్పుదురు. ఇది నిజ మనియే తోచుచున్నది. తుళ్లల్ జానపద నృత్యవిశేషమని పేర్కొనదగును. ఇందులో పరయన్, సీతంకన్, ఓట్టన్ అను మూడు రకములు గలవు.

కుంజన్ నంబియార్ 1705లో జన్మించెను. ఇతని నిజ నామధేయము కూడ తెలియరాలేదు. రాఘవన్ నంబియార్ అను నతడు కుంజన్ నంబియారు గురువని తెలియుచున్నది.

కుంజన్ నంబియార్ తుళ్లల్ రచనలో ఘటికుడని పేరు పెంపులు గడించి నను, అతడు కిళిప్పాట్టు, వంజిప్పాట్టు గాథ ఆట్టక్కథ మొదలగువానిలో కూడ పెక్కురచనలు చేసెను. అతడు మొత్తము అరువదినాలుగు తుళ్లల్ రచనలు చేసినట్లు చెప్పుదురు. కాని పరిశోధకుల మతమునను సరించి అతడు నలబదియైదు రచనలు చేసెననియే చెప్పవలసియున్నది. కుంజన్ కవితలో హేళన ప్రధాన ముగా కానవచ్చును. సామాన్యమానవుని సైతము రంజింపజేయు నైపుణి అత నిలో నున్నది. అతడు సరళమైన మలయాళమునే తన రచనలయందు వాడెను. కేరళము నందలి ప్రతి కులమును అతడు నిర్భయముగా విమర్శించెను.

మరొక విశిష్టతకూడ కుంజన్ కవితలో కనబడుచున్నది. అతడేవిషయము చెప్పినను, అందులో కేరళదేశపు వాతావరణము కనబడునుండును. పౌరాణిక గాథల ద్వారమున అతడు తనకాలపు పరిస్థితులను చక్కగ వివరించెను. ఇదియే ఆతని యాశయమై యున్నట్లు స్పష్టమగుచున్నది. మొత్తము మీద తుళ్లల్ సామాన్యులను సైతము అలరించిన సాహిత్య ప్రక్రియ అనియు, కుంజన్ నంబియారు పండితాధీనమైన సాహిత్యమును ప్రజలకు సన్నిహిత మొనర్చిన ప్రగతిశీలి యనియు నుడువ వచ్చును.

తరువాతి కాలమున నివాతకవచ కాలకేయవధం, శీతంకన్ తుళ్లల్, లంకా మర్దనం, కృష్ణార్జునవిజయం, రావణవధం మొదలగు తుళ్లల్ రచనలు వెలువడెను. ఇవికూడ చక్కని రచనలని భావింపబడుచున్నవి. వీనియందు కుంజన్ నంబి యారు ప్రభావము సుస్పష్టమగుచున్నది.

## వచన వాఙ్మయము

మలయాళ సాహిత్యము అతి ప్రాచీనము కాకున్నను, అందలి యితర సాహిత్య శాఖలతో పోల్చి చూచినప్పుడు మలయాళ వచన వాఙ్మయము ప్రాచీన మనియే తోచును. ఒక రకపు వచనముపై సంస్కృత ప్రభావమును, మరొక రకపు వచనము నందు తమిళభాషా ప్రభావమును కనబడుచున్నవి. మలయాళ మున ఎనిమిదవ శతాబ్దమునుండియు శాసనములు కనబడుచున్నవి. వీని యందలి భాష వ్యావహారికము. ప్రాచీన వచన రచనలలో సాహిత్యపు విలువ అంతగా లేకున్నను, భాషాతత్త్వ పరిశీలకులకు అవి మలయాళ భాషాతత్త్వమును కను గొనుటకు తోడ్పడు ననుటలో సందేహములేదు.

మలయాళమున వెలసిన వచన రచనములందు "భాషా కౌటిల్యము" చాల ముఖ్యమైనది. కౌటిల్యుని అర్థశాస్త్రము ననుసరించి వ్రాయబడిన యీ యుద్గ్రంథము పంద్రెండవ శతాబ్దమున రచింపబడెను. మూలమునందు పదునేను ఆధ్యాయములు గలవు. కాని మలయాళ గ్రంథమునందు ఏడు అధ్యాయములు మాత్రమే లభించినవి. తమిళభాషా ప్రభావ మీ గ్రంథమునందు కనబడుచుండుట గమనింప దగిన యంశము.

సంస్కృతభాషా ప్రభావముగల మలయాళ వచన రచనలు కూడ కొన్ని కలవు. ఆట్టప్రకారం, క్రమదీపిక మొదలగునవి యీ కోవకు చెందిన వానిలో ప్రధానములు. తోలన్ అనునతడు ఆట్ట ప్రకారమును రచియించినట్లు చెప్పుదురు. అతడు కులశేఖరవర్మ యాస్థానకవి. కూత్తు, కూడియాట్టం అను నీ జానపద నృత్యవిశేషముల నెట్లు నిర్వహింపవలెనో ఆట్ట ప్రకారమునందు వివరింపబడినది. రంగాలంకరణకు సంబంధించిన వివరములు క్రమదీపికలో గలవు. ఇవి కాక మంత్రాంగం, మత్తవిలాసం, శూర్పణాఖాంగం మొదలగు వచన రచనలు కూడ గలవు. ఇవి 13–15 శతాబ్దములందు వెలుగులోనికి వచ్చియుండునని తలంచు చున్నారు.

మహాభారతమునందలి యుద్యోగపర్వమునకు సంబంధించిన కథ నభి వర్ణించు నొక వచన రచన మలయాళమున గలదు. దీనిని దూతవాక్య మందురు.

బ్రహ్మాండ పురాణం, అంబరీషోపాఖ్యానం. నలోపాఖ్యానం మొదలగు వానిని కూడ నిట పేర్కొనదగును. తమిళ వేద మనబడు తిరుక్కురళునకు పదునారవ శతాబ్దము నందే మలయాళమున అనువాద మొకటి వెలసెను. కాని యిది నేటి దాక అచ్చుపడక పోవుట చింత్యము! ఈ రచనలన్నియు గ్రాంథిక మలయాళము నందు గలవు.

## వ్యావహారిక మలయాళము

వ్యావహారిక మలయాళము వ్యాప్తిలోనికి వచ్చుటకు క్రైస్తవ మిషనరీల కృషియే కారణ మనవచ్చును. వాస్కోడిగామా 1498వ సం॥న కేరళదేశమున కాలిడెను. పదునారవ శతాబ్దమున కాథలిక్కు మిషనరీలు కేరళ తీర ప్రాంతమున స్థిరనివాసము లేర్పరుచుకొనిరి. నాటినుండియు వ్యావహారిక మలయాళమున గ్రంథరచన ప్రారంభమయ్యె ననవచ్చును. ఇట్లుండగా 1577లో జెసూట్ పాద రీలు గోవాలో ఒక ముద్రాక్షరశాలను స్థాపించిరి. వారే 1605లో కొడుణ్ణల్లూరులో ముద్రాణాలయము నొకటి నెలకొల్పిరి. ముద్రణభాగ్యము నందిన మొదటి మలయాళ పుస్తకము సంక్షేప వేదార్థము. ఇది 1772లో రోమ్‌లో ప్రచురింప బడెను.

ఆ నాళ్లలో వెలువడిన గ్రంథములందు వర్తమాన పుస్తకం పేర్కొన దగినది. పారేమ్మాక్కల్ తోమ్మాకత్తనార్ (పాదిరీ) అను నతని ప్రయాణ వృత్తాంత మిందు వర్ణింపబడెను. అతడు రోములో చాలకాలము (1778-1786) నివసించెను. ఈ పుస్తకము నందలి భాష ముద్దులు మూట గట్టుచుండును.

పందొమ్మిదవ శతాబ్దపు మలయాళ వచన రచనలలో మరొక ప్రభావము కన్పట్టుచున్నది. పందొమ్మిదవ శతాబ్దపు పూర్వార్ధమున ఆంగ్లేయుల పరిపాల నము స్థిరపడుటయు, ఉత్తరార్ధమున ప్రొటెస్టంట్ మిషనరీలు మలయాళ సాహిత్య రంగమున ప్రవేశించుటయు జరిగెను. తత్ఫలితముగ మలయాళము నందు లక్షణ గ్రంథములు, నిఘంటువులు, సులభశైలిలో వ్రాయబడిన పుస్తక ములు మున్నగునవి వెలుగులోనికి వచ్చెను. కాని మిషనరీల వచన రచన మంత ప్రశస్తమైనదికాదు. సామాన్యులకు సైతము అర్థము కావలెనను తలంపుతో వారట్టి రచనా విధానము నవలంబించిరి.

పాశ్చాత్యులు మలయాళము నభ్యసించి అందు పాండిత్యముకూడ గడించినను మలయాళ భాషను మాత్రమువారు తమవశము చేసికొనలేకపోయిరి. అందువలన వారి రచనా విధానము కొంచెము కృత్రిమముగ నున్నట్లు తోచును. అనగా వారి శైలిలో సహజత లోపించెనని నుడువదగును. అయినను, భాషాతత్త్వమును పరిశీలించువారికి వారి రచనలు అమూల్యము లనుట నిస్సంశయము.

బెంజమిన్ బెయ్‌లీ అను నతడు 1846వ సం॥న తొలి మలయాళ నిఘంటువును ముద్రించెను. కోట్టయంలో అతడొక ముద్రాక్షరశాలను స్థాపించెను. కాని మలయాళమున ప్రామాణికమైన నిఘంటువును కూర్చిన చిరయశస్సు జర్మన్ మిషనరీ యగు డాక్టర్ గుండర్టు దొరకు చెందుచున్నది. ఇది 1872లో ప్రచురింపబడెను. 1868వ సం॥న అతడొక వ్యాకరణమును కూడ ప్రకటించెను. అదియు ప్రామాణికమైన రచనయే. ఇట్లగుటచే అంతకుమునుపు మలయాళమునందు వ్యాకరణ గ్రంథములు లేవని అర్థము చేసికొనరాదు. రాబర్టు ద్రమ్మండ్, జోసఫ్‌పీట్, యఫ్. స్ప్రింగ్, యల్. గర్త్‌వెయిట్ మున్నగువారు మలయాళ భాషా వ్యాకరణములు రచియించిరి. కాని యివి యన్నియు మలయాళము నభ్యసింప నభిలషించు పాశ్చాత్యులకు ఉపయోగపడునవిగా నున్నవి. పైపెచ్చు వారు వెలిబుచ్చిన యభిప్రాయములు కొన్ని సహేతుకముగా లేవు. కనుక వానిని ప్రాథమిక రచన లనుట సమంజసము.

ఆ నాళ్లలోనే తంత్ర సముచ్చయం, వ్యవహారమాల మొదలగు వ్యాఖ్యానములు కూడ వెలసెను. పాశ్చాత్యుల వచన రచనములందు సంస్కృతభాషా ప్రభావ మంతగా గోచరించదు. సంస్కృత పండితులా రచనలలోని భాషను నీచభాష యని పేర్కొనిరి. అయినను, ఆ నాటి వ్యావహారిక భాషా స్వరూపమును తెలిసికొనుటకు ఈ రచనలు తోడ్పడును. ఇటుల ప్రారంభమయిన మలయాళ వచన రచన కేరళవర్మ వల్లియకోయిల్ తంబురాన్ నాటికి మధురము, గంభీరము నగు వచన రచనగా రూపొందెను.

పందొమ్మిదవ శతాబ్దపు మధ్యభాగమున కేరళములో నూతన విద్యావిధానము ప్రచారములోనికి వచ్చెను. దేశము నందలి వివిధ ప్రాంతములందును పాఠశాలలు స్థాపింపబడెను. తత్ఫలితముగ పాఠ్యగ్రంథములు కావలసి వచ్చెను.

సంస్కృతము నుండి పెక్కు గ్రంథములు మలయాళము చేయబడెను. ఆ యను వాదము లందలి భాష కొంచము జటిలముగానే యుండెను. తరువాతి కాలమున ఈ పాఠశాల విద్యా విధానమును తీర్చిదిద్దు నవకాశము కేరళవర్మకు లభించెను. అతడు కొన్ని పుస్తకములు కూడ రచియించెను. వానిలో మయూర సందేశము చాల ముఖ్యమైనది.

కేరళవర్మవలె కొడుంగల్లూర్ రాజవంశీయులు, వెన్మణి నంబూద్రి ప్రభృతులు రచనలు చేసిరి. వెన్మణి నంబూద్రి కావ్యములందు కొంత అశ్లీలత కానవచ్చెడి మాట వాస్తవమే యైనను. మలయాళ సాహిత్యమునకు వన్నెచిన్నెలు దిద్దినవారిలో నంబూద్రి యొకడని నుడువదగును. కె.సి. కేశవపిళ్లై గూడ ప్రసిద్ధ కవి. కాని అతని శైలి కేరళవర్మ శైలివలె అంత గంభీరముగ నుండదు; వెన్మణి నంబూద్రి శైలివలె అంత సరళముగా నుండదు. అతడు మధ్యేమార్గము నవలంబించెను. కేరళ పాణినీయ మను వ్యాకరణమును సంతరించిన ఎ. ఆర్. రాజరాజ వర్మ ప్రముఖ వైయాకరణుడేగాక సుప్రసిద్ధకవిగాను, విమర్శకుడుగాను చిర యశస్సు నార్జించెను. నేడు కూడ కేరళ పాణినీయము పరమ ప్రామాణికమైన రచనగా భావింపబడుచున్నది. మలయాళమున ఆధునిక వచనరచన మనగానే రాజరాజవర్మ పేరు స్ఫురణకు వచ్చుచుండును. నిజమున కీతడు మలయాళ వచన రచన కొక చక్కనిరూపము నొసగిన మహనీయుడు

వచన రచయితలను గురించి ప్రస్తావించునపుడు సుప్రసిద్ధ నవలారచయితలగు చందుమీనన్, సి.వి. రామన్‌పిళ్లై ప్రభృతులను గురించి చెప్పక తప్పదు. చందుమీనన్ రెండే రెండు నవలలు వ్రాసెను. వానిలో మొదటిది ఇందులేఖ అను సాంఘిక నవల. రెండవది శారద. ఈ రెండును చందుమీనన్‌కు మలయాళ సాహిత్యమున కీర్తి ప్రతిష్ఠలు సమకూర్చి పెట్టినవి.

సి వి. రామన్‌పిళ్లై కూడ సుప్రసిద్ధ రచయిత. అతడు చందుమీనన్ సమకాలికుడు. వీరిరువురును నవలారచనకు మార్గదర్శకులయిరి. చారిత్రాత్మక నవలలను రచియించుటలో అతడు సిద్ధహస్తుడు. తిరువాంకూరుచరిత్ర అతని యభిమాన విషయము. అతని తొలినవల మార్తాండవర్మ, రామరాజబహదూర్, ధర్మరాజ అను నవలలుకూడ నీతడు వ్రాసెను. ఈ మూడును చరిత్రాత్మకములు.

రామన్‌పిళ్లై ప్రేమామృతం అనునొక సాంఘిక నవలను కూడ సంతరించెను. అతనిది సంస్కృతపద భూయిష్ఠమైన శైలి.

చందుమీనన్. సి.వి. రామన్‌పిళ్లైలు పరిహాస రసికులు. వీరి రచనలందు హాస్యరసము చిప్పిలుచుండును. రామన్‌పిళ్లై మంచిభావుకుడు. ఒక్కొక్కచోట అతడు చెప్పదలచిన విషయమును, ఆలోచనచేసినగాని, మనము అర్థము చేసికొనలేము. కాని చందుమీనన్ రచన సరళముగ నుండును. అతడు వ్యావహారిక మలయాళమును వాడెను.

తొలిప్రహసనమును రచియించినవాడు కూడ సి.వి. రామన్‌పిళ్లైయే. అది యొక కళాశాలవారికోసము వ్రాయబడినదే యైనను, ప్రహసనరచనా విషయమున అదియే తరువాతివారికి త్రోవచూపెను.

ఇందులేఖలో వలె ఆనాటి నాటకములందును సాంఘిక విషయములే ప్రస్తావింపబడెను. కొచ్చుణ్ణి తంబురాన్ వ్రాసిన కల్యాణి నాటకం, కొచ్చీప్పన్‌తరగన్ రచియించిన మరియమ్మ నాటకం మొదలగునవి యీ తెగకు చెందిన నాటకములు. ఆనాటి సామాజిక జీవితమునకు కల్యాణిని దర్పణ మనవచ్చును. మరియమ్మ నాటకం క్రైస్తవుల జీవితవిధానము నభివర్ణించుచున్నది. కుంజరామన్‌నాయనార్ అనునతడు కేసరి యను గుప్తనామమున హాస్యరస స్ఫోరకములగు వ్యాసములు వ్రాసెను.

## నూతన శకము

ఇరువదవ శతాబ్ది ప్రారంభమున ఆధునిక మలయాళమున నూతనశకమారంభమయ్యె ననవచ్చును. వి.సి. బాలకృష్ణపణిక్కర్ ప్రప్రథమముగ మలయాళమున గేయరచన మొనర్చెను. అటుపిమ్మట కుమారన్ ఆశాన్ గేయములను వ్యాప్తిలోనికి తీసికొనివచ్చెను. అతడు బహుముఖ ప్రతిభాశాలి.

ఆశాన్ 'ఆశయగంభీరన్' అని వినుతికెక్కెను. అతని యాశయములు మహోన్నతములు. అతడు ఈళవ యను నొక నిమ్నజాతికి చెందినవాడు. అతని విద్యాభ్యాసము బెంగుళూరు కలకత్తాలలో సాగెను. కాగా ఆశాన్ బెంగాలీ భాష

లోను మంచి పరిచయము సంపాదించెను. సంస్కృత మలయాళములందతడు పండితుడని వేరుగ వ్రాయనక్కరలేదు. అస్పృశ్యత, జాతిభేదములు మొదలగునవి ఆతని కావ్యము లందభివర్ణింపబడిన విషయములు.

ఆశాన్ ప్రథమ కావ్యమగు వీణపూవు (రాలినపూవు) ఆనాటి మలయాళ కవిలోకమున సంచలనము కలిగించెను. ఇది 41 పద్యముల ఖండకావ్యము. ఈ పద్యములన్నియు జాతిరత్నము లనదగును. ఇది మలయాళము నందలి ప్రముఖ పత్రికలన్నిట చాలసారులు ప్రకటింపబడెను. వీణపూవునకు పిమ్మట ఆశాన్ నళిని అను మరియొక ఖండకావ్యమును ప్రచురించెను. ఇందు ప్రేమ మనోజ్ఞముగ వర్ణింపబడెను. కాని ఆశాన్ వర్ణించిన ప్రేమ మన ప్రాచీనులు వర్ణించిన శృంగారము కాదు.

దురవస్థ, చండాలభిక్షుకి, చింతావిష్టయాయసీత (చింతాక్రాంతయైన సీత) అను ఖండకావ్యములను కూడ ఆశాన్ రచియించెను. బౌద్ధగాథలనుండి కూడ అతడు ఇతివృత్తములను గ్రహించెను. ఇందుకు అతని కరుణ అను ఖండకావ్యమును ఉదాహరణముగ పేర్కొనదగును.

బాలకృష్ణ పణిక్కర్, ఆశాన్ ప్రభృతులు గేయమును వ్యాప్తిలోనికి గొనివచ్చినను, అది బహుళ వ్యాప్తిలోనికి వచ్చుటకు మరికొంతకాలము పట్టెను. ఇందుకు వళ్లత్తోళ్ మహాకవి కారణభూతు డనదగును.

ఆధునిక మలయాళ సాహిత్యమును సుసంపన్న మొనర్చిన వారిలో కుమారన్ ఆశాన్, వళ్లత్తోళ్ నారాయణమీనన్, మహాకవి ఉళ్ళూర్ యస్. పరమేశ్వర అయ్యర్ ప్రభృతులు పేర్కొనదగినవారు. వీరిని కవిత్రయ మని పేర్కొనదగును.

## మహాకవి వళ్లత్తోళ్

వళ్లత్తోళ్ 1879వ సం॥న ఒక మధ్య తరగతి కుటుంబమున జన్మించెను ఆయన తన పదమూడవ యేటనే మూడు ఖండకావ్యములను రచియించెను. కాని వాల్మీకి రామాయణానువాదము వలననే వళ్లత్తోళ్ మలయాళీలకు సుపరిచితు

దయ్యెను. అప్పటికాయన వయస్సు ఇరువదేడు సంవత్సరములు. ఆయన రచియించిన గ్రంథములలో ముఖ్యమైనవే డెబ్బదికి పైగా నున్నవి.

వళ్లత్తోళ్ కావ్యములలో మగ్దలన మరియం నుడువదగినది. ఇందు మేరీకథ మనోజ్ఞముగ నభివర్ణింప బడినది. మంచినీటిని మధుర ద్రాక్షాసవముగ మార్చివైచిన యేసుక్రీస్తు మహనీయునివలె, వళ్లత్తోళ్ మేరీ కథను మధురమోహనముగ చిత్రించినాడు. జీసస్ పవిత్ర పాదములను మేరీ తన కన్నీటి ధారలతో క్షాళన మొనర్చి, సుమపేశలమైన తన కేశములతో తుడిచి ఆ పాదములను ముద్దిడిన ఘట్టము కడు రమణీయముగా, కన్నులకు కట్టునట్లుగాను చిత్రింపబడెను. నేడు నీ (మేరీ) చుంబనమునకు సార్థకత కలిగెనని వళ్లత్తోళ్ చెప్పిన యాతీరు విస్మరింప రానిది. కాని యీ కావ్యమునందు శృంగారమునకు కొంచెము ఎక్కువగా ప్రాధాన్య మీయబడెనని కొందరు విమర్శింతురు. ఇది నిజమే అయినను, మగ్దలన మరియము నందు నిజమైన కవితయున్నది.

వళ్లత్తోళ్ విశాలహృదయుడు. పురాణగాథలనే కాక జైన బౌద్ధమత గాథలను, ఇస్లాం క్రైస్తవ మతములకు సంబంధించిన కథలను గూడ స్వీకరించి ఆయన కావ్యనిర్మాణ మొనర్చెను.

కొందరు వళ్లత్తోళను కేరళదేశపు ప్రకృతి కవియని వర్ణింతురు. మరి కొందరాయనను జాతీయ కవిగాను, అభ్యుదయ కవిగాను భావింతురు. నిజమునకు వళ్లత్తోళ్ మహాకవి. జాతీయకవి. సౌందర్యోపాసకుడు. ఏమి చెప్పినను రమణీయముగ చెప్పును. వళ్లత్తోళ్ రచనలనుండి పదునేడు కావ్యఖండికలను సంకలన మొనర్చి కేంద్రసాహిత్య అకాడెమీ వానిని ఇతర భారతీయ భాషలలోనికి పరివర్తింప జేయుచున్నది.

వళ్లత్తోళ్ వెలయించిన రచనలలో చిత్రయోగం మహాకావ్యం, ఔషధహరణం కథకళి, శాకుంతలం నాటకానువాదము, ఋగ్వేదానువాదము మొదలగునవి అతిముఖ్యమైనవి. ఇవికాక వళ్లత్తోళ్ రచియించిన గేయములు కూడ అనేకము లున్నవి. 1914లో ఆయన ప్రచురించిన అనిరుద్ధుడను కావ్యము మలయాళీ పాఠక లోకమును బహుధా ఆకర్షించెను. ఈ కావ్యము వ్యాప్తిలోనికి వచ్చుటతో కాల్ప

నిక కవిత్వమునకు కేరళమున ఆశ్రయ మేర్పడెనని నుడువదగును. ఆయన రచియించిన వందలకొలది గీతములు సాహిత్యమంజరిలో చోటు చేసికొనెను. ఇది యేడు సంపుటముల గ్రంథము.

1910లో వళ్లత్తోళ్ బధిరవిలాపం అనునొక చక్కని కావ్యమును ప్రకటించెను. ఇందు ఆత్మాశ్రయ కవిత్వమునకు ప్రాధాన్య మేర్పడెను. హృదయమును కదలించునట్టి కరుణరస భరితమైన చిక్కనికవిత యీ కావ్యమునకు పెట్టని భూషణము!

మహాకవి వళ్లత్తోళ్ గాంధీమహాత్ముని గురించి ఒక అద్భుతమగు కావ్యమును సంతరించెను. ఎంటె గురునాథన్ (నా గురుదేవుడు) అనునది యీ కావ్య నామము. మహాత్మునిలోని విశిష్ట గుణముల నన్నిటిని వళ్లత్తోళ్ ఇటుల సంస్మరించెను.

"జీసస్ ఆత్మత్యాగము, శ్రీకృష్ణుని ధర్మబుద్ధి, బుద్ధుని అహింస, శంకరుని బుద్ధికుశలత, రంతిదేవుని యనుకంప, హరిశ్చంద్రుని సత్యపరిపాలనము, మహమ్మదు స్థైర్యము మొదలగు గుణములను ఒక్కచోట దర్శింప దలచినచో నా గురుదేవుని సన్నిధికి పొమ్ము—"

మహాత్ముడనిన మహాకవి వళ్లత్తోళుకు అంత ఆదరాభిమానములు! కనుకనే మహాత్ముని మరణవార్త ఆయన హృదయమును కలచివైచెను. ఎంటె గురునాథన్ కావ్యము కఠినాత్ముని కూడ కదిలించును.

మహాకవి వళ్లత్తోళ్ తరువాతి రచనలలో క్రొత్తపోకడలు కనబడుచున్నవి. భారతదేశమునే కాక పాశ్చాత్య దేశములను కూడ చూచినపిమ్మట ఆయనలో పెక్కు నూతన భావము లుదయించెను. మనదేశపు ఆర్థిక, సామాజిక విషయము లాయనను వశము చేసికొనెను. కాగా వళ్లత్తోళ్ మహాకవి ఆధునిక కవిగాను అభ్యుదయవాదిగాను కనబడుటలో ఆశ్చర్యము లేదు.

కేరళ కళామండలమును స్థాపించి వళ్లత్తోళ్ కథకళిని పునరుద్ధరించెను. ఈనాడు కథకళి ప్రాచ్యపాశ్చాత్యుల యాదరాభిమానములను చూరగొనుచున్న

దన్నచో, అందుకు వళ్లత్తోళ్ కృషి చాలవరకు కారణ మనదగును. కేరళ జాతీయకవిగా పేరుపెంపులు గడించిన వళ్లత్తోళ్ కవిశేఖరుడు తన డెబ్బది తొమ్మిదవ యేట (13-3-1958) మరణించెను.

కుమారన్ ఆశాన్, వళ్లత్తోళ్ నారాయణ మీనన్‌లవలె ప్రతిభాగరీయస్కు డైన మహాకవి ఉళ్లూర్ యస్. పరమేశ్వర అయ్యరు మలయాళ వాఙ్మయము నకు చేసిన మహోపకారము నిక పరిశీలింతము.

ఉళ్లూర్ పరమేశ్వర అయ్యరు (1877-1949) తిరువాంకూరు ప్రభుత్వో ద్యోగి. న్యాయమూర్తిగా పనిచేసెను. సంస్కృత, తమిళ, మలయాళములం దఖండ పాండితీ సంపన్నుడు. ఆయన మహాకవి. ఉత్తమ పరిశోధకుడు. ప్రముఖ వ్యాసకర్త చరిత్రజ్ఞుడును.

పరమేశ్వర అయ్యరు రచనలలో కేరళ సాహిత్య చరిత్రమను నుద్గ్రం థము ముఖ్యముగా పేర్కొనదగినది. ఇది యైదు సంపుటముల బృహద్రచన. తిరువాంకూరు చరిత్రము నభివర్ణించు ఉమాకేరళం అను మహాకావ్యమును కూడ పరమేశ్వర అయ్యరు రచించిరి. ఇవికాక కర్ణభూషణం (కర్ణుని చరిత్ర)' పింగళ. భక్తిదీపిక మొదలగు ఖండకావ్యములను కూడ ఆయన రచియించెను.

## ఆధునిక కావ్యత్రయము

కుమారన్ ఆశాన్ కరుణ, వళ్లత్తోళ్ మగ్దలన మరియము, పరమేశ్వర అయ్యరు పింగళ-ఈ మూడు కావ్యములందును పతితలగు పడతులను గురించియే చెప్పబడుట గమనింపదగు విషయము. ఆధునిక మలయాళ కవితకు వీరు ముప్వురు రూపరేఖలు దిద్దినవారనుట అతిశయోక్తి కానేరదు. ఆధునికులు కొందరు ఆశానును అభ్యుదయ కవితాశాఖకు ప్రథమాచార్యుడని అభివర్ణింతురు. ఆశాను రచియించిన దురవస్థ, చండాలభిక్షుకి మున్నగు కావ్యములందు వర్ణ వ్యవస్థ విమర్శింపబడుట వలన ఆశానునికీ గౌరవము దక్కినది.

కవిత్రయమునకు పిమ్మట పేర్కొనదగిన కవిపండితులు కొందరున్నారు. వారిలో నలప్పాత్తు నారాయణ మీనన్ ఒకడు. అతని కణ్ణునీర్‌తుళ్ళి (కన్నీటి

చుక్కలు) ఒక చక్కని కావ్యము, ఇది 'ఎలిజీ'. తన భార్య మరణమును పుర స్కరించుకొని నారాయణమీనన్ ఈ కావ్యము రచించెను.

ఇంగ్లీషు రచయితగా, చారిత్రక గ్రంథకర్తగా విశ్వవిఖ్యాతి గడించిన సర్దార్ కె.యం. పణిక్కర్ (కావలం మాధవ పణిక్కర్) మలయాళ కవిగా, నాటకకర్తగా, నవలారచయితగా యశస్సు గడించిన విషయము చాలమందికి తెలియదనవచ్చును. ఆయన ప్రతిభ బహుముఖమైనది. చింతాతరంగిణి, పంకి పరిణయం, అంబపాలి మొదలగునవి పణిక్కరు కావ్యములలో సుప్రసిద్ధములు. ఆయన లేఖినినుండి అమూల్యము లనదగు అనువాద రచనలు కూడ వెలువడినవి. సంస్కృతము నుండియు, కొన్ని పాశ్చాత్య భాషలనుండియు ఆయన అను వాదములు చేసెను. సులభసుందరమైన శైలిలో సంతరింపబడిన సర్దార్ పణి క్కర్ స్వీయ చరిత్రము ఆంగ్లములోనికి, భారతీయ భాషలలోనికిని పరివర్తింప దగిన యుత్తమ గ్రంథము.

## రవీంద్ర ప్రభావము

ఇక సమకాలిక కవులలో మహాకవి జి. శంకరకురూప్ సుప్రసిద్ధుడని చెప్పవచ్చును. కవిత్రయమువారి తరువాత శంకరకురూప్ మహాకవిగా పరిగ ణింపబడుచున్నాడు. ఈయన కవిత్వమును మర్మకవిత్వ మనియు, లేదా సాంకేతిక కవిత్వ మనియు చెప్పుట సమంజసము. మర్మకవితను చెప్పుటలో కురూప్ సిద్ధహస్తుడు. విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు ప్రభావ మీయనపై పరి పూర్ణముగ గలదు శంకరకురూప్ పెక్కు ఖండకావ్యములు వెలయించెను. ఓటక్కూళల్ (పిల్లనగ్రోవి) అను కవితా సముచ్చయము నందు కురూప్ మధురకవిత లనేకములు అందాలు దిద్దుకొనినవి.

ఈ నడుమనే శంకరకురూప్ షష్టిపూర్త్యుత్సవము మహావైభవముగ జరిగి నది. ఆ సందర్భమున పాథేయం అను కవితా సంకలనమును కురూప్ ప్రక టించిరి. సాహిత్య అకాడెమీ వారికోరికను మన్నించి శంకర కురూప్ ఇటీవల రవికవీంద్రుని 101 కావ్య ఖండికలను (ఏకోత్తరశతి) నూట్టొణ్ణు కిరణంగళ్ అనుపేరున మలయాళము చేసినారు. ఇది ప్రశస్త మగు రచన యని వేరుగ

చెప్పనవసరము లేదు. మొత్తము మీద శంకర కురూప్ నవ్యకవితాశాఖకు చెందిన ప్రముఖ కవియనుట నిర్వివాదాంశము.

ఈ సందర్భమున చంగంపూళ కృష్ణపిళ్లై అను ప్రసిద్ధకవిని గూర్చి నుడువవలసి యున్నది. చిన్న వయసుననే అకాల మరణమునకు పాల్పడిన దురదృష్టవంతుడు చంగంపూళ. మహాకవిగా చిరయశస్సు గడించిన యాతని కవితలో గేయాంశము మిక్కుటముగ నుండును. ఆతనిది మధుర మోహనమైన శైలి. చంగంపూళ కృష్ణపిళ్లై కృతులలో ముఖ్యమైనది రమణన్ అనునొక ఎలిజీ. ఇందులో అతని మిత్రుడగు ఇడప్పళ్ళి రాఘవన్‌పిళ్లై ఆత్మహత్య వర్ణింపబడినది. రాఘవన్‌పిళ్లై కూడ ప్రముఖ కవియే. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలమునందు రమణన్ ప్రతులు అమ్ముడు పోయినట్లు మరొక మలయాళ పుస్తకము అమ్ముడు పోలేదని చెప్పవచ్చును. యువకవులు పలువురు చంగంపూళను అనుసరించు చున్నారు.

బాలామణియమ్మ, లలితాంబికా అంతర్జనం, మేరీజాన్‌తోట్టం, వెణ్ణికుళం గోపాలకురూప్, కె. కె. రాజ, పి కుంజిరామన్‌నాయర్, పాలా నారాయణ నాయర్ మున్నగువారు కూడ ప్రశంసింపదగిన యాధునిక కవులు.

మలయాళమున అభ్యుదయ కవితకు 1936 వ సంవత్సర ప్రాంతమున ప్రాధాన్యము లభించెనన వచ్చును. 1937 వ సం॥ న తిరుచూర్‌లో అభ్యుదయ రచయితల మహాసభ జరిగెను. అభ్యుదయ రచయితల రచనలకు జీవత్ సాహిత్యం అను వ్యవహార నామము కలిగెను. కాలక్రమమున దీనికి పురోగమన సాహిత్యం అనుపేరు ఏర్పడెను. ఎ. బాలకృష్ణపిళ్లై, యం. పి. పాల్, జోసఫ్ ముండస్సేరి ప్రభృతులను ఈ యుద్యమ నాయకులుగా పేర్కొనవచ్చును. యన్. వి కృష్ణవారియర్, అక్కిత్తం, వయలార్ రామవర్మ, ఒళప్పుమణ్ణ, ఒ. యన్. వి. కురూప్. పి. భాస్కరన్, ఒ. యం. అనుజన్ మొదలగువారు అభ్యుదయ కవులుగా ప్రసిద్ధి కెక్కినారు.

## నవల

సి. వి. రామన్ పిళ్లైకి పిమ్మట కూడ మలయాళమున చారిత్రక నవలా రచన కొనసాగెను. సర్దార్ కె. యం. పణిక్కర్ వ్రాసిన కేరళసింహం,

అప్పన్ తంబురాన్ వ్రాసిన భూతరాయర్ మొదలగునవి చక్కని చారిత్రక నవలలు.

ఇక తరువాతి నవలా రచయితలలో పి. కేశవదేవ్, తగళి శివశంకరపిళ్లై, మహమ్మద్ బషీర్ మొదలగువారు సుప్రసిద్ధులు. సాంఘిక నవలారచనకు వీరే మార్గదర్శకులనియు నుడువ దగును. వీరి రచనలలో వాస్తవిక దృష్టి కొట్టవచ్చి నట్లుగా కనబడును. వీలయినంతవరకు సామాజిక జీవనమును యథాతథముగ చిత్రించుటకు వీరు ప్రయత్నము చేయుచున్నారు. వీరి రచనలలో మరొక విశేషము కూడ కానవచ్చుచున్నది. వీరి నవలలందు సామాన్యులే నాయికా నాయకులైనారు; నిర్ధనులకు ప్రాముఖ్య మేర్పడినది.

కేశవదేవ్ రచించిన ఓడయిల్నిన్ను, ఉలక్క అను నీ రెండు నవలలు చాల ప్రసిద్ధములు. తగళి శివశంకరపిళ్లై వెలయించిన రండిడంగళి (రెండుశేర్లు) చెమ్మీన్ (రొయ్యలు), తోట్టియుడె మగన్ (వీథులూడ్చేవాని కొడుకు) మున్నగు నవి సుప్రసిద్ధములు. చెమ్మీన్ నవలకు సాహిత్య అకాడెమీ వారి యైదువేల రూపాయల బహుమానముకూడ లభించినది. సాహిత్య అకాడెమీ యాధ్వర్యమున రండిడంగళి, చెమ్మీన్ నవలలు గన్నవరపు సుబ్బరామయ్యగారిచే తెలుగు చేయ బడినవి. ఈ తెలుగు సేతలు ప్రస్తుతము అచ్చులో నున్నవి. తగళి రచనలలో సహజత, సాంఘిక న్యాయము మొదలగు విశిష్ట గుణములు ప్రధానముగ కాన వచ్చును.

ఇక మహమ్మద్ బషీర్ రచనలను పరిశీలింతము. బషీర్ నవలలు కేరళ దేశపు ముస్లిం సామాజిక జీవనమునకు దర్పణము లనుటలో ఆవంతయు సందే హములేదు. అభ్యుదయ వాదియగు మహమ్మద్ బషీర్ ముస్లిముల జీవిత విధా నమునందలి మంచి సెబ్బరలను నిష్పాక్షికముగ విమర్శించెను. ఆతని పరిహాస రసికత కొనియాడ దగినది. బషీర్ రచనలలో బాల్యకాలసఖి, ఎన్‌రుప్పాప్ప కొరుయానె వుండార్ను అను నవలలు చాలముఖ్యమైనవి. వీనిలో ముస్లిము లుప యోగించు మలయాళభాష ప్రయుక్తమైనది. ఎన్ రుప్పాప్ప కొరుయానె వుండార్ను (మా తాతయ్యకొక యేనుగుండేది) త్వరలోనే తెనుగులో వెలువడ నున్నది. చల్లా రాధాకృష్ణశర్మ కావించిన యీ తెలుగు సేత సాహిత్య అకాడెమీ యాధ్వర్యమున వెలువడనున్నది.

యస్. కె. పొట్టెక్కాడ్ రచియించిన విషకన్యక, మూడుపటం (పరదా) అను నవలలు, పి. సి. కుట్టికృష్ణన్ సంతరించిన ఉమ్మాచ్చు, సుందరిగళుం, సుందర న్మారుం నవలలు మున్నగునవి కూడ ఈ మధ్య వెలుగులోనికి వచ్చిన నవలలందు పేర్కొనదగినవి. సుందరిగళుం, సుందరన్మారుం సాహిత్య అకాడెమీవారి యైదువేలరూపాయల బహుమతినిపొందిన యుత్తమరచన.

## కథానిక

ఆధునిక మలయాళ సాహిత్యమున కథానికకూడ బాగుగ రూపొందినది. నేడు ఎన్నియో కథానికా సంపుటములు వెలువడుచున్నవి. వీనిలో నిజమునకు ఉత్తమ కథానికలు కూడ ననేకములు గలవు. వీనిని ఇతర భాషలలోని ఉత్తమ కథానికలతో పోల్చవచ్చు ననుట సాహసము గాదు.

ఇ. వి. కె. కృష్ణపిళ్ల, సుకుమారన్. 'యం. ఆర్. కె. సి.' ప్రభృతులు మలయాళమున కథానికలు వ్రాసిన వారిలో ఆద్యులన వచ్చును. ఇ. వి. కృష్ణపిళ్ల నాటకకర్తగా కూడ ప్రసిద్ధి కెక్కెను. నవలా రచయితలుగా పేరుపెంపులు సంపాదించిన పి. కేశవదేవ్, తగళి శివశంకరపిళ్లై, మహమ్మద్‌బషీర్ మొదలగు వారు కూడ ప్రముఖ కథానిక రచయితలనుటలో సందేహము లేదు. వీరికథలందు అభ్యుదయ వాదధోరణి ప్రవ్యక్త మగుచున్నది.

ఇంకను పొన్‌కున్నంవర్కి, కారూర్ నీలకంఠంపిళ్లై, లలితాంబికా అంతర్‌జనం, ఇ. యం. కోవూర్ మున్నగు కథానికా రచయితలు ప్రశస్తములనదగిన కథల నెన్నియో ప్రకటించినారు.

కేరళములో అక్షరాస్యులసంఖ్య అధికమన్న విషయము సువిదితమే. అచట రిక్షా లాగువారిలోకూడ చాలమంది ఏదోయొక మలయాళ దినపత్రికను చదువుచుందురు. పత్రికాపఠనము అంతవ్యాప్తిలో నున్నది! కాగా సాహిత్యమనునది యే కొద్దిమందికో సంబంధించిన దనుభావము కేరళమున సనసన్నగా తొలగిపోవుచున్న దనవచ్చును. ఇందుకు మలయాళ పత్రికలుకూడ దోహదమొనర్చుచున్నవనుట నిజమునకు దగ్గరగానుండును. అంతేకాదు; ఈ పత్రికలు సాహిత్య స్వరూపమును కూడ తీర్చిదిద్దుచున్నవని చెప్పవచ్చును.

## నాటకము

మలయాళమున నాటకరచన అంతగా అభివృద్ధి చెందలేదనియే నుడువ వలసియున్నది. కాని యీ నడుమ ప్రసిద్ధరచయితలు కొందరు నాటకములు నంతరించిరి. ఇవి ఉత్తమ రచనలని భావింప వచ్చును.

యన్. కృష్ణపిళ్లై, టి. యన్. గోపీనాథన్‌నాయర్, చెల్లప్పన్‌నాయర్, కైనిక్కరసోదరులు (కుమారపిళ్లై, పద్మనాభపిళ్లై), ఇడశ్శేరి గోవిందన్ నాయర్ మొదలగువారు ఆధునిక మలయాళమున సుప్రసిద్ధ నాటక రచయితలు. ప్రముఖ నాటక కర్తయైన ఇ. వి. కృష్ణపిళ్లై ప్రముఖ హాస్య రచయితగా కూడ యశస్సు గడించెను. హాస్యరస ప్రధానమగు రచన చేయుటలో 'సంజయన్' (యం ఆర్. నాయర్) కూడ పేరుపెంపులు గడించెను. ఈ మధ్య తొప్పిల్ భాసి అను యువ రచయిత నింగళ ఎన్నె కమ్యూనిస్టు ఆక్కి (మీరు నన్ను కమ్యూనిస్టును చేశారు). పుదియ ఆకాశం, పుదియభూమి (కొత్తఆకాశం కొత్త భూమి) అనునాటకములు వ్రాసెను. ఇవి ప్రజాదరమును చూరగొన్నవి.

## విమర్శలు, చరిత్రలు

గత యేబదేండ్లలో మలయాళమున విమర్శ, జీవితచరిత్ర, స్వీయ చరిత్ర, వాఙ్మయచరిత్ర మున్నగు సాహిత్యక్రియలలో ఉద్గ్రంథములు రచియింపబడెను. ఇది ఎంతయు హర్షింపదగిన యంశము.

జీవిత చరిత్రలు రచియించిన వారిలో పి. కె. పరమేశ్వరన్ నాయర్ ఒకరు. ఈయన వ్రాసిన సి. వి. రామన్‌పిళ్లై జీవితచరిత్ర బహుధా ప్రశంసింపదగిన రచన. పరమేశ్వరన్‌నాయర్ జీవితరచనలో అందెవేసిన చేయి అనవచ్చును. పి. కె. నారాయణపిళ్లై. ఇ. వి. కృష్ణపిళ్లై, సి. కేశవన్, కె. యం. పణిక్కర్ మొదలగు ప్రసిద్ధ రచయితలు వ్రాసికొనిన స్వీయ చరిత్రలు కూడ పేర్కొనదగినవే. యాత్రా వాఙ్మయమునకును, బాలసాహిత్యమునకును సంబంధించిన రచనలు కూడ నేడు ప్రచారములోనికి వచ్చుచున్నవి. ఈ వివిధ రచనలన్నియు ఆధునిక మలయాళ సారస్వతమును పరిపుష్టము చేయుచున్న వనుట సమంజసము.

## పరిశోధన

కథలకు కథానికలకును విశేష వ్యాప్తి లభించుచున్న యీ దినములలో కూడ మలయాళమున చక్కని పరిశోధన గ్రంథములు కొన్ని వెలువడినవి. డా. గుండర్ట్, ఎ. ఆర్. రాజరాజవర్మలకు పిమ్మట మలయాళ భాషను గుఱించియు, మలయాళ వాఙ్మయమునందలి వివిధ శాఖలను గురించియు పరిశోధనలు సాగించిన వారు చాలమంది లేరు.

తమిళ మలయాళభాషలకు గల సంబంధ బాంధవ్యములను గూర్చి ఆట్టూర్ కృష్ణపిషారోడి చేసిన పరిశోధన ప్రశంసనీయము. ఆయన పరిశోధన స్వతంత్ర పథమున సాగెను. మలయాళ భాషా తత్త్వమును గురించియు, దాని తోబుట్టు భాషలను గురించియు పరిశోధన సాగించిన వారిలో డా. కె. గోద వర్మ ప్రముఖుడు. డా. సి. ఎ. మీనన్ కూడ మలయాళ పరిశోధకులలో ప్రముఖుడే; కాని ఆయన ఎళుత్తచ్చన్ సాహిత్యము, కాళికా పూజ, కేరళ దేశపు జానపద గేయములు మొదలగు వానిలోనే ఎక్కువగా కృషిచేసెను. ఇవి ఆయన యభిమాన విషయములనవచ్చును.

ఈ నడుమ డా. యస్. కె. నాయర్ కేరళ దేశపు జానపద దృశ్య కావ్యములకు సంబంధించిన యుత్తమ గ్రంథము నొకటి ప్రకటించిరి. సారస్వత పరిశీలకులకిది అత్యంతోపయుక్త మనుట నిస్సంశయము. ప్రాచీన కావ్యమగు రామ చరితమునందలి భాషా విషయములను గురించి డా. కె.యం. జార్జి ప్రకటించిన పరిశోధన గ్రంథము కూడ పేర్కొనదగినది. భాషాతత్త్వ పరిశీలకుల కిది మిక్కిలిగా తోడ్పడు ననుట అత్యుక్తికాదు. ఈ సందర్భమున శూరనాడ్ కుంజన్‌పిళ్లై, ఇళం కుళం కుంజన్‌పిళ్లై మొదలగు వారిని కూడ సంభావింప వలెను. కేరళ దేశపు చరిత్రను గూర్చియు, ప్రాచీన మలయాళ భాషను గురించియు వీరు పరిశోధనలు చేసిరి.

## అనువాదములు

సాహిత్యము ద్వారా భావైక్యమును సాధింపదలచిన యీ నాళ్లలో అను వాదముల యావశ్యకత ఎంతేని కలదు. ఈ విషయమును మలయాళ రచయి

తలు గుర్తించి రనియే చెప్పవలెను. పాశ్చాత్య భాషల నుండియే కాక వివిధ భారతీయ భాషలనుండి కూడ అనువాదములు చేయబడుచున్నవి. కాని పాశ్చాత్య భాషలనుండి చేయబడిన అనువాదములతో పోల్చి చూచ్చినప్పుడు, భారతీయ భాషలనుండి యితోధికముగ మలయాళమున అనువాదములు వెలువడవలె నని స్థూలదృష్టికి కూడ తోచును.

ఇంతవరకు బెంగాలీ, హిందీ, మరాఠీ భాషల నుండియే ముఖ్యముగా అనువాదములు చేయబడినవి తత్ఫలితముగా సుప్రసిద్ధ రచయితలగు రవీంద్రనాథ ఠాకూరు. బంకించంద్ర ఛటర్జీ శరత్‌చంద్ర ఛటర్జీ. రమేశచంద్ర దత్తు, ద్విజేంద్రలాల్‌రాయ్, ప్రేమ్‌చంద్. రాహుల్‌సాం కృత్యాయన్. వి యస్.ఖండేకర్ మొదలగు వారు మలయాళ పాఠక లోకమునకు సుపరిచితు లయినారు. ఈ నడుమ ఇ. కె దేవకరన్‌పొట్టి అను నతడు గోదాన్, వోల్గాసేగంగా అను గ్రంథముల ననువదించి ప్రకటించెను ఇవి మలయాళీల యాదరాభిమానములను చూరగొనినవి.

హిందీ మొదలైన భాషలనుండి కొన్ని రచనలు మలయాళము చేయబడినట్లే, కొన్ని మలయాళ నవలలు, కథానికలు మొదలగునవి హిందీ మొదలగు భాషలలోకి పరివర్తింప బడినవి. అట్టి వానిలో సర్దార్. కె. యం. పణిక్కర్ వ్రాసిన కేరళ సింహం, తగళి శివశంకరపిళ్లై రచియించిన రండిడంగళి, చెమ్మీనులు, వళ్లత్తోళ్ నారాయణమీనన్ పదునేడు కావ్యఖండికలు, ముహమ్మద్ బషీర్ సంతరించిన ఎన్‌రుప్పాప్పకొరు యానె వుండార్ను మొదలగునవి పేర్కొనదగినవి ఈ యనువాదము లన్నియు కేంద్ర సాహిత్య అకాడెమీ వారి యాధ్వర్యమున వెలువడినవి.

ఈ 'యిచ్చి పుచ్చుకొనుట' యింకను కొనసాగవలెను. కాని ఈ యనువాద కార్యక్రమమునకు మంచి అనువాదకుల తోడ్పాటు లభింపవలెను. మనమీ విషయమును విస్మరింపరాదు. హిందీ సంస్కృతములు తెలిసిన మలయాళ రచయితలు మాత్రము పలువురు గలరు.

అధునిక మలయాళ సాహిత్యము నందలి వివిధ ప్రక్రియలను గురించి స్థాలీపులాకముగా ముచ్చటింప బడినదే కాని, విపులముగా చర్చింప బడలేదు.

కనుక ఆధునిక మలయాళ సాహిత్యములోని ముఖ్యలక్షణములను పరిశీలింతము.

## ఆధునిక మలయాళ సాహిత్యము - సింహావలోకనము

పూర్వకాలమున రాజ వంశీయులను సంతృప్తి పరచుటకు కవులు ప్రయత్నించిరి. అందువలన పాండిత్య ప్రకర్షకు ప్రాధాన్య మేర్పడెను. అంతేకాదు, రాజ వంశీయులకు నచ్చిన విషయములనే కవులు చెప్పదొడగిరి. వారు వాడిన భాష కొంచెము కృత్రిమముగ నున్నట్లు కనబడును. పరిస్థితులు తారుమారగుటతో రచయితల దృష్టిలో కూడ మార్పు ఏర్పడినది. ఆధునిక రచయిత సామాన్య మానవుని సంతృప్తి పరచుటకు అభిలషించుచున్నాడు. కనుక ఇతివృత్తము నందును, భాషయందును మార్పులేర్పడినవి. సంస్కృతపద భూయిష్ఠమైన భాషనుగాని, కృత్రిమమగు మలయాళ గ్రాంథిక భాషనుగాని వాడుటకు ఆధునిక మలయాళ రచయిత సుముఖుడుగా లేడు. అందువలన చెప్పదలచిన విషయమును సరళశైలిలో చెప్పుట కతడు యత్నించుచున్నాడు. అనగా వ్యావహారిక భాషకు సన్నిహితముగ నుండు భాషను అతడు స్వీకరించెను. కథానికలు నాటికలు మొదలగు వానిలో వాడుకభాషను సులభముగా ఉపయోగింపవచ్చును. కావ్యములందును, గీతములందును సులభ సుందరమైన భాషను వాడవచ్చునని చంగంపూళ కృష్ణపిళ్లై, ఆతని యనుచరులు సంతరించినరచనలను పరిశీలించుచో తెలియగలదు. చంగంపూళ ఉపయోగించిన భాష చాల సరళమైనది. ఆధునిక రచయితలు జటిలము లగు సంస్కృత ఛందముల నుపయోగించుటలేదు. వీలయినంతవరకు గేయాంశముగల ప్రాచీన మలయాళ ఛందములను స్వీకరించుచున్నారు. ప్రాచీర సాహిత్యము సామాన్య మానవునికి మోయరాని బరువగుటచే, అది కేరళమునందు బహుళ వ్యాప్తికి రాలేక పోయెను. కాని ఆధునిక మలయాళ రచనలను విద్యాసంస్కారములుగల పలువురు పఠించుచున్నారు. నిజమునకిది కొనియాడదగిన విషయము. ప్రజలలో పఠనాసక్తి యేర్పడుట అభ్యుదయ చిహ్న మనవచ్చును.

ఆధునిక మలయాళ సాహిత్యమునందు సామాన్య మానవునికి కూడ అభిరుచి కలుగుటకు కారణము అందలి భాషా సారళ్యమే అనుట అసమంజసము.

ఆధునిక రచయితలు స్వీకరించు ఇతివృత్తములు కూడ అందుకు కారణము లన దగును. ఆ యితివృత్తములు సామాన్యులను రంజింప జేయుచున్నవి. అందువలన సమగ్ర జీవితమును చిత్రించుటకు రచయిత పూనుకొనుట లేదు. జీవితమునందలి వివిధ భాగములను ఆధారము చేసికొని అతను రచన సాగించుచున్నాడు. అభ్యుదయ రచయితలు సామాన్య మానవుని జీవితమునే తమ రచనలకు ఇతివృత్తముగా గ్రహించిరి. అంతవరకు సాహిత్యమునందు సామాన్యునకు స్థానము లభించక పోవుటచే, అభ్యుదయ రచయితల రచనలకు ప్రచుర ప్రచారము లభించెను. ఆటుపిమ్మట సామాన్య మానవుని ఆర్థిక సమస్యలకు సంబంధించిన విషయములే ఇతివృత్తము లయ్యెను. కాగా పేదసాదుల ఆర్థికదుస్థితి నభివర్ణించు కావ్యములు, కథలు పెక్కులు సంతరింపబడెను. కొందరి రచనలను పరిశీలింపగా, ఆ రచయితలు కేవలము ఆకలి మంటలను గూర్చియు, పతితలగు స్త్రీలను గూర్చియు వ్రాయుటకు నిర్ణయించుకొనిరేమో అనిపించును. సంఘమునందలి యీ కుళ్లును తొలగించుటకు కొందరు రచయితలు ముందడుగువైచిరి.

ఇది యిట్లుండగా, ప్రతి రాజకీయ పక్షము తన సిద్ధాంతములను వ్యాప్తిలోనికి తీసికొని వచ్చుటకు ప్రయత్నించెను. అందువలన తమకు నచ్చినట్లుగా రచనలు చేయదలచిన రచయితలు కొందరు రాజకీయ పక్షములతో సంబంధము పెట్టుకొనలేదు. ఈ కారణమున రాజకీయ పక్షములతో సంబంధముగల రెండవ రకపు రచయితలకు ప్రాధాన్య మేర్పడెను. అందువలన అట్టి రచయితల వ్రాతలు 'పార్టీ సాహిత్యము'నకు దారి తీసినవి. అంతేకాక ప్రచారాత్మకమైన సాహిత్యము ప్రచారములోనికి వచ్చెను. కాని ఆ రచనలకు సాహిత్య గౌరవము లభింపలేదు.

ఈ సందర్భమున మరొక విషయమును కూడ పేర్కొనవలెను. యువ రచయితలు కొందరు విద్వత్తనిన చిన్నచూపు చూచుచున్నారు. పరిహసించు వారును కొందరు గలరు. ఇది మంచి లక్షణము కాదు. పూర్వకాలమున పండితులు ప్రభువుల నాశ్రయించిరి; వారిని బహుముఖముల ప్రశంసించిరి. మన మా పొగడ్తలను తెగడుచున్నాము కాని దురదృష్ట వశమున, ఆ విధానమునే నేడును మరొక రీతిని మన మవలంబించుచున్నాము. ఆధునిక సాహిత్యమునందు కార్మి

కుడు కథా నాయకుడైనాడు. వయోజనులకు ఓటింగు హక్కు ఏర్పడుటతో సమాజమున కార్మికునిదే పై చేయిగా నున్నది. కనుక వారు శక్తిమంతులైనారు. కార్మికుని ప్రశంసించుట వలన తమ కేదో కలుగునను నభిప్రాయము రచయిత లలో నున్నట్లు కనబడుచున్నది. ఉపాధ్యాయవృత్తి, న్యాయవాదవృత్తి మొద లైన వృత్తులకంటె కార్మికుని వృత్తియే ప్రశస్తమైనదని భావింపవలెనా ? ప్రతి వృత్తియు ప్రశస్తమైనదే కనుక హెచ్చుతగ్గులకు చోటులేదు. ప్రస్తుతము మన దేశమునందు మధ్య తరగతి కుటుంబములకు చెందిన విద్యావంతులు నిర్వహింప దగు ప్రముఖ పాత్ర తగలదు.

ప్రజాస్వామిక సమాజమునందు ఓటరును విద్యావంతునిగ జేయు బాధ్యత రచయితపై గలదు. వివిధ రాజకీయ పక్షములకు చెందిన రచయితలు తమ పార్టీ సిద్ధాంతములను తమ రచనల ద్వారా వ్యాప్తిలోనికి తీసికొనివచ్చుచున్నారు. ఇట్లొనర్చుటచే రచయిత తన విధ్యుక్త ధర్మమును సక్రమముగా నిర్వర్తించుట లేదని చెప్పనగును. కాని కేరళములో రాజకీయ పక్షములతో సంబంధములేని ప్రముఖ రచయితలు పలువురున్నారు. వారికి సమాజమున గౌరవ ప్రపత్తులు గలవు. అట్టి రచయితలు నిష్పాక్షికముగ ప్రవర్తించుచు తమ యభిప్రాయము లను నిర్భయముగ వెలిబుచ్చుచున్నారు. కాని రచయితలందరు నొక్క త్రాటిమీద నిలువగలిగిన నాడు మలయాళ భాషావాఙ్మయములందు నూతన శకము ప్రారం భము కాగలదు. ఇందుకు నిష్పాక్షికముగ ప్రవర్తించు ప్రముఖ రచయితలు ప్రయత్నింపవలెను.

ఇతర భాషలలో వలె, ఆధునిక మలయాళ సాహిత్యము నందును వచన వాఙ్మయమునకు ప్రచుర ప్రచారము లభించినది. కావ్యములకు గల ప్రచారము తగ్గుముఖము పట్టుచున్నది. ఇట్లనుటచే ఈ నాళ్ళలో కావ్యములు వెలువడుట లేదనియు, వానికి ప్రచారము లేదనియు భావింపరాదు.

ఆధునిక మలయాళ రచయిత లనేకులపై రష్యన్ రచయితల ప్రభావము మిక్కుటముగా కానవచ్చుచున్నది. అందువలననే ప్రసిద్ధ రష్యన్ రచయితల గ్రంథము లనేకములు మలయాళము చేయబడినవి.

పూర్వకాలమున పండితులు కవులు మున్నగువారు రచయితలుగా పరిగణింప బడిరి. కాని యీ నాళ్ళలో ప్రజలెల్లరు రచయితలే అనిపించుచున్నది. విద్వత్తునకు విలువ తగ్గుటతో, ఏ మాత్రము విద్యాసంస్కారము గలవారును నేడు మలయాళమున వచన రచనలు చేయుచున్నారు. అవి ప్రజల యాదరాభిమానములను కూడ చూరగొనుచున్నవి వీనిలో కొన్ని సాహిత్య చరిత్రలో స్థానము సంపాదించుకొన్నవి కూడ.

యుద్ధమును ప్రాతిపదికగా చేసికొని సైన్యములో పని చేయుచున్న కొందరు ఈ నడుమ చక్కని నవలలు ప్రకటించియున్నారు. వీరు పండితులు కారు. అయినను, వీరి రచనలు ప్రజా బాహుళ్యమునకు రుచించినవి. ఈ కోవకు చెందిన రచయితలలో 'పారప్పురం' అను గుప్తనామముగల కె. యి. మత్తాయ్, 'కోవిలన్' 'నందనార్' మొదలగువారు ముఖ్యులు.

పారప్పురం రచియించిన నిణమణింజ కాల్పాడుగళ్ (నెత్తుటి కాలియడుగులు), అన్వేషిచ్చు కణ్డెత్తిల్ల (అన్వేషించాను కాని కనబడలేదు) అను నవలలు మలయాళ పాఠకులను మిక్కిలి ఆకర్షించినవి.

ఉపసంహారమున సాహిత్య మనునది యే కొద్ది మందికో లేదా ఒక వర్గమునకో సంబంధించినది కాదనియు, అది ప్రజలందరకు సంబంధించినదనియు అధునిక మలయాళ సాహిత్యమును పరిశీలించిన ప్రవ్యక్తమగును. ప్రజలే పాఠకులు, ప్రజలే రచయితలును. అందువలన ప్రజావాఙ్మయ నిర్మాతలు ప్రజలు మాటాడుకొను వ్యావహారిక మలయాళములోనే గ్రంథరచన చేయుటకు అభిలషించుచున్నారు.

---

# మహారాష్ట్ర సాహిత్య

## సంగ్రహము

రచన

గుండేరావు హర్కారే



# మహారాష్ట్రి భాష-ప్రారంభ కాలము

పరిశోధకుల యభిప్రాయముల ననుసరించి ప్రస్తుత మరాఠీభాష, సంస్కృతము-పాలీ-అర్ధమాగధి-పైశాచి-మహారాష్ట్రి యను నైదుభాషల యపభ్రంశ స్వరూపముల సంయోగము వలన నుద్భవించినదని తెలుచున్నది.

పదియవ శతాబ్దము నాటి యపభ్రంశ స్వరూపములైన మహారాష్ట్రి జైన మత గ్రంథములలో, మరాఠీ శబ్దము లధికముగా నుండుటవల్ల నిట్లూహించుట కవకాశ మెక్కువగా నున్నది. కాని మరాఠీభాష యపభ్రంశముల వల్లనే యేర్పడిన, యపభ్రంశ రూపమని మాత్రము ఊహింప గూడదు. ఏలనన, యెన్నియో ప్రాకృత భాషలవల్లను, విదేశీయ భాషలవల్లను జన్మించిన మరాఠీ భాషలో సంస్కృతీకరణము గూడ నొక విశిష్టమైన ముఖ్యాంశము.

ఈ భాషయొక్క కాలనిర్ణయము శిలాశాసనములు, తామ్రపత్రములు, ప్రాచీన గ్రంథములు మొదలగు వానివల్ల చేయవచ్చును. ఉద్యోతన సూరి యను పండితుడు 7వ శతాబ్దములో కువలయమాల యనునొక గ్రంథమును రచించెను. అందుకొన్ని మరాఠీ శబ్దములు గలవు. అట్లే శా॥ శ॥ 1129లో చాళుక్యరాజగు సోమేశ్వరుడు రచించిన "మానసోల్లాసము లేక అభిలషితార్థ చింతామణి" యను గ్రంథమున గూడ కొన్ని మరాఠీ శబ్దములున్నవని శ్రీ వి. ల. భావేగారు నుడివి యున్నారు. దీనినిబట్టి మరాఠీభాష 7 – 8 శతాబ్దాలలో ప్రారంభమైనదని చెప్పవచ్చును.

కాని మరాఠీ భాషోత్పత్తిని గూర్చిన కాలనిర్ణయము దీనివల్ల కాజాలదని కొందరు తమ యభిప్రాయముల వెలిబుచ్చి యున్నారు.

దేశమంతటను బౌద్ధమతము పరివ్యాప్తమగు నప్పుడు, మతవిషయకములైన వివిధ విప్లవము లధికముగా చెలరేగెను. వైదిక-ధార్మిక-సంప్రదాయములలో నెన్నియో మార్పులు గలిగెను గోపరాష్ట్రము-నల్లరాష్ట్రము-పాండురాష్ట్రము-అపరాంతము-విదర్భ-అశ్మక – మొదలగు రాష్ట్రములా కాలముననే క్రొత్తగా స్థాపింపబడెను-బహుశా అప్పుడే యీ మహారాష్ట్రమను సంకేత శబ్దము పుట్టి

యుండ వచ్చును. ఈ శబ్దము క్రీస్తుకు పూర్వమునుండియే వాడుకలోనికి వచ్చినది. హ్యూ-ఎన్-త్సాంగ్, వాత్స్యాయనుడు, వరరుచి-దండి-మొదలగువారు-మహారాష్ట్ర శబ్దమును, తమరచనలలో పేర్కొని యున్నారు. మహా మహోపాధ్యాయ, పి వి. కాణేగారు, "మహాకాంతారమను శబ్దమునుండి మహారాష్ట్రమను పదముద్భవించినదని తమ యభిప్రాయమును వెల్లడించి యున్నారు. మహర్ + రట్ట=మహారాష్ట్ర యయ్యెనని మరికొందరి వాదనలు కలవు.

మైసూరు ప్రాంతమును పూర్వము గంగవంశపు రాజగు రాజమల్లుడు పాలించు చుండెను. అతని మంత్రి చాముండరాయుడు-శ్రావణబెళగోళ లోని "బాహుబలి లేక 'గోమటేశ్వరు'ని శిలావిగ్రహమును క్రీ. శ. 983 లో స్థాపించి యుండెను. అచట నొక శాసనము కూడ కలదు. ఆ శిలాశాసనము నందలి మొదటివాక్యము 'చాముండరాయే కరవియలే' (చాముండ రాయుడు చేయించెను) అని మహారాష్ట్ర భాషలో వ్రాయబడి యున్నది. శ్రీరాజవాడేగారు దీనికంటె పూర్వము క్రీ శ. 736 నకు చెందిన నొక తామ్రశాసనములో మరాఠీ శబ్దములు గలవనియు నది "చికుర్డే" గ్రామమున లభించినదనియు ప్రకటించి యున్నారు.

ఈ ప్రమాణముల ననుసరించి మరాఠీ భాష 7-8 శతాబ్దములలోనే జన్మించినదన్న వాదము రూఢియగు చున్నది.

జ్ఞానేశ్వరుడు గూడ తన గీతాభాష్యమున "నేను మరాఠీలో అనగా సులభమైన భాషలో చెప్పుచున్నా"నని మరాఠీ శబ్దమును సులభార్థములో వాడి యున్నాడు.

ఈ మరాఠీ భాషాభివృద్ధికి భక్తకవులు, పండితకవులు, సంప్రదాయ ప్రవక్తలు-బహువిధముల తోడ్పడి యున్నారు. భక్తకవులు తమ తమ ఉపదేశ గ్రంథములు వ్రాసియు; పండితకవులు రస, భావాద్యలంకారములతో నిండిన రచనలు చేసియు; సంప్రదాయ ప్రవక్తలు జ్ఞాన-భక్తి యోగాదులను ప్రబోధించు పుస్తకములు వ్రాసియు దీని ననేకవిధముల ప్రచారము గావించి యున్నారు. ముకుందరాజీ భాషలో నాదికవి యని చెప్పవచ్చును. ఇతనికి పూర్వమే నాథ సంప్రదాయము స్థాపింప బడుటచే నీ సంప్రదాయమునకు జెందిన పారిభాషిక

పదములు మరాఠీలో రూఢమై యున్నవి. దీని తరువాత మహానుభావ సంప్రదాయ మేర్పడి తాత్త్వికములును, భక్తిజ్ఞాన పరములునైన, శాస్త్రీయ పారిభాషిక పదములు వాడుకలోనికి వచ్చినవి.

తరువాత జ్ఞానదేవు డుదయించి "జ్ఞానేశ్వరీ" యను ప్రఖ్యాతమైన గీతా భాష్యమును రచించెను. ఇతడు జ్ఞానము, భక్తి-వైదికధర్మము మొదలగు విషయములను ఉపమానోత్ప్రేక్షాద్యలంకారములతో చక్కగా వివరించి భాషకు వన్నెబెట్టెను. వీరి యనంతరము నామదేవాదులు భక్తిరస ప్రాముఖ్యమును దెలుపు రచన లనేకములు గావించి భక్తిరస సాహిత్యమును విస్తరింప జేసిరి.

మహమ్మదీయుల దండయాత్రల వల్లను, కరువు కాటకముల వల్లను తర్వాతి కాలమున వాఙ్మయాభివృద్ధి కుంటుపడి పోయెను. ఐనప్పటికి భాషాసేవ నొనర్చు కవులు-భక్తులు-జన్మించక పోలేదు. ఏకనాథుడు తన కవితతో తత్త్వ ప్రచారము గావించి భాష బాహ్యాంతర రంగములను సుందర మొనర్చెను.

అనంతరము పండిత కవియైన ముక్తేశ్వరు డుదయించి మరాఠీలో మహాభారతమును రచించి సాహితీదృష్టితో భాష నలరార జేసెను.

భక్తుడైన తుకారాం తన సూక్తులతో సమాజము నుద్ధరించెను. రామదాస స్వామి భక్తి-జ్ఞానము, సామాజిక విషయములనే గాక రాజకీయ విషయములను గూడ ప్రబోధించెను. భక్తకవులలో యితడే చివరివాడు.

వామనుడు మొదలగు పండితకవులు ప్రబంధశైలిలో కావ్యరచన మొనర్చి భాషామతల్లికి బహుళముగా సేవజేసిరి. కవిసార్వభౌముడు, మోరోపంత్, బంధ కవితాద్యనేక ప్రఖ్యాత కావ్యములు వ్రాసి కృతార్థుడయ్యెను.

ఇంతవరకు మరాఠీ భాషలో భక్తి-జ్ఞాన వైరాగ్యాద్యనేక, సారస్వతము లభివృద్ధి జెందినవి. సమర్థ రామదాసస్వామి భక్తిజ్ఞానములను ప్రబోధించుటయే గాక, రాజకీయములను వ్యావహారిక విషయములను దేశభక్తిని గూడ ప్రబోధించు సాహిత్యమును చక్కగా పెంపొందించెను.

మరాఠీ వాఙ్మయ సేవా తత్పరులైన యీ సత్పురుషులు కేవలము భక్తి-జ్ఞాన వైరాగ్యములలో పారవశ్యులైన మహామహులు మతప్రవక్తలు కవులు-పండితులు మాత్రమే తప్ప ధనాశచే తమ కావ్యములను ధనికుల కంకితముజేసి బహుమతుల పొందగోరిన వారెవ్వరును లేరు.

ఇంతవరకభివృద్ధిజెందిన భాషకు రాజపోషణ యనునది బొత్తిగాలేదు గ్రంథకారులందరు స్వయముగా భిక్షాటనము జేయుచు, ఉపవసించుచు, దేశాటన చేయుచు భావుకులై బహువిధ సముచిత శబ్దరచనతో భాషాదేవి నలంకరించిరే కాని, తామెట్టి ద్రవ్యలాభమును అనుభవించిన వారుకారు. వీరు కేవలము పారమార్థిక దృష్టితోడనే రచనలు సాగించిరనుటకు "కర్ణాట కిరాట కీచకులకమ్మ త్రిశుద్ధిగనమ్మ భారతీ" యను పోతనామాత్యుని సూక్తియే యిందుకు తార్కాణముగ స్ఫురించును. దేవగిరి యాదవవంశపు రాజైన రామదేవరావు తన యాస్థానములో నున్న నరేంద్రుడను కవి వ్రాసిన రుక్మిణీ స్వయంవరమను గ్రంథమును విని సంతోషించి ఆ గ్రంథమును తన కంకితమిచ్చిన బహుమతి నొసంగుదునని పలుకగా, నతడు వాణీవిక్రయమున కంగీకరింపక తన యుద్యోగముతో బాటు దేశమును గూడ వదిలి వెళ్ళిపోయెనట.

వీరి యనంతరము సారస్వత క్షేత్రమున కొన్ని మార్పులు గోచరించును షాహిరీ కవిత్వ కాలమున లావుణీ పోవాడలను క్రొత్త మార్గములలో కవిత్వమల్లి కొందరు ద్రవ్యార్జనకై ధనికుల కంకిత మొనర్చిరి.

నవ్యయుగమున కవితాసుందరి తన ప్రాచీనస్వరూపమును పూర్తిగా మార్చుకొని నవీనరూపధారణ మొనర్చినది. ఆంగ్లవాఙ్మయము ననుకరించుచు గద్యరచన లనేకము ప్రారంభింపబడినవి. వీనిలో సామాజిక, వ్యావహారిక, రాజకీయ విషయములను గూర్చిన రచనలే మెండుగానున్నవి. ఈ రీతిగా మరాఠీ భాషయొక్క వృద్ధి క్రమమును సామాన్యదృష్టితో పరిశీలించిన యెడల "ఊర్ధ్వమూల మధఃశాఖం అశ్వత్థ ప్రాహు రవ్యయం" అను గీతావాక్యము జ్ఞప్తికివచ్చును పైన మూలమును క్రింద కొమ్మలు గలదియనగు అశ్వత్థము నాశరహితమైనది. మరాఠీభాషా కల్పలత నాశములేనట్టి శబ్దబ్రహ్మయొక్క విశ్వరూపము-మరాఠీ వాఙ్మయమున యుపనిషత్తులలో ప్రతిపాదించిన జీవబ్రహ్మైక్య విచారము, యోగా

ఖ్యానము మొదలగు పవిత్రములైన యభిప్రాయములతో అనగా, బ్రహ్మవిచార ముతో రచన ప్రారంభమైనది. ఇదియే యూర్ధ్వమూలము. ఈ భాషా కల్పలత మూలములు దిట్టముగా బ్రహ్మయందే నాటుకొని శాశ్వతస్థితిని సంపాదించినవి. ముకుందరాజు మొదలుకొని, జ్ఞానదేవుడు, నామదేవుడు, తుకారాం వరకుగల సత్పురుషులీకల్పలత యాలవాలమున నవిచ్ఛిన్నముగా (500) ఐదువందల సంవత్సరములవరకు జ్ఞానయోగధర్మ – శ్రద్ధాభక్తిమయములగు రచనాస్వరూప ములలో యమృతధారల ప్రవహింపజేసి. భాషావల్లిని చక్కగా నభివృద్ధిజేసి నారు. తర్వాత సమర్థరామదాసస్వామి దేశభక్తి-రాజకీయము, ధైర్యము, స్థైర్య ములను స్తంభములచే పందిరివేసి, భాషాలతను వెల్లివిరియునట్లుజేసెను. వామన పండితుడు, శ్రీధరుడు, మోరోపంతు మున్నగువారు అలౌకిక పరిమళముల వెద జల్లు పుష్పములను కావ్యరసములతోనిండిన ఫలములను పండించినారు. ఆధుని కులు పాశ్చాత్యసాహితీ సంపర్కమువలన అపూర్వమైన, క్రొంగ్రొత్తరీతుల నవ లంభించి భాషాస్రవంతిని తమ కవితాధారలతో నమృతవాహినిగాజేసి ప్రవహింప జేయుచున్నారు.

# వర్ణ సమామ్నాయము

## వ్యాకరణము

1. మరాఠీభాషలో అచ్చులు-హల్లులు-తెలుగుభాషలో యున్నటులనే యున్నవి.

2. వాని కంఠతాలవ్యమూర్ధన్యాది యుచ్చారణ స్థానములుగూడ తెలుగు భాషను ననుసరించియే యున్నవి.

3. చవర్గమున పూర్తిగా దంతతాలవ్యములు రెండును గలవు.

4. దంత్యచవర్గము కేవలము "దేశీ" యోచ్చారణలోనే యున్నది.

5. అనునాసికములవాడుక యీ భాషలో నధికముగా గలదు ప్రాయశః శుక్ల యజుర్వేదమునకు సంబంధించిన కాత్యాయన ప్రాతిశాఖ్యానుసారమీ

యుచ్చారణ చేయబడును. ఫారసీ-హిందీ-ఉరుదూ భాషలలోకూడ దీని నుచ్ఛ రింతురు. ఫారసీలో అనునాసికమును "నూనెగున్నా" యందురు. తెలుగులో దీనిని "అరసున్న" ద్వారా చూపుదురు.

మరాఠీభాషకు భీష్మాచార్యపండితులు ప్రథమ వ్యాకరణకర్త - వీరు మహానుభావ సంప్రదాయమునకు జెందినవారు వీరు రచించిన ప్రథమ ఛందో గ్రంథమును "పంచవార్తిక" మందురు.

యాదవవంశపు రాజులలో రెండుశాఖలు గలవు. ఒకశాఖ మహారాష్ట్ర మండలి దేవగిరిలో "సేవుణయాదవవంశమను" పేర బరగుచుండెను. వీరి రాజ్యము ఉత్తర దేశమున నెక్కువగా వ్యాపించియుండెను. రెండవది హోయసల యాదవవంశము. వీరలరాజ్యము కర్ణాటకమున వ్యాపించినది. వీరు ద్వారసము ద్రమును రాజధానిగా జేసుకొని పాలించిరి. భీష్మాచార్యపండితులు దేవగిరిని పాలించిన రామదేవరావు కాలమువారని చారిత్రకులు నిర్ణయించినారు. తర్వాత 19వ శతాబ్దిలో దాదాజీ కొండదేవుడను నాతడొక వ్యాకరణమును రచించెను. దీని యాధారముననే యీ మధ్య కొందరు పాఠశాలల కుపకరించు వ్యాకరణ శాస్త్రముల రచించిరి.

తెలుగుభాషలోనున్నట్లు గ్రాంథిక - వ్యావహారిక భాషాభేదములు మరాఠీ భాషలో లేవు. ప్రాచీనములైన ప్రకృతి ప్రత్యయ రూపములందేమాత్రమును మార్పుగలుగక, యీ నాటికిని వ్యవహరింపబడుచునే యున్నవి. సామాన్యముగా శిక్షితులుకానివారు వాడుకొనుభాషలో ప్రాంతీయభేదముల వల్లను, ఇతరములగు కొన్నికారణముల వల్లను, కొద్దిగా భేదములున్నను సాధారణముగా మహారాష్ట్ర దేశమంతటను పండితులొకేవిధమగుభాషను మాట్లాడుచున్నారు. ప్రాచీనకాలమున వాడిన శబ్దములస్థానే కాలక్రమమున క్రొత్తక్రొత్త శబ్దములు చేరియున్నను, "వచ్చుచున్నాడు" అనుదానికి "వస్తున్నాడు" అనునట్లు ప్రత్యయాంత రూపము లలో మాత్రము మార్పులు జరుగలేదు.

మహారాష్ట్రదేశమంతటను నాలుగువిధముల ఉపభాషలు వాడుకలో నున్నవి. ఈ యుపభాషలలో కొంకణిభాష అత్యంత భిన్నమైనది. ఇతరములగ

మరాఠీ యుపభాషలతో పోల్చిచూచినచో యీ కొంకణీభాష పూర్తిగా భిన్నభాషగా నుండి యితరుల కర్థము గానట్టిదిగా నుండును. కాత్రేయనువాడు యీ భాషకు, "Grammar of konkani" అను వ్యాకరణమును రచించెను. ఈ కొంకణీ భాషకు స్టీవన్సుకూడ ఇంగ్లీషులో నొకవ్యాకరణ గ్రంథమును వ్రాసియున్నాడు. ఈ భాషలో సారస్వత సాహిరోబాయనువాడు ఆదికవి. కాని, యితనికవిత యంతయు సాధారణమైన మరాఠీ భాషలోనే యున్నది. ఈ మధ్య కొందరు పండితులు కొంకణీభాష సార్వత్రికముగా వాడబడు మరాఠీ కంటె భిన్నముకాద నియు కేవలము ఉచ్చారణ భేదమువల్లనే రెండవభాషగా భాసించుచున్నదనియు ప్రతిపాదించుచున్నారు.

ప్రాంతీయభాషలలో "దేశీ" (పూనామొదలగు ప్రాంతములలో వాడబడు) భాష యుత్కృష్టమైనది. "వర్హాడీ"భాషలో హిందీశబ్దములు, మరాఠ్వాడాభాషలో ఉర్దు - ఫారసీ - తెలుగు - మొదలైన భాషలశబ్దములు వాడబడుటవలన "దేశీ" భాషలకంటెగూడ కొలదివైలక్ష్యమును గలిగియుండును. ఇదిగాక, "వర్హాడీ" మరాఠ్వాడీభాషలలో అనుస్వారముయొక్కవాడుక చాలతక్కువగానున్నది.

ఉదా:—

"త్వాంచా (వారల) అనుచోట 'త్వాహ్చా' అను వాడుకగలదు. ఐనను, వ్యవహారముననే దీని యుపయోగముగాని, వ్రాతలో నెట్టిభేదములను పాటింపరు.

## సాహిత్యము - ఛందస్సు

మరాఠీ కవులు సంస్కృతవృత్తములను యథేచ్ఛగా వాడినారు. అనుష్టుపు - ఇంద్రవజ్రము - ఉపేంద్రవజ్రము - ఉపజాతి-శాలినీ -వంశస్థము-పుష్పితాగ్రము -వియోసినీ -భుజంగప్రయాతము -వసంతతిలకము -మాలినీ-పృథ్వీ-మందాక్రాంతము - మొదలగు వృత్తములు -రసభావములకు తగిన రీతిని ఉపయోగించినారు. శిఖరిణీ - హరిణి - శార్దూలవిక్రీడితము - స్రగ్ధర - మందారమాల యనువాని నెక్కువగా వాడియున్నారు. ఈ యక్షరగణ వృత్తములేగాక, 'ఆర్యా' - 'గీతి' మొదలగు మాత్రాగణవృత్తములు పైవానికన్నను విపులముగా

వాడినారు. తెలుగున వాడిన "చంపకమాల" మరాఠీలో కనిపించదు. సంస్కృతమున వాడునట్టి చంపకమాలనే వారు గ్రహించిరి. శార్దూలమును వాడిరేగాని, "మత్తేభము"న రచనలు లేవు.

సంస్కృత ఛందస్సేగాక, మరాఠీదేశీ వృత్తములను గూడ విశేషముగా వాడి యున్నారు. బహుశాః యవి యన్నియు మాత్రాగణములేయై యుండును.

"మరాఠీ - ఘటన - రచనా- పరంపరా"యను గ్రంథమున దేశీవృత్తము లెక్కువగా నుదహరింపబడినవి.

తెలుగున నన్నయగారి వివిధ వృత్తరచనలు, తిక్కనగారి కందములు, శ్రీనాథుని సీసములు, ధూర్జటి శార్దూలములు, వేమన యాటవెలదులు- ప్రఖ్యాతములై యున్నటులే మరాఠీలో "ఆర్యా" వృత్తము ప్రసిద్ధమై యున్నది.

వామనుడు పండిత కవిగాన, సంస్కృత వృత్తముల నిరర్గళముగా నుపయోగించియున్నాడు. తుకారాం అభంగములు, జ్ఞానేశ్వరుడు 'ఓవీ'ని మోరోపంత్ సంస్కృత దేశీ వృత్తముల నన్నిటిని యమకానుప్రాసలతో గూడ వాడినాడు. ఐనను, అంత్యనియమముల పాటించి యార్యావృత్తము లధికముగా రచించెను. ఆధునికులైన కవులు తమ కావ్యము లందెన్నియో క్రొంగ్రొత్త ఛందస్సుల నుపయోగించుచున్నారు.

మరాఠీ కావ్య రచన సంస్కృత సాహిత్యము ననుసరించినది. కావ్య లక్షణము శబ్దమునకు అభిధ-లక్షణ-వ్యంజన-యను వృత్తులు-వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థములకు గూడ వ్యంజకత్వము మొదలైన విషయములన్నియు సాహిత్య శాస్త్రము ననుసరించియే ఉపయోగింపబడినవి. కావ్యాత్మ యగు రసము-విభావాను భావవ్యభిచారీ భావములతో చక్కగా పోషింపబడినది. నిర్వేదాది ముప్పదిమూడు భావములు పండిత కవుల రచనలందే గాక భక్త కవుల రచనలందు గూడ చక్కగా ప్రతిపాదింపబడినవి. జ్ఞానేశ్వరుడు శాంత రసమును పండిత కవుల కంటె మిన్నగా పోషించెను. మాధుర్య ప్రసాదాది కావ్య గుణము లాయా రస భావాదుల కనుగుణముగా కావ్య రచనలో చూపబడినవి. వీనిలో అక్కడక్కడ కావ్యదోషములు కూడ కనిపించుచుండును. ఇంతియెగాక శబ్దార్థాలంకారములు

సమయానుసారముగా వాడబడి, రసపోషణ చక్కగా జరుపబడినది. ఈయంశము లన్నియు సంస్కృత సాహిత్యము ననుసరించియే యుండుట వలన వీని లక్ష ణములు ఉదాహరణములు వేరుగా బేర్కొన బనిలేదు. శబ్దాలంకారముల విష యమున మాత్రము కొన్ని విశేషములు చూపవలసియున్నది.

1. తెలుగులో వలె ప్రతి పాదమునందును ప్రాస యతి నియమములులేక, సంస్కృత ఛందో రీతినే పాటింతురు. కాని అంత్య నియమములు మాత్రము తప్పనిసరిగా పాటింతురు. ఈ నియమమును ప్రథమ – ద్వితీయ – పాదము లందు గాని, ద్వితీయ చతుర్థ పాదములందుగాని పాటింతురు. అక్షర గణము గల వృత్తములలో ప్రథమ – ద్వితీయ – తృతీయ, చతుర్థ పాదములలో నంత్య నియమము లవశ్యములు.

ఉదా:—

"యాజన్మామధ్యేఁ ఇంద్రియేఁ దేహవాణీ
ఆత్మాహ్రుద్ వాంఛాకల్పనావృత్తి యాణీ
జీఁజీఁ మీకేఁలీఁ జ్ఞాత అజ్ఞాత పాపీఁ
తీఁతీఁ నాశాలీఁ శ్రీహరీ స్వప్రతాపీఁ."

పైన నుదహరించిన శాలినీ వృత్తము అక్షరగణము గలది. కనుక దీని ప్రథమ – ద్వితీయ – పాదములకు, ద్వితీయ - చతుర్థ పాదములకు అంత్య నియ మము గలదు

మాత్రాగణ వృత్తములలో ప్రాయశః ద్వితీయ చతుర్థపాదములకు అంత్య నియమము పాటిఁపబడును.

"కురుక టికాసిపహోతాఁ
తో ఉత్తరబాళ పారగడబడలా!
స్వపర బళాలళనేణుని
బాలిళ బహుబాయకాంతబడ బడలా!"

పైన నుదాహృతమైన యార్యా వృత్తములో రెండు మరియు నాలుగవ పాదాంతములందు నాలుగక్షరముల యమక గర్భితమైన యంత్య నియమము గలదు.

# ప్రాచీన యుగము

## చాళుక్య సోమేశ్వరుడు

(క్రీ. శ. 1126-1138)

కల్యాణి నగరాధీశుడైన చాళుక్య సోమేశ్వరుడు 1129లో మానసోల్లాసము లేక అభిలషితార్థ చింతామణి యను గ్రంథమును రచించెను. అందలి 36వ అధ్యాయమున దశావతారమను పేరు గల నొక గేయము గలదు. సోమేశ్వరుడు దీనిని లోకగీతమని చెప్పియున్నాడు. అందుచే నది సోమేశ్వరుని కన్నను ప్రాచీన తరమని తోచుచున్నది.

ఈ గీతములో వాడబడినది ప్రాచీనమైన మరాఠీభాష. దీనియందు కన్నడ అపభ్రంశములతో పాటు, ఇతర భాషాశబ్దములు గూడ నున్నవి. గనుక వీని యర్థము స్పష్టముగా తెలియదు. ఇది సోమేశ్వరుని కంటె వంద సంవత్సరములైనను తక్కువయని యూహింపవచ్చును.

## ముకుందరాజు

(క్రీ. శ. 1128-1198)

ముకుందరాజు మరాఠీ భాషలో ఆదికవి. ఇతడు వివేక సింధువను కావ్యమును రచించెను. ఈ కావ్యము "ఓవీ" యను దేశీ వృత్తములలో వ్రాయబడినది. ఇందు 1671 ఓవీలు గలవు. ఈ ఓవీ వృత్తము సంస్కృత ఛందోరీతులలో చేరదు. ఈ గ్రంథము క్రీ. శ. 1188 (శా. శ. 1110)లో వ్రాయబడినది. ఈయన శుక్ల యజుర్వేదాంతర్గత మాధ్యందిన శాఖకు చెందిన బ్రాహ్మణుడు. ఈ మహాకవి నివాసస్థానమును గూర్చి వివాదములు గలవు. ఇతడొక చోట అంబానగరీ యను స్థలమును నిర్దేశించినాడు. చారిత్రకు లీనగరమును మధ్య ప్రాంతమందలి (నాగపూరు) భండారీవద్ద వైన్‌గంగా నదీతీరమునగల

యంభోరుగ్రామమై నుండనోపునని కొందరు, మరాత్వాడాలోనున్న 'అంబేజో గాయి' అనగా మోమినా బాదని మరికొందరు చెప్పుచున్నారు. అంబేజోగాయి సమీపమున యొక గుహలో ముకుందరాజు సమాధియున్నది. అచటి నుండి "జయంతి" యను నొక నది ప్రవహించి ప్రాణగంగలో గలియుచున్నది. ఇచటి రాజు పేరు జయంతపాలుడు కావున యా నదికి 'జయంతి' యని పేరు కలిగియుండునని కొందరి యూహ. జయంతపాలుని పేరు వివేక సింధువున నుదహరింపబడినది. యోగీశ్వరీ మాహాత్మ్య మను గ్రంథమున ముకుందరాజు పేరు ప్రస్తావింపబడినది. ఇదియును గాక మహానుభావ సంప్రదాయమునకు జెందిన మేఘచంద్రుని విరచితమగు యక్షదేవ వృద్ధాన్వయ మను గ్రంథమున ముకుందరాజు విషయ ముచ్చరించబడినది. కాని ఐతిహాసికముగా యీ రెండు గ్రంథములును ప్రమాణభూతములు గావు. కావున వీని వలన నీ కవియొక్క దేశ కాలములు నిర్ణయింప వలను పడదు.

ఏ దెటులున్నను ఇతడు మాత్రి మాదికవి యని నిశ్చయముగా జెప్ప వచ్చును. ఈయన యోగాభ్యాసపరుడై అద్వైత వేదాంతమున నిష్ఠగలవాడై అద్వైత వేదాంత తత్వమునే తన గ్రంథమున బోధించి నటుల స్పష్టమగు చున్నది.

ఈయన శ్రీ శంకరోక్తులనే మరాఠీ భాషలోని కనువదించి నానని స్వయముగా చెప్పుకొనినాడు. ఈ మహాకవి వివేక సింధువులో వేదాంతశాస్త్ర సిద్ధాంతములను ప్రతిపాదించి వానినే సకల జనులకు బోధపడు నట్లుగా పరమామృత మను గ్రంథమున వివరించి యున్నాడు. ఈ విధముగా వేదాంత తత్వమును బోధించి ముకుందరాజు జ్ఞానేశ్వరునకు మార్గ దర్శకుడైనాడు. వివేకసింధువు, పరమామృత మను గ్రంథములే గాక రుక్మిణీ స్వయంవరము మున్నగునవి యితని కృతులుగా ప్రసిద్ధి వడసినవి. కాని యీ విషయమున పరిశోధకులు భిన్నాభిప్రాయములు గలిగియున్నారు.

# నాథ సంప్రదాయము

నాథ సంప్రదాయము ఉత్తర భారతము నుండి దక్షిణ దేశమునకు ప్రాక్కి మహారాష్ట్రమున నెక్కువగా వ్యాపించినది. మచ్ఛేంద్రనాథుడీ సంప్రదాయమునకు మూలపురుషుడు.

వీరు యోగాభ్యాసమునందు ప్రావీణ్యము సంపాదించినవారు. యోగమువలన అద్వైత జ్ఞానము పొంది మోక్షము నందవచ్చునని వీరి నమ్మకము. ముకుందరాజు కూడ యీ సంప్రదాయమునకు జెందిన వాడేనని తెలియుచున్నది. జ్ఞానేశ్వరుడును నాథ సంప్రదాయానుయాయి యనియే వాడుక. ఈ సంప్రదాయమునకు జెందిన మఠములు దేవాలయము లిప్పటికిని మహారాష్ట్రమున నెక్కువగా నున్నవి. ఈ సంప్రదాయమునకు జెందినవారు చెవులకు పెద్దవి రంధ్రములు జేసికొని కుండలములు ధరింతురు. వీరిని మరాఠీలో "కాన్ ఫాడే" యందురు. సర్వాంగములందు భస్మము ధరించుటయు, భిక్షాటనమును యోగము నభ్యసించుటయు వీరి యాచారములు. వీరి సిద్ధాంత గ్రంథములు హిందీ మొదలగు భాషలలో నెక్కువగా నున్నవి. కాని మరాఠీలో గోరక్షగీత, అమరనాథ సంవాదము అను రెండు గ్రంథములు మాత్రమే యున్నవి. ఇవియును మూల రూపమున లభింపవు. జ్ఞానేశ్వరుని కంటె పూర్వమే యీనాథ సంప్రదాయము ప్రచలితమైనది. ఈ సంప్రదాయమునకు జెందిన గ్రంథము లెక్కువగా లేక పోయినను దీని సంస్కారములు ముకుందరాజు జ్ఞానదేవునిపై అధికముగా నున్నటుల తోచుచున్నది. యోగాభ్యాసము యోగసిద్ధి మొదలగు వానిపై నెక్కువగా నిష్ఠగలిగి యుండుట వలన జ్ఞానదేవుడీ సంప్రదాయము పట్ల శ్రద్ధచూపినాడు. ఇట్లు నాథ సంప్రదాయ గ్రంథములు విశేషములుగా లేక పోయినను దీని పరంపర జ్ఞానదేవుని వరకు సాగుచునే వచ్చినది. గోరక్షగీత ఓవీ వృత్తములలోను అమరనాథ సంవాదము గద్యరూపమునను రచింపబడినవి. ఐనను యీ గ్రంథశైలి మహాభాష్య కారుడైన పతంజలి నుడివినట్లుగా పద్యగంధి గద్యములో వ్రాయబడినది.

ఇవియే గాక నీ భాషలో నవనాథ భక్తిసారము, నాథ లీలామృతములను రెండు గ్రంథములు పూజ్యములైనను ఐతిహాసిక దృష్ట్యా నెక్కువ ప్రమాణ భూతములుగావు. నవనాథ భక్తిసారమును ధుండీసుతమాలూ నరహరి యను పండితుడు గోరక్ష కిమియాగర మను గ్రంథము నాధారముగా జేసికొని ప్రమాది సంవత్సర జ్యేష్ట శుక్ల పాడ్యమి (శా. శ. 1241) నాటికి ముగించి నటుల స్పష్టీకరింపబడినది.

# హేమాద్రి పండితుడు

12వ శతాబ్దిలో ముకుందరాజు తరువాత పేర్కొన దగిన ప్రసిద్ధ పురుషులు హేమాద్రి బోపదేవుడను వారు. వీరిలో హేమాద్రి లేక హేమారపంత్ అను పండితుడు మహాదేవరావు, రామదేవరావు యనువారు రాజ్యమేలు కాలమున ప్రధానిగా నుండెను. దీనికి "బోపదేవేన రచితం మంత్రి హేమాద్రి తుష్టయే" యను ప్రమాణములు గలవు. హేమాద్రి సర్వతోముఖ పాండిత్యము గలవాడు, గొప్ప ధార్మికుడు. ప్రతిదినము శివలింగ స్థాపన చేయకయే భుజించువాడు కాడు. ఇతడు కట్టించిన శివాలయములు వేనకువేలు గలవు. ఈ మహనీయుడు నాగర లిపిని మార్చి వ్యవహార సౌకర్యార్థము "మోడి" యను నొక క్రొత్త లిపిని సృష్టించి మహారాష్ట్ర భాషకు మహోపకార మొనర్చెను. తెలుగున గొలుసు వ్రాత వలె దీనికి లేఖనా సౌకర్య మెక్కువగా గలదు. ఇదే రీతిగా ఫార్సీలో 'షికస్తా' యను నొక లిపి వ్యవహారోప యుక్తమునకై నిర్మింపబడినది. "లేఖన కల్పతరువు" "నీతిబోధ" యను గ్రంథములు హేమాద్రి విరచితములని ప్రసిద్ధి జెందినవి. ఇవి యాతని స్వయం కర్తృకములు కావని చారిత్రకుల యభిప్రాయము. ఎటులైనను ఈ గ్రంథములు 12వ శతాబ్దమునకు జెందినవిగా సర్వసమ్మతములైనవి.

మరాఠీ ఆధ్యాత్మిక గ్రంథ ప్రాచుర్యము కలిగినను వ్యావహారిక విషయమును ప్రతిపాదించు మొదటి గ్రంథము యిదియేనని చెప్పవచ్చును. ధర్మశాస్త్ర విషయములను ఆచారము - దానము - ప్రతిష్ఠ - ప్రాయశ్చిత్తము - మొదలగు వానిపై నెన్నియో గ్రంథములు హేమాద్రి పేర ప్రచలితములై యున్నవి

ఆయుర్వేద రసాయన మనునొక గ్రంథము హేమాద్రికృతమని కొత్తగా కనుగొనబడినవి.

# బోపదేవుడు

హేమాద్రి కాలమున నీ పండితుడు దేవగిరి రాజ్యమునందాస్థాన విద్వాంసుడుగా నుండెను. ఇతడనేక గ్రంథములు రచించెను. హేమాద్రి బోపదేవులు పరస్పరము తమతమ గ్రంథములపై వ్యాఖ్యానములు వ్రాసినటుల ప్రమాణములు గలవు. ఈయన గొప్ప వైయాకరణుడు. సంస్కృత సాహిత్య పారంగతుడు. జ్యోతిష సాహిత్య శాస్త్రములపై ననేక గ్రంథములు వ్రాసియున్నాడు. శ్రీ మద్భాగవతము బోపదేవ ప్రోక్తమనియు దేవీభాగవతము వ్యాస విరచితమనియు ఇది వరకు వాడుకలో నుండెను. కాని బోపదేవ కృత భాగవత వ్యాఖ్యా గ్రంథము లిపుడు ప్రసిద్ధము లగుట వలన భాగవత కారుడితడు కాదని స్పష్టమగుచున్నది. వామన-జయాదిత్యులు రచించిన "కాశికావృత్తి"ని ఖండించెననియు తర్వాత మాధవ విద్యారణ్యు డితని మతమును ఖండించినాడనియు ప్రసిద్ధిగలదు

"బోపదేవమహాగ్రాహ గ్రస్తోవామనదిగ్గజః
కర్తేరేవ ప్రసంగేన మాధవేన విమోచితః"

అని పై వాక్యమున కాధారము. భట్టోజీ దీక్షితుని శబ్దకౌస్తుభమను వ్యాకరణ గ్రంథమున నీ శ్లోకము గలదు.

# మహానుభావ పంథ

జ్ఞానదేవునికన్న పూర్వమును ఆదికవి ముకుందరాజు తర్వాతను మహారాష్ట్రమున నొక క్రొత్త సంప్రదాయము స్థాపింపబడెను. ఇదియే మహానుభావ పంథ - వ్యవహారమునందున "మానుభావ పంథ" యని వాడుక. కాని గ్రంథ

ములలో నీ పేరు కనిపించదు. ఈ సంప్రదాయము మహాత్మా అచ్యుత, జయ కృష్ణీ పర మార్గమను పేర్లచే పిలువబడుచున్నది. మహానుభావు డనగా గొప్ప యనుభవము గలవాడని యర్థము. కాని దీని యథార్థ జ్ఞానము లేక సామాన్యు లలో మాత్రము దొంగ అసత్యమాడువాడు అని రూఢియై పోయినది. ఇదిగాక "బోలణీమానభావాచీ, కరణీక సావాచీ" (మాటలు మహానుభావునివి చేష్టలు కటికె వానివి) యను లోకోక్తులు మహారాష్ట్ర దేశమున ప్రచార మందున్నవి.

జీవుడు పరమేశ్వరుడు వేరనియు జగత్తు, నిత్యము, స్వతంత్రము జడ మనియు, పరమేశ్వరుడు నిత్యముక్తుడు, స్వతంత్రుడనియు వీరి సిద్ధాంతము. ఇట్టి మతము ద్వైతసిద్ధాంతమును ప్రతిపాదించుచున్నది. ఈ సంప్రదాయమున అవతార కల్పన బలవత్తరమైనది. శ్రీకృష్ణుడు - దత్తాత్రేయుడు - ద్వారవతీ వాసియైన చాంగదేవరావుళ్, బుద్ధి పురమండలి గుండంరావూళ్ చక్రధరుడు భగ వంతుని యవతారము లని వీరి మతము - చక్రధర విరచిత సూత్రపాఠము ఈ మతానుయాయుల పారాయణ గ్రంథము. దీనికి తోడుగ అహింస, అనా సక్తి, నివృత్తి - భక్తియోగము వీరలకు చతుః సూత్రి. విషయాసక్తి - ముఖ్యముగా స్త్రీ సంగమము పూర్తిగా వదలదగినది. బ్రహ్మచర్య వ్రతము ధరించి ఈశ్వరభక్తి గలవాడై నిత్యము సంచరించుట వీరల ముఖ్య ధర్మము. ఈ సంప్రదాయ గ్రంథములు సాంకేతిక శబ్దములచే నిండియుండును. చక్రధరుడీ సంప్రదాయమునకు ముఖ్యప్రవక్త-ఇతని మొదటిపేరు హరపాళదేవుడు. భడోచ్ (గుజరాతున కుత్తరమునగల ప్రాంతము)ను త్రిమల్లదేవుడను రాజు పాలించు చుండెను. ఇతని ప్రధాని విశాలదేవుడు-దత్తాత్రేయానుగ్రహమున నితనికి హర పాలదేవుడు జన్మించెను. ఈ హరపాలుడు యుద్ధమున మరణించెను. అప్పుడితని దేహమున ద్వారవతివాసి చాంగదేవరావుళ్ ప్రవేశించెను. వెంటనే హరపాలుడు పునరుజ్జీవితుడై ఇంటికేగి భార్యతో విలాసముగా కాలము గడుపజొచ్చెను. ద్యూత లోలుడై తన భార్య యొక్క యాభరణములిమ్మని బలవంత పెట్టగా నామె నిరాకరించుటచే ఇల్లు వదలి బుద్ధిపురము జేరికొనెను. ఆట గుండంరావుళ్ వద్ద శక్తి స్వీకార మొనర్చెను. అక్కడనే హరపాలునకు చక్రధరుడను పేరుగలిగెను. పన్నెండు సంవత్సరములు కఠిన తప మొనరించి దేశ సంచార మొనర్చుచు ప్రతిష్ఠానపురము జేరుకొనెను. ఆ పురమున కొందరనుయాయు లితనితో జేరిరి.

అనంతరము వరంగల్లున హంసోబాయను కన్యకతో వివాహము జరిగెను, అక్కడి నుండి ఎలిచపురమునకు రాగా రామదేవదరణా యను సంస్థానాధీశుడు తన కూతురైన ఉమాదేవి నిచ్చి పెండ్లి జేసెను. అక్కడ నొక మూడు సంవత్సరములుండి జనులకుపదేశ మిచ్చుచు మరల తిరుగనారంభించెను. ఇట్లీతడొక మతస్థాపకుడయ్యెను. తర్వాత హిమాలయములకు ప్రస్థానమొనరించెను.

చక్రధరుడు స్వయముగా సదాచార సంపన్నుడును, కఠినములగు నియమములను పాటించువాడును వైరాగ్యశీలుడునై యుండెను. తన సంప్రదాయమున చేరు వారిని బాగుగా పరీక్షించి దీక్షనిచ్చువాడు. భిక్ష నెవనివద్ద నేపదార్థము స్వీకరింపవలెనో దాని వినియోగమెటుల జేయవలెనో యను దానినిగూర్చి యొక దండకము వ్రాసి తన శిష్యుల నా విధముగా నాచరించుటకు ప్రోద్బలపరిచెను. విధుల నతిక్రమించిన శిక్ష నొసగుచుండెడువాడు. ఇట్లీతడొక సంప్రదాయ ప్రవక్తయై గ్రంథ రచనకై యెందరినో ప్రోత్సహించి, తన పేరు ప్రతిష్ఠల నాచంద్రతారార్కము నిలుపుకొనెను. ఈ మహాపురుషుడు గ్రంథములు రచించినటుల కనిపించదు. ఈ క్రింద నుదహరించిన గ్రంథము లీసంప్రదాయమున ప్రసిద్ధములైనవి.

| | | | |
|---|---|---|---|
| 1. శిశుపాలవధ | : భాస్కరప్రణీతము | శా.శ. | 1195 |
| 2. ఉద్ధవగీత | : భాస్కరుడు | ,, | 1196 |
| 3. వత్సహరణము | : దామోదరపండితుడు | ,, | 1200 |
| 4. రుక్మిణీస్వయంవరము | : నరేంద్రుడు | ,, | 1213 |
| 5. సహ్యాద్రివర్ణనము | : రవళో లేక రాఘోవ్యాసుడు | ,, | 1224 |
| 6. జ్ఞానప్రబోధము | : విశ్వనాథ పండితుడు | ,, | 1253 |
| 7. బుద్ధిపురవర్ణనము | : నారాయణ పండితుడు | ,, | 1285 |

పై వారిలో నరేంద్రుడను కవి ప్రఖ్యాతి నార్జించినవాడు. దేవగిరి రాజగు రామదేవరావు ఆస్థానకవి. ఇతడు వ్రాసిన రుక్మిణీస్వయంవరమును విని ఆరాజు సంతోషించి తనకా గ్రంథమును కృతినొసంగిన గొప్పబహుమాన మొసంగుదునని చెప్పెను. నరేంద్రుడు కృతినొసంగుట కంగీకరింపక ఆస్థానము వదలి

వెడలిపోయెను. ఇతని కావ్యము ప్రకృతి వర్ణనలు, అలంకార వైభవము, రస పోషణ, భక్తి కల్పనా-చాతుర్యములచే నిండియున్నది.

పైన పేర్కొనిన గ్రంథములన్నియు ఓవీవృత్త బద్ధములు. వీనియందు మహానుభావ తత్వజ్ఞానమంతగా వర్ణింపబడలేదు. కానీ 'సాతీగ్రంథ'ము లను పేరుతో పిలువ బడుచున్నవి. చక్రధరు డప్పుడప్పుడు ప్రదర్శించిన కొన్ని లీల లను ఉపదేశములను ఆతని శిష్యుడైన మహీభట్టు లీలాచరితమను గ్రంథమున వర్ణించినాడు. ఇతడు గొప్ప విద్వాంసుడై పెక్కు వాదములు సల్పి పండితుల నోడించెనని ప్రతీతి. చక్రధరునితో వివదించి ఓడిపోయి యాతనికి శిష్యు డయ్యెను. ఈ సంప్రదాయమునకు జెందిన గ్రంథములన్నియు నెక్కువ సాంకే తిక శబ్దములతో నిండియున్నవి. కొందరు పండితులు వీని యర్థమును తెలిసి కొనుటకు ప్రయత్నములు సాగించినారు. ఆధునికులు గూడ కొందరీ సంప్ర దాయ గ్రంథములను వ్రాసియున్నారు. సంప్రదాయము వేద విషయమున యాదరము చూపినను వేద ప్రమాణము నంగీకరింపక పోవుటచేత అవైదిక మతమని స్పష్టమగుచున్నది. వీరు "పంచకృష్ణు"ల వాక్యములనే ప్రమాణము లుగా గ్రహింతురు. వీరిలో దత్తాత్రేయుడు ప్రథముడు. ఇతని వాక్యము లనుప లబ్ధములు; భగవద్గీతా వాక్యములు పంచకృష్ణులలోని రెండవకృష్ణుని రచన. చక్రధరుని వాక్యములు వేదప్రమాణములుగా గ్రహింపబడును. ఈ సంప్రదాయ మున కొందరు ప్రసిద్ధులైన వారి వైయుక్తికాచారముల ననాదరము కనిపించినను వారి తత్త్వజ్ఞానములో కనిపించు కొన్ని సిద్ధాంతములు మాత్ర మనాదరణీయ ములు కావు. ఇంతియేగాక వారి వాఙ్మయసేవ పరమాదర పాత్రము. మరాఠీ భాషలో నిరాటంకముగా వేదాంత సిద్ధాంతములు భక్తి బోధకమగు విశిష్టశైలితో నిర్మించిన కీర్తి మహానుభావ సంప్రదాయ ప్రవక్తలకే దక్కినది. ఇదిగాక సాహిత్య విషయమునందు సృష్టి సౌందర్య వర్ణన, శృంగారాది రసభావ పోషణ, అర్థ గాంభీర్యము వీరి గ్రంథములయందే ఉపలభ్యమానములు.

ఆద్య మరాఠీ కవయిత్రి మహదాయిసా ఈ కాలమునకు జెందినదే. ఈయమ వ్రాసిన స్త్రీల పాటలు "ధవళే" యను గ్రంథముగా కూర్పబడినవి. ఈ గ్రంథపు పూర్వార్ధము క్రీ. శ. 1286లో వ్రాయబడినది. ఈ విదుషీమణి

వేదశాస్త్ర పారంగత; విప్ర పరివారమున జన్మించినది. ఈమె తండ్రి వాయే నాయకుడు. ఈమె మహానుభావ పంథను స్వీకరించినది. ఒక వివాహ సందర్భమున నీ కవయిత్రి "కరవలి" (పెండ్లి పెద్ద) యధికారమును స్వీకరించి రుక్మిణీ స్వయంవర గీతములు వ్రాసి పాడెను. సంగీతము రాకున్నను నీమె గురువగు చక్రధరుని చరణముల స్మరించి రచన ప్రారంభించెను.

# జ్ఞానదేవుడు

(క్రీ. శ. 1275 - 1296)

జ్ఞానదేవుని కాలమున దేవగిరిని రామదేవరావు పాలించుచుండెను. మహాభక్తుడగు నామదేవుడు వ్రాసిన ప్రకారము జ్ఞానదేవుని వంశమునకు మూల పురుషుడు త్ర్యంబకపంత్ కులకర్ణి. ఈయన యజుర్వేదీయ బ్రాహ్మణుడు. యాదవ రాజ్యాంతర్గతమైన భీడుజిల్లా ప్రాంతమున నితడుద్యోగిగా నుండెను. ఈతని కిరువురు కుమారులు. వారిపేర్లు గోవిందుడు–హరిహరుడు. హరిహరుడు యుద్ధమున మృతిజెందెను. త్ర్యంబకపంత్ పుత్రవియోగము వలన దుఃఖము భరింపలేక సన్యసించి నాథపంథకు జెందిన గహనీనాథుని వలన నుపదేశము పొందెను. త్ర్యంబకపంత్ జ్యేష్ఠపుత్రుడగు గోవిందపంత్ 'కులకర్ణి'గా పని చేయు చుండెను. ఇతని కరువది యైదేండ్ల వరకును సంతానము కలుగలేదు. వార్ధక్యమున గహనీనాథుని యనుగ్రహము చేత ఒక పుత్రుడు గలిగెను. అతనికి విఠలుడని పేరు పెట్టిరి. విఠలపంత్ వేదాధ్యయనపరుడు – తన తండ్రికడ నాజ్ఞ గైకొని తీర్థయాత్రకు బయలుదేరెను. ద్వారకాదిక్షేత్రముల దర్శించి త్ర్యంబకేశ్వరమునకు వచ్చెను. అటనుండి అలకాపురి (ఆళంది) చేరుకొనెను. ఈ అలకాపురి ఇంద్రాయణీ నదీతీరమున గొప్ప శైవతీర్థముగా ప్రసిద్ధినంది యుండెను. అచ్చట కొన్ని దినములుండిన తరువాత సిద్ధోపంతుని కుమార్తెతో నితనికి వివాహము జరిగినది. కాని ఇతనికి సంసారముపై నాశక్తి లేకుండెను. భక్తసమాజము (వారేకరి) పండరిపురమునకు వెళ్ళుచుండగా వారివెంట నితడును వెళ్ళెను. ఆటుతరువాత రామేశ్వరమును సేవించి యత్తగారిల్లు చేరుకొనెను. కాని స్వగృ

హమునకు వెడలలేదు. ఇతడు 'ఆపేగాం' అనుచోట నివాస మేర్పరుచు కొనెను. సంతతి లేకపోవుటవలన విఠలుడు తన భార్యను బలవంతపరిచి సన్యసించుట కనుమతి బొందెను. తర్వాత కాశీ చేరుకొని శ్రీపాదస్వామికడ సన్యాసము గ్రహించి యుపదేశమునందెను. చైతన్యాశ్రముడని ఈతని యాశ్రమ నామ ధేయము. కాని ఇతని భార్య రుక్మిణీబాయి మాత్రము తన భర్త తిరిగి రాగల డను విశ్వాసముచే ఉపవాసాదికముల నాచరించుచుండెను. కొన్ని దినముల యనంతరము శ్రీపాదస్వామి సంచార మొనర్చుచు ఆళంది క్షేత్రమున కేతెం చెను. అప్పుడు రుక్మిణీబాయి స్వామి సన్నిధికేగి నమస్కరించగా 'పుత్రవతీభవ' యని స్వామివా రాశీర్వదించిరి.

రుక్మిణీబాయి సహజస్థితిని గనిపెట్టి శ్రీపాదస్వామి తన శిష్యుని తిరిగి గృహస్థాశ్రమము గైకొన నాజ్ఞాపించెను. గురునాజ్ఞకు లోబడి విఠలుడు తిరిగి సంసారమును ఆరంభించెను. కాని జనులతని నవహేళన జేయుచుండిరి. ఐనను యిత డవమానముల సహించెను. ఈయనకు నలుగురు బిడ్డలు జన్మించిరి. వారు నివృత్తినాదు, జ్ఞానదేవుడు, సోపానదేవుడు, ముక్తాబాయి. వీరు ప్రతిభా సంప న్నులు. తండ్రి వీరలకు చక్కగా విద్యాభ్యాసము చేయించెను. ఐనను లోక నింద మాత్రము తప్పలేదు. విఠలపంత్ ఆళందిలోని బ్రాహ్మణ బృందమునకు నమస్కరించి క్షమాపణ గోరెను. కాని వారతనికి దేహాంతర ప్రాయశ్చిత్తము విధించిరి. వారియాజ్ఞ ప్రకారము విఠలుడు వెంటనే ప్రయాగ క్షేత్రమును జేరు కొని త్యజించరాని ప్రాణముల త్యజించెను. తర్వాత పెద్దకుమారుడగు నివృత్తి నాథుడు బ్రాహ్మణ బృందమునకు నమస్కరించి ప్రార్థింపగా వారు పైఠనుకు వెళ్ళి "శుద్ధిపత్రము" తేవలెనని నిర్ణయించిరి. అదేప్రకార మీ నలుగురును ప్రతి ష్ఠాన పురము చేరుకొని యచటి బ్రాహ్మణులను ప్రార్థింపగా వారు:-

"గోఖరవాణీ శ్వాన వందూనియా
వందావే అంత్యజ బ్రహ్మభావ నేచీ"

అనగా ఎద్దు-గాడిద-కుక్కలను గూర్చి నమస్కరించి యనంతరము బ్రహ్మ భావముచే నంత్యజునకు నమస్కరింపవలెనని నిర్ణయించిరి. అటులనే

వీరలు వందన మాచరించిరి. అనంతర మాసభలో నొక చమత్కారము జరిగెను. ఒక దున్నపోతు వీపుపై గొట్టిన దెబ్బలు జ్ఞానేశ్వరుని వీపుపై గనిపించెను. ఈ యలౌకిక చమత్కారము జూచి యందరికి వీరిపై పూజ్యభావము కలిగెను. ఇంతియే గాక జ్ఞానేశ్వరుని యాజ్ఞానుసార మొక దున్నపోతు వేదము చదువ నారంభించెను. అప్పుడు వీరి యద్భుత యోగశక్తికి మెచ్చుకొని వెంటనే శుద్ధి పత్రి మొసగిరి. ఆ పత్రమును మహాపండితుడు బోపదేవుడు వ్రాసెనని ప్రసిద్ధి.

అటనుండి నివృత్తినాథాదులు 'నావాసే' యను గ్రామమునకు వచ్చిరి. ప్రవరా నదీతీరము నందలి 'మహాలయా' యను మందిరమున జ్ఞానేశ్వరుడు తన యద్భుత గ్రంథరాజమగు "జ్ఞానేశ్వరీ" యను భగవద్గీతా వ్యాఖ్యానమును నివృత్తి నాథుని యాజ్ఞానుసారము అమృతానుభవమను గ్రంథములను వ్రాసెను. నివృత్తి నాథుడు పండిత సభలో నగ్రస్థానము వహించినప్పుడు జ్ఞానేశ్వరుడు గీతాభాష్యము ప్రవచించి నటుల తన జ్ఞానేశ్వరీ గ్రంథమున చెప్పికొన్నాడు. అందు ఆదినాథుని పర్యంతమైన తన గురుపరంపర నంతయు వర్ణించినాడు. "భాష్యకారాతే వాటపునతు" అనగా భాష్యకారుడగు శంకరుని మార్గము ననుసరించు చున్నటుల తెలిపినాడు. జ్ఞానేశ్వరీ లేక జ్ఞానదేవీ గ్రంథము సర్వోత్కృష్టమైనది. మరాఠీ భాషలోనే గాక సంస్కృత భాషలోను యింతటి గ్రంథము లేదని చెప్పవచ్చును. శంకరగీతా భాష్యము ననుసరించి యున్నను, జ్ఞానదేవుడు తన యాధ్యాత్మిక స్వానుభవమును వ్యక్తిత్వమునందు సంపూర్ణముగా నావిష్కరించినాడు. జానేశ్వరీయందు వాడిన భాష తత్కాలీన భాషా స్వరూపమును బాగుగా వెల్లడించును. ఈ గ్రంథము మాత్రము మార్పులకు లోబడలేదు. ఇందలి కవిత ప్రసాదగుణ భూయిష్టమై ఉపమ–ఉత్ప్రేక్షాద్యలంకారములతో గూడి ప్రతి పాద్య విషయము చక్కగా పొందుపరుప బడినది. శృంగారాది రసములను గూడ శాంతరసమున కంగభూతములగునట్లు మిక్కిలి సుందరముగా చేర్చి యున్నాడు. ఆరవ యధ్యాయ వ్యాఖ్యానమున యోగాభ్యాస క్రమమును జెప్పుచు కుండలినీ యుత్థాన సమయమున శారీరక మానసిక వికారము లే విధముగ గలుగునో వాని క్రమమును విశదపరిచినాడు. మహా మహోపాధ్యాయ వాసుదేవశాస్త్రి అభ్యంకర్‌గారు సంస్కృతభాషలో యీ గ్రంథమును చక్కని శైలిలో ననువదించినారు. వేదాంతము–భక్తి యోగములే గాక నిందు సాహితీ దృష్టితో జూచి

నను గొప్ప విలువైన గ్రంథము. జ్ఞానేశ్వరు డద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించు వాడైనను జగన్మిథ్యా విషయమున భిన్నాభిప్రాయము గలవాడుగా దోచు చున్నది. "రజ్జ్వాయథాహేఽభ్రమః" అనగా రజ్జు సర్పన్యాయముగ జగత్తు కేవలము భ్రమాత్మకమని చెప్పదు. విశ్వమంతటను మాయయే వ్యాపించినపుడు మాయాకార్యమున 'అసత్తు' లేక త్యాజ్యభాగ మేదియులేదు. 'బంగారము సొమ్ముల రూపము పొందినను తన గుణమును వదులునా? కమలము వికసించిన కమలత్వము వదలగలదా?' యని జ్ఞానదేవుని యభిప్రాయము.

పై యుదాహరణల వలన జ్ఞానదేవుడు గొప్ప సత్పురుషుడైనను తనను గూర్చి గొప్పకవినని చెప్పకొనినటుల కేశికర్‌గారభిప్రాయ పడిరి. జ్ఞానదేవుని పేరుగలవారు మరికొందరు కవులు వెలసినారు. యోగవాసిష్ఠము వ్రాసిన జ్ఞానదేవుడితడా కాడా యను విషయము గూడ సంశయగ్రస్తమైనది.

# నామదేవుడు

(క్రీ. శ. 1270 - 1350)

శా. శ. 1192 కార్తీక శుద్ధ ఏకాదశి ఆదివారము నాడు పర్భనీ మండలము నందలి నర్సిబామణి యను గ్రామమున మహాపురుషుడగు నామదేవుడు జన్మించెను. ఈయన తండ్రిపేరు దామోదర సేటు. తండ్రి యనంతరము నామదేవుడు తన యాస్తినంతయు విక్రయించి పండరిపురము చేరుకొని హరినామ స్మరణలో నిమగ్నుడయ్యెను. అనంతరము తన కుటుంబము నంతయు నచ్చటికే చేర్చెను. జ్ఞానదేవుడు తన గ్రంథమగు జ్ఞానేశ్వరి యందు భగవత్ప్రాప్తి కొరకు సులభోపాయమును బోధింపగ నామదేవుడు హరినామ స్మరణకంటె రెండవ యుపాయము లేదని ప్రత్యక్షముగా నాచరించి చూపెను. ఇతడెల్లప్పుడు అంతరంగ మానసోల్లాస నిమగ్నుడై యుండెడివాడు.

మహమ్మదీయుల ఆక్రమణము వలన 1318లో దేవగిరి రాజ్యము పతనమయ్యెను. 1347 లో బహమనీ రాజ్యము స్థాపింపబడెను. అదే సమయమున

విజయనగర సామ్రాజ్యము గూడ స్థాపింపబడినది. ఈ పరిస్థితులలో నామదేవుని భగవన్నామ సంకీర్తన ప్రసారము వలన ప్రజలలో ధార్మికశ్రద్ధ యెడతెగక నిలచియుండ గలిగెను. రాజకీయ కల్లోలములు చెలరేగినను ధర్మముపై యభిమానమును వదలకుండ జేసినకీర్తి నామదేవునకే దక్కినది.

ఈ మహాకవి అభంగ వృత్తములలో తొలిసారిగా కవిత వ్రాయ నారంభించినవాడు. భావగీతముల (Romantic lyrical) నాలాపించిన వారిలో నితడే ప్రథముడు; చరిత్రను ఇతివృత్తముగా గైకొని సాహితీరచన గావించుటకు త్రోవను జూపిన ప్రథమ కవీశ్వరుడు. ఈ గ్రంథమే జ్ఞానదేవ చరిత్రము. ఇతని యభంగ వృత్తము లసంఖ్యాకములు. 'నామదేవాపీగాదా' యను గ్రంథమున నవి కూర్పబడినవి. పంజాబునకు వెళ్ళి భక్తిమార్గము నామస్మరణ సరణ సాంప్రదాయముల స్థాపించెను. శిక్కుల ధర్మగ్రంథమగు గ్రంథసాహెబు నందీతని రచనలు సమావిష్టములై యున్నవి. ఇప్పటికిని పంజాబున నామదేవుని దేవాలయము లసంఖ్యాకములుగా కనుపించును. ఇతని కవితలు చదువునపుడు చదువరి తన్మయుడై భగవంతుడు తన సాన్నిధ్యమున నున్నటుల భావ ముదయించును.

"ఓదేవా! నీవు నన్ను తప్పించుకొని పోవుచున్నావు. ప్రేమయనెడు త్రాటితో నీకాళ్ళ బంధించి తేగలను" అను మధురమైన భక్తి కవిత నితడెంతేనియు సృష్టించి మరాఠీ సాహిత్యమునకు మెరుగులు దిద్దెను. నామదేవు లనేకులు గలరు. అందుచే ఈ నామదేవుని రచనలేవో తెలిసికొనుటకు విమర్శకులు పరిశ్రమల పాలుగావలసి వచ్చినది.

# ఆధ్యాత్మిక లోకసత్త

(13 – 14 శతాబ్దములు)

నామదేవుడు మిక్కిలి సులభోపాయమగు భగన్నామస్మరణచే, భగవత్సాక్షాత్కారమును పొందు సంప్రదాయమును స్థాపించి, మహారాష్ట్రముననేగాక, ఉత్తర దేశమునగూడ పర్యటించి, సమాజోద్ధరణ మొనర్చి. శాశ్వతమగు ధర్మ

సంస్థాపన మొనరించెను. దీనివలన దేశీయ వాతావరణమున విలక్షణ పరివర్తనము గలిగెను. సామాన్యప్రజలు. స్త్రీ పురుషభేదము లేక తమతమ కార్యక్రమములు, నిత్య కృత్యములు నిర్వర్తించుకొనుచు గూడ శ్రద్ధాభక్తులు గలవారై శుద్ధాంతః కరణముతో భగవన్నామస్మరణ జేయుచు, పవిత్రాచరణ గలవారై లోకమున భక్తి భావమును ప్రసరింపజేసిరి. ఒడ్డు లొరసికొని ప్రవహించు వీరి భక్తి తరంగిణీ ప్రవాహమునందు మహమ్మదీయుల ప్రతిబంధకములు నిలువలేక పోయినవి. ఈ కాలమున చెప్పుకోదగిన భక్తులు, కవులెందరో వెలసినారు. వారిలో విసోభాఖేచరు మొదలగువారు జాతి, మత, భేదములు లేక త్రికరణ శుద్ధితో భగవన్నామ సంకీర్తన చేయుచు భావపూర్ణములగు గీతముల పాడుచు, కవితలు వెలువరించుచు ప్రజలలో నాధ్యాత్మిక భావమును ప్రసరింపజేసినారు.

## విసోభా ఖేచర్

ఇతడు ఆంవఢ్ గ్రామమున నొక బ్రాహ్మణ గృహములో జన్మించెను. ఈ గ్రామము పర్భనీ మండలములో నున్నది. ప్రారంభమున నితడు భక్తి మార్గమునకు విరోధి. జ్ఞానదేవుడు తన యోగసామర్థ్యమువలన నీతని సన్మార్గమునకు దెచ్చెను. ఇతడే నామదేవున కుపదేశము నొసంగినవాడు. ఆ కాలమున వ్యాపారస్థుల సమాజములో వాడుకలోగల 'నంద' భాషలో నితడు గ్రంథములు వ్రాసెను.

## పరిసా భాగవత్

ఇతడు నామదేవుని ప్రథమ శిష్యుడు. భాగవతమును వినువినుమని ముమ్మారు చెప్పుటచే నితని కీపేరు గలిగినది.

## గోరా కుంభార్

ఇతడు కుమ్మరివాని యింట జన్మించెను. ఈ భక్తుడు కుండను పరీక్షించు పరికరము (సల్ప)తో భక్తుల తలలపై గొట్టి వారిని పరీక్షించువాడు – నామదేవునంతటి వానిని గూడ పరీక్షించిన మేటి. ప్రస్తుత మితడు వ్రాసిన 10 అభంగము లుపలబ్ధములు.

## నరహరి సోనార్

ఇతడు కంసాలి. ఈ కవి రసాళ రామాయణమను గ్రంథమును రచించెను. కాని దానిలోని 8-10 అభంగములు మాత్రమే దొరుకుచున్నవి.

## చోఖా మేళా

ఇతడస్పృశ్యుడు. మంగళవేధా గ్రామనివాసి. ఈయన యనేక తీర్థ యాత్రలు సేవించి పండరిలో నివాస మేర్పరచుకొనెను. పండరిపురమే "భూవైకుంఠం" అని పండరిని పొగడుచు రచనలు చేసెను.

## సేనాన్హావి

ఇతడొక మంగలివాని ఇంట జన్మించి భక్తిప్రచార మొనర్చినవాడు. ఆతడు నిత్యవ్యవహారమున రూఢములు అర్థపూర్ణములైనట్టి శబ్దముల నేరి గ్రంథ రచన చేసెను.

కాన్హోపాత్ర యను వేశ్య కుమార్తెయును - జనబాయి అను కవయిత్రియు పరమానందుడను తెలికలవాడు, జగమిత్రనాగా మొదలగు భక్తులును భక్తి భావమును ప్రసరింపజేసిన వారిలో పేరెన్నిక గన్నవారు.

ఈ సత్పురుషుల వాఙ్మయము వలన భాషాభివృద్ధి చెప్పుకొన తగినంత జరుగకున్నను సర్వ సామాన్యుల వరకు గూడ భక్తిప్రచారము ధర్మముపై శ్రద్ధయును కలిగినవి. దీనివలన అవైదిక సంప్రదాయమగు మహానుభావపంథకు సంబంధించిన వాఙ్మయమున క్రొత్త మార్పులు కలిగినవి. ఇదే కాలమున సహ్యాద్రి వర్ణన కర్తయగు రవళోవ్యాసుడు 'సకళ' యను సాంకేతిక లిపి నుపయోగించి రచనలు చేసెను. పై లిపిలో గ్రంథములు వ్రాయుటచే మహానుభావ సంప్రదాయేతరులకు వీరి భాష తెలియని దయ్యెను. 'సుందరీ' పారమాండల్య-కవీశ్వరీ - వజ్రలిపి - సుభద్రాలిపి - సింహలిపి మున్నగు లిపుల నుపయోగించి ఎందరో గ్రంథరచనలు చేసిరి. ఈ లిపులకు పూర్వము అనగా శా. శ. 1275కు పూర్వము బాలబోధినీ లిపిని వాడుచుండిరి. ఈ కాలమున మహానుభావ సంప్రదాయ గ్రంథములెన్నియో వ్రాయబడినవి.

సరస్వతీ గంగాధరుడు గుడగంఛి యను గ్రామ వాస్తవ్యుడు. ఈతడు కర్ణాటక దేశపు కవి. ఈతని గురువు నృసింహ సరస్వతి. ఈ గురువు గాణగా పురమను ప్రసిద్ధ క్షేత్రమున నున్న దత్తాత్రేయుని యవతారము. గంగాధరుడు తన గురువగు నృసింహసరస్వతిని వర్ణించుచు "గురుచరిత్ర" యను గ్రంథ మును వ్రాసెను. ఈ గ్రంథము - ఓవీవృత్త బద్ధమై యున్నది.

# ఆస్మానీ - సుల్తానీ

దక్షిణ దేశమున బహుమనీ సామ్రాజ్యము పతనమై 1490లో ఐదు భాగములుగా విభజింపబడెను. మహారాష్ట్రమున ఏల్చిపూర్‌లో ఇమాంషాహీ, అహమద్ నగరమున నిజాంషాహీ యను రెండు రాజ్యములు స్థాపింపబడెను. క్రీ. శ. 1350 మొదలు 1490 వరకు మరాఠీ వాఙ్మయ చరిత్రను తెలిసి కొనుట కెట్టి యాధారములును లేవు. విపత్కరమైన నిట్టి విప్లవ కాలమందు మిగిలియున్న కొలది పత్రముల నాధారముగా జేసికొని యాకాలపు వాఙ్మయ చరిత్ర స్వరూపము నూహింపవచ్చును.

"ఆస్మానీ" యనగా దైవికముగా గలిగిన ఇక్కట్టులు. "సుల్తానీ" యనగా మహమ్మదీయ సుల్తానుల దౌర్జన్యమువల్ల సంభవించిన విపత్తులు. ఈ రెండు విపత్తు లొకేమారు మహారాష్ట్రము నావరించుటవలన దేశమునకే గాక వాఙ్మయమునకు గూడ గొప్ప నష్టము సంభవించినది. 1350 నుండి 1490 వరకు అనగా 150 సంవత్సరములలో ఉత్కర్ష జెందిన మహారాష్ట్ర భాషాభి వృద్ధి పూర్తిగా నశించినది. సామాజిక సంస్థలు పూర్తిగా నిర్మూలములైనవి. ప్రతియొక్కరును తమ తమ పొట్ట నింపుకొనుటకే ఎన్నో విధముల ప్రయత్నింప వలసి వచ్చెను. 12 సంవత్సరము లెడతెగని కరువేర్పడెను. కొందరు కార్య నిర్వాహణశక్తి గలవారున్నను వారు రాజుల నాశ్రయించిరి. ఈ కాలమున మరాఠీలో పారసీ శబ్దము లెన్నియో కలిసిపోయెను. కాని వ్యవహారములనుండి దూరమైయున్న స్త్రీలలో మాత్రము మరాఠీ భాష చెక్కుచెదరక నిలచియుండెను. పాటలు, చిన్న చిన్న కథలు, భూపాళాలు, హారతులు మున్నగువాని రూపమున

భాష నిలువగలిగెను. జ్ఞానదేవుని పరంపరకు జెందిన వటేశ్వరుడు యోగసార మును ప్రతిపాదించు తత్వసారమను గ్రంథమును రచించెను. ఇది శా. శ. 1234లో వ్రాయబడెను. 1036 ఓవీలుగల గ్రంథమున మనకు 400 మాత్రమే ప్రస్తుత ముపలబ్ధములైనవి. ఈ నటేశ్వరుడే ప్రసిద్ధ యోగీశ్వరుడగు చాంగ దేవుని గురువు.

చోంభాకవి (1300 - 1350 మధ్యకాలము) : ఈ కవి ఉషాపరిణయ మను గ్రంథమును వ్రాసెను ఈ గ్రంథమున జ్ఞానేశ్వరుని వర్ణనశైలి భాషా ప్రభావము స్పష్టముగా కనపడుచున్నవి. ఈ కావ్యమున నొక పార్సీ శబ్దమైనను కనుపించదు.

వరద నాగేశమను కావ్యమును వ్రాసినవాడు అజ్ఞానుడను పేరుగల కవి. ఈ కావ్యమున గూఢములగు వేదాంత ప్రమేయములు విశదీకరింపబడినవి. శా. శ. 1300ల కాలమున గద్య - పద్యములు రెంటిలోను పంచతంత్రానువాదము చేయబడెను.

బహిరా జాతవేదుడు (1350) :- ఇతడు గొప్ప పండితుడు. దశమటీకా పూర్ధమను గ్రంథమును రచించెను. అందు 45000 ఓవీ వృత్తములు గలవు.

సత్యామళనాథుడు (1200 - 1270) :- ఇతడు వేదాంత రహస్యమను గ్రంథమును వ్రాసెను.

విష్ణుదాసుడు :- ఇతడు మహాభారతమును సుమారు 20వేల ఓవీలలో వ్రాసెను. ఈ కవి ఏకనాథుని సమకాలికుడు.

జ్ఞానదేవుడు, నామదేవుడు మున్నగువారి తర్వాత భాషాశైలి మారి పోయెను. ఈ కాలమున రామకృష్ణాద్యవతార పరములైన రచన లెక్కువగా రచింపబడెను. సంకట సమయమున భగవదవతార వర్ణనలవల్ల ధైర్యమును స్థిరపరుచుకొనుటకీ రచనలు బయలుదేరి యుండవచ్చును.

# ఏకనాథుడు

(క్రీ. శ. 1533 - 1599)

క్రీ. శ. (1370 - 1495) ప్రాంతమున భానుదాసుడను నొక సత్పురుషుడుండెను. అతడు ఋగ్వేదాధ్యాయియైన దేశీయ బ్రాహ్మణుడు (కోంకణ దేశీయుడు కానివాడు). సాంసారికుడై గొప్ప భక్తాగ్రేసరుడుగా నుండి వ్యాపారము చేసి లెస్సగా ధనమార్జించెను. ఈ భానుదాసుని మనుమడగు సూర్యనారాయణుడు ఏకనాథుని జనకుడు. తల్లి రుక్మిణీబాయి. ఏకనాథుడు జనార్ధనస్వామి వలన ఉపదేశము పొందెను. ఈ మహనీయుడు భక్తకవి - ఈయన ఆత్మానుభవపరుడై వేదాంతోపదేశము చేయుచు మరాఠీ వాఙ్మయమును మిక్కిలి యభివృద్ధికి గొనివచ్చెను. చతుఃశ్లోకీ భాగవతముపై వ్రాసిన టీక, రుక్మిణీ స్వయంవరము, భావార్థ రామాయణము మున్నగునవి ఏకనాథుని గ్రంథములు. శ్రీమద్భాగవతమునకు విశిష్టమగు టీకను రచించెను. తత్త్వవిచార సంపద సర్వజన సుబోధకమైన శైలి ఈ గ్రంథమునకు మెరుగులు దిద్దినవి. ఈ క్రింది వాక్యము వలన నితనికిగల మరాఠీ భాషాభిమానము తెల్లమగును.

"సంస్కృతవాణీ దేవేఁ కేలీ
ప్రాకృతకాయ్ చోరాపాసోనీకేలీ?"

"ఏమీ! సంస్కృతభాష భగవన్నిర్మితమైనచో ప్రాకృతభాష దొంగల భాషయా?" అని ప్రశ్నించును. ఇతడు భాగవతమున ఉపమ, దృష్టాంతము, రూపకము మున్నగు అలంకారముల వాడుటచే శైలి గంభీరముగలదైనను సులభముగా నర్థమగు ననుటలో సందేహము లేదు

చతుఃశ్లోకీ భాగవతమనగా భాగవతము నందలి ద్వితీయస్కంధ నవమాధ్యాయాంతర్గతములగు 32 నుండి 35వరకు గల నాలుగు శ్లోకములు. వీని యర్థమును ఏకనాథుడు 1036 ఓవీలలో వ్రాసెను.

శ్రీ కృష్ణునిగూర్చి బ్రహ్మయొనర్చిన స్తోత్రము :

"చతుర్భుజ ఘనసాంవళా
మకరకుండలేం కౌస్తుభగళాం
వైజయంతి వక్షస్థళా
ఆపాద వనమాలా"

ఏకనాథుడు బ్రహ్మదేవుని చిత్తముతో సాజాత్యము పొంది తన యను భవము వ్యక్తపరిచి యున్నాడు – ఈ వర్ణనవలన భగవంతుడు ప్రత్యక్షముగా మూర్తీభవించి నటులే కనుపించుచున్నది.

ఇతని రుక్మిణీ స్వయంవరము లోకప్రియమైన గ్రంథము. ఇందు 1711 ఓవీలు గలవు. రుక్మిణి వ్రాసిన లేఖ కృష్ణవర్ణన ఘట్టములు ఉత్తమకావ్య గుణములు గలిగి రసమును ప్రవహింప జేయుచుండును.

ఈ మహాకవి యొక్క భావార్థ రామాయణము అసమగ్రముగా నుండి పోవుటచేత ఈయన శిష్యుడైన గావుబా దీనిని పూరించెను.

ఏకనాథు డొనర్చిన గొప్పపనులలో జ్ఞానేశ్వరీ సంశోధన ముఖ్యమైనది.

## "జ్ఞానేశ్వరీ" విషయమై

"జ్ఞానేశ్వరుని యనంతర మెవరు ఓవీ వృత్తమున కావ్యము వ్రాయదలచి నారో వారు అమృతమయమైన బంగారు పళ్లెరము ముందు టెంకాయచిప్ప నుంచు చున్నారు".

అని యీయన తన యభిప్రాయమును తెలిపినాడు.

ఇవి గాక పామరులకు తెలియుటకై భారుడ, గౌళన, హారతులు అను కొన్ని పద్యములను కూడ వ్రాసెను.

ఏకనాథుని సమీపవర్తులగు విఠారేణుకా జనార్దన్-జనీజనార్దన్, జానూ జనార్దన్, దాసోపంత్ నలుగురు ఏకనాథునితో గూడి యీ ఐదుగురిని నాథ

పంచక మందురు. వీరందరు గొప్పభక్తులై భక్తి గీతముల రచియించిరి. దాసో పంత్ హస్తాక్షరములతో వ్రాయబడిన నొక 'పాసోడీ' (పచ్చడము) కొన్ని సంవత్సరములకు పూర్వము గొప్ప ఉత్సవముతో హైదరాబాదుకు తేబడినది.

# ముక్తేశ్వరుడు

(క్రీ. శ. 1609–1660)

ముక్తేశ్వరుడు దక్షిణకాశి యని ప్రసిద్ధిజెందిన ప్రతిష్ఠాన పురమున జన్మించెను. ఈతని మొదటి పేరు ముద్గలుడు. ఇతడు విశ్వంబరుడను గురువు ద్వారా ఉపదేశమును బొంది కులదేవత పేర ముక్తేశ్వరుడను నామము ధరించెను. కొన్నాళ్లు కాశీ పట్టణమున నివసించి తదుపరి దేశాటన మొనర్చెను. ఈ మహాకవి వివిధ గ్రంథముల నధ్యయనము చేసినవాడు. ఇతడు మహాభారతమును మరాఠిలో ననువదించి చిరకీర్తి నార్జించెను. ఇతని భారతము సంపూర్ణముగా నుపలబ్ధము కాలేదు. ఆది సభా అరణ్య విరాట సౌప్తిక-పర్వములు మాత్రమే ఇపుడుపలబ్ధము లగుచున్నవి. సంక్షేపరామాయణము (శ్లోకబద్ధము) శుకరంభా సంవాద మీతని యితర రచనలు. ఈతని భారతము మిక్కిలి లోక ప్రియమైన గ్రంథము. ఇందు ఆధ్యాత్మిక, ధార్మిక విషయములే గాక వ్యావహారిక విషయములు, ఉత్తమములైన కావ్యరచనా రీతులు నిండియున్నవి. దీని వలన ఈ భారతము నేటికిని గొప్పవిశిష్టత గలిగియున్నది. సహజరీతిలో ప్రతిభా విలాసములు వ్యక్త పరుచుటకు సంపూర్ణముగ నవకాశము చిక్కుట వలన నీ గ్రంథము సాహిత్య దృష్ట్యా మరాఠీ భాషలో ఆదికావ్య మని పేరుగాంచినది. ఇతడు భారత కథా భాగమును సూక్ష్మముగా ననువదించియు సమయానుసారము కొన్ని మార్పులు గావించియు రసానుగుణ్యముగా తీర్చిదిద్దెను. పై కారణముల వలన ముక్తేశ్వరుడు మహాకవి యని పేరు గాంచెను.

## రమావల్లభదాసు

ఇతడు గొప్పభక్తుడు – కర్ణాటకమునకు వెళ్లి కృష్ణభక్తిని గూర్చి ప్రచార మొనర్చిన సత్పురుషుడు. బృహద్వాక్యవృత్తి టీక దశకనిర్ధార్, గురుఖళి, ప్రబోధ చంద్రిక మున్నగునవి యితని గ్రంథములు.

## శివకల్యాణుడు

ఇతడు దశమ స్కంధమును ఒక లక్ష ఓవీ వృత్తములలో రచించెను. అమృతానుభవము అను దానికి నితడొక టీకను రచించెను.

## షేక్ మహమ్మద్

(1645 క్రీ. శ.) ఇతడు తురుష్కుడైనను పరమభక్తుడు, సరసకవి. మోరోపంత్ 'సన్మణిమాల'లో నితని గూర్చి ;-

"హర్షే(శేఖ మహమ్మద్ భగవజ్జన ముసలమాన వానావా"

యని పేర్కొనినాడు. ఇతడు యోగాభ్యాస పరుడు. పవన విజయము మున్నగు కొన్ని గ్రంథములు వ్రాసెను.

మాణుకోజిబోధవేలు ఆ నింబరాజు మోరవ్యాగోసావీ మొదలగు వారీతని కాలమువారే. యోగవాసిష్ఠమునకు టీక వ్రాసిన మాధవదాసు, ప్రదోషమాహాత్మ్యము రచించిన రామకవి, అశ్వమేధాఖ్యానకర్త విప్రనారాయణుడు, నాచికేతోపాఖ్యాన గ్రంథకారుడు తుకాసుందరదాసు, ఏకనాథుని శిష్యుడగు శ్యామరాజు మొదలగువారు కూడ ఇదేకాలమునకు జెందినవారు.

క్రైస్తవ కవి క్రిస్తదాసుతో మాన్‌స్టీవన్స్ కోంకణ భాషాధ్యయన మొనర్చి క్రీస్తు పురాణము వ్రాసెను. ఈ పుస్తకము మొదలు రోమను లిపిలో వ్రాయబడి తర్వాత నాగర లిపిలోనికి మార్చబడినది. ఇతడు కోంకణ భాషకొక వ్యాకరణము కూడ రచించెను.

# తుకారాం

(క్రీ. శ. 1608-1649)

ఇంద్రాయణీ నదీతీరమందలి దేహూగ్రామమున (శా. శ. 1530) తుకారాం జన్మించెను. ఇతని తండ్రి బోల్హోబా. వీరలవృత్తి వాణిజ్యము. బోల్హోబా

పెద్ద కుమారుడు మొదటి నుండియు విరక్తుడు కనుక, వీరి తండ్రి కార్యభారము నంతయు రెండవ కుమారుడగు తుకారామునిపై నిలిపెను. తుకారాం కేవలము భక్తి-శ్రద్ధాసక్తులు గలవాడైనను సంసారమును, వ్యాపారమును చక్కగా నడుపుచు వచ్చెను. చిన్ననాటనే యితని తండ్రి గతించెను. కరువు కాలములో వీరి వ్యాపారము దెబ్బతినెను. ఇతని భార్య మరణించెను. ఇట్లీతడు మిక్కిలి కష్టపడుచు జీవనయాత్ర సాగించెను. సంసారతాప శాంతికి భగవద్భక్తియే మార్గమని తలంచి భక్తుడై స్వకీయ విఠల మందిరములో కాలము గడుప దొడగెను. ఇతని భార్య గయ్యాళి. ఈయమ తుకారాం చర్యలను జూచి పరిహసించెడిది. తుకారాం సంసారముచే వ్యాకులుడై తానవలంబించిన పాండురంగ స్మరణయే శ్రేయమని తలంచియు సంసారమును వదలజాలడయ్యెను. తర్వాత స్వగ్రామమును వదలి భామగిరి యను కొండవైపు పయనించెను. ఆతడింటికి రాకపోవుటచే భార్య వేసటపాటు చెందినదైనను భామగిరికే యాహారము పంపుచుండెను. తుకారాముని భక్తికి సంతసించి విఠలుడు ప్రత్యక్షమై అభంగములలో కవితను వ్రాయుమని యాజ్ఞాపించెను. భగవద్దర్శనానంతర మీ భక్తకవి యుపదేశాత్మకమైన కవితను జూచి ఉపదేశార్హత లేదని బ్రాహ్మణు లీతని బహిష్కరించిరి. రామేశ్వరభట్టను పండితు డితని నిందించుటలో ముందుకు వచ్చెను. బ్రాహ్మణుల చర్యకు బాధపడి తుకారాం అభంగముల కట్టలను (వహీలను) ఇంద్రాయణీనది కర్పించి ప్రాయోపవేశము చేయుట కారంభించెను. పదమూడు దినముల తరువాత కాగితములు తడియలేదు. తీసుకొని వెళ్ళుమను వార్త వచ్చెను. దీనివలన నితడు గొప్ప మహిమాన్వితుడని తెలిసి రామేశ్వరభట్టు మొదటి శిష్యుడయ్యెను. అనంతరము తుకారాం కేశవచైతన్యుని వలన నుపదేశము పొందెను. భక్తుడుగా ప్రసిద్ధి జెందినను ఆత్మజ్ఞానము రాలేదని తహతహపడుచు భగవంతుని నిందింప మొదలిడెను. తుదికి ఆత్మార్పణ మొనర్ప సిద్ధపడగా ఆత్మజ్ఞానము కలిగి బ్రహ్మానందానుభూతిని బడసెను. తుకారాం జీవితకాలములో శివాజీ రామదాసుల దర్శనము అభంగ వృత్తములో శివాజీకి వ్రాసిన లేఖ ముఖ్యఘట్టములు. ఈ భక్తకవి కవిత మరాఠీ భాషకు అలౌకిక సౌందర్యము గలుగజేసినది. నామదేవుని యనంతరము విశదము-విస్తృతము రసవంతమునైన అభంగరచన తుకారామునిదే యని చెప్పవచ్చును. ఈతని యభంగములలో 'లౌకిక' పారమార్థిక జీవన

మున అనుభవమునకు వచ్చిన విషయములెన్నియో సుందరమైన శైలిలో వివరింపబడినవి. కరువు కాలములో కుటుంబపు దుర్గతి, సాధకున కారంభావస్థలో గలుగు ఇక్కట్టులు, ప్రతిక్షణము మనోదార్ఢ్యమును పరీక్షించు ఘట్టములు, వీని వలన గలుగు దారుణమైన నిరాశ, ఈ స్థితియందును కలుగు భావనాపటిమ, అంతమున గలుగు సాక్షాత్కారము, ఆనందానుభూతి మున్నగు వానిని గూర్చి వ్రాసిన భావనాయుతములగు అభంగములు ఈ మహాకవి ప్రతిరచనయందును తాండవించుచుండును. ఆత్మ సాక్షాత్కారానంతరము భగవత్ప్రాప్తికి సులభోపాయముల జూపు కొన్ని కీర్తనలు రచించెను. ఇతని వాక్యములెన్నియో మహారాష్ట్రమున చాటువులుగా వాడుకలో గలవు.

# సమర్థ రామదాసస్వామి

(క్రీ. శ. 1608–1681)

మహారాష్ట్ర సత్పురుష మాలికలో రామదాసస్వామి తేజశ్శాలియైన రత్నము ఇతని జీవితము భాగ్యవంతమైనది. 17వ శతాబ్దములో శివాజీ స్వతంత్రముగా మహారాష్ట్ర సామ్రాజ్యమును స్థాపించెను. ఆ కాలమున రామదాసస్వామి తన ప్రపంచ విజ్ఞానమును యింటింటికి ప్రాకించెను. "జ్ఞానేశ్వరుని జ్ఞానేశ్వరి, ఏకనాథుని భాగవతము, రామదాసస్వామి దాసబోధలు" మహారాష్ట్ర భాషలో ప్రఖ్యాతములైన గ్రంథములు. ఇతని పూర్వులు 'జాంబ్' అను నొక గ్రామమును కట్టించిరి. ఈయన శా. శ. 1530 లో జన్మించెను. తండ్రియగు సూర్యాజీపంతుని సూర్యోపాసన ఫలమున నారాయణుడు, గంగాధరుడను ఇరువురు కుమారులు గలిగిరి. నారాయణుని ఉపనయనానంతరము తండ్రి స్వర్గస్థుడయ్యెను. పెద్దకుమారుడగు గంగాధరుడు ఆధ్యాత్మోపదేశము చేయు యోగ్యత సంపాదింపగలిగెను. నారాయణుడన్నయగు గంగాధరుని ఉపదేశమిమ్మని కోరగా చిన్నవాడని యతడు నిరాకరించెను. కనుక నారాయణుడు ఏడవయేటనే ఇల్లు వదలి వెళ్లి సమీపమందలి రామాలయము చేరుకొని ఉపాసన నారంభించి ఎనిమిదవ యేట రాముని సాక్షాత్కరింప జేసికొనెను. నాటినుండితనిని రామదాసని పిలువదొడగిరి. రాముడే యితనికి గురువయ్యెను. రామదాస్య మొనర్చుచు,

స్వీయ కర్తృత్వము వలన శ్రద్ధావివేకముల బలముతో 'సమర్థ' పదవిని సంపాదింప గలిగెను రామదర్శనానంతర మితడు గృహమున కేతెంచెను గాని, ఇంట నుండుట కిష్టపడలేదు. 1542 శా. శ. లో ఇల్లు వదలి సావధానుడై పదునెనిమిది రోజులు పయనించి నాసిక యొద్దగల టాకదే యను గ్రామమునకు వెళ్లెను. అక్కడ నొక గుహలో పన్నెండేండ్లు కఠినమగు తపమాచరించి ఆత్మసాక్షాత్కారము నందెను. తపమొనర్చు కాలముననే కరుణాష్టకమును రచించెను. ఆ గ్రంథముద్వారా ఆ పరిస్థితిలోని అతని మనోవృత్తి స్పష్టముగ తెలియగలదు. దాసబోధ మూలభాగము అనగా జునాదాసబోధ అదే సమయమున రచించెను ఏకనిష్ఠతో జేసిన శ్రీరాముని యారాధన సఫలమైన తదుపరి ఇతరులకు బోధ జేయ నారంభించెను. యావద్భారతము నందును పన్నెండేండ్లు సంచరించెను. ఈ పర్యటన ద్వారా కలిగిన యనుభవము ఆ కాలమునాటి పరిస్థితులు దాసబోధలో పరచక్ర నిరూపిణి మున్నగు ప్రకరణములలో నిరూపించియున్నాడు. తల్లిని దర్శించి కృష్ణాతీరమున గల బాఘళ్ అను గ్రామమున నివసింప మొదలిడెను. ఇతడు ఇక్కడ మఠములు హనుమద్దేవాలయములు నిర్మించెను, రామదాసు జేసిన పని నంతయు "సంఘటన" యను నొక శబ్దముద్వారా చెప్ప వచ్చును. శా. శ. 1571 లో శివాజీ ఇతనిని సందర్శించి ఉపదేశము స్వీకరించెను. పండరిలో రామదాసు తుకారాముల సమాగమము జరిగెను. శివాజీ యనంతరము మహారాష్ట్రము సంకటముల పాలయ్యెను. అట్టి గడ్డుకాలమున నితడు ప్రజలలో ధైర్యమును పురికొల్పి స్వాతంత్ర్యము నిలుప ప్రయత్నము చేసెను.

దాసబోధ, మనాచే శ్లోక్, సుందరకాండ, యుద్ధకాండము, కరుణాష్టకములు, పంచకరణము, హారతులు, ఓవీలు, మహారాష్ట్ర దేశవర్ణన పరమైన ఆనందభువనము మున్నగునవి ఈయన రచించిన గ్రంథములు. పరంపరానుగతమైన సనాతన ధర్మము భక్తితోపాటు స్వీయ కర్తవ్యము మున్నగు వానిని గూర్చి ఈయన బోధించెను. స్వాతంత్ర్యము ననుభవించు మహారాష్ట్ర దేశము ఆనంద భువనమని గౌరవించి దేశభక్తిని ప్రజలలో పెల్లుబికింప జేసెను. 'అధీ పంచకరవానేటికా' (మొదట ప్రపంచమును చక్కదిద్ది తర్వాత పరమార్థమును సాధింపవలెను) 'అధీ అసావే బ్రహ్మచే అధిష్ఠాన మగకరావే రాజకరణ' (ప్రథ

మమున బ్రహ్మాధిష్ఠానము పొంది అనంతరము రాజకీయములలో ప్రవేశింప వలెను) అని ఈతని ప్రబోధాలు.

# రామదాస పంచాయతనము

## జయరామస్వామి వడగాంకర్

ఇతడు దశమస్కంధమునకు టీకను వ్రాసెను. రుక్మిణీహరణము, అపరోక్షాను భూతి, సీతా స్వయంవరమను గ్రంథములు గూడ నితని విరచితములే.

## రంగనాథస్వామి నిగిడీకర్

నిగిడీకర్ రాజయోగియై గురుగీత, మిథ్యా మాయా స్వరూపము, సుదామ చరిత్రయను గ్రంథములు వ్రాసెను.

## కేశవస్వామి

హైదరాబాద్ ఇతని నివాసము. గొప్ప కీర్తనాకారుడు. ఈతని కృష్ణ గీతలు జయదేవుని గీత గోవిందమును స్మృతికి తెచ్చును.

## ఆనందమూర్తి

రామదాస శిష్యుడైన నితడనేక గీతములు వ్రాసెను.

## గంగాధరపంత్

ఈ భక్తకవి భక్తిరహస్యము సుగమోపాయ మనువానిని ఓవీబద్ధ గీతములలో వ్రాసెను.

# పండిత కవులు

## వామన పండితుడు - (క్రీ. శ. 1606 - 1695)

వామనుడు బిజాపుర ప్రాంతీయుడు. ఇతడు చక్కని శాస్త్ర పాండితి గల వాడు. ఈతనిని జాతి భ్రష్టుని గావింపవలెనని బిజాపుర సుల్తానులు ప్రయత్నించిరి. ఈ బాధనుండి తప్పించుకొనుటకు పత్నీ సమేతుడై కాశీ చేరుకొని, అచట శాస్త్రాధ్యయన మొనర్చి విజయపత్రము నందెను. ఆత్మజ్ఞానము పొందుటకై సద్గురువు నన్వేషించుచుండ ఈతనికి సమర్థ రామదాసుని దర్శన భాగ్యము లభించెను. తర్వాత మలయపర్వతముపై తపము సేయ నారంభించెను. అక్కడ సచ్చిదానంద స్వామిని దర్శించి వారివలన వారుణీ విద్యను గ్రహించెను. తదుపరి గ్రంథరచనోద్యుక్తు డయ్యెను. కావ్యరచనా విధానము మరాఠీలో వామనుని నుండియే ప్రారంభమైనది. శృంగార సమ్మిశ్రితమైన భక్తి, అనుప్రాసాత్మకమైన వర్ణరచన, నాదమాధుర్య మీ కవీశ్వరుని శైలిలో స్థానమాక్రమించు కొనినవి. నిగమసారమను గ్రంథమున నితడు విద్య నార్జించిన విధమును తెలిపెను. కర్మతత్వము, చిత్సుధ సిద్ధాంత విజయము, అపరోక్షానుభూతి, గజేంద్ర మోక్షము మున్నగునవి ఈతని గ్రంథములు - యథార్థదీపిక యనునీతని భగవద్గీతా వ్యాఖ్యానము మిక్కిలి ప్రఖ్యాతమైన గ్రంథరాజము - "జ్ఞానేశ్వరి" యథార్థముగా లేదని ప్రతినబూని 22వేల ఓవీలలో దీనిని పూర్తి జేసెను. పూర్వ భాష్యకారు లెవ్వరును శ్రీకృష్ణ తత్వమును దర్శింపలేక పోయిరని యాక్షేపించి స్వయముగా వ్యాఖ్యను ప్రకటించెను. గీతలో జ్ఞానోత్తర భక్తి ప్రతిపాదింపబడినదని ఈతని యభిప్రాయము. వేణుసుధ - నామసుధ - భామా విలాసము - రాసక్రీడ మున్నగు కావ్యములను రచించెను. లలితములగు పద ప్రయోగమునను అలంకారములు ప్రయోగించుటలోను వామను డందెవేసిన చేయి.

## రఘునాథ పండితుడు - (శా. శ. 1552 - 1642)

రఘునాథుని దేశకాలములను గూర్చి నిశ్చయముగా తెలియుటలేదు. ఇతడు నలదమయంతీ స్వయంవరమను నద్భుత గ్రంథరాజమును వ్రాసెను

రామదాస వర్ణన, గజేంద్ర మోక్షములను కావ్యములను గూడ రచించెను. రఘునాథుని కావ్యములలోని పాండితీ పరిశ్రమల మనోహర సమావేశ మింతవరకు గల పూర్వ కావ్యములలో నరుదు. ఇతడు మరాఠీలో శ్రీనాథు నంతటివాడు. శ్రీహర్షుని నైషధమును చక్కని భాషలో సంగ్రహముగా వివిధ సంస్కృత వృత్తములలో యమకానుప్రాసముల యుక్తముగా రచియించెను. దురదృష్ట వశమున నీ గ్రంథము పూర్తిగా లభ్యము కాలేదు.

రఘునాథుని తర్వాత నెందరో ప్రసిద్ధులగు కవులు వెలసిరి. వారిలో నీ దిగువ పేర్కొనినవారు ప్రసిద్ధులు.

## ఆనందతనయుడు

ఇతడు 'కడలే' యను గేయరూపమున సీతా స్వయంవరమను కావ్యమును వ్రాసెను. ఇదిగాక భారత, రామాయణాములలోని ఆఖ్యానములకు సుందరములగు పదములు వ్రాసెను. ఇవి పురాణములు - హరికథలు - చెప్పు వారలకు కామధేనువులై యున్నవి.

## సామరాజు

ఇతడు ముద్గలాఖ్యానము, రుక్మిణీహరణములను కావ్యములు వ్రాసెను. రుక్మిణీహరణము మహాకావ్యము, సంస్కృత సాహిత్య శాస్త్ర గ్రంథములలోని మహాకావ్యాది లక్షణముల ననుసరించి ఇందలి విషయములు వర్ణింపబడినవి.

## విఠల అనంతక్షీరసాగర్

ఈ మహాకవి కేవలము సంస్కృత సాహిత్యశాస్త్రము ననుసరించి రుక్మిణీ స్వయంవరము, పాంచాలీస్తవనము, రసమంజరి, బిల్హణచరిత్ర యను గ్రంథముల రచించెను. ఛత్ర చామరాది బంధ కవిత్వము, ప్రతిలోమ యమకములు, ఈతని కావ్యములలో నిండియున్నవి. భీడ్ మండలాంతర్గతమైన గౌరీపుర మీతని నివాసము.

## నిరంజన మాధవుడు - (శా. శ. 1625 - 1712)

నిరంజన మాధవుడు పీష్వా మొదటి బాజీరావు దర్బారులో గొప్ప రాజో ద్యోగిగా నుండెను. ఈతని తండ్రికూడ బీజాపురమున రాజోద్యోగిగా పని చేసెను. నిరంజనుని కవితలో వ్యవహార ప్రావీణ్యము గోచరించును. ఛంద శ్శాస్త్రము వేదాంతము - ప్రవాస వర్ణనాదులపై గ్రంథములు రచించెను. కృష్ణా నంద సింధువు, చిత్తబోధ, వృత్త ముక్తావళి, సుభద్రాచంపు. (ఇది మరాఠీలో మొదటి చంపూ గ్రంథము), రామకర్ణామృతము మున్నగున వీతని గ్రంథములు.

## దేవదాసు

ఇతడు రామదాసుని శిష్యుడు. వేంకటేశ స్తోత్రమును వ్రాసెను.

## శ్రీధరుడు - (శా. శ. 1600 - 1651)

శ్రీధరుడు దాదాపు 60 వేల పద్యముల రచించి భావుకుల హృదయము లందు స్థాన మేర్పరుచు కొనినవాడు. నార్ఘురీ ప్రాంతీయుడు. హరివిజయము, రామవిజయము, పాండవ ప్రతాపము, శివలీలామృతము మున్నగునవి ఇతని ప్రఖ్యాతములగు రచనలు. శోక - వీర - శృంగార - కరుణాది రసములు పోషించుటలో ఇతనికితడే సాటి. ఈ కవి రచనలు ప్రజలలో మిక్కిలి ప్రచా రము గలవై యున్నవి.

## కృష్ణదయార్ణవుడు — (శా. శ. 1596 - 1662)

ఇతడు దశమస్కంధముపై 42వేల ఓవీలను వ్రాసెను. గ్రంథ మసం పూర్ణముగా లభించుటచే నుత్తమ శ్లోకుడను నితని శిష్యుడు తక్కిన దానిని పూరించెను.

## మహీపతి - (శా. శ. 1667 - 1712)

మహీపతి తహరాబాదు నివాసి. ఇతడు ప్రసిద్ధములైన చరిత్ర గ్రంథ ములు వ్రాసెను. భక్తిలీలామృతము, సంతలీలామృతము, కథాసారామృతము,

పాండురంగ మాహాత్మ్యము మున్నగు చరిత్ర గ్రంథములు భక్తిపరముగ రచియించెను.

## మోరోపంత్ - (క్రీ. శ. 1729 - 1794)

మోరోపంత్ శా. శ. 1651లో పన్హాల్‌గడ్ (కొల్హాపుర ప్రాంతము)లో జన్మించెను. ఇతని తండ్రి రామచంద్రపంత్ పరాడ్కర్, కేశవోపాధ్యాయుని కడ పంత్ విద్య నభ్యసించెను. కాశీయాత్ర గావించి బారామతీ నగరము చేరుకొని యచటనే బాపూజీ నాయక సరంజామదార్ అనువారి ఇంటిలో పౌరాణికుడుగా స్థిరపడెను. ప్రగాఢ పాండిత్యము శుద్ధాంతఃకరణముతో గూడిన రామభక్తిని పరికించి చూడ సకల పండిత కవులలో గల అసాధారణ ప్రతిభ, నామదేవాది సత్పురుషులలో గల భక్తి సంపద, యీ మహాకవిలో మూర్తీభవించి నటుల స్ఫురించును. గంభీరమైన అధ్యయనము, పుట్టుకతో వచ్చిన నవరసాభి వ్యంజన శక్తి, వ్యాకరణ శుద్ధత, అసాధారణ రసోచిత పదవిన్యాస కౌశలము, పరమేశ్వరునిపై నెడతెగని భక్తి యితని కవితలో నడుగడున కనిపించు చుండును. ఈ మహాకవి సంస్కృత మరాఠీ భాషలలో ప్రఖ్యాతములగు నెన్నియో కావ్యములు రచించి మహారాష్ట్రకవి సార్వభౌముడని పేరుగాంచెను. లవకుశాఖ్యానమీతని మొదటి గ్రంథము. ప్రహ్లాద విజయము, సప్తశతి, సీతాగీతము, సావిత్రీగీత, శ్రీకృష్ణవిజయము, హరివంశము, కేకావళి మున్నగు కావ్యములువ్రాసెను. ఇతని కవిత నేదృష్టితో జూచినను సర్వాంగ సుందరమునై యున్నది. ఆర్యాగీతి, మాత్రా గణ వృత్తము లీతని కవితలో నెక్కువగా కనిపించును. పంత్ సంపూర్ణ మహాభారతమును నవరస పూర్ణమైన అద్భుత శైలిలో ఆర్యావృత్త బద్ధముగా రచించెను, ఎన్నియో రకములైన రామాయణములు వ్రాసెను. మంత్ర రామాయణమను గ్రంథమున "శ్రీరామ జయరామ జయజయరామ" యను మంత్రమును, గైకొని యనుక (Alliteration) గర్భితముగ వ్రాసెను ఇటులే మంత్ర భాగవతమును గూడ కూర్చెను. పద్మ రామాయణము, దామ రామాయణములు గూడ ఇతని లేఖినినుండి వెలువడినవే. సన్మణిమాల యను కావ్యమున జ్ఞాన దేవాది భక్త కవులను, పండిత కవులను గూర్చి ఆర్యావృత్తమును సభంగ శ్లేషయుక్తముగా కూర్చెను.

ఈ "ఆర్య"లో రెండవ, నాలుగవ చరణములు సభంగ శబ్ద శ్లేషగలవి. సంశయ రత్నమాల యను కావ్యమున మిక్కిలి చమత్కారముగా నీకవి భగవంతుని గూర్చి స్తోత్రము చేసియున్నాడు. భగవంతుని గూర్చి ప్రార్థింపగా నతడు రాకపోవుటకు గల కారణములను అనేకములగు ఉత్ప్రేక్షాలంకారములతో వర్ణించెను. పంత్ రచనలలో కేకావళి అత్యద్భుతమైన కావ్యము.

# షాహిరీ వాఙ్మయము

(క్రీ. శ. 1744-1844)

మహారాష్ట్ర వాక్తరంగిణి అత్యున్నతమైన జ్ఞానము, భక్తి-వైరాగ్యము-ధర్మము-మున్నగు, పర్వత శిఖరములనుండి వెడలి-క్రిందికిదిగి నిసర్గ సుందరమైన సుగంధ పుష్పములతో గూడిన కవితా వనారామములనుండి ప్రవహించి కవితా విక్రయముచేయు స్వార్థపరుల జనపదముల సమీపమునుండి ప్రవహించుటను చూడగా నది యొక క్రొత్త రూపమునే ధరించినటుల గోచరించును. ఇదియే లావణి, పోవాడా యను నవ్య రచనారీతి. దీనికే షాహిరీ వాఙ్మయమని సంకేతము. అరబ్బీ భాషలో కవిని 'షాయర్' అందురు. ప్రాయశః పై శబ్దమే రూపాంతరము చెంది 'షహిరీ'గా మారినదని చెప్పవచ్చును.

పోవాడ రచనలో మహారాష్ట్ర ప్రభువుల శౌర్య - ధైర్య - పరాక్రమాది గుణము లద్భుతముగా వందిమాగధుల కైవారమువలె పొగడబడినని. కొందరు లావణీ పోవాడలను నీతిబోధ వేదాంతము భగవత్పరమున కూడ వ్రాసినవారు కలరు. పీష్వాల యనంతరము - లావణీ లెక్కువ ఆదరము పొందినవి. ఇది కేవలము శృంగార రసమైన రచనారీతి. ధనికులు, విలాసప్రియులు వీని పోషకులు. అగన్‌దాసనువాడు (1720-1790) పోవాడ రచనలో ప్రథముడు. 1659లో జరిగిన అఫ్జల్‌ఖాను వధనుగూర్చి పోవాడను రచించెను.

## హంసరాజు - (క్రీ. శ. 1720-1770)

ఇతడద్వైత వేదాంత రహస్యములు సులభముగా రసవంతమైన శైలిలో రచించెను. వేదాంతపరముగా రామాయణమును అభంగములలో వ్రాసినాడు.

భా - రా-పాళందేయనువాడు మరాఠీ కవితలో భగవద్గీతానువాదము చేసెను. ఈ కాలములో యిట్టి వేదాంతకవులు అపవాద కారకులు.

## ఆనంతఫందీ - (1744 - 1819)

ఇతడు పీష్వా కాలమునకు చెందినవాడు. ఈయ నెన్నియో పోవాడలు ఫటకాలు రచియించెను.

## రామజోషి - (1754-1849)

ఇతడు శిష్టసమ్మతుడైన కవి. ఎన్నియో లావణీలు వ్రాసెను. ఈయన కవిసార్వభౌముడైన మోరోపంత్ వలన నుపదేశము పొంది లావణీ రచనవాలించి హరికథలు వ్రాయ మొదలిడెను. ఛేకాపహ్నుత్యలంకారమున నితడు వ్రాసిన లావణీ ప్రసిద్ధమైనది.

## ప్రభాకర్ - (1769-1843)

ఇతడు పీష్వా ఆస్థానమున నుండి పోవాడలు వ్రాసెను. ఇతని "రంగాచా పోవాడా" యనునది ప్రఖ్యాత పోవాడలలో నొకటి. ఇందు "సవై మాధవరావు" యొక్క ప్రశస్తి యున్నది.

హోనారీబాళ్ వ్రాసిన ఘనశ్యామ సుందర్ అను భూపాళము మహారాష్ట్ర దేశమున నధిక ప్రచారము నందినది.

# నవ్యయుగము

(క్రీ. శ. 1818)

## గద్యావతరణ

18 వ శతాబ్దపు అంత్యభాగమున మన భారత దేశమందు నొక విచిత్ర వాతావరణ మేర్పడెను. పీష్వాల రాజ్య మంత్యదశ యందుండెను. కలకత్తా-

బొంబే - మద్రాసు - తిరువాన్‌కూరు పట్టణములందు క్రైస్తవ మతమునకు సంబంధించిన వివిధ సాంప్రదాయ మత పీఠములు స్థాపింపబడెను. దానికి తోడుగా పండితులు, శాస్త్రవేత్తలు పరంపరాను గుణ్యముగా తమతమ వేదవిద్యా సంబంధమగు అధ్యయనముల జరుపుచుండిరి. మరికొందరు క్రొత్తగా ఇంగ్లీషు భాషను నేర్వసాగిరి. క్రీ.శ. 1818లో పీష్వా సామ్రాజ్య మస్తమించెను. దేశమంతటను ఆంగ్ల సామ్రాజ్య విధాన మమలులోనికి వచ్చెను. దాని కనువుగా ఇంగ్లీషు విద్యా విధానము ప్రారంభమయ్యెను. మిషనరీవారు క్రైస్తవ మత ప్రచారమునకై చిన్న చిన్న గ్రంథములు మరాఠీలో వ్రాయించి ప్రకటించిరి. క్రమేణ యుపయుక్తములగు గ్రంథములకు మరాఠీ యనువాదములు కూడ చేయించి ప్రకటించిరి. క్రొత్తగా స్థాపింపబడిన ముద్రణా యంత్రశాలల సహాయము వలన, గద్య, పద్యాత్మకములైన భాషాంతరీకరణములు జరిగి ప్రకటితమైనవి.

డాక్టర్ విలియంకేరీ యనునతడు "శుభవర్తమానము" "మరాఠీ భాషేచే వ్యాకరణ్" మోడీలిపిలో అచ్చువేసిన "మరాఠీ ఇంగ్రీజీకోశ్" (క్రీ శ. 1810) మొదలగు గ్రంథముల సిద్ధపరిచెను. తర్వాత "హితోపదేశ్" "పంచతంత్ర" మరియు "సింహాసన బత్తీసీ" మొదలగునవి యనువదింప బడెను. బొంబాయి నగరమున "బాంబే నేటివ్ ఎడ్యుకేషనల్ సొసైటి" ద్వారా రెండు వ్యాకరణములు సిద్ధము చేయబడెను. 1829లో "మహారాష్ట్ర భాషేచాకోశ్" యను గ్రంథమును ప్రచురించిరి. 'హైంద్‌శాలా' పుస్తక మండలివారు మరాఠీ, గుజరాతీ పాఠశాలలకుపకరించు పుస్తకములను వెలువరించిరి. "బాలమిత్ర" 'ఇసాక్‌నీతి' 'వేతాళ పంచవీశీ' 'అరబీ భాషేతీల్-సురస్ ఆణిచమత్కార గోష్టి' 'రాసేలస్' మొదలగు పుస్తకముల భాషాంతరీకరణములు సదాశివ కాశీనాథ్‌ఛత్రే - కృష్ణశాస్త్రి చిపుళూన్‌కర్ మొదలగువారు గావించిరి. చార్లెస్ లాంబ్ రచించిన 'షేక్‌స్పియర్' నాటకానువాదము యిదే సమయమున చేయబడెను.

హరికేశవజీ ప్రథమముగా నొక 'నవల' వ్రాసెను. నవల కీ సమయముననే 'కాదంబరీ'యను పేరు గలిగెను. ఆ నవల పేరు 'యాత్రిక క్రమణ.' ఇది అనువాద పుస్తకము - అనంతరము బాబా పదంజీ యనునొక క్రైస్తవ మతావలంబి 'యమునా పర్యటనము' అను నొక స్వతంత్రమగు నవలను రచిం

చెను. ఈ నవల యందొక హిందూ విధవయొక్క జీవితమును వ్యక్తపరిచి తుదకొక క్రైస్తవ యువకునితో వివాహమాడినటుల చిత్రించెను. ఇది ప్రత్యక్షముగా క్రైస్తవ మత ప్రచారము. లక్ష్మణశాస్త్రి హళలేయనువారు "ముక్తమాల" 'రిన్‌బూడ్' యనునతడు 'మంజుఘోష' యను నద్భుతములగు కదంబరులను రచించిరి. ఇదే ప్రకారముగా 'ఘాసీరామ కోత్వాల్' అను నొక నవల యుపదేశపరముగా వ్రాయబడి ప్రసిద్ధిగాంచెను. ఇట్లే మరికొన్ని నవలలు వ్రాయబడెను.

ఇదే సమయమున నాట్యక్షేత్రము నందు కూడ మరాఠీ భాష యున్నత స్థానము నందుకొన్నది. శ్రీలక్ష్మీనారాయణ కల్యాణమను నాటకము యొక్క లిఖిత ప్రతి తంజావూరు గ్రంథాలయమున నున్నది. ఇది పౌరాణిక నాటకము. క్రీ.శ. 1700లో వ్రాయబడెను. మరాఠీ భాషలో నిదియే మొదటి నాటకము— కాని మరాఠీ భాష దృష్ట్యా సాంగ్లీవాస్తవ్యుడైన విష్ణురాసుభావే వ్రాసిన 'సీతా స్వయంవర్' అను నాటకమే మొదటి నాటక మనవచ్చును. ఈ విధముగా 1843వ సంవత్సరము మరాఠీ నాటకములకు ప్రారంభ కాలమైనది. తర్వాత 'రుక్మిణీ హరణ' 'చంద్రహాస' 'గోపీచంద్' మొదలగు నాటకములు వ్రాయబడెను. తర్వాత విక్రమోర్వశీయము, వేణీసంహారము, ఉత్తర రామచరితము, శాకుంతలము, మృచ్ఛకటికము, నాగానందము, పార్వతీ పరిణయము - తాత్యా గోడబోలె పండితుడు అనువదించెను. పరశురాం మరాఠీ నిమంతురచనలో పాల్గొన్నవారిలో ముఖ్యుడు - 'వృత్తదర్పణ' మను ప్రఖ్యాత మరాఠీ ఛందో గ్రంథము వ్రాసెను. ఇతడు మరాఠీ కావ్య సంగ్రహమైన నవనీతమను గొప్ప గ్రంథమును రచించెను. ఇది 1854లో ప్రచురింపబడినది. మాలతీ మాధవము, ముద్రారాక్షసము మొదలగు వాని భాషాంతరములు కృష్ణశాస్త్రి రాజవాడే యను నతడొనర్చెను.

ఈ ప్రకారముగా ఇంగ్లీషు నాటకములు గూడ ననువదింపబడెను. వీనికి 'బుకిష్' నాటకములని కూట వాడుక గలదు. మహదేవశాస్త్రి కోల్హాట్‌కర్ 'ఒథెల్లో' - 'నాథూ' వ్రాసిన 'జూలియన్ సీజరు' అను సర్వోత్కృష్టములైన నీ రెండు అనువాదము లీకాలముననే వెలువడినవి. "థోర్లే మాధవరావు పేష్వే"

యనునది మరాఠీ భాషలో నైతిహాసికము, స్వతంత్రము, సర్వాంగ సుందరము నైన నాటకము. 'మనోరమ' యనునది స్వతంత్రమైన సామాజిక నాటకము చరిత్రలు స్వీయచరిత్రలు, ఇతిహాసములు, ప్రవాసవర్ణనలు మొదలగు వివిధ గద్య రచనలు కూడ ఇదే కాలమున ప్రారంభములైనవి.

'ప్రతాపాదిత్య'! సోక్రటీస్, నానాఫడ్నవీస్, రామమోహనరాయలు మొదలగు ననేక ప్రాచ్య పాశ్చాత్య మహాపురుషుల చరిత్రలు వ్రాయబడినవి. విష్ణుబోవా, బ్రహ్మచారి, బాబాపదంజీ, దావాబా పాండురంగ్ - వీరి-స్వీయచరిత్రలు విశేషముగా నుల్లేఖనీయములైనవి. వీనియందు వదలదగిన అంశము లెక్కువగా నున్నను చరిత్రాంశము సులభమైన భాషలో కలదు.

ఖ. బ. ఫడకే, వి. కే. ఓక్ మొదలగువారు 1857 నాటి స్వాతంత్ర్య విప్లవమును గూర్చి సవిస్తరముగా గ్రంథముల రచించిరి.

శ్యామ్‌రాజ్ మోరోజీ యనువాడు కాశీప్రవాస మను గ్రంథమును వ్రాసెను. ప్రవాస వర్ణన మందిది మొదటి గ్రంథము. మేజర్ క్యాండీ యను నతడు ప్రప్రథమముగా 'హిందూస్థాన్ చే వర్ణన్' అను భూగోళ గ్రంథమును వ్రాసెను. విద్యార్థుల కొరకు ఉపయుక్తమైన చిన్నచిన్న శాస్త్రీయ గ్రంథములు గూడ వ్రాసెను. ఎందరో పండితులు వ్యాకరణ శాస్త్రమున మిక్కిలి పరిశ్రమ నొనర్చి రచనలు వెలువరించిరి. దాదోబా యను పండితుడు 'మహారాష్ట్రపాణిని, యను పేరుగాంచెను.

ఈ కాలమున ఆంగ్లసామ్రాజ్యము స్థాపింపబడుట వలన యనేక విషయములపై వాద వివాదములు ప్రారంభ మయ్యెను. క్రైస్తవ మతానుయాయులు, సనాతనులు, సనాతనాచారముల సంస్కరింప గోరువారు, అంత్యజుల నుద్ధరించువారు పరస్పర వాదముల నారంభించిరి. ఇట్టి వివాదాత్మక వాఙ్మయము వలన 'నిబంధరచన' ప్రాంభమయ్యెను.

## విష్ణుబోవా బ్రహ్మచారి - (1825-1871)

ఈ పండితుడు గొప్ప క్రైస్తవ మత ఖండనకర్త. ఇతడుపన్యసించి హైందవ మతప్రచార మొనర్చెను. వీరిలేఖిని యెంత తీక్ష్ణమైనదో వాణియు

నంతయే తీక్షమైనది. వీరి రచనలు వేదోక్త ధర్మప్రకాశ్, సేతుబంధనీ, సుఖ దాయక రాజ్య ప్రకరణీ నిబంధ్, సహజస్థితీసా నిబంధ్ మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. ధర్మము, రాజకీయము, తత్వము మొదలగు విషయములలో నిత డొకే విధమైన సామరస్య గ్రంథముల రచించెను

## జ్యోతిబా పులే - (క్రీ. శ. 1827-1890)

వీరు సత్యశోధక సమాజ స్థాపన మొనర్చిరి. 1848లో వీరు పూనా పట్టణమున ప్రప్రథమముగా కన్యా విద్యాలయమును స్థాపించి తన భార్యను ఆ పాఠశాలలో చేర్పించిరి. వీరి "గులాంగిరి" యను పేరుగల గ్రంథము ప్రసిద్ధమైనది. అస్పృశ్యులు చదువుకొనుటకు వీరొక పాఠశాలను స్థాపించిరి. వీరు తమ నిస్వార్థత అఖండ పరిశ్రమ మొదలగు సద్గుణములచేత 'మహాత్మ పులే' యని ప్రసిద్ధి గాంచినారు.

## గోపాలహరి దేశముఖ్ - (1823-1892)

ఇతడు 'ప్రభాకర్' యను నొక పత్రిక నారంభించెను. సుప్రసిద్ధమైన రచనలు గావించుటవలన దేశముఖ్ ప్రఖ్యాత పురుషుడయ్యెను. ఈయన "లోక హితవాది" యను పేరుతో (100) నూరు వ్యాసముల కెక్కువగా రచించెను. ప్రభుత్వోద్యోగమును వదలిన తర్వాత 'లోకహితవాది' యను మాసపత్రికను స్థాపించెను. ఇతని రచన ఓజోగుణ ప్రధానముగా నుండును. ఈ విధముగా ననేక విషయములపై గద్య రచనలు వెలసెను.

ఈ కాలముననే 'వితోబా అణ్ణాదఫ్తర్‌దార్' అను నొక గొప్ప కవి యుండెను. మరాఠీ భాషలోను, సంస్కృత భాషలోను అతని కవిత్వ మత్యంత మనోహరముగా నుండును. ఈ విధముగా ఆంగ్లభాషా సంప్రదాయానుసారము నిసర్గవర్ణన పరమైన కవితారచన ప్రారంభ మయ్యెను.

బజాబా ప్రధాన్ అను నతడు 'లేడీ ఆఫ్ ది లేక్' అను సుప్రసిద్ధమైన ఆంగ్ల కావ్యమును 'దైవసేనీ' యను పేర యనువదించెను. ఇట్టి రచనల వలన మరాఠీ వాఙ్మయమునకు క్రొత్త శోభ రాదొడంగెను. ఇదివరకు సంత్ (సత్పురుషులు)

పంత్ (మోరోపంత్ మొదలగువారు) శాస్త్రపండితులు - సంస్కర్తలు - సనాతన ధర్మ ప్రచారకులు - చేసిన సేవ వలన శోభించుచుండిన మరాఠీ సాహిత్యమొక విలక్షణమును, అద్భుతమును నైన సుందర స్వరూపమును ధరించెను.

# నిబంధమాల రచయిత

## విష్ణుశాస్త్రి చిపుళూణ్‌కర్ – (1850 - 1882)

మహారాష్ట్రమున ఆంగ్ల సామ్రాజ్య ప్రారంభ దినములలో దర్పణ్, దిగ్దర్శన్, ప్రభాకర్, మరాఠీశాలా పత్రక్ మొదలగు పత్రికలు ప్రసిద్ధమగు చుండెను. వీనిలో ననేక శాస్త్రీయ విషయములను గూర్చి ఉపయుక్త సమస్యలపై చర్చలు జరుగుచుండెడివి. వానివల్ల ప్రజలలో స్వాతంత్ర్య భావములు రెకెత్తుచుండెను. చిన్నవాడగు విష్ణుశాస్త్రి తన లేఖన వ్యాపారమును తండ్రియగు కృష్ణశాస్త్రిగారి పత్రికయగు 'శాలాపత్రిక' ద్వారానే ప్రకటించెను. ఇందు మొదట సంస్కృతాంగ్ల కవులచరిత్రలు - వ్రాయసాగెను. 1874లో స్వీయముగా 'నిబంధమాల'యను పత్రికను స్థాపించెను. లోకమాన్య తిలక్, ఆగర్కర్, నామజోశీ, ఆప్టే మొదలగువారి సహాయము వలన 1880లో 'న్యూ ఇంగ్లీష్ స్కూల్' అను పాఠశాల ప్రారంభించెను. 'కేసరి' యను మరాఠీ సంచిక, 'మరాఠా' యను ఇంగ్లీషు పత్రిక ప్రారంభమాయెను. ప్రాచీన హిందీలో కాంబేజ్ఞాన్ అనునది ఇతని మొదటి నిబంధము విద్వత్ ఆణి కవిత్వ మను వ్యాసము ద్వారా నితని పాండిత్యము, విమర్శనా చాతుర్యము విశదమగును. వీరి భాష సులభమైనదైనను, వాక్ప్రవాహము కడు వేగమైనది. రచన గంభీరమైనది. 7 సంవత్సరములీ నిబంధమాల నడిచెను. మరాఠీ భాషలో సామాజిక, రాజకీయ, చరిత్రాత్మక, మానసిక శాస్త్ర, ధార్మిక విషయాలపై అనుకూల ప్రతికూల రచనలు ప్రకటించి భాషపై తన యధికారమును స్థాపించెను.

పారతంత్ర్యము పట్ల తిరస్కారము - స్వత్వము పట్ల నభిమానము- స్వదేశము పట్ల ప్రేమ ప్రకటించుటవల్ల ఈ నిబంధములలో నొక విలక్షణమగు

శక్తి - ఓజో గుణము కనిపించుచున్నవి. వీరు ఆర్యసమాజము - క్రైస్తవ మత ప్రచారకులు - ఆంగ్లాభిమానులు, ప్రార్థనా సమాజవాదులు - మొదలగు వారిపై అగ్నివర్షము కురిపించుచుండిరి, వీరు ప్రతిపక్షము వారి మర్మస్థలములు కనిపెట్టి బలవత్తర ప్రహారములు చేసెడివారు. వీరి శైలిలో గాంభీర్యము, సంస్కృత శబ్ద ప్రాచుర్యము, ఎక్కువ ఇతర భాషలకు జెందిన శబ్దములను మరాఠీ భాషారూపములుగా మార్చి చమత్కారముగా వ్రాయుచుండెడివారు. "మోరోపంత్ కవిత" అను వ్యాసమున నితడు తన అమృత కల్పనాశక్తిని వెల్లడించియున్నాడు. ఈ 'నిబంధమాల'లో విష్ణుశాస్త్రి తన విశ్వతోముఖ ప్రతిభా పాండిత్యముల ప్రదర్శించియున్నాడు. మహారాష్ట్ర సాహిత్యమున నిబంధమాల ఒక దీపస్తంభము వలె ప్రకాశించుచున్నది. ఇదివరకు అంధకారములో దాగియున్న - మహారాష్ట్ర సరస్వతి ఇపుడు ప్రకాశించి తన అంతరంగమున గుప్తమైన పీయూష తరంగణీ ప్రవాహమును నలుదెసల పారించినది.

## నిబంధ యుగము

నియమిత కాలమున ప్రకటింపబడు పత్రికలలో "నిబంధమాల" కారణమున నొక గొప్ప క్రాంతి గలిగెను. పత్రికల ద్వారా ప్రకటింపబడు రచనల కొక విశిష్ట వాఙ్మయమునకు వలె గౌరవము లభించెను. ఈ ఓజోగుణము క్రమేణ విజృంభించెను.

## గోపాలగణేశ అగర్కర్ – (1856 - 1895)

ఈతని సుధాకర్ అను పత్రికవల్లను లోకమాన్య తిలక్ యొక్క 'కేసరి' అను విఖ్యాత పత్రిక వల్లను నిబంధముల వాఙ్మయ వైశిష్ట్యమునకు మిక్కిలి వన్నె కలిగెను. సమాజ సంస్కరణ, బుద్ధి వివాదము ఈ రెండును అగర్కర్ గారి ప్రతి వాక్యమందును వ్యక్తమగుచుండును. ఈయన షేక్స్పియర్ విరచితమగు "హామ్లెట్" నాటకమును విచార విలసితమను పేర భాషాంతరీకరణము గావించెను. ఇది అర్థ సౌందర్యములచే నిండియున్నదిగాన, నేటివరకును గౌరవింపబడుచున్నది. ఇంగ్లీషు భాషా సంపర్కము వలన పరి

వర్తితమైన మరాఠీ భాష నధ్యయనము జేయువారికి ఇతడు వ్రాసిన వాక్య మీమాంసయను వ్యాకరణ గ్రంధము అత్యంతోపయోగకరమై యున్నది. పాశ్చాత్య భావములు మరాఠీ భాషలో చొప్పించుటకు తగిన శబ్దములెన్నియో క్రొత్తగా కల్పించుటయందు ఈయన కత్యంత సామర్థ్యము కలదు. ఇదే ప్రకారముగా ఇంగ్లీషు శబ్దములకు దేశీ రూపము నిచ్చుటవలన వీరి శైలి యొక విశిష్ట రూపమును ధరించెను. రాజకీయ సంస్కరణతో పాటు సామాజిక సంస్కరణయును అగర్కర్ రచనలో ప్రతిబింబించుచుండును. వీరు కొన్ని నానుడులను కూడ సృష్టించిరి.

## లోకమాన్య తిలక్

లోకమాన్య తిలక్‌గారి లేఖన శైలిలో నొక గొప్ప అననుభూతమగు తేజము సాక్షాత్కరించుచుండును. అసామాన్య ధైర్యము - వజ్రము వంటి కఠోరత - స్వాతంత్ర్యము - నిస్సీమమగు ప్రేమ - నిష్కలంక దృఢచారిత్రము - ఇవి లోకమాన్యుని వ్యక్తిత్వమును చక్కగా ప్రకాశింపజేయు గుణములు. తిలక్ గారు ప్రతిభావంతములగు తమ రచనలను అనేక పత్రికల ద్వారా వెలువరించి ప్రళయాగ్ని జ్వాలల వర్షింపజేసిరి. లోకమాన్యుని వాణి మరియు లేఖిని గూఢ రహస్యములను పెకిలించునట్టియు, మనోగ్రంథిని భేదించునట్టియు శక్తి గలవి. (1) ఓరాయన్. (2) ఆర్కిటిక్ హోం ఇంది - వేదాస్, (3) గీతారహస్యము (కర్మయోగ శాస్త్రము)-ఈ గ్రంథములు తిలక్ అసామాన్య బుద్ధిమత్వము, అవిరత వ్యాసంగము, అద్వితీయమగు ప్రతిభకు నిదర్శనములు. రాజకీయ విషయమున నతిక్రోధమును ప్రదర్శించు శైలితో బాటు ఈ గ్రంథములలో పరమ శాంతిని, గాంభీర్యమును, సామరస్యమును వ్యక్తీకరించుటను చూచినవారికి ఆశ్చర్యము కాక మానదు. వేదాంగ జ్యోతిషము, శివాజీ ఉత్సవము, సామాజిక సంస్కరణకు మార్గములు - అగర్కర్‌పై గౌరవము, మహారాష్ట్ర భాషామార్గము, ధర్మము, భాష, ఇతిహాసము, తత్త్వజ్ఞానము - వేదాంతము ఇత్యాది విషయములపై అద్భుతమగు రచనలెన్నియో వీరు గావించిరి.

తిలక్‌గారి యనంతరము 'కాళ్' యను పత్రిక సంపాదకుడైన శివరాంపంత్ పరాంజపే (1864-1929) గారు చిరస్మరణీయులు. "కేసరి"తో సరి

తూగ గల "కాళ్" పత్రిక ప్రభావపూరితమగు శైలితో గూడి కొన్నది. పరాంజపే గారి భాషలో నొక విలక్షణమగు వైశిష్ట్యము గలదు. "కాళ్"లో విశిష్టములగు అలంకారము లుపయోగింప బడినవి. నాటకము-కథ-కాదంబరీ (నవల) మరాఠీ ప్రజల లఘుచరిత్రము-అన్నంభట్టు విరచితమగు తర్కసంగ్రహము, భాస్కరుని అర్థ సంగ్రహము ఇత్యాది శాస్త్రీయ గ్రంథరచనతో బాటు పరిశోధన, వ్యుత్పత్తి మొదలగు విషయములపై వీరి అపూర్వములగు రచనలు వెలువడినవి. కొన్ని చమత్కారములైన వ్యాసములు మిక్కిలి సుందరముగా కూర్పబడినవి.

ఈ కాలమున మరాఠీ వార్తాపత్రికల క్షేత్రము బహువిస్తీర్ణమై యుండెను. సందేశ్, మహారాష్ట్ర కోకిల, వివిధజ్ఞాన విస్తార్, గ్రంథమాల మొదలగు మాస పత్రికలు దిన పత్రికలు వెలువడుచుండెడివి. అచ్యుత బలవంత్ కోల్హాట్‌కర్, ఇతిహాసాచార్య రాజ్‌వాడే, చింతామణి వినాయక వైద్య, బిజాపూర్‌కర్, గుంజీకర్, రాజారామశాస్త్రి భాగవత్ మొదలగువారు తమ అమూల్యములగు నిబంధనల వలన మరాఠీ భాషకు శోభ నొసగ గూర్చిరి.

## రాజవాడే వైద్య

వీరు ఇదిహాస పరిశోధనము, సంస్కృత మరాఠీ వాఙ్మయ సంశోధనము చేసియున్నారు.

# నవలా రచయితలు

## హరిభాఊ

హరినారాణయ ఆప్టే (క్రీ. శ. 1864-1919) మరాఠీ నవలా రచయితలలో చక్రవర్తి యని ప్రసిద్ధిగాంచెను. ఇతడు "కర్మణూక్" (వినోద) అను పత్రికకు సంపాదకత్వము వహించి నవలలను రచించి మహారాష్ట్ర వాఙ్మయమున తన పేరును ఆచంద్రతారార్కము నిలుపుకొనెను. పాశ్చాత్య లలితకళా వాఙ్మయము యొక్క అధ్యయనము, బిపుళూణ్‌కర్, తిలక్ మొదలగు కర్తృత్వశాలురగు మహాపురుషుల భావముల ప్రభావము వలన హరిభాఊలో నొక విల

రణ ఉదయించెను. ఇట్లితనిలో నుదయించిన భావములను నవలా వరించెను. ఆప్టే 10 సామాజిక నవలలు, 11 ఐతిహాసిక నవ ఖూ, సతీపింగళా యను రెండు స్వతంత్ర నాటకములు, కొన్ని కముల భాషాంతరములు గావించి మరాఠీ వాఙ్మయ ప్రపంచము వృద్ధికి తెచ్చెను. భాషా శాస్త్రము, మరాఠీ అధ్యయనము ఇత్యాది నెన్నియో ఉపన్యాసము లిచ్చి విద్వత్తా పూర్ణములగు రచనలు ్పటగోష్ఠి యను పేరుతో నాల్గు భాగములలో కథాసాహిత్యము ఈ కథలే ముందు రాబోవు లఘుకథా రచనలకు మార్గదర్శకము పైన పేర్కొనిన అనేకములగు రచనల వలన నితని గహనమగు హిత్యము వ్యక్తమగుచున్నది. సాత్త్వికగుణ పూర్ణమగు వినోదమును ప, సమాజములోని లోపములను తొలుగ జేయు నుద్దేశముతో నలు వెలువరించి తన భావములను స్పష్టీకరించెను. వాస్తవముగా ాష్ట్ర నవలా రచనమునకు క్రొత్త వన్నెలు తీర్చిదిద్దెను. వాస్తవ రించుచు నైసర్గిక భూమికపై నీ నవలలను ప్రతిష్ఠించెను. దీని రచనలు సామాజికుల హృదయాంతరాళమున శాశ్వతస్థానము గలిగెను. 'యమూ' 'ప్రొఫెసర్ డ్యాండూ', 'శంకర్ మామంజీ' నంద్, యమునా, రావూజీ మొదలగునవి చదువువారి హృదయ ంనర్చు సామర్థ్యముగల నవలలు. భావ చిత్రణ హృదయమున ుకొను నట్టుల ప్రకృతి వర్ణనలు సమాజ సంస్కరణల వైయర్థ్య రూపమున వ్యక్తీకరించుట యితని ప్రత్యేక గుణములు. ప్రసం గా వ్యక్తుల కనుగుణ్యమగు భాషను వాడి జనుల హృద్గత భావముల ాపము నితడు వివిధ ప్రకారముల చిత్రించెను. సామాజిక, ఆర్థిక విషయములను చర్చించుట వలన నితని నవలలు ఆ కాలమందలి దేశపరిస్థితులు తెలియజేయు దర్పణములుగా భాసిల్లుచున్నవి. 'మీ' ్వంతరావుఖరే; 'భయంకర్‌దిల్సె' మొదలగు సామాజిక జీవనమును వలలు మిక్కిలి అద్భుతములైనవి. 'పణ్‌లక్షాంత్ కోణ్ ఘోతో' ం లక్ష్య పెడుతాడు?) అను నవల కూడ యీ తెగకు చెందినదే. 'కేవళ్' స్వరాజ్యసాఠీ 'వజ్రాఘాత్' – 'హైసూర్‌చావాఘ్' – 'గడ్

అలా పణ్‌సింహ్‌గేలా' మొదలగు ప్రఖ్యాత ఐతిహాసిక నవలలు వ్రాసెను. ఇతని అనంతరము నాథమాధవ్: విఠల్ సీతారాం గుర్జర్, వాసుదేవ గోవింద ఆప్టే మొదలగు వారు ప్రఖ్యాత నవలా లేఖకులుగా ప్రసిద్ధిగాంచిరి.

# నాటకములు

మరాఠీ భాషలో మొదటి నాటకము 'సీతా స్వయంవరము'. ఇది 1843 లో వ్రాయబడినదని యిదివరకే తెలుపబడినది. అటు తరువాత "సైరంధ్రీ" మదాలస, కృష్ణలీల-యను కొన్ని పౌరాణిక నాటకములు రచింపబడెను. అనంతరము ఇంగ్లీషు భాష నధ్యయనము చేసినవారు "షేక్‌స్పియర్" నాటకముల ననువదించిరి. వీనికి 'బుకిష్' నాటకములని పేరు గలిగెను. సంస్కృత నాటకముల యనువాదము కూడ జరిగెను. 'ఫార్స్' యను ఆంగ్ల ప్రహసము వంటివి కూడ వ్రాయమొదలిడిరి. "జాసుందీపురీ చా ఫార్స్" మొదలగునవి వ్రాయబడెను. మోర్ ఎల్.ఎల్.బి. వంటి నాటకములుకూడ ఎక్కువ ప్రచారములు గలవి.

## అణ్ణాసాహెబు కిర్లోస్కర్ - (1843-1885)

ఈయన మహారాష్ట్ర రంగభూమిని తన కౌశల్యముతో విశేషముగా అలంకరించెను. ఇతడు నాటక పద్య రచనలో గొప్ప ప్రావీణ్యము గడించెను. ఇతని నాటకములు "శాకుంతలము" - "సంగీత సౌభద్రము" - "రామరాజ్య వియోగము" - (పాదుకాపట్టాభిషేకము) మొదలగునవి ప్రసిద్ధములై, జనసామాన్యముచే ఆదరింపబడుచున్నవి. కిర్లోస్కర్ నాటకముల చక్కని ప్రదర్శనముల వలన రంగభూమికి వన్నె యెక్కుటయేగాక నటుల విషయమున నొక విధమగు గౌరవము జనుల హృదయములలో ప్రవేశించెను. నాటకముల యెడ గల హేయ భావము తొలగిపోయెను. సూత్రధారుడు పారిపార్శ్వకుడు మొదలగు పాత్రలచే ప్రారంభింపబడు నాటకము వలన భరతమహర్షి ప్రణీతమగు నాట్యశాస్త్ర విషయమున జనులకు ఆదరము, గౌరవము కలిగెను. తర్వాత "గోవిందబల్లాళదేవళ్"

"శ్రీపాదకృష్ణ కోల్హాట్కర్"-కృష్ణాజీ ప్రభాకర్, ఖాడిలీకర్, రామగణేశ్ గడ్కరీ మొదలగు ప్రముఖ రచయితలు ప్రఖ్యాత నాటకములు రచించి యీ క్షేత్రమును విస్తరింపజేసిరి. 'దేవల్' గారి నాటకములలో "శారద"-సర్వోత్కృష్టమైనది. ఇందు జరఠకుమార వివాహ సమస్య అనగా వృద్ధునకు కన్యనిచ్చి పెండ్లిచేయు సంప్రదాయమును గూర్చి బాగుగా చర్చించెను. ఇతడు యితర భాషలనుండి రూపాంతర మొనర్చిన వానిలో, అపరిమితమగు చాతుర్యము, భాషపై తనకుగల అధికారమును చూపినాడు. ప్రసాదగుణ పూర్ణములగు రచనలు చేయుటలో నితడు అద్వితీయుడు. దేవల్‌గారి పద్యములు ప్రసిద్ధములై ప్రజలలో నిలచి పోయినవి.

## శ్రీపాద కృష్ణ కోల్హాట్కర్ - (1871-1934)

కోల్హాట్కర్‌గారు నాటక సృష్టిలో నూతన మార్గము ననుసరించిరి. వీరి నాటకములందు అద్భుత రసము బాగుగా పోషింపబడినది. 'వీర తనయ 'మూక నాయక'-'వధూపరీక్ష'-'గుప్తమంజూష' - 'ప్రేమశోధన' - మొదలగు పన్నెండు (12) నాటకములను వీరు రచించిరి. 'శ్యామ్ సుంద్'\- 'దుటప్పీకీదు హేరీ'-అను రెండు మనోహరములగు నవలలు లిఖించిరి. 'సూదామ్యాచే పోహే'-(కుచేలుని అటుకులు) అను పేర నొక వినోద పూర్ణమగు గ్రంథము శ్రీపాద కృష్ణగారు వెలయించిరి. వీరి 'మూక నాయక'-యను నాటకము మిక్కిలి లోకప్రియమైనది ఇతడు సౌందర్య ప్రియుడు. జనులను కడుపుబ్బ నవ్వించు హాస్య సన్నివేశములను తన రచనలద్వారా వ్యక్తపరిచెను. మరాఠీ రంగభూమి వీరి రచనల వలన వన్నె కెక్కినది. మరాఠీభాష నధ్యయన మొనర్చినవారు వీరిని మాటిమాటికి జ్ఞప్తికి తెచ్చుకొందురనుటలో వీరి ప్రతిభ వెల్లడి యగుచున్నది.

## కృష్ణాజీ ప్రభాకర్ ఖాడిల్కర్ (1872-1948)

కృష్ణాజీ ప్రభాకర్ కోల్హాట్కర్ కంటె నెన్నియో రెట్లు నాటక సాహిత్యమును సృష్టించి మహారాష్ట్ర రంగభూమిని క్రొత్తవెల్గులకు దెచ్చెను. వీరి రచనలు తత్త్వ ప్రతిపాదకములు-లోకమాన్య తిలక్‌గారి అనుచరుడగుటచే గొప్ప

దేశసేవా పరాయణుడుగా పేరు పొందెను. "కేసరి" పత్రికకు సంపాదకుడై ప్రభాకర్ యెందరో రచయితలను పైకి దెచ్చెను.

నవాకాడ్ (New Times) అను పత్రిక స్వయముగా స్థాపించి దాని ద్వారా దేశహితార్థము ఉత్తేజాత్మకములగు నెన్నియో రచనలు చేసెను. 8 సంగీత నాటకములు, 7 గద్య నాటకములు-వ్రాసి వానియందు తన ముఖ్యమగు ధ్యేయమును చిత్రించి నాటక రంగముపై ప్రదర్శింపజేసెను. మహారాష్ట్రమున వీరి రచనల కొక విశిష్ట స్థానము కలదు. ఐతిహాసిక పౌరాణిక ఇతివృత్తములు గైకొని వానివలన జనుల సానుభూతిని సంపాదించెను. 'భావుబందికీ' - యను నాటక మందలి పాత్రయగు రామశాస్త్రి సంభాషణ విన్నచో ప్రత్యక్షముగా తిలక్ గారే వచ్చినటుల సామాజికులకు భ్రాంతి కలుగును. 'కీచకవధ'-లో కీచకపాత్ర దర్శనముతో 'లార్డ్ కర్జన్' యొక్క తాండవము జ్ఞప్తికి వచ్చుచుండును. వీరి 'మానాపమాన్' 'స్వయంవర్' 'ద్రౌపది'-మొదలగు నాటకములు మిక్కిలి ప్రసిద్ధములైనవి. 'భావుబందికీ' 'గాంచనగడ్ చీ మోహనా'-'సవై మాధవ రావు చా మృత్యు'-'సత్యపరీక్ష'-మొదలగునవి వీరి గద్య నాటకములు శృంగార-వీర-కరుణ-రసములు వీరికి చాలా ప్రియములు.

## రామగణేశ గడకరీ - (1885-1919)

వీరి రచనల వలన నాటకములకు దృశ్య కావ్యములను పేరు సార్థకమైనది. ప్రాచీన భక్తి సాహిత్యము, పాశ్చాత్య వినోద రచనా సాహిత్యములను వీరు బాగుగా నధ్యయన మొనర్చిరి. "ప్రేమసన్యాస్"-"భావబంధన్"-"ఏక చప్యాలా" మరియు "పూర్ణప్రభావ్"-అనునవి వీరి నాటకములలో మిక్కిలి లోక ప్రియములు. "బాళకిరాం" అను నొక నాటకము మనోరంజకమైనది. దేవల్ ఖాడీల్కర్ కోల్హాట్కర్ మొదలగు వారి శ్రేష్ఠమగు నాటక రచనముల వలన నాటక రంగము స్వతంత్రము మనోహరమునై వర్ధిల్లెను.

# నవీన కావ్యసృష్టి

## "కృష్ణాజి కేశవదామ్లో" (కేశవసుత్)-(1866-1905)

కేశవసుత్ నవ్యకావ్యములు వ్రాసిన వారిలో ప్రథముడు. ఇతని ప్రథమ కావ్య సంగ్రహము "కేశవసుతాచీ కవిత" - యను పేర ప్రకటింపబడెను. ఈ కవి స్వానుభవమును ప్రకటించుటకు కవితను సాధనముగా గ్రైకొనెను. అనువాదమును, రూపాంతరములును గావింపక పూర్వుల రచనావిధానము త్యజించి స్వానుభవమును మనోభూమికపై గోచరించిన రీతిని కవితద్వారా వెల్లడించెను. ఈయన పారమార్థిక విషయములను త్యజించి ఐహిక విషయములను గూర్చి పిచ్చిపాటలను పేరున రచన గావించెను. "సబోవతాంచానిసర్గ" "శైశవప్రీతి" మున్నగు శీర్షికలు సులభ శైలిలో అర్థ గాంభీర్యమును వెల్లడించునవి. "అజ్ఞాత పరిశోధన" - "మృత్యువు" - సామాజిక విషయములు వస్తువుగా గ్రహించి కళావిలసితములగు రచనలు వెలువరించెను. "కేసవసుత్" "తుతారీ"-యను ప్రథమ గేయము రచించి నవయుగ కవితా శంఖమును పూరించెను. కవి, కావ్యము, కావ్యశక్తి మున్నగు వానిని గూర్చియే గాక ప్రేమ విషయకములగు కవిత్వమునుగూడ వ్రాసెను. "సతారీచేబోల్"-"నవాసిపాయీ"-"స్ఫూర్తి" "ఆష్టికోణ్"-"ఝాపుఝా"-మున్నగు కవితల వలన కేశవుని సామాజిక తత్వజ్ఞానము వ్యాపకమైన మానవతావాదము చింతనశీల ప్రవృత్తి వెల్లడియగుచున్నవి. ఇతడు గొప్ప క్రాంతికారుడైన కవి. ఆత్మనిష్ఠమగు ప్రేమ భావము ను ప్రకటించినవారిలో నతడే ప్రథముడు. ఆంగ్ల కవి "వర్డ్స్వర్త్" చెప్పినటుల "ప్రకృతియే మహాకవి" - యను భావమును తన ప్రకృతి కవితలో వ్యక్త పరిచెను.

## నారాయణ వామన తిలక్ - (1862-1919)

కేశవ సుతుని శైలి ననుసరించి ఇతడు తనలో నేర్పడిన ప్రాకృతిక సంస్కారమును కవితలో సుందరముగా చిత్రించెను. ఇతనికి "ఫులాములాంచే

కవి" - (బాలల పూవులకవి) యని ప్రజలు పెట్టిన పేరు సార్థకమైనది. తిలక్ క్రైస్తవ మతము స్వీకరించి రామాయణమువలె "ఖ్రిస్తాయన్"-అను కావ్యము రచించుటకు మొదలిడెను. కాని యా సంకల్పము పూర్తిగా నెరవేరలేదు. ఇతని "బొంబాబోంబ్" - "రణసింగ్"-అను కావ్యములు ప్రసిద్ధములైనవి. సర్వ సామాన్యముగా నితని కవితలో ప్రసాదగుణము, ప్రేమతత్వము వెల్లడియగు చుండును జీవితమున క్రైస్తవ మత దృష్టికోణ మేతీరున నుండవలెనో యీ కవి తన కవితలో స్పష్టముగా నిరూపించెను. "పాంఖరాయె శిల్‌కాఫరతూన్" (పక్షి నీవుతిరిగి రాగలవా?) అను కావ్యమున తిలక్ కరుణరసమును బాగుగా పోషించెను. ఈయన ఈశ్వర భక్తిని సరళమును సుందరమునైన శైలిలో ప్రతిపాదించు సామర్థ్యము గలవాడు.

## వినాయక జనార్ధన కరందీకర్-(1872-1909)

స్వాతంత్ర్యమును ప్రబోధించు గేయకవులలో వినాయక్ పేరెన్నికగన్న వాడు ఇతడు సనాతాన ధర్మాభిమాని. శివరాయదర్శన్-మహారాష్ట్రలక్ష్మి-శివసందేశ్-మొదలగున వీతని ప్రసిద్ధ రచనలు. హతభాగినీ యను కవితలో వినాయక్ దౌర్భాగ్యవతియైన భారతమాత కరుణాగాథను బాగుగా చిత్రించెను. కథా రూపకములగు కావ్యముల రచించుటయందు కరందీకర్ ప్రముఖుడు, పద్మినీ-సంయోగత-కృష్ణాకుమారి-మున్నగు కథారూపకములైన కావ్యములలో ఆదర్శభూతమైన స్త్రీ జీవితమును చక్కగా చిత్రించి యున్నాడు.

## రామగణేశ గడకరీ (గోవిందాగ్రజ్)

గోవిందాగ్రజ్ నవ్య కవితా క్షేత్రమున ప్రసిద్ధులగు కవులలో గణనీయుడు. ఇతని కావ్యములలో అలౌకికమైన ప్రతిభ మాటిమాటికి తొంగి చూచు చుండును-వాగ్వైజయంతి యను నీతని సంకలన గ్రంథములో కల్పనాశక్తి, ప్రతిభలు వెల్లడి యగుచుండును. హృదయాస్‌గోఫ్ "ఏఖాద్యాసేనసీబ్"-పునర్జాత్ ప్రేమాస్ ఇత్యాది కవితలు భావనా మయములైనను నిరాశా ఛాయలు కనుపించుచుండును "పుటకీ"-తపేలీ-మురళీ యను కవితలలో నీ మహాకవి ఔపనిషధ తత్త్వజ్ఞానమును ప్రకాశింపజేసెను.

## త్రంబక బాపూజీ ఠేబరే (బాలకవి) - (1890-1918)

త్రంబక్ మరాఠీ నవ్య కవితకు శోభను గూర్చిన వారిలో నొకడు. ఫూలరాణీ-సంధ్యాజననీ-నిర్ఝరాస-శ్రావణమాస-అరుణ-సంధ్యాతారక-మున్నగు కవితలలో నితని భావ గాంభీర్యము-ప్రకృతిపై గల ప్రేమ ద్యోతకమగును. "బాలకవి"కి సరళము, కోమలమునైన కల్పనాశక్తి స్వాభావికముగనే కలిగి నవి-విషాదమును వెల్లడించు రచనలు చేయుట యందును త్ర్యంబక్ సిద్ధ హస్తుడు. బాలగీతములు గేయ కథానికలు రచియించి వీరు బాలసాహిత్యము వృద్ధిజేసిరి.

## నారాయణ మురళీధరగుప్తే - (1872-1947)

ఇతడు "Bee" యను పేర ప్రసిద్ధిజెందినవాడు "ఫూంచీ ఝంజక్"- అను గుప్తేగారి ప్రఖ్యాత కవితా సంగ్రహము పేరు మోసిన శీర్షికలతో నిండి యున్నది. ఢంకా-యమాచేదూత-కవివందన్-మున్నగునవి యీతని కల్పనా శక్తికి తార్కాణములు-ప్రేమవిషయకము లగు రచనలు వీరి భావనా పటిమను వెల్లడించుచున్నవి. గుప్తే రచితమగు 'మాఝీకన్య' కరుణారసముతో నిండి యున్నది ఈ కవి కొన్ని భాషాంతరీకరణములు గూడ చేసినాడు. సంస్కృతా ధ్యయనము చేయుట వలన నితని మరాఠీ కవిత, గంభీరమైన శైలిని సంపా దించుకొన్నది.

## దత్తాత్రేయ కొండోఘాటే-(1875-1899)

అల్ప వయస్కుడగు నీ కవి ప్రతిభ అత్యద్భుతమైనది. ఇతని బాల గీత ములు మనోరంజకములై విలసిల్లుచుండును. దత్తాత్రేయుని 'నిజనీజమాఝ్యాబాళ' (జోజోపాపాయి) "విశ్వామిత్రాచ కంఠీ" (విశ్వామిత్రుని గుతుప) 'భగవా ఝుండా' మున్నగు రచనలు మనోవిహ్వలతను విశాలమగు నంతఃకరణమును వ్యక్తపరుచుచుండును.

ఇతని తరువాత నుల్లేఖనీయులు, మాధవానుజుడు ఏకనాథ పాండురంగ వార్కర్-నాగేశ్-నరహరశంకర హాళకర్-అనంత తనయుడు-గంగాధర మోగ

చంద్రమోగరే-విఠలబగవంత లేఖే-లక్ష్మణశాస్త్రి లేవే, జనార్దన ఆగాశే-కృష్ణాజీ నారాయణ మొదలగువారు కొందరు ఎడ్వర్డ్ చక్రవర్తి మొదలుకొని నామదార్ గోఖలే వరకు గల మహాపురుషులను గూర్చి కవితలు వ్రాసిరి. మరికొందరు ప్రాచీన విధానము ననుసరించి కావ్యరచన చేసియున్నారు. ఈ విధముగా పై పేర్కొనిన కవుల వలన నవ్యకావ్య రచనా విధానము స్థిరపడినది.

# ఆధునిక యుగము

## నవల

### నృసింహ చింతామణి కేళీకర్ - (1872-1947)

గత 25 సంవత్సరములలో మహారాష్ట్ర వాఙ్మయాభివృద్ధిని సామాన్య దృష్టితో పరిశీలించిన అనుస్యూతముగా స్మృతిపటలమున కెక్కెడు నామము కేళీకర్ గారిది. ఇతని ప్రతిభా పాటవము సర్వతోముఖ పాండిత్యము మరాఠీ వాఙ్మయము యొక్క ప్రతిశాఖయందును మూర్తీభవించి ప్రకాశించినది. ఇతడు లోకమాన్య తిలక్ గారి తర్వాత కేసరి పత్రికకు సంపాదకత్వము వహించి చిరకాలము సమర్థతతో నిర్వహించెను పత్రికలద్వారా నిబంధ రచనా క్షేత్రము విశాల మొనర్చెను. కేసరి పత్రికా ముఖమున విదేశ ప్రభుత్వముపై శర సంధాన మొనర్చుటే గాక నిబంధరచనా క్షేత్రమును కూడ విస్తరింపజేసెను. కేళీకర్ పరిశోధనాత్మకమైన బుద్ధికి ప్రతి చిన్న విషయముకూడ విశాలముగా భాసించెడిది. వీరు సాహిత్యము, వినోదము-తత్త్వజ్ఞానము ఇతిహాసము-కళలు—సంగీతము-మున్నగు విషయములపై అధికార యుక్తములగు రచనలు వెలువరించిరి. ఇతని 'జ్ఞానాచీ సదావర్తే' - 'సంస్కృత విద్యాచే పునరుజ్జీవన్'- వంటి రచనలు అజరామరములై నిలిచినవి - తిలక్ - అగర్కర్ - శైలి కంటెను కేళీకర్ శైలి రమణీయమైనది.

### శ్రీధర వేంకటేశకేత్కర్ - (1884-1937)

ఇతడు గొప్ప పండితుడే గాక గొప్పసాహసికుడు. కేత్కర్-మహారాష్ట్ర విశ్వకోశము (విజ్ఞాన సర్వస్వము)ను రచించెను. వామన మల్హార్‌జోషీ, కాకా

కారేల్కర్ - శ్రీపాద మహాదేవసాఠే -వినోబాభావే-దత్తాత్రేయ కేశవ కేళశకర్- మాధవదామోధర ఆళతేకర్ - నరహరరఘునాథ పాఠక్ - ఇరావతీ కార్వే - మున్నగువారు ఆధునిక నిబంధ రచనాకారులలో నుల్లేఖనీయులు. వీరలు సమాజ శాస్త్రము - నీతి - కళలు - ఇతిహాసము - విజ్ఞానము - సంస్కృతి ఖండన - మండనము - మున్నగు వాని గూర్చి యమూల్యములగు రచనలు వెల యించిరి. ఈ రీతిగా నిబంధ రచనలను అధిగమించి నవలల వైపు మరలిన యెడల-దాని యాంతరిక బాహిర స్వరూపములలో నెన్నియో మార్పులు గలిగి నటుల స్పష్టమగును. పూర్వమున కంటె నిపుడీ నవలాక్షేత్రము వైశాల్యము కాదొడగినది.

శ్రీధర వేంకటేశ కేత్కర్ -బ్రాహ్మణ కన్య-వివక్షణ-ఆశావాది మొద లగు నవలలు వ్రాసెను. వీనియందు సామాజిక సమస్యలు మిక్కిలి క్షుబ్ధస్వరూ పమున చిత్రితములైనవి. కనుక నివి 'నవల'లేనా?యను సంశయము కలుగును.

## వామన మల్హార్ జోషి

ఇతని రచనలు తత్త్వచింతనా విలసితములు - ఆశ్రమహరిణి - విధవా కుమారి - గొదూగోఖలే - ఘాటకీవాకళ్ - శిపాయాచీబాయకో - యనునవీతని నవలలు - కాళేజణీ సరళాభోళే ఉత్తర ప్రత్యుత్తరాత్మకమైన నవల - ఇతని తర్వాత శాంతాబాయి నాశికర్ - మాలతీబాయి-బాండికర్ మున్నగు రచయిత్రీ మణులుకూడ నెన్నియో నవలలు వ్రాసిరి.

## నారాయణ సితారాంఫడకే - (1894)

ఫడకే రచనా విధానమున క్రొత్తపంథ ననుసరించెను. రచన అతి - విస్తృతము గాకుండునట్లును - ప్రతిపాద్య వస్తువును అన్యూనాతిరిక్తముగా వర్ణించియు - మనోహరమైన భాషలో సుందరములగు సంభాషణలు కూర్చియు ప్రఖ్యాతమైన నవలలు వ్రాసెను. దౌలత్-ఆటకేఘార్- అఖేరచేబండ్ -ప్రవాసి- మున్నగు నవలలు - పరిశీలించి చూచిన పై గుణము లన్నియు వానియందు కండ్లకు గట్టినట్లు వ్యక్తమగును.

**విష్ణుసఖారాం ఖాండేకర్ - (1898)**

ఇతడు కాంచన మృగము - దోన్ ధృవ్ - పాంథ రేథగ్ - అను నవలలు వ్రాసెను. వీనిలో సంవాదకుశలత-వర్ణనలు-పాత్రలపేర్లు బాగుగా చిత్రింపబడినవి. ఖాండేకర్ నవలలు - తమిళము - హిందీ - సింధీ - గుజరాతీ భాషలలో అనువదింపబడుటవలన వీరి లోకప్రియత వెల్లడి యగుచున్నది.

**గజానన త్ర్యంబక మాడఖోల్కర్ - (1899)**

గజాననుని రచనలు - చందనవాడా - స్వైరవిచార్-ముక్తాత్మ-రాజకీయ కాదంబరీ - మున్నగు నవలలను రచియించెను. ఇతని 'చందనవాడీ' మిక్కిలి పేరుపొందిన నవల.

**బాళసీతారాం మర్ఢేకర్ - (1907-1956)**

సరాయీ - పాణకళా - రాత్రీచాదివస్ -భావీణ్ -మొదలగు నవలలలో శిల్పమును లలితమగు భాషను వాడి మర్ఢేకర్ ఖ్యాతి నార్జించెను. ఈతని అనువాదములను చూచిన నితనికి భాషపైగల యధికారము వ్యక్తమగును.

**శ్రీ. నా. పేండ్సే**

ఇతిని నాటకములలో కొన్ని ప్రాదేశిక పరములు - గారంభీచాబాపూ - హద్దుపార్-ఏగ్లార్-మున్నగున వీతనికి కీర్తిని గడించి పెట్టిన నవలలు.

**గోపాల నీలకంఠ దాండేకర్**

కొంకణ దేశీయులకు విదర్భ ప్రజలకు ప్రేమపాత్రుడైన ప్రముఖ రచయిత. పడఘవళీ - శితూ 'పవనాకాంఠచాధోండీ - మున్నగున వీతని ప్రసిద్ధములైన నవలలు.

**భాషాంతరీకరణములు**

బంగాలీ - హిందీ - ఇంగ్లీషు - గుజరాతీ భాషలనుండి యనేక నవలలు మరాఠీలోనికి అనువదింపబడినవి. బంగాలీ నవలలను విఠల సీతారాంగుర్జర్ - భార్గవరామవిఠల వరేర్కర్ - వాసుదేవ గోవిందఆప్టే - మున్నగువారు అనువదించిరి.

# కథానికలు

మహారాష్ట్ర వాఙ్మయ పరిశీలనము వలన మాస పత్రికలు-వారపత్రికల ద్వారా వివిధములైన రచనలు అభివృద్ధిచెందిన వని స్పష్టమగుచున్నది. హరిభాఉ కూడ తన రచనలను కర్మణూక్ - అను వారపత్రిక మూలమున ప్రకటించెను-కథానికలును నియత కాలికములు - అనగా ప్రతివారము ప్రతిమాసము ప్రకటింపబడు ప్రతికలద్వారానే వికాసము నందినవి. మనోరంజన్-రత్నాకర్ - యశ్వంత్ - కిర్లోసర్కర్-జ్యోత్స్న - పారిజాత్ - సమీక్షక్ - క్రొత్తగా వెలువడుచున్న సత్యకథావసంత్, హంస్ఛంద్ - మొదలగు పత్రికలు -మహారాష్ట్ర కథానికల నెక్కువగా నభివృద్ధి పరచినవి. ఈ పత్రికా సంపాదకు లందరును క్రొత్త లేఖకులను ప్రోత్సహించిరి. కథానికల పోటీలు జరిపించియు ప్రత్యేక సంచికల ప్రచురించియు - నీ లఘు కథల నెందరో ప్రచారమునకు దెచ్చిరి. కథానికలలో క్రొత్తది ప్రాతది యను భేదము కల్పింపబడెనని భావింపకూడదు. ప్రాచీన కాలములో కహాణ్యా అనగా కథలని వాడుకలో యుండెను. అవియే దీనికి మూలమని తెలిసికొన వలెను. మన ప్రాచీన పురాణము కథోప కథలతో ఆఖ్యానోపాఖ్యానములతో నిండియున్నవి. పంచ తంత్రము - హితోపదేశము-మొదలగునవి చిన్నచిన్న కథలలో గొప్ప గొప్ప విషయములను గరపుచున్నవి. పరదేశీయములగు ఇసాబీ నీతికథలుకూడ నిటులే రచింపబడినవి. కేవలము వస్తు స్థితిని నివేదించుటయే వాని యావిష్కరణకు మూలహేతువు. కథానికలను చిన్నలు - పెద్దలు - అందరును - ఎంతో ఆదరముతో చదువుదురు. ఆంగ్ల రాజ్యకాలమున వీని భాషాంతరములు - రూపాంతరములు - కావించిరి. అరబ్బీ భాషలో రసవంతములైన కథలు - సురస్ ఆణి - చమత్కారక్ గోష్ఠీ - అను పేర అనువదింపబడినవి. హరిభాఉ స్ఫుటగోష్ఠీ యను నాల్గు సంపుటములలో కథలు ప్రకటించి లఘుకథా నిర్మాణమునకు మార్గదర్శకుడైనాడు.

నారాయణ సీతారాం ఫడకే రత్నాకర అను పత్రికా ముఖమున కథలు వెలువరించెను. ఇట్లు నవలా రచనయేగాక ఫడకే లఘు కథలను గూడ వ్రాయుటలో పేరు మోసెను. వీరి "మాణూస్ జగతోతరీక కసాతీ? న్యాయ' జిఫ్క-

తూ(తి-ఛమీ - మొదలగునవి చాలా ప్రసిద్ధములు. ఫడకే ఖాండేకర్ యశవంత్ గోపాళజోషి విష్ణువినాయక్ బోకిల్ మొదలగువారు లఘుకథా రచనలో సిద్ధ హస్తులు - జోషీ శ్రద్ధావాది. బోకిల్ అశ్రద్ధావాది. ఐనను వీరిద్దరు లోక ప్రేమకు పాత్రులైనవారే. వీరు కుటుంబములోని పరిస్థితులను చక్కగా చిత్రించి కథా రచనలలో ప్రత్యేకతను సంపాదించినారు. వినాయక్ లక్ష్మణ్ బర్వే, సానే గురూజి, వామన గజానన, లక్ష్మణ్ లోకళ్ - కమలాబాయీ టిళక్-క్షమా బాయిరావ్, కృష్ణాబాయి కుసుమావతి మొదలగువారును ప్రసిద్ధ లఘు కథా రచయితలే-సరస కథారచనమున వీరి యనంతరము-ఎందరో పేర్కొనదగినవారు వెలసిరి. ఈ కాలములోనే ప్రాత కథలు నవ్య కథలు - అను విషయములపై ఉపన్యసింప మొదలిడిరి. వాస్తవముగా నవ్య కథల నారంభించిన వారు గంగా ధర్‌గాడ్‌గీళ్-అరవిందగోఖలే యను వారు. గాడ్గిల్ కథానికలకు క్రొత్త రూపము నొసగినాడు. ఇతడొనర్చిన మార్పులను గురించి కొంద రాక్షేపించినారు. గాడ్గిల్ భాషపై యధికారము - కల్పనాశక్తి - భాషకు మెరుగులు దిద్దుటలో అసదృశు డనే పేరు బొందెను. ఇతని రచనలు గాళ్ అణిఫెస్ కాంచే గుప్తత్-సరళవేషా మొదలగునవి.

### అరవింద గోఖలే

మంజుళేకారరవేళ్ అంతర్‌ముఖ్ జాహ్నవీ మొదలగు కథానికలలో వీరి విశిష్టశైలి వ్యక్తమగుచున్నది. వీరు కథలను సూక్ష్మపరిశీలన దృష్టితో వ్రాసి నారు. గోఖలే భాషకూడ గాడ్గిల్ భాషవలె తన ఆశయమునకు అంగభూత ముగా నున్నది.

### పురుషోత్తమ భాస్కరభావే

భావే కథానిక రచనలో క్రొత్త పంథ నవలంబించెను. ఇతడు తన విశిష్ట శబ్ద ప్రయోగముతో స్వీయములగు అభిప్రాయములతో చదువరుల నాకర్షించు టలో అద్వితీయుడు-ధ్యాన్-మాణుస్‌కిచ్యా మర్యాదా, స్వప్నసార్థక్- మొదలగు నవి భావే వ్రాసిన లఘు కథలు.

## మహాదేవశాస్త్రి జోషి

జోషి కథానికలు ప్రకృతి వర్ణనలతోను వ్యుత్పన్నమగు భాష తోడను సంస్కృతిని చిత్రించుటలోను ప్రఖ్యాతములై యున్నవి.

## శ్రీపాద మహాదేవశాస్త్రి మాటే

ఉపేక్షితాంచే అంతరంగ్ -మాణుసకీ ఛాదీహి వీర్ -ఆవామిక్ -మొదలగు రచనలలో విశిష్ట సంస్కారములు చదువరులపై వదునటుల జేసినారు - మాటే భాషా శైలికి పాఠకులను సమ్మోహ మొనర్చు శక్తిగలదు. శాస్త్రిగారు అనుభవములోని ఇతివృత్తము గ్రైకొని దానికి కథారూపము నొసగునపుడు తన్మయులై పోవును. మాడ్గూళ్కర్ దీనికి భిన్నముగా నలిప్తులై రచన సాగించెను.

చింతామణి వినాయక్ జోషి, శ్యామ్‌రావ్ ఓక్ - వి. మ. డి. పటవర్ధన్ - గోల ఆప్టే మొదలగువారు వినోద పూర్ణములగు రచనలు చేయుటలో పేరు పొందిరి.

పు. ల. దేశపాండే గారి రచనలలో వినోదము వ్యక్తమగు చుండును. హాస్యము నుచిత శైలిలో ప్రతిపాదించుట యితని రచనలోని విశిష్టత. ఖోగీర భారతి నస్తిపురావె మొదలగునవి దేశపాండే కథానికలు- ఇట్లు మరాఠీ వాఙ్మయము యొక్క కథానిక క్షేత్రమందు నేడును నవీన భావావేశముచే ప్రేరితులైన పూర్వ రచయితలతో కూడి క్రొంగ్రొత్త రచనలు చేయుచున్నారు. వారిలో శశికాంత పునర్వసు, అంబాదాస్ అగ్నిహోత్రి, రణజిత్ దేశాయి, గోరే-మొదలగు వారు పేర్కొన దగినవారు.

# నాటకములు

## భార్గవరాం వరేర్కర్

మహారాష్ట్ర వాఙ్మయమున ఆద్యనాటక కారుడైన కిర్లోస్కర్‌ను గూర్చి ఇదివరకే తెలుసుకొంటిమి. అతని ననుకరించి దేవల్ గడ్‌కరీ మొదలగు వారు నాటక క్షేత్రమున కృషిసల్పి సంగీతాంశమును విస్తృత పరిచిరి. తర్వాత గద్య నాటకములు వెలసి ప్రజల నెక్కుడుగ నాకర్షించెను. ఈ కాలమున రాత్రంతయు నాటక ప్రదర్శనము జరిపి తెల్లవారే వరకు నాటకమును కొనసాగించుచుండిరి. "రాక్షసీ మహత్త్వాకాంక్ష" మొదలగు నాటకములు రెండు రాత్రులు ప్రదర్శించి నను ముగియునవి కావు. ఇదే విధముగా భార్గవరామ్ వరేర్కర్ "కుంజవిహారీ" యను దీర్ఘ నాటకమును రచించెను. తర్వాత నాటక రంగమున నితడే మార్పు లను తెచ్చెను. "భూమికన్యాసీతా"యను నాటకమును నవీన పద్ధతిలో రచన గావించెను. ఇతడు నవలలే గాక రాజకీయ సామాజిక విషయములను నాట కము ద్వారా ప్రదర్శింప నారంభించెను. వరదక్షిణ, కార్మికుడు. పెత్తందారుల సంబంధము - పారతంత్ర్యము - మొదలగు విషయములను గ్రహించి నాటక రచన గావించెను. వీని వలన నీతని రచనలు లోక ప్రియములయ్యెను. వరే ర్కర్ పద్యములు సుబోధక శైలిలో రచించెను. "హాచ్ ములాచాబాప్ "సోనా చాకళన్" మొదలగు సామాజిక నాటకములును "కరీ నీతీ పూర్వ" మొదలగు ఐతిహాసిక నాటకములును చాలా ప్రసిద్ధములైనవి. సామాజిక విషయ ప్రదర్శ నము-మనోరంజక శక్తి-ప్రయోగవైశిష్ట్యములు వరేర్కర్ నామమును నాటక సాహిత్యేతిహాసమున చిరస్థాయిగా నిలిపినవి.

వరేర్కర్ గారితో గూడ గోవిందరావ్ టెంబే, శంకరపరశురాంజోషీ, (విష్ణుహరి ఔందుకర్-వినాయకరావుజోషీ) నరసింహ చింతామణికేళ్కర్ - మాధవ నారాయణజోషీ - సదాశివ అనంతశుక్ల - మొదలగువారు విభిన్న ప్రకృతులు గల నాటకముల రచించిరి. వీరి విశేషమేమన వీరి నాటకములలో ఒక్కొక్కటియే ప్రజల చిత్తములను హరించి పేరు గాంచెను. కేళ్కర్‌గారి

"తోత్‌యాచేబండ్" అనునది చాల పేరుగాంచినది. చెండే పద్మారవతో అద్వితీయుడు.

ఆంధళ్యాంచశీలా అను నాటకము చాలా ప్రసిద్ధిగాంచినది. ఈ నాటకము ఉత్తములగు నటీనటులు చక్కగా ప్రదర్శించి గొప్ప పేరు తెచ్చిరి. ప్రహ్లాద కేశవఆశేసాష్టాంగ నమస్కార్ అను హాస్యప్రధానమైన నాటకమును రచించెను. ఇందు సమాజములోని లోపములను బాగుగా ప్రదర్శింప గలిగెను. వసంత శాంతారాందేశాయి వ్రాసిన అమృతసిద్ధి - వినాయక దామోదర్ సావర్కరగారి సన్యస్తఖంగ్, నారాయణ వినాయక కులకర్ణిగారి కన్యోపాత్ర - మొదలగునవి మిక్కిలి ప్రసిద్ధినందిన నాటకములు.

వీరి తర్వాత కాలములో ప్రభావశాలురగు నాటకకారులు లేకపోవుట వల్లను-సినిమాల వల్లను ఆర్థిక పరిస్థితులు విషమించుటచేతను, ఉత్సాహమును భంగపరుచు రాజకీయ కారణముల వలనను ఉత్తములగు నటులు లేకపోవుట చేతను - వన్నెకెక్కిన నృత్తారంగము దిగజార జొచ్చెను - 1933 లో శ్రీధర వినాయక వర్తక్ ప్రహ్లాద కేశవ అత్రేల కారణముగ నాటకరంగము తిరిగి వృద్ధికా జొచ్చెను. మరల యీ మధ్య కాలమున నాట్యరంగముపై ఉదాసీన భావము హెచ్చెను. 1941 లో మోతీరామ్ గజానన్ కాంగ్‌ణేకర్ నాట్య నికేతనము స్థాపించి తన నాటకములను రంగముపైకి దెచ్చెను.

భావే. విషకన్య, స్వామిని అను నాటకములు వ్రాసి జనుల సానుభూతిని సంపాదించెను. ముక్తాబాయి "జుగార్"ను రచించెను.

అనంతకాణేకర్ పు. ల దేశపాండే శిర్వాడ్‌కర్ మొదలగువారు నాటకానువాదములు చేసిరి. వీరు ఆంగ్ల రచనలను "ఆస్కార్‌వైల్డ్" ఇత్యాది చాటకములను భాషాంతరీకరణ మొనర్చిరి.

మాలతీబాయి, దాండ్‌కర్ — తారావనారసే - ఆనందబాయి విజాపురే-మొదలగు వారు బుద్ధిపూర్వకముగా విశిష్ట రచనలు గావించిరి. వీరి రచనలు ప్రయోగదృష్ట్యా ప్రశంసార్హములు.

నాటకముల వలె ఏకాంకికల రచన ఎక్కువ అభివృద్ధి కాజొచ్చెను. పు.ల. దేశపాండే - వేంకదేశ్ వకీల్ వరేర్కర్ - శకుంతలాపరాంజపే - మొదలగు వారి నాటకములు - పుస్తకరూపములో వెలువడినను హంసవసంత కిర్లోస్కర్- మొదలగు పత్రికలలో ప్రచురితములై విశేషాదరమును పొందినవి.

ప్రస్తుత కాలములోను అనంతహరిగద్రే ఎన్నియో నాటకములను రచించెను.

రేడియో నాటికలు గూడ యీ మధ్య ఎక్కువగా వ్రాయబడి ప్రచారము నకు వచ్చుచున్నవి.

# ఆధునిక కాలము

## కవిత్వము

కేశవసుత్ తిలక్, బాలకవి, గడకరీ మున్నగు ప్రఖ్యాత కవులు కవితా క్షేత్రమును విశాలముగను సుసంపన్నముగను గావించిరి. వీరలు ఆత్మీయ సంవేద నను నవ్యదృష్టితో నావిష్కరించిరి. గత ముప్పది యేండ్లలో నీ కవిత సర్వతో ముఖముగా వికసించినది. బాలగీతములు జానపద గేయములు-భాగవతములు- పద్యరచన లీ కాలమున నధికముగా జరిగినవి.

## చంద్రశేఖర శివరామగోర్హే-(1871-1937)

చంద్రశేఖర్ ఆధునిక కవితను తన ప్రతిభాశక్తిచే వికాసమొనర్చెను. ఇతడు సంస్కృతాంగ్లములలో గొప్ప పండితుడు - ఈ రెండు సంస్కృతుల ప్రభావము గోర్హేగారి రచనలలో స్పష్టముగా కనిపించును. వైయక్తిక సుఖ దుఃఖము లీతని కవితలో నెక్కువగా లేవు. ఈ మహాకవి రచనా శైలి ప్రౌఢ మును, గంభీరమును, మర్మస్పర్శిగను, ప్రసాదసంయుతమునై యున్నది. ప్రసంగోచిత విషయ వ్యక్తీకరణలో నితని వైవిధ్యము గోచరించును. మిల్టను కావ్యముల నాధారముగా జేసికొని చింతోపంత్, ఉదాన్, రంగరావుహర్షే,

కాయిహో చమత్కార్ మున్నగు రచనలు చేసెను. గోర్హే శైలిని చూచిన నితడు మహాకావ్య నిర్మాణ మొనర్ప దక్షుడని తోచక మానదు గోదాగౌరవ్ అను నతని కవితను పరికించిన ప్రతిభా పరిశ్రమల ఔన్నత్యము వ్యక్తము కాగలదు.

## భాస్కర రామచంద్ర తాంబె - (1874-1941)

భాస్కరుని కవిత చంద్రశేఖరునకంటె భిన్నమైనది-"నా కవిత నా జీవితము తోడనే వృద్ధిజెందినది" అను భాస్కరుని వాక్యమతని యెడ అన్వర్థకమైనది. రికామే మధుఘట్-అను కవితలో తాంబే కవి జీవితమును చక్కగా చిత్రించినాడు. ఝుఝుర్ఝుఝుయే రుద్రాస్ ఆవాహన్ - నవ వధూప్రియా - నిశ్శబ్ద ఆత్మయజ్ఞము - మున్నగు రచనలలో స్త్రీ జీవన మహత్త్వము - శిశు జీవనము-ప్రకృతి సౌందర్యము-మనస్సు అంతర్ముఖమైన తదుపరి దాని నాత్మ వైపు ప్రేరేపించు విచారము మున్నగు వానిని గూర్చి మిక్కిలి సుందరముగా వర్ణించినాడు.

కొందరు కవులు-కావ్యముల వికాసముచేయు కొరకు సంఘటిత ప్రయత్నము చేసి రవి కిరణ మండలి యను సంస్థను స్థాపించిరి. గొప్ప గొప్ప కవులీ సంస్థలో సభ్యులుగా జేరిరి. మాధవత్ర్యంబక పట్వర్ధన్-శంకరకేశవ కానేట్కర్-యశవంత దినకర్ పెంఢార్కర్ మొదలగు వారెన్నియో కావ్యములా సంస్థ ద్వారా ప్రచురించిరి. బాలకృష్ణరానడే, మనోరమాబాయిరానడే యను నీదంపతులు కలిసి కొన్ని కావ్యములు వ్రాసిరి. పట్వర్ధన్ ఫార్సీ-మరాఠీ కోశము ఛందో రచన యను గ్రంథముల రచియించెను. గజ్జలాంజలీ, సునీతాంజలి వీరి ప్రఖ్యాత కవితా సంకలనములు.

యశవంత్ బండిశాల-జయమంగళ మున్నగు నవ్య కవితా సంపుటములు సంధానించెను. గిరీశ్ అభాగకమల్ అను ఖండకావ్యములు వ్రాసెను.

వీరి యనంతరము గోవింద్-చారిత్రక-ఆధ్యాత్మిక పరములైన రచనలును దుర్గా ప్రసాద్-ఆత్మారామ్ తివారీలు-ఐతిహాసిక రచనలును చేసిరి. మాధవ కేశవకాటధరే మొదలగు వారు మహారాష్ట్ర నవ్య కవితా క్షేత్రమును సస్యశ్యామల మొనర్చిరి. ప్రహ్లాదకేశవఅత్రే-"ఝెండూచాఫులా" యను హాస్యమయ

మైన కవిత్వము వ్రాసెను. గోపీనాథతళ్వళకర్, భవానీ శంకరపండిత్, సంజీవనీ మరాఠే మొదలగు వారు బాలగీతములు వెలయించిరి.

దేశపాండే, నార్ఖడే, సోపానదేవచౌదరి, అనువారు జానపద గేయ రచన చేయుటలో సిద్ధహస్తులు-ఆత్మారామ్ దేశపాండే (అనిల్) ఫల్వాత్, భగ్న మూర్తి మున్నగు వానిలో కవితా శక్తిని బాగుగా ప్రదర్శించెను. ఇతడు ముక్త ఛందమున నెన్నియో కవితలు వ్రాసెను-కుసుమ గ్రజ్-ప్రఖ్యాత కవితా సంగ్రహములను ప్రకటించెను. ఇతని సమకాలికులగు రా. అ. కాళె. ఇందిరా సంజీవనీ మరాఠే గారలు కవితా సంఘములు స్థాపించిరి.

స్వతంత్ర రచనా వైశిష్ట్య మెక్కువగా లేక పోయినను స్త్రీల పాటలు పేర్కొనదగినవే-వీనిలో ప్రాచీన కాలమందలి మరాఠీ ప్రజల మానసిక స్ఫూర్తి చక్కగా వ్యక్తీకరింపబడినది. సామాజిక పరిస్థితులు స్త్రీ భావములు- దాని కనురూపమగు తేటనైన తీయనిభాష-హృద్యమగు శైలి, కరుణాత్మక ప్రసంగములు -వీనిని గూర్చిన వివేచన యీ స్త్రీల పాటలలో నిమిడియున్నవి. సానే గురూజీ-మహాదేవశాస్త్రిజోషి-కమలాబాయి దేశపాండే-మున్నగువారి పరిశ్రమ ఫలితములే యీ పాటలు.

ప్రస్తుత కాలములో మర్ఢేకర్ (1907-1956) కావ్య క్షేత్రమున కొన్ని యాక్షేపణలకు గురియైనను నవ్యకావ్య రచయితలకు మార్గదర్శియైనాడు. శిశిరాగమ్- కాహీఁ కవిత అనున వీతని ప్రసిద్ధ రచనలు. ఈతని కవిత సామాజికుల హృదయముల నాకర్షించునదై యున్నది." భంగుఁదేకాతిన్యమారెుఁ" అను మార్ఢేకర్ కవిత యెక్కువ ఆక్షేపణలకు గురియైనది. ఈ విమర్శ అతని కవిత బాహ్య స్వరూపము పైననే కాని కావ్య సృష్టి వైయక్తికత వారికి ద్యోతకము కాలేదని విమర్శకుల యభిప్రాయము.

విందా కరందీకర్, శరచ్చంద్ర ముక్తిబోధ్, మంగేశ పాడ్గాంకర్ సదానంద రేగే యనువారలు నూతన మార్గముల నవలంబించి రచనలు చేసిరి.

వసంతబాపట్

సుశ్లిష్టమైన శబ్దరచన నాదమాధుర్య మీతని కవిత ప్రత్యేక లక్షణములు.

పురుషోత్తమ శివరాంరేగే

ఈయన సుప్రసిద్ధ కవితల్లజుడు త్రిగాథా, సేవగాహిమసేక్. అనున వీతని రచనలు ఇవి చదువుటకును అనుభవమునకును యోగ్యమైనవి సంస్కృత శైలిలో ప్రాచీన మరాఠీ శబ్దము లుపయోగించి కావ్యసృష్టి చేయుట రేగే యొక్క ప్రత్యేకత.

సంస్కృతము. బెంగాలీ, హిందీ, ఇంగ్లీషు, కన్నడముల నుండి ఎన్నియో కావ్యము లనువదింప బడినవి.

మాడ్గూళ్కర్ వ్రాసిన గీతా రామాయణము మరాఠీలో నొక క్రాంతి కారకమైన రచన. ఈనాడు మహారాష్ట్రి కవితా స్రవంతి స్వానుభవములో క్రొంగ్రొత్త మార్గములు ద్రొక్కుచు ముక్తఛంద రూపమున వేగముగా ప్రవహించు చున్నది. ఈనడకలో అభినవ స్వరూపము ఉత్సాహము గోచరించు చున్నవి.

# వచన రచన

కడచిన 35 సంవత్సరములలో నవల-నాటకము-కథ మొదలగు వివిధ వాఙ్మయ ప్రక్రియలతో బాటు, లలిత గద్య రచనా శాఖయు పల్లవింప దొడగెను. లఘు నిబంధములు, వైయక్తిక చిత్రణ, స్వభావ చిత్రణ, లేఖా రచన, రూపక కథలు. నాట్యచ్ఛట మున్నగునవి లలిత గద్యము యొక్క వివిధ భేదములు.

## లఘు నిబంధములు

ప్రథమమున లఘు నిబంధములను నారాయణ సీతారామ్ ఫడకే 'గుజ గోష్' అను శీర్షికతో రత్నాకర్ పత్రికలో ప్రకటించెను. ఖాండేకర్, అనంత కాణేకర్ వి.ప. దాండేకర్ మొదలగువారు తమ తమ యోగ్యతానుసార మీ క్షేత్రమును విస్తరింపజేసిరి. ఫడకే 'మీ సాతహివా పాంఢరాకేస్ (మొదట నెర

సిన వెంట్రుక) పోర్ ఖేల్ (పిల్లలాట) గ్రంథాచా సుగంధ్ మొదలగు రమణీయ ములైన లఘు నిబంధనలు ప్రకటించెను. ఖాండేకర్ లఘు నిబంధనలలో స్వైర విహార మొనర్చెను. 'నిమిత్త' ఇతని లఘు నిబంధనములలో నొకటి.

అనంత కాణేకర్ 1905లో లఘు నిబంధ రచనలో నూతన మార్గ మవ లంబించెను. గణాకా, కాపాంధ రీశిఢే వీరి రచనలు.

మంగేశ్ పాడ్ గాంకర్, వి.పా. దాండేకర్ మున్నగు వారెందరో తమ వైశిష్ట్యములను, వెల్లడించుచు, పెక్కు రచనల వెలయించిరి.

కాణేకర్ తన 'రుపేరువాఖా' అను గ్రంథమున "ఖలీల్ జిబ్రాన్" అను తత్త్వవేత్తను కొనివచ్చి లఘు నిబంధ క్షేత్రమున క్రాంతి లేవదీసెను.

ఈ రచన వలన గొప్ప గొప్ప భాషా సేవకుల నోరులు మూతబడెను. మరాఠీ వాఙ్మయమున ప్రవాస వర్ణనములు సర్వాంగ సుందరము లైనవి కలవు. ఇవి లోక ప్రియములగు తీయని రచనలు. గోపురాంచా ప్రదేశ్, అమాచీమాత్ అమాచ్ ఆకాశ్ మున్నగునవి ప్రవాస వర్ణనా గ్రంథములు.

## శబ్ద చిత్రములు

కుమార రఘువీరుని హృదయ్, మాటేగారి పాశ్చాత్య పురుష శ్రేష్ఠ, గోపీనాథ్ తళవళోక్కర్ గారి గృహరత్న మొదలగు శబ్ద చిత్రరచనలు ప్రసిద్ధి గాంచినవి.

## రూపక కథలు

రూపక కథా రచనలో ఖాండేకర్ ప్రత్యేకాధికారము గలవాడు. కేశిక మృగ జలాంతల్యా కళ్యా అను గ్రంథములను యాయన రచించెను.

## పత్ర లేఖనము

మరాఠీ వాఙ్మయమున పత్ర లేఖనమున కొక ప్రత్యేక స్థాన మొసంగుట గమనించ దగినది. పత్ర లేఖనము యొక్క బాహ్య స్వరూపము వలన

వాఙ్మయమున నిదియొక క్రొత్త ప్రక్రియ యని చెప్పుటకు వీలులేదు. పరిశీలించి చూడగా నెన్నియో పత్రములు నిబంధములుగా స్పష్టమగు చున్నవి. లేఖ కుడి వైపున వ్రాయబడు చిరునామ; వామ భాగమున గల లేఖారంజక సూచకముగా ఆశీర్న మస్క్రియా బోధక వాక్యము; అంతమున వ్రాయబడు సంతకమునకు పూర్వమున గల భావ ప్రదర్శక వాక్యము; ఇవి తీసివేసిన యెడల, పత్ర స్వరూపము నశించి నిబంధ స్వరూప మావిర్భవించును. లేఖ యనగా నొకరీతి వాచకమగును గాని, ఆకార వాచకము గాదు. హరి భాఊగారి పత్రే, తశ్పశ్కర్ గారి మీనేన్ పత్రే, మరియు శామా కాంతాచీ పత్రే, మున్నగునవి ప్రసిద్ధ లేఖలు

నాట్యచ్ఛటా

శంకర్ కాశీనాథగరే (దివాకర్) ఈ రచనాప్రక్రియ నారంభించి అత్యం తోన్నత స్థితికి తీసుకొని పోయెను. నాట్యచ్ఛటా యను దివాకర్ సంకలన గ్రంథ మొగటి నేటి వరకును ప్రాతినిధ్యము వహించినది. వీరి తర్వాత, కొందరీ మార్గము నవలంబించి తమ శక్త్యానుసారము ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నములు చెప్పుకొన దగినంతగా పైకి రాలేదు. ఆంగ్ల కవి రాబర్ట్ బ్రౌనింగ్ వ్రాసిన డ్రామెటిక్ మానోలాక్స్ చదువుట వలన దివాకరున కీ స్ఫూర్తి కలిగెను. వీనిలో నొకేవ్యక్తి యున్నను శబ్దముల వలనను, భావముల వలనను ఇతరులతో కలిగిన సంబంధములు వ్యక్తమగు చున్నవి. 'దివాకర్' వాఙ్మయమును సూక్ష్మముగా పరిశీలన చేయు వాడగుటచే అతడు తన వ్యక్తి త్వము యొక్క పరమ సుందర రూపమును నాట్యచ్ఛటలో నింపి దానిని సౌందర్యవంత మొనర్చెను.

వీరి రచనలు — పంత్ మేళే రావ్‌చఢ్‌లే— బుడుబుడే, ఫాట్‌లేలా పతంగ్ మొదలగునవి.

# చరిత్రలు

## ఆత్మ చరిత్రలు

మహారాష్ట్ర భాషలో చారిత్రక వాఙ్మయము ప్రాచీన కాలమునుండి పరంపరగా వచ్చుచున్నది. నామదేవ రచితమగు జ్ఞానదేవ చరితము మొదటి చరిత్ర గ్రంథము. ఇది అభంగ వృత్తములో వ్రాయబడినది. తర్వాత, మహానుభావ సంప్రదాయమున తీర్థావళిచే అభంగ్ మరియు గద్యమున వ్రాయబడిన లీలా చరిత్, శ్రీకృష్ణ చరిత్ అను చారిత్రక గ్రంథములు వ్రాయబడినవి. ముక్తేశ్వరుడు వ్రాసిన ఏకనాథ చరితము, భానుదాస చరితము, నిగిడీకర్ రంగనాథ స్వామి రచించిన సుదామ చరితము, నాభాజీ వ్రాసిన భక్తమాల, మహీపతి వ్రాసిన భక్తలీలామృతము, సంత్ విజయము మొదలగు చరిత్ర గ్రంథములు ప్రసిద్ధములైనవి. నిజముగా చూచిన యెడల చరిత్ర లేఖన దృష్ట్యా యీ గ్రంథముల కంత ప్రాముఖ్యము లేదు. చిట్నిస్ అను నతడు శ్రీ శివచ్ఛత్రపతీచే సప్త ప్రకరణాత్మక్ చరిత్ర అను గ్రంథమును వ్రాసినాడు.

కృష్ణాజీ అనంతుడు వ్రాసిన "సభాసదీ బఖర్"విఖ్యాతమైన రచన. ఇదే కాలమున రామదాస చరిత్రము వ్రాయబడెను. 16వ శతాబ్ద్యంత్య భాగమున స్టీఫన్స్ అనువాడు క్రీస్తు చరిత్ర వ్రాసెను. పై చరిత్ర గ్రంథములుకూడ ఆధునిక చరిత్ర లక్షణములకు గురికావు. తర్వాత 18వ శతాబ్దములో నానాఫర్నవీస్ ఆత్మ చరిత్రము మనకు కానిపించు చున్నది. అనంతరము 1857లో గోడ్సే భట్‌జీ 'మఝ్యాప్రవాస్, యను ఆత్మ చరిత్రము వ్రాసెను. విష్ణుశాస్త్రి చిపూళూణ్‌కర్‌గారి 'పోపు పెటా', విష్ణుశాస్త్రి పండిత్‌గారి 'పృథ్వీరాజ్ చౌహాణ్', నానాఫర్నవీస్ చరిత్ర గ్రంథములు ప్రసిద్ధములైనవి. ఈ కాలమునుండి చరిత్ర రచనలో భక్తి, శ్రద్ధ, కథా భాగము కంటె చరిత్రనాయకుని గూర్చి సత్యము లగు విషయములు తెలుపుట మొదలగు క్రొత్త రచనకు ప్రారంభము జరిగెను. లక్ష్మణరావు కృష్ణ త్రిపుళూణకర్‌గారు చిపూళూణకర్‌గారి చరిత్రను రచించిరి. ఇప్పటినుండి ఐతిహాసికులైన స్త్రీ పురుషులను రాజకీయ ఘటనలను, సామాజిక

విషయములను చారిత్రక లేఖనమునకు కారణములుగా స్వీకరించి చారిత్రక రచనలు రచింప నారంభించిరి. తిలక్ మొదలగు వారి చరిత్రలు వ్రాయుటలో సంకోచించు అవసరమే లేదు. పాశ్చాత్య పురుష శ్రేష్ఠ అనుపేర మాటే గొప్ప గ్రంథమును రచించెను. పాంగార్కర్ 'పంత్' చరిత్రను సుందరమైన శైలిలో వ్రాసినాడు.

టిళక్ చిపుళూణకర్ మొదలగు వారి చరిత్రలేగాక వివేకానంద రామ "మోహణరాయ్ ఎక్కువ రసవంతములై యుండును.

పార్వతీబాయి అద్వలేగారి "మాఝీకహాణీ", ఆనందీబాయి కర్వేగారి "మాఝెపురాణ్" కమలాబాయి దేశపాండేగారి, 'స్మరణసాఖళీ' మొదలగునవి యీ తెగకు జెందిన రచనలు.

మరాఠీ ఆత్మ చరిత్రలలో అతి దారుణమైన, ఘోరదుఃఖ దావానలము యొక్క అనుభవములను వ్యక్తీకరించు నొక క్రొత్తతీరు ప్రారంభమయ్యెను. సావర్కర్ వ్రాసిన "మాఝీసావరే" దీనికి ఉదాహరణము. దీనివలన శరీరమును దహింపజేయు మనోబుద్ధి వ్యాపారములను స్థిమితపరచి క్రూరమైన వస్తుస్థితిని వెల్లడించు నియతియొక్క నిష్కారణములగు దారుణలీలలు, ప్రళయ భైరవ నర్తనలు వ్యక్తములగును.

నరసింహ చింతామణ్ వ్రాసిన 'గీతగోష్ఠి', లక్ష్మణరామచంద్ర పాంగాంకర్గారి చరిత్ర చంద్ర్, శ్రీమహాదేవ మాటేగారి మీసాహితేలా చిత్రపట్ మొదలగునవి గొప్ప సాహితీపరులు వ్రాసిన ఆత్మచరిత్రలు.

అనేకులగు కళాకారులు తమతమ జీవితానుభవములను, 'మాఝానాటకీ సంసార్' 'మాఝాక్రీడా జీవన్' 'మాఝాసంగీత వ్యాసంగ్' అను పేరులతో ఆత్మచరిత్రలు వ్రాసినారు.

'హర్సన్వర్ రోఖలేల్యా ప్రస్తులాంతూన్', మీకసాఝూలో( అను గ్రంథములు వాసుదేవ బళవంతగోగటే, ప్రహ్లాద కేశవఅత్రే అనువారు వ్రాసుకొనిరి. ఇవి అర్వాచీన గ్రంథములు.

నెపోలియన్, బిస్మార్క్, హిట్లర్, టాల్‌స్టాయ్ మొదలగువారి చరిత్రలు కూడ వ్రాయబడెను.

కడచిన 35 సంవత్సరములలో చరిత్ర వాఙ్మయ శాఖలలో కొల్లలుగా గ్రంథములు వ్రాయబడినవి. లోకమాన్యతిలక్, అగర్‌కర్, శాహ్‌మహారాజ్ వ్యాజ్యము, మండలేకారా వాసము, పూనా పట్టణమునకు ప్రత్యాగమనము మొదలగు నెన్నియో విషయములు కేళికర్‌గారి రసవంతములైన శైలి మాధుర్యమగు రచనలలో వెలసినవి.

అనంతరము చరిత్ర లేఖన విధానములో ఒక క్రొత్తమార్పు కలిగినది. ఇందు ఒక విశిష్ట వ్యక్తి యొక్క కార్యమహత్త్వమును తెలుపుటకును, ఎక్కువగా విమర్శ నొనరించి క్రొత్త విషయమును కనుగొనుటకును వారి చరిత్రాంశములు జ్ఞప్తికై వ్రాసిన రచనలును చరిత్ర రచన యనబడును.

**ఉదా:—** పు.ప. గోఖలే వ్రాసిన ఆగరకరాంబీ జీశఖ్, వాకృపరాంజపే కాళకర్తే శివరాంపంత్ పరాంజపే మొదలగునవి యీ తెగకు చెందినవి.

చరిత్ర రచనలో ఆత్మచరిత్ర యను క్రొత్తపద్ధతి కుతూహల జనకమైనది. ఆత్మ చరిత్ర అంతరంగ స్వరూపమును, ప్రాంజలమును ప్రామాణికమైన, సరళమైన శైలిలో ఔదార్యముతో వ్యక్తపరచుట.

ధోండో కేశవకర్వే అనువదించిన 'సత్యాచే ప్రయోగ్' అను గాంధీ ఆత్మ చరిత్ర సుప్రసిద్ధరచన.

# సమీక్షా వాఙ్మయము

ఒక భాష యొక్కయు, వాఙ్మయము యొక్కయు ఔన్నత్య మాయా భాషలో వెలసిన ప్రతిభావంతులగు కవుల రచనల వలనను, వివిధ శాఖలుగా వెల్లి విరిసిన సాహితీ స్రవంతి వలనను వ్యక్తమగును. ఇటులే వాఙ్మయము నందలి వివిధములగు రచనల అంతఃప్రవృత్తి, ప్రతిభ, బాహ్యస్వరూపము,

సౌందర్యము మున్నగు నంగములను గూర్చి, ఆయా కాలానుగుణముగా రచయితల వైయక్తిక వైశిష్ట్యమును కనిపెట్టి చేయు సమీక్ష వలనను యీ యభ్యున్నతి కనుపించుచుండును.

ఈ సమీక్షా విధానము, దాని వికాస క్రమము ననుసరించి మూడు విధములు. అభివృద్ధి జెందిన భాషయొక్క నిరూఢమైన సమీక్షా విధానమునుండి, మరియొక క్రొత్త సమీక్షా విధాన మేర్పడును. ఒకప్పుడు ప్రభావవంతమైన సృజనశక్తిగల రచన సమీక్షా విధానములోనే మార్పును గొనివచ్చును. మరియొకప్పుడు ఉత్తమ సాహిత్య మభివృద్ధి నందు కొరకు సమీక్షయే క్రొత్త్రోవలను చూపుచుండును. ఇట్లు పై క్రియా ప్రతిక్రియల వలన వాఙ్మయ సముద్రము బాగుగా మథింపబడును.

ఈ మథన వలన దర్శనము, సత్వము, రచనా విశ్లేషణ, సౌందర్య పృథక్కరణలను రత్నములు బహిర్గతములగును. సహృదయులకును జిజ్ఞాసువులకు నీ వాఙ్మయ విమర్శ విచారణా దృష్టిని పెంపొందించి ప్రోత్సాహ కారకమగును. చదువరులకు వాఙ్మయ విషయమున గలిగిన సామాన్యములగు కల్పనలకును ఊహలకును మెరుగులు దిద్ది రచన లందలి విశాలములగు భావనల వ్యక్తపరచి వారికి గల యభిరుచిని పెంపొందించును. సమీక్షతో బాటు వాఙ్మయేతిహాసము సంశోధనాత్మకములగు విషయములను గూడ తడుముటచే క్రొత్తవిషయములు కనుగొనబడి ముందు చేయబోవు పరిశోధనలకు నివి యుపకరించును. ఇటుల పరిశోధనా క్షేత్రము విస్తరించు నవకాశము గలదు.

వాఙ్మయము మూలరూపములోనే మార్పులు సంభవించినపుడు విమర్శాక్షేత్రమున పరంపరగ వచ్చిన పద్ధతులు నిరుపయోగములగును.

మహారాష్ట్ర భాషకు సాహిత్యశాస్త్రము నియతముగా నున్నటుల దోపదు. 1868లో దాజీ శివాజి ప్రధాన్ వ్రాసిన రసమాధవ మను గ్రంథము మరాఠీ సాహిత్య శాస్త్ర ప్రథమ గ్రంథమని చెప్పవచ్చును. తర్వాత సాహిత్య శాస్త్రము, అలంకార దర్పణము, అలంకార వికాస మను గ్రంథములు వ్రాయబడినవి. దాదోబా పాండురంగ్ వ్రాసిన 'యశోదాపాండురంగ్', మోరోపంత్

వ్రాసిన కేకావళిపై పరీక్షాత్మకమైన వ్యాఖ్యానము సమీక్షా గ్రంథములలో మొదటి దని చెప్పవచ్చును. "నావల్ వ నాటక్ హ్యా విషయానిబంద్" అనునది మరాఠే గారి ప్రఖ్యాత సమీక్షా గ్రంథము. బాలకృష్ణ మల్హారహంస్ తుకారాం, మోరో పంత్ వామన పండితుల కావ్యముల సమీక్షగావించి మహత్వపూర్ణములగు గ్రంథ ములు వ్రాసెను. విష్ణుశాస్త్రి చిపూళూణ్కర్‌గారి సంస్కృత కవి పంచక్ అను నిబంధము కూడ విశేష ప్రాముఖ్యము గలదే. తర్వాత వాసుదేవ పట్వర్ధణ గారి "కావ్య ఆణి కావ్యోదయ" పేర్కొన దగినది. ఇతడు మరాఠీ వాఙ్మయ సమీక్షను ఆంగ్ల సాహిత్య సమీక్షా విధానము ననుసరించి చేసెను. సామాజిక భౌతిక విషయముల పరిణామము, కవి కల్పనాశక్తిపై ప్రభావమును వేయునని సిద్ధాంతీకరించెను. ఇది సంస్కృత సాహిత్య శాస్త్ర విధానమున లేదని చెప్ప వచ్చును. విదగ్ధ వాఙ్మయమను గ్రంథము ద్వారా హరిభాఊ ఆప్టే సమీక్షా విష యములు ప్రకటించినాడు. 'వివిధజ్ఞాన విస్తార్' "కేసరి" మున్నగు పత్రికల ద్వారా తిలక్, శ్రీపాదకృష్ణ, పరాంజపే మున్నగు వారెన్నియో సమీక్షలొనర్చి యున్నారు. పాండురంగ వామన కాణేగారు 'సంస్కృత సాహిత్య శాస్త్రాచా ఇతిహాస్' అను ప్రఖ్యాత గ్రంథము వ్రాసియున్నాడు.

ఈ మధ్య సమీక్షా స్వరూపము రెండు విధములుగా విస్తరిల్లెను. మొద టిది కావ్య ప్రకాశాది సంస్కృత సాహిత్య గ్రంథముల సిద్ధాంతముల ననుస రించి మరాఠీ వాఙ్మయ సమీక్ష చేయుట, రెండవది పాశ్చాత్య సాహిత్య విమ ర్శనా విధానము. ఇందు మానసిక శాస్త్రమునకు, వివిధ కళలకు సంబంధించిన విజ్ఞానము ప్రాముఖ్యము వహించుచున్నది.

రామచంద్ర శ్రీపాదజోగ్‌గారి అభినవ కావ్య ప్రకాశము, ఆనందబోధ్, దత్తాత్రేయ కేశవ కేళ్కర్‌గారి కావ్యాలోచన్ మున్నగునవి ప్రథమ సమీక్షా విధానమునకు జెందినవి. మర్ఢేకర్‌గారి సౌందర్య ఆణి సాహిత్య, సురేంద్ర బార్లింగేగారి సౌంధర్యాచే వ్యాకరణ రెండవ తెగకు చెందిన సమీక్షా గ్రంథములు.

ప్రతి రచయితను గూర్చియు మరాఠీలో నెన్నియో విమర్శ గ్రంథములు గలవు. ఈ గ్రంథములు రెండు విధములుగా ప్రాచీన అర్వాచీన భేదములతో వ్రాసినారు.

ేగ్‌గారి అర్వాచీన మరాఠీకావ్య కేశవసుత కావ్య దర్శనములును
కర్ బన్‌హట్టీలు వ్రాసిన విష్ణుశాస్త్రీ చిపళూణ్‌కర్, ద్వివిధ దర్శన్
త ఖుశాల్ దేశపాండేగారి మహానుభావీయ మరాఠీ వాఙ్మయ' అనునవి
సమీక్షా గ్రంథములు.

ఒక కళాకృతిని కళాబాహ్యములై నమూల్యములైన మూల్యముల
సమీక్షించుట తగదని కొందరు వాదించుచున్నారు. ఈ ప్రతిపాదనా
సౌందర్యమన నేమి? అను వివేచనయే ప్రాముఖ్యము వహించును.

కళాసృష్టి, కళాజన్యమైన ఆనందము. దాని యుత్పత్తి మున్నగు ననేక
లను మానసికశాస్త్ర సిద్ధాంతములచే పరిష్కరించుటకు మార్డేకర్ మున్న
సన్నద్ధులైయున్నారు. కరందీకర్‌గారి అరిస్టాటిల్‌చే కావ్యశాస్త్ర 'సౌంద
వ్యాకరణ' ఈ తెగకు చెందిన గ్రంథములు. బాలసీతారాం మర్డేకర్‌గారు
యూన్ మహాత్మతా' అను గ్రంథము వ్రాసి తన సిద్ధాంతముల నందు
దించెను.

ఇట్లు మహారాష్ట్ర సమీక్షా వాఙ్మయము సర్వతోముఖముగా నభివృద్ధి
స వేగముగా పురోగమించుచున్నది.

ఓం త త్స త్.

